గంగిశెట్టి లక్ష్మీనారాయణ



# చైతన్యలహరి

సాహితీ మహితాత్ములు, చైతన్యమూర్తులు
తిక్కన సోమయాజి, పాల్కురికి సోమనాథుడు
శ్రీకృష్ణదేవరాయలు, వేమన యోగి
గురజాడ అప్పారావుగారలు
ప్రతిభాప్రభావాలనుగూర్చి

ప్రసిద్ధాంధ్రసాహిత్యాచార్యులు

ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీ గడియారం రామకృష్ణశర్మ
శ్రీ పుటపర్తి నారాయణాచార్యులు, శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి
శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారల

ఉపన్యాసమంజరి

ప్రచురణ




రిజిస్టర్ నెం: 1/64

యువభారతి
సాహితీసాంస్కృతికసంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**CHAITANYA LAHARI**

A collection of Lectures on
Tikkana Somayaji, Palkuriki Somanadhudu,
Sri Krishnadevarayalu, Vemana and Gurajada

Delivered by
Prof. Divakarla Venkatavadhani, Sri Gadiyaram Ramakrishna Sarma, Sri Puttaparthi Narayanacharyulu, Sri Marupuru Kodandarama Reddy, Dr. Kottapalli Veerabhadra Rao.



యువభారతి

ప్రచురణ : 8

ప్రథమముద్రణ : 15,000 ప్రతులు.

ఆగస్టు 6, 1972

ముఖపత్రరచన : శీలా వీర్రాజు

అక్షరాలంకరణ : సుధామ

ముద్రణ :
డి. ఎస్. ఎంటర్ ప్రైసెస్, హైదరాబాదు-20.

ముఖచిత్రముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5 కింగ్స్‌వే, సికింద్రాబాదు - 3.

ప్రచురణకు పూర్వం మూడురూపాయలు విరాళ మిచ్చిన సాహితీప్రియులకు అందజేయబడింది.

వెల : ఆరురూపాయలు.

# చైతన్యలహరి

# ప్రేరణ



''అక్షరరూపము దాల్చిన
ఒకేఒక్క సిరాచుక్క
లక్ష మెదళ్ళకు కదలిక''

మనిషిప్రత్యేకత ఆలోచించగలగటం. ఆలోచన మనిషిలోని ప్రత్యేకతలను వెలికితీసుకువస్తుంది. ఆలోచన వుంటే సంస్కారం అబ్బుతుంది. సంస్కారం వున్నచోట సహృదయం ఉండితీరుతుంది. సహృదయుడైనవ్యక్తి చైతన్యవంతు డౌతాడు. చైతన్యవంతుడైన మనిషిలో సాహిత్యస్పందన జీవలక్షణం. అందుకే ఆలోచన జీవలక్షణంగా భాసిస్తుంది.

ఆలోచన అందరిసొత్తూ అయినా, అందరికీ అవసరమయ్యేలా వినియోగించుకోవలసినదే అయినా, ఏకొందరుమాత్రమో అది కేవలం తమ స్వప్రయోజనాలకే కాక అందరికొరకూ, అందరితరఫునా, ఆలోచించే బాధ్యతను తమపై వేసుకుని, జాతిగమనానికి అవసరమైన, పదిలమైనబాటను సిద్ధపరచే పనికి పూనుకుంటారు.

మానవుడిని ఉన్నతపథాలవైపు పయనించేందుకు సంసిద్ధుణ్ణి చేయటానికి, తమ ఆలోచనలను సారించి, కృతార్థులైన కవితామూర్తులకృషియొక్క సమగ్రఅవగాహన అవసరమని మేము భావిస్తున్నాము.

ద్రష్టలై, కవితాస్రష్టలై, తమ తరాలవారికే కాక, రానున్నతరాలకు సైతం వెలుగుబాటను చూపిన దివ్యజ్యోతులు వీరు. తమ ఆలోచనలద్వారా, జాతిని

చైతన్యవంతం కావించి, సాహిత్యానికేకాక, సమాజానికికూడా ప్రగతిశీలాన్ని ప్రసాదించి, యుగపురుషుల్లా వెలుగొందే ప్రజ్ఞామూర్తుల సాహిత్యసమాలోచనం సమాజకర్తవ్యం. ఆంధ్రసాహితీప్రగతికి సారథ్యం వహించి, తమ ప్రతిభా ప్రభావాలతో తరతరాలను తీర్చిదిద్దిన ప్రజ్ఞామూర్తుల కవితాచైతన్యాన్ని యువభారతి నవమవార్షికోత్సవాల సందర్భంగా, సాహితీప్రియులకు అందించటానికి తలపెట్టాము.

మార్గదేశికవితాస్రవంతులకు సంగమస్థానమై, సాటిలేని సాహిత్యాచార్య పీఠాన్ని అధిరోహించిన "ఉభయకవిమిత్ర, కవిబ్రహ్మ" తిక్కనసోమయాజి-

ద్విపదపథంలో దివ్యయానం సాగించిన "దేశికవితాసనాథుడు" పాల్కురికి సోమనాథుడు-

ప్రబంధ భువనవిజయంలో "సాహితీ సమరాంగణ సార్వభౌములు" శ్రీకృష్ణదేవరాయలు-

నిత్యం జోతలు పెట్టుకో దగిన నీతులతో "విశ్వదాభిరామ వినురవేమ"గా వినుతి కెక్కిన వేమన—

"క్రొత్తపాతల మేలుకలయిక"తో ఆంధ్రభారతికి క్రొత్తగొంతుక నిచ్చిన గురజాడ—

వీరిని చైతన్యలహరీమూర్తులుగా ఎన్నిక చేశాము.

సాహితీజగత్తులో పేరెన్నికగన్న ఈ అయిదుగురు అమృతమూర్తులను గూర్చి, ప్రసిద్ధాంధ్రసాహిత్యాచార్యుల ఉపన్యాసాలకు కల్పించినగ్రంథరూపమే ఈ "చైతన్యలహరి".

మహాభారతంనుండి ముత్యాలసరాలవరకు సాహిత్యచరిత్రలో ఉజ్జ్వలంగా మెరసిన ధ్రువతారల ప్రతిభా ప్రభాలహరి—"చైతన్యలహరి".

* * *

గుడిగోపురాన వున్న తురాయికి ఆధారం—కనపడకుండా అడుగున పడి వున్న గుడిపునాదిరాయి. సాధించిన నేటి విజయాలకు, సురభిళమైన నేటి సంస్కృతికి, సుసంపన్నమైన నేటి సాహిత్యానికి, సొంపైనసంగీతానికి, అంతెందుకు——సమస్తానికీ, సర్వస్వానికీ, గతంలోని తరతరాలు తమ ఆలోచనలను కాన్కపెట్టి మిగిల్చినదికారణం. వారి ఎదలను రగిల్చిన ఆలోచనలు కారణం. రగిలిన ఎద, లెదిగిన ఎదలై, తా మున్నతులై, తమవెంట జాతిని

ప్రగతిమార్గంలో నడిపించటానికి కారకులై, ప్రవర్తిల్ల గలిగారు. వర్తమానం, గతానికి ఋణపడివుంది. నేటితరం తరతరాలకు ఋణపడివుంది. మానవతామర్యాదలను మనసులోన పెంచుకొని, హృదయంలో ప్రేమ అనే జ్యోతిని వెలిగించుకొని, విశ్వమానవకల్యాణానికి తోడ్పడటంద్వారా—బహుశః, ఈఋణాన్ని, కొంతయినా తీర్చగలమేమో ! వారసత్వంగా వచ్చినవెలుగుదివ్వెను మరింత ప్రకాశవంతంగా, ప్రజ్వరిల్లేలా పరిపుష్టం చేసి, రానున్నతరానికి అందించటం నేటితరం బాధ్యత. బాధ్యతను నెరవేర్చటం కనీసధర్మం. క్రాంతదర్శులైన మహాకవుల కమనీయ సాహిత్యసమాలోచనం సమాజచైతన్యానికి సార్వకాలిక సమ్యక్‌దృష్టిని ప్రసాదిస్తుందని, యువభారతి, చైతన్యలహరి ఉపన్యాసమంజరిని, తెలుగుసాహితీమైత్రికి చిహ్నంగా బహూకరిస్తున్నది.

"అంతకడివెడు పాలపై
ఒక్కింతమీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి
మంచి; అదియే సంప్రదాయము"

—డా. సి. నారాయణరెడ్డిగారు

మంచిని సంరక్షించుకుంటూ, పెంచుకుంటూ, భవిష్యత్తుకై పదిలమైన బాటను వర్తమానంలో నిర్మించుకొంటూ మనుదగ సాగాలని-ప్రతితరం కోరుకుంటుంది; నిర్విరామంగా కృషిచేస్తుంది.

జీవితంపట్ల సమ్యక్‌దృష్టి ఏర్పడటానికి ప్రాతిపదికగా, సాహిత్యంపట్ల సహనం అవసరమనీ, సంప్రదాయాల పునాదులమీదనే, సరికొత్తప్రయోగాల వజ్రసౌధాలు నిర్మించుకోగలమనీ, ప్రగతిమార్గంలో ప్రయాణించగలమనీ, యువభారతి గతసంవత్సరం కావ్యలహరి ఉపన్యాసమంజరిని ఏర్పాటుచేసింది. సాహిత్యసహనోద్యమానికి నాంది పలికింది. మరిన్నిప్రబంధాలను చేపట్టి, ఉపన్యాసాలను ఏర్పరచమని సహృదయులు సూచించారు. అయినా, మరింకోసారి ఆకార్యక్రమంగురించి ఆలోచించవచ్చుని, ఈసారికి—సాహిత్యానికి ప్రగతిశీలాన్ని ప్రసాదించే శకపురుషుల సాహిత్యసేవాసమాలోచనం సమాజకర్తవ్యమని భావించి, ప్రగతికి సారథ్యం వహించి, తరతరాలను తీర్చిదిద్దిన ప్రజ్ఞామూర్తుల కవితాచైతన్యాన్ని ఉపన్యాసమంజరిగా, చైత్యలహరిగా రూపొందించాము.

ఆంధ్రదేశంలో అఖండకీర్తి గాంచిన ప్రసిద్ధవాగ్మివతంసులను ఉపన్యాసకులుగా పొందగలిగినందులకు యువభారతి ధన్యమైనదని భావిస్తున్నది.

*　　　*　　　*

మాసంస్థ వ్యాపారసంస్థ కాదు; తోచినమేరకు మాతీరికసమయాన్ని సాహితీసేవకు వినియోగించటం మంచి దని మాభావం. యువభారతి యువతరానికి ఉద్దేశించి ఈకార్యక్రమాలు తలపెట్టింది. కలుషిత రాజకీయవాతావరణం వల్ల ఏర్పడిన అస్తవ్యస్తవ్యవస్థ కారణంగా అలజడిమాత్రమే అలవాటు చేసుకొని, నిర్మాణాత్మకమైన ఆలోచనవైపు మనసు మ్రొగ్గకుండా, విశృంఖలత్వమే బాటగా భావిస్తున్న యువతరాన్ని జిజ్ఞాసువులుగా చేయటం మాధ్యేయం. ఈకార్యక్రమాలు ఆ వుడుకువయసులో వున్న సోదరబృందానికి—

ఒక్కక్షణం ఆగండనీ, గతంలోని మంచిని సంరక్షించుకోండనీ, సమన్వయ దృక్పథంతో సహనంతో సామరస్యంతో ప్రగతిమార్గంలో పయనించండనీ మా అభ్యర్థన.

కావ్యలహరి ప్రచురణను సాదరంగా ఆదరించారు సాహితీప్రియులు. ఆ ప్రోత్సాహం ఊతగా, చైతన్యలహరి కనీసం 25,000 ప్రతుల అచ్చునోచుకుంటుందని ఎంతో ఆశించాము. ఎందుకోగాని, యువభారతికృషి ఇన్నివేల మందికితెలిసినా,సహృదయులైనప్రజానీకం ముందుకురాకపోవడం కారణంగా, మా ఆశయాలకు అడ్డుగోడలు కట్టి, కేవలం 15,000 ప్రతులు ముద్రించడానికి సాహసిస్తున్నాం. నిజానికి, మా నమ్మకాలు వమ్మయినందుకు చింతిస్తున్నాము.

ఎందుకోగాని,తెలుగువారికి పుస్తకాలు చదివేఅలవాటు,కొని చదివేఅలవాటు చాలా తక్కువయని అందరూ ఒప్పుకుంటారు. పుస్తకాలు కొని చదవటం అలవాటుగా ఉన్నఇతరభాషలవారి సాహిత్యాలతో పోల్చిచూస్తే, మనం వెనుకబడియున్నాము. తెలుగువారిచేత పుస్తకాలు కొనిపించడం చదివించటం అవసరం. పుస్తకాన్ని కొనటం నిరర్థకమనీ, వ్యర్థమనీ ఆలోచించే అలవాటును మాన్పించాలి. మేధావివర్గంవారి ఆలోచనలు సామాన్యుడి కందుబాటులో ఉండి ప్రగతికి పదిలమైన బాటను నిర్మించడంలో తోడ్పడి, జాతిపురోగతికి దోహదం చేయాలంటే, అక్షరాకృతి దాల్చిన ఆలోచనలు వేలాదిమందికి అందుబాటులో ఉండి, సామాన్యజనాన్ని సైతం చైతన్యమూర్తులుగా చేయటానికి పుస్తకాలు అచ్చువేయటం, అచ్చయిన పుస్తకాలు అమ్ముడుపోవటం ద్వారా, అటు

వ్రాసినవాడికీ,ఇటు అచ్చువేసినవాడికీ నిరుత్సాహపరచని పద్ధతిలో కృషి నిర్విరామంగా కొనసాగటానికి సాయపడాలి. అచ్చు వేసినపుస్తకాలు అమ్ముడుపోకపోతే, అచ్చువేయటం అనవసరమని పిస్తుంది. అచ్చువేయకుండా ఊరుకుండినట్లయితే, కృషి స్తంభిస్తుంది. కృషి స్తంభించడం పురోగతికి దోహదకారి కాదు. వేలకొద్దిప్రతులు అమ్ముడుపోయేస్థితి వస్తే,తెలుగుసాహిత్యంలో కొత్తమార్పులు కొత్తప్రయోగాలు జరుగుతాయనీ, జరుగుతున్నకృషి వెలుగుచూసి నలుగురికీ తెలుస్తుందనీ ఆశించవచ్చును. వేలకొద్దిప్రతులు అమ్ముడుపోతే, ఖర్చులు వాటంతట అవే తగ్గుతాయి. పుస్తకాలధర అందరికీ అందుబాటులో వుంటుంది.

ప్రచురణపూర్వవిరాళాలపద్ధతిలో, ముందే, పాఠకులసంఖ్యను, కొని చదివే సహృదయులసంఖ్యను లెక్కవేయడం జరుగుతోంది. పుస్తకం అచ్చుకు, కార్యక్రమాలనిర్వహణకు, ఉపన్యాసాల ఏర్పాటుకు సహృదయులు తమ విరాళాలను పెట్టుబడిగా పెట్టుతున్నారన్నమాట. యువభారతి కృషి జయప్రదమయ్యేందుకై అందరూ తోడ్పడితే, యువభారతేకాక, ఇతరసోదర సాహితీసంస్థలుసైతం, సాహిత్యరంగంలో కృషి సలిపి, జాతిలో చైతన్యాన్ని పెంపొందింపచేయటానికి కృషి చేయగలుగుతాయి.

చక్కనిసాహిత్యం, అందంగా తక్కువధరలకు అందించాలనే మా ఆశయాన్ని, తెలుగులోకం అర్థంచేసుకోగలదనీ, ఆదరించగలదనీ ఆశిస్తున్నాము.

'చైతన్యలహరి' ఉపన్యాససభలతో ఆంధ్రసారస్వత పరిషత్ప్రాంగణమంతా వేలాదిజనంతో కళకళలాడుతూ కనిపించింది. జనంలో నిద్రాణమైయున్న సాహిత్యచైతన్యాన్ని మేల్కొల్పటానికి యువభారతి కారణభూతం కావటం మాభాగ్యంగా భావిస్తున్నాము!

తెలుగుతల్లికి ఒక దివ్యమైన నూత్నమణిహారాన్ని సమర్పించాలన్న మాయీప్రయత్నానికి అందరి ఆదరణా మనఃపూర్వక సహకారమూ అందగలవన్న ఆశతో, నిరీక్షణతో—

వంగపల్లి విశ్వనాథం
సమావేశకర్త.

యువభారతి




# చైతన్యలహరి

## ఉపన్యాసమంజరి

### కార్యక్రమాల వివరణ

సభాస్థలి : ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

సమయం : సాయంకాలం 5.30 గం. నుండి 8.30 గం. వరకు

ప్రథమ సమావేశం **9-7-72** ఆదివారం

చైతన్యమూర్తి : 'ఉభయకవిమిత్ర' 'కవిబ్రహ్మ' తిక్కనసోమయాజి

ముఖ్యఅతిథి ; ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖామాత్యులు
మాన్యశ్రీ అనగాని భగవంతరావుగారు

అధ్యక్షులు ; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యదర్శులు
శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

ఉపన్యాసకులు : ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

సాహితీమిత్రపతకం
ఆవిష్కరణ : శ్రీ అక్కిరాజు వాసుదేవరావుగారు

ద్వితీయ సమావేశం **16-7-72** ఆదివారం

చైతన్యమూర్తి : 'దేశకవితాసనాథుడు' పాల్కురికి సోమనాథుడు.

ముఖ్యఅతిథి : సికింద్రాబాద్ సాయం కళాశాల అధ్యక్షులు
శ్రీ పి. ఎల్. ఎన్. శర్మగారు

అధ్యక్షులు : శిరోమణి కేశవపంతుల నరసింహశాస్త్రిగారు

ఉపన్యాసకులు : శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు

# గంగిశెట్టి లక్ష్మీనారాయణ

**తృతీయ సమావేశము** **23-7-72** **ఆదివారం**

చైతన్యమూర్తి : 'సాహితీసమరాంగణ సార్వభౌములు' శ్రీకృష్ణదేవరాయలు
అధ్యక్షులు : డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారు
రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయము
ఉపన్యాసకులు : 'పద్మశ్రీ' 'సరస్వతీపుత్ర'
శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

**చతుర్థ సమావేశము** **30-7-72** **ఆదివారం**

చైతన్యమూర్తి ; 'విశ్వదాభిరామ వినురవేమ' వేమన
ముఖ్యఅతిథి : ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షులు
మాన్యశ్రీ తోట రామస్వామిగారు
అధ్యక్షులు : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు
శ్రీ గొల్లపూడి వేంకటరామశాస్త్రిగారు
ఉపన్యాసకులు : శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు

**అయిదవ సమావేశము** **6-8-72** **ఆదివారం**

చైతన్యమూర్తి : 'కొత్తపాతల మేలికలయిక' గురజాడ
ముఖ్యఅతిథులు
చైతన్యలహరి ఆవిష్కర్తలు : ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ అధ్యక్షులు
డా. బెజవాడ గోపాలరెడ్డిగారు
అధ్యక్షులు : డా. సి. నారాయణరెడ్డిగారు
రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయము
ఉపన్యాసకులు : డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు

# మా గురించి




"చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంతచిన్నదీపాన్నయినా వెలిగించడం మంచిది."

అన్నసూక్తి మాకుఊపిరి. మా ప్రయత్నం ఉడుతాభక్తి.

నేటియువతరం నిర్మాణాత్మకంగా ఆలోచించి తనభవిష్యత్తును ఉజ్జ్వలంగా తీర్చిదిద్దుకోవడానికి అనువైన వాతావరణం కల్పించాలనే మహితాశయంతో యువభారతి రూపొందింది.

యువభారతి అవతరణం : విజయదశమి, 1963.

**యువభారతి లక్ష్యం :**

* దేశానికి, సంఘశ్రేయస్సుకు అనువైనపద్ధతిలో పరిపూర్ణవ్యక్తిత్వాన్ని పెంపొందించుకొని సభ్యులు యుగోచితాగ్రగామిత్వానికి సమర్థులను చేయడం.

* పరిపూర్ణమైన, సమగ్రమైన వ్యక్తిత్వనిర్మాణానికి తోడ్పడేవిధంగా వక్తృత్వాన్ని, రచనాశక్తిని, అధ్యయనశీలమును, ఆలోచనాశక్తిని, రచనాపాటవాన్ని అలవడజేయడానికి కృషిచేయడం.

* సభ్యుల్లో మంచిఅభిరుచులను కలిగించేందుకు అనువైన వైజ్ఞానిక, సాహిత్య, సాంస్కృతిక, సంగీతకార్యక్రమాలను నిర్వహించడం.

ఈలక్ష్యసాధనకు కొన్నికార్యక్రమాలను రూపొందించి కడచిన తొమ్మిదేళ్ళుగా యువభారతి సాహిత్యోద్యమాన్ని నిర్వహించగల్గుతున్నది.

ప్రతినెలా మొదటిఆదివారం, మూడవఆదివారం మధ్యాహ్నం 2.30 గంటలకు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం, సుల్తాన్‌బజార్, హైదరాబాదులో యువభారతి నిర్వహిస్తున్న సాహితీసమావేశాలు సభ్యులలో ప్రతిభోద్దీపనానికి, వ్యుత్పన్నతాసముపలబ్ధికి యథోచితమైన అవకాశాలను కల్పించ గల్గుతున్నవి.

ప్రతిమాసం మొదటిఆదివారం ఉదయం 10 గంటలకు ఆగ్రంథాలయం లోనే యువభారతి వనితావిభాగం ఇదేలక్ష్యంతో తనసాహితీకార్యక్రమాలను జరుపుకుంటున్నది.

## మా సాహిత్య కార్యక్రమాల సంక్షిప్తవివరణ

**పుస్తకచర్చ :**

"A good book is a precious life blood of a Master's Spirit."

ప్రతిభామూర్తులైన రచయితలపుస్తకాల అధ్యయనం,పరిశీలనం ఉత్తమవ్యక్తిత్వ నిర్మాణానికి దోహదం కలిగిస్తాయనే విశ్వాసంతో పుస్తకచర్చాకార్యక్రమం నిర్వహిస్తున్నాం. సాహిత్యాధ్యయనంలో ఉత్తమాభిరుచులను పెంపొందించి ప్రామాణికమైన పరిశీలనాదృక్పథాన్ని సభ్యులలో అలవడునట్లు చేయడమే ఈకార్యక్రమలక్ష్యం.

**క్లుప్తగోష్ఠి :**

భాష భావాన్ని సువ్యక్తం చేయగల్గాలి. మాతృభాషలో అందంగా, క్లుప్తంగా, స్పష్టంగా, నిర్భయంగా, ప్రయోజనకరంగా మాట్లాడగల్గాలి. అప్పటికప్పుడే ఇచ్చిన విషయంమీద రెండునిముషాలలో సద్యఃస్ఫూర్తితో, సమయనియమాన్ని పాటించి, సదస్యులమనస్సులను ఆకట్టుకునేవిధంగా ప్రసంగించగల్గాలి. అందరికీ అందుబాటులో వుండే వక్తవ్యాంశాలే ఈయబడతాయి. ఈప్రసంగకార్యక్రమమే క్లుప్తగోష్ఠి. సదస్యులకు నచ్చిన ఉత్తమవక్తకు ప్రోత్సాహకరంగా గ్రంథరూపేణా బహుమతి లభిస్తుంది. ప్రాసంగికుల ఉపన్యాసాలను ప్రతిసభ్యుడూ సావధానంగా వినడంకూడా అవసరం. కనుక క్లుప్తగోష్ఠి ముగియగానే సభ్యులలో ఏఇద్దరినైనా ఉద్దేశించి సభాధ్యక్షులు సమీక్షించవలసిందిగా సూచిస్తారు. వక్తలకూ, శ్రోతలకూ ఇలాంటి సంబంధ మున్నప్పుడే ప్రసంగాల పై ప్రయోజనం నెరవేరుతుంది.

**వక్తృత్వం :**

సభ్యులలో సముచితవక్తృత్వశక్తిని పెంపొందించడానికి యువభారతి రూపొందించిన కార్యక్రమం వక్తృత్వం. సమగ్రంగా ఆలోచించి అయిదు నిముషాలపాటు ప్రసంగించవలసి వుంటుంది. ఒకపక్షంరోజులకు ముందే ప్రసంగించవలసినసభ్యులు నిర్ణయింపబడతారు. నాటకప్రయోగం సామాజికులు లేనిదే సమగ్రంకానట్లు శ్రోతలు లేనిదే వక్తృత్వం సమగ్రంకాదు. ప్రసంగాన్ని మనస్ఫూర్తిగా సావధానంగా సతర్కంగా వినగల్గేవాళ్ళే శ్రోతలు. శ్రోతలు, వక్తలు పరస్పరాశ్రితులై వున్నప్పుడే ప్రసంగంలోని ఔచిత్య అనౌచిత్యాలను విశ్లేషించుకో గల్గుతారు. ఈకార్యక్రమం ఆఆశయాని కనుగుణంగా ఉండేటట్లు

ఉపన్యాసకళకు సంబంధించిన కొన్ని శాస్త్రీయపద్ధతులను యువభారతి రూపొందించి కృషిచేస్తున్నది.

**నా ఊహాపథంలో...**

దైనందిన జీవితంలో తారసిల్లే సంఘటనలను గురించిగానీ, అప్పుడప్పుడు గుండెలను కదిలించే తలపులకు గానీ, అక్షరరూపం కల్పించడమే ఈకార్యక్రమలక్ష్యం. అబద్ధాలు, పూలు, నవ్వు, వెన్నెల, రాత్రి, ఊతపదాలు, నిద్ర, ఇంటర్వ్యూ, మీటింగులవంటి అంశాలను ముందే ఎన్నికచేసి ఒకపక్షం రోజులకు ముందే సభ్యులకు తెలియజేయబడుతుంది. మూడునిముషాలకు మించకుండా ప్రతిసభ్యుడు ఆయావిషయాలపై పద్యమో, గద్యమో, గల్పికో, గేయమో తనకు నచ్చినరీతిలో వ్రాసికొనివచ్చి వినిపించవలసివుంటుంది. మనసుకు తట్టిన ఊహలను వర్ణరంజితంచేయడమే_'రచనాకంపం' వంటిది కొంతయినా తగ్గించడమే_ఈకార్యక్రమలక్ష్యం.

**నాగురించి :**

సభ్యులు తమవృత్తికి, ప్రవృత్తికి సంబంధించిన అనుభవాలను, అనుభూతులను ఇతరసభ్యులకు విశ్లేషించి చెప్పడం.

**నాకు నచ్చినది - నేను మెచ్చినది :**

ఏసభ్యుడైనా ముందుగా తెలిపి తాను ఇటీవల చదివినగ్రంథంలోని విషయంగురించిగానీ, పాల్గొన్న సమావేశంగురించి గానీ, చూచిన సినిమా, నాటకాలనుగురించిగానీ, దర్శించిన, కలిసినమనుష్యులను గురించిగానీ తనకు నచ్చిన, తాను మెచ్చినభావాలను సభ్యులకు తెలియజేయడం.

**అభిప్రాయవేదిక :**

ఈయబడిన ఒకేఒక అంశాన్నిగురించి సభ్యులు తమతమ అభిప్రాయాలను వ్యక్తపరచడం.

**చర్చలు :**

సారస్వత, సామాజిక, సాంస్కృతిక సమస్యలపై అప్పుడప్పుడు చర్చలు నిర్వహింపబడుతుంటాయి. చర్చనీయాంశం పక్షంరోజులకు ముందే ప్రకటింపబడుతుంది. సభ్యులు ఆయాసమస్యలకు సంబంధించిన వివరాలను సమీకరించుకునే అవకాశం కలిగింపజేసి చర్చలవల్ల సమగ్రవిషయపరిజ్ఞానం అలవడేట్లు చేయడం ఈచర్చల లక్ష్యం.

**స్వీయరచనాపఠనం :**

ప్రతిసమావేశంలో సభ్యులు తమ రచనలను వినిపించే అవకాశం కల్పించి ప్రోత్సహించడం.

ఏవిధమైన కార్యక్రమాలను నిర్వహించినా సభ్యులందరూ వాటిలో పాల్గొనేవిధంగా అవి రూపొందింపబడతాయి. సౌహార్దం, సరసత సాహిత్యాభ్యుదయానికి దోహదంచేయగల్గుతాయనే విశ్వాసం యువభారతికి వున్నది.

నియమబద్ధంగా కొనసాగే ఈపక్షసమావేశాలేకాక అనువైనప్పుడు కవితాగోష్ఠులను, నాటకప్రయోగాలను, చిత్రలేఖనప్రదర్శనాలను, విజ్ఞుల, సాహితీమర్మజ్ఞుల ఉపన్యాసాలను సాంస్కృతికయాత్రలను, పుస్తకప్రచురణాలను, గోష్ఠులను, ప్రోత్సాహంకోసం సాహిత్యపరమైనపోటీలను యువభారతి నిర్వహించగల్గుతున్నది. వీనిలో కొన్నింటిని ఇక్కడ మేము సవినయంగా పేర్కొంటున్నాము.

యువభారతి తొలిదశలో 'యువభారతి' అనే పేరున ఒకసైక్లోస్టైల్ మాసపత్రికను ఒకసంవత్సరంపాటు వెలువరించి, సుమారు వెయ్యిప్రతులదాకా సాహిత్యాభిమానులకు అందించింది. ధనాభావంవల్ల ఇది కొనసాగలేక కొందరికైనా అందాలని చిన్నఎత్తున లిఖితమాసపత్రికను కొన్నాళ్ళపాటు నిర్వహించింది.

యువభారతిలో నటులుకూడా వున్నారు. చక్కని నాటకాలను ప్రయోగించి ఉభయనగరాల ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు.

సాహిత్యాసక్తిని ఇతోధికంగా ఇనుమడింపజేయడానికి ప్రచురణకు పూర్వమే విరాళాలు సేకరించి శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం' అనే కావ్యాన్ని, శ్రీ కాళోజీ తెలుగుచేసిన ఖలీల్‌జీబ్రాన్ 'జీవనగీత' The Prophet ను ప్రచురించింది. నలుగురు యువభారతి సభ్యుల కవితాసంకలనం 'వీచికలు' సమీక్షకుల అభిమానాలను చూరగొనగల్గింది.

**పుస్తకపథకం :**

మనలో పలువురికి పుస్తకాలు కొనిచదివే అలవాటు తక్కువ. తక్కువ పెట్టుబడితో ఎక్కువ పుస్తకాలను సంపాదించి పెట్టగల్గేపద్ధతిలో మేం పుస్తకపథకాన్ని రూపొందించి ఒకసంవత్సరంపాటు నిర్వహించాం. తగినంత ఆదరణ, సహకారం లభ్యంకానందువల్ల ప్రస్తుతానికీపథకం నిలిపివేశాము. ఈపథకం సందర్భంగా ఐదుగురు ప్రఖ్యాతకథకుల కథలసంపుటి 'పంచవటి'ని ప్రచురించాం.

**విద్యార్థి రచయితలకు కథారచన పోటీ - 1970 :**

విద్యార్థులలో సృజనాత్మకశక్తిని ప్రోత్సహించే నిమిత్తం ప్రఖ్యాత ప్రచురణకర్తలు శ్రీ ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, సికిందరాబాదు, వారి సహకారంతో అఖిలభారతస్థాయిలో తెలుగువిద్యార్థులందరికీ కథారచనపోటీ నిర్వహించాం. ప్రవేశరుసుము లేని ఈపోటీకి నగదుపారితోషికాలేకాక ఉత్తమ కథకులకు పుస్తకరూపంలో బహుమతుల నిచ్చి యువభారతి సప్తమ వార్షికోత్సవ సందర్భంగా 15 మన్నికైన కథలను సంపుటిగా విద్యార్థిసాహితి 2గా ఎమెస్కో-ప్యాకెట్ బుక్‌గా వెలువరించాం.

సప్తమవార్షికోత్సవ సందర్భంగా మారెండో కార్యక్రమంగా "మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు" అనే విషయంపై ఒకగోష్ఠిని నిర్వహించాం. వడివడిగా విలువలు మారుతున్న ఈకాలంలో మేధావివర్గానికికూడా హక్కులు గుర్తున్నంతగా బాధ్యతలు గుర్తురాని ఈరోజుల్లో రచయితల తీరుతెన్నులను జాగ్రత్తగా అంచనాకడదామని ఈగోష్ఠిని నిర్వహించాం. 37గురు ప్రముఖసాహితీస్రష్టల వ్యాసాలను ముందుగానే సేకరించి, 'రచన' అనే పేరుతో ఒకసంపుటిగా ప్రచురించి గోష్ఠిలో పాల్గొనేవారికి ఒకవారం ముందుగానే అందజేశాం. జంటనగరాలలోని 20 కళాశాలలనుండి ప్రతినిధులు పాల్గొన్నారు. దాదాపు 400 మంది కళాశాలాధ్యాపకులు, విద్యార్థులు, రచయితలు, వివిధరంగాలలో ఉద్యమిస్తున్నయువకులు, సాహిత్యాధ్యయనశీలురు ప్రతినిధులుగా పాల్గొన్న ఈసదస్సు ఒకరోజంతా మూడు సమావేశాలుగా జరిగింది. 'మారుతున్నవిలువలు-రచయితల బాధ్యతలు' అనే విషయంపై వ్యాసాలను అందించి, చదివి, చర్చించినవారిలో ప్రాచీనఅర్వాచీనసాహితీసిద్ధాంతాలకు ప్రతినిధులైన రచయితలు పలువురు పాల్గొనడం ఈ గోష్ఠిలోని ఒకవిశేషం! ప్రముఖసాహితీ మాసపత్రిక 'భారతి' అక్టోబరు '70, సంచికలో ప్రతి సాహితీపరుడు తప్పక చదువవలసిన వ్యాససంకలన మనీ, ఈపుస్తకాన్ని చదవడం ఒకగుణ మనీ చెప్పడమేకాక చదవకపోవడం ఒక లోపమనిగూడా చెప్పవచ్చునని 'రచన'ను సమీక్షిస్తూ పేర్కొన్నది.

## కావ్యలహరి - 1971

గతాన్ని గతందృష్టితో కాకుండా వర్తమానస్ఫూర్తికి అనుగుణంగా మలచుకోవాలనే సమ్యక్‌దృష్టితో యువభారతి ప్రాచీనాంధ్ర ప్రౌఢభారతిని

ఈతరంవారికి పరిచయంచేయాలని సంకల్పించింది. శ్రీనాథునిశృంగారనైషధం, అల్లసాని పెద్దన మనుచరిత్రము, నందితిమ్మన పారిజాతాపహరణము, రామరాజభూషణుని వసుచరిత్రము, చేమకూర వేంకటకవిరాజు విజయవిలాసము అనే అయిదు ప్రబంధాలనుగూర్చి వాగ్మివతంసులు, సద్విమర్శకులు, విద్యత్కవులు, సుప్రసిద్ధసాహిత్యాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు యువభారతి ఏర్పరిచిన సాహిత్యసమావేశాలలో ప్రసంగించి వానికి వ్యాసరూపమును కల్పించి ప్రచురించుట కవకాశము నొసగిరి.

అది కావ్యలహరిగా ప్రచురణ పొందింది. వీలైనంత తక్కువధరలో ఉత్తమ సాహిత్యా న్నందజేయాలన్న దృక్పథం కలిగిన యువభారతి దాదాపు 250 పుటలు కలిగిన ఈపుస్తకాన్ని 2 రూపాయలు ప్రచురణపూర్వవిరాళమిచ్చిన సాహితీప్రియులకు అందజేసింది. ఉభయనగరాలలోని భాషాభిమానులు వేలసంఖ్యలో ఈ ఉపన్యాససభల్లో, పాల్గొని యువభారతికి ప్రోత్సాహాన్ని కల్గించారు. ఉభయనగరాల సాహితీచరిత్రలో ఈసభల నిర్వహణ పద్ధతి, క్రమశిక్షణ అపూర్వమైన దని తెలుగుజాతికి శుభోదర్కమని ప్రముఖుల, పత్రికల ప్రశంసల నందుకున్నది.

**Kavyalahari :**

"A collection of lectures delivered by Dr. D. Venkatavadhani, Yuvabharathi, 5, Kingsway, Secunderabad-3, Price : Rs. 5.

A team of young men who are very much devoted to literary activities made history-under the banner of Yuvabharathi in the history of Telugu literature by organising a series of lectures by Dr. D. Venkatavadhani, Professor of Telugu, Osmania University, and bringing out the text of the lectures into a handy volume. It is highly commendable that they printed 11,500 copies of the book and offered it at an incredible pre-publication price of Rs. 2.

The book under review contains detailed criticism of five of the most important kavyas in Telugu literature-Sringaranaishadhamu, Manucharitramu, Parijatapaharanamu, Vasucharitramu and Vijayavilasamu. The author who is a great critic, poet and Rasajna dwelt at length on the merits of the kavyas with profuse illustrations from each one of them and expounded in detail the poetic imagery and literary nuances of the famous poets. The

book is a treatise on the kavyas and richly deserves a place in every library, personal as well as public. The Yuvabharathi deserves congratulations on their unique venture."

BHAVARAJU

Triveni, April-June 1972, pp.98.

'యువభారతి జంటనగర సాహితీప్రియులకు క్రొత్తకాదు. గత ఎనిమిది సంవత్సరాలుగా యువకులలో సాహితీచైతన్యం కలిగిస్తున్నది. రచనా ప్రోత్సాహం ఇస్తున్నది. మెదడునకు పదును పెడుతున్నది. ఉత్తమ సాహిత్య పఠనాభిలాషను, సువచోరీతిని కలిగించేందుకు కృషి చేస్తున్నది.'

'యువభారతి కార్యకర్తల కార్య నిర్వహణలో సాహితీ సౌరభం, సంస్కృతీసౌరభం కనపడుతున్నవి. సభలను ఏర్పాటుచేయడం ఒక కళ, ఒక విద్య. ఇందులో యువభారతివారు ఆరితేరారు' అని శ్రీ నార్లవారు అన్నారు. ఇంతేకాకుండా 'సమయనిర్ణయం పాటించడం, ఆహూతులకు సముచితస్థానాలు ఏర్పాటు చేయడంతోపాటు, చిన్న చిన్న విషయాలలోకూడా తమ కున్న కళాభిరుచి, అభిజ్ఞతను వెల్లడించారు. ఇది యువభారతి కాదు-నవభారతి, నవ్యమైన భారతి' అన్నారు శ్రీ నార్ల.

ప్రాచీనకావ్యాలపై కేవలం ఉపన్యాసాలను ఏర్పాటుచేయడమేకాక, ఆ ఉపన్యాసాలు ఒక పుస్తకరూపంగా వెలువరించి, యువభారతివారు తమ కృషికి ఒక నిదర్శనం, ఒక సాఫల్యం చేకూర్చారు. చక్కని get up తో అయిదు ఉపన్యాసాలను 240 పేజీలలో ముద్రించారు. ఉపన్యాసాల కాలంలో కేవలం రెండురూపాయలు విరాళంగా ఇచ్చినవారికి ఆపుస్తకాన్ని అందించారు. తరువాత పుస్తకానికి అయిదు రూపాయలు వెల నిర్ణయించారు. పుస్తకాన్ని చూచిన తరువాత అయిదు రూపాయలకే ఈ పుస్తకం అన్నంత అందంగా ముద్రించారు. ప్రథమముద్రణే పదకొండువేలఅయిదువందల ప్రతులు వేశారు. అపూర్వమే. తెలుగు సాహిత్యంలో ఏపుస్తకాన్నికూడా ప్రథమముద్రణలోనే ఇన్నివేలప్రతులు వేయడం చెప్పుకోదగ్గ విషయం."

— ఆంధ్ర జ్యోతి, 24 అక్టోబర్ '71.

"కావ్యలహరి ఉపన్యాసాలు ఏర్పాటుచేసిన యువభారతివారి సంఘటనా బలాన్ని, సమావేశ నిర్వహణాదక్షతను, తెలుగుసాహిత్యంలో సహనబుద్ధిను ద్దీపింపజేయాలన్న లక్ష్యాన్ని జంటనగరాలవారు ప్రశంసిస్తున్నారు. ఇవి ఏదో పక్షపాతంతోనో అభివృద్ధినిరోధక దృక్పథంతోనో చేస్తున్న ప్రశంసలు కావు.

యువభారతి అష్టమ వార్షికోత్సవ ఉపన్యాసమంజరికి హాజరైనవారంతా ప్రాచీనాంధ్రసాహిత్యంగురించి వినడానికి రా ప్రారంభించిన రసజ్ఞుల సంఖ్యను చూచి విభ్రాంతి చెందారు. ఈ ఫినామినా చాలామందికి అర్థంకాలేదు. యువభారతి కార్యకర్తల ఉద్యమస్ఫూర్తియే ఈ అసాధారణ లక్షణానికి ముఖ్యకారణమని చెప్పక తప్పదు. ఈనాడు ఫిక్షన్ చదవడానికి నిజమైన ఆసక్తి కల్పించింది కొవ్వలి, జంపన నవలలు అనడంలో అతిశయోక్తి లేదు. అలాగే యువభారతి ప్రయత్నాన్ని అభివృద్ధినిరోధకమని విమర్శించేవారుకూడా సాహిత్యోపన్యాసాల పట్ల జనసామాన్యంలో ఆసక్తి పుట్టించిన 'క్రెడిట్' యువభారతివారు పొందిపోతున్నారని విచారపడికూడా లాభంలేదు.

ఈ ఉపమానం డిలిబరేట్‌గానే వాడాను; ఒక్కొక్క విషయం చరిత్రాత్మకంగా నిలిచిపోతుందని చెప్పడానికి; ఉపన్యాసాలిస్తే టిక్కెట్లుకొని వెళ్ళి వినేవాళ్ళు బ్రతుకుతున్నవ్యవస్థల్ని గురించి విన్నామేగాని తెలుగువాళ్ళం అటువంటి వెన్నడూ ఎరుగం. సుమారు 250 పేజీల 'కావ్యలహరి' గ్రంథాన్ని రెండు రూపాయల విలువకు అందించే కృషిద్వారా, అన్నమాట నిలబెట్టుకొన్నదీక్ష ద్వారా యువభారతివారు ఆ గ్రంథాన్ని 11,500 ప్రతులు అచ్చువెయ్యడమేకాక గత ఆదివారంనాడు జరిపిన విజయవిలాస ఉపన్యాసం ఆఖరు–నాడు అక్కడికక్కడే దాదాపు ఏడెనిమిదివేల ప్రతులు చెల్లుబాటు చేయగలిగారంటే యువభారతిని చూసి అసూయపడేకన్న అభినందించడం సహృదయతకు తార్కాణం.

ప్రాచీనాంధ్ర సాహిత్యం గురించి ఉపన్యాసాలేర్పాటుచేసి జనంలో కల్పించిన ఆసక్తినిపట్టి యువభారతివారు ముమ్మందుకూడా ఏ'మందారమంజరి' కార్యక్రమాలో నిర్వహించే ప్రయత్నం చెయ్యాలి. జంటనగరాల్లోనూ యువతరంవారిలో ఇంతమంది 'అభివృద్ధినిరోధకులు' తయారయ్యారనుకొనే కొందరి మనసుల్ని క్షాళనం చెయ్యడానికైనా యువభారతి ఈసాహిత్య సహనోద్యమాన్ని కొనసాగించాలి".

—ఆంధ్రజనత 18-9-1971

అష్టమవార్షికోత్సవసందర్భంగా ఈ కార్యక్రమం రూపొందించబడింది. ఇదే సందర్భంగా ఒక వార్షిక సంచికను; పదముగ్గురు యువభారతీయుల కవితాసంకలనం "అక్షరాలు" వెలువరించాము.

## 1972

నవమవార్షికోత్సవ సందర్భంగా మేము చేపట్టిన కార్యక్రమాలు రెండు. మొదటి కార్యక్రమము—తమ ప్రతిభాప్రభావాలతో తరతరాలను తీర్చిదిద్దిన ప్రజ్ఞామూర్తులు, మహితాత్ములు—'ఉభయకవిమిత్ర' 'కవిబ్రహ్మ' — తిక్కన

సోమయాజి; "దేశికవితాసనాథుడు" _ పాల్కురికి సోమనాథుడు; 'సాహితీ _ సమరాంగణ సార్వభౌములు' - శ్రీకృష్ణదేవరాయలు; 'విశ్వదాభిరామ వినుర వేమ' _ వేమన; 'కొత్తపాతల మేలికలయిక' - గురజాడలనుగూర్చి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు; శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు, డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారల ఉపన్యాసమంజరి - 'చైతన్యలహరి' అనే పుస్తకరూపంలో ప్రచురణ. ప్రచురణ పూర్వవిరాళం రు. 3/_లు సేకరించి అందిస్తున్నాము.

రెండవకార్యక్రమము—స్వాతంత్ర్యయుగోదయము (1947_1972)లో తెలుగుతీరు _ తెన్నులను సంతరించుకున్న 100 సమీక్షావ్యాసాల సంకలనం— 'మహతి' ప్రచురణ.

స్వాతంత్ర్యయుగోదయములో తెలుగు సాహిత్యములో ప్రసరించిన సాహితీ పరిమళాలను, కల్లోలాలను, మార్పులను, తీరుతెన్నులను వివరిస్తూ ఈవ్యాస కదంబం సాహితీ చరిత్రరచనకు ప్రాతిపదికగా ఆధారభూతగ్రంథంగా రూపొందాలని మాధ్యేయం।

**మహతికి హితవరులు :**

శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ సి. నారాయణరెడ్డిగారలు.

**మహతి సంపాదవర్గం :**

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథంగారలు.

ఆయారంగాలలో కృషిచేసి సిద్ధహస్తులైన రచయితల వ్యాసాలతో600 పుటల ఈ వ్యాససంకలనానికి ప్రచురణపూర్వవిరాళం కేవలం రు. 7/_లు సేకరించి అందిస్తున్నాము.

ఈమహతి ప్రచురణ సందర్భంగా యువతీయువకులకు వ్యాసరచన పోటీని, యువతులకు వక్తృత్వపోటీని నిర్వహించాం. 1972 మార్చి 12వ తేదీన జరిగిన ఈ పోటీలో దాదాపు 200 మంది యువతీయువకులు పాల్గొన్నారు. పోటీలలో నెగ్గినవారికి నగదు బహుమతులను పుస్తకరూపంలో ప్రోత్సాహ బహుమతులను అందిస్తున్నాము.

**'సాహితీమిత్ర' పథకం :**

యువభారతి తనకృషిలో పాలుపంచుకునే మిత్రులకోసం ఎదురు చూస్తోంది. సాహితీమిత్రులుగా చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు, బాధ్యతలు పంచుకునే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. ఇది సాహితీమిత్రపథకం ధ్యేయం. 1973 వ సంవత్సరంలో మూడు రూపాయల ప్రచురణపూర్వవిరాళంపై ప్రచురింపబడే పుస్తకం ఈపథకంలోని సభ్యులకు ఉచితం.

సాహిత్యాభిమానుల ఆదరాభిమానాలతో మరింత ప్రయోజనకరమైన సాహిత్యాత్మకమైన, కళాత్మకమైన కార్యక్రమాలను రూపొందించాలని యువభారతి సంకల్పం. సాహితీస్నేహమే పరమలక్ష్యంగా పెట్టుకున్న యువభారతికి సరసులైన తెలుగుప్రజల సౌహార్దం బాసటగా నిలుస్తుందని విశ్వసిస్తున్నాం. ఆంధ్రులరాజధానీనగరంలో తెలుగుతనం తొణికిసలాడాలని తెలుగువాతావరణం నెలకొనాలని మా ఆకాంక్ష।

యావద్భారతప్రజాజీవితంలో తెలుగువారి సార్థక్యానికి, వైశిష్ట్యానికి, శక్తిసామర్థ్యాలకు ఆదరణ లభించాలని మాకామన.

సాహిత్యం సహనశీలతను, ఔదార్యాన్ని, సంస్కృతిని, దేశభక్తిని, సౌమనస్యాన్ని, దేశప్రజలలో కలిగించగలిగినపుడే జాతికి జీవం పోయగలుగుతుంది. ఉత్తమసాహిత్యప్రచారానికి సుందరమైన, సులభమైన, శుభావహమైన, సరసమైన వాతావరణం కల్పించడమే మా సంకల్పం.

యువభారతి యథోచితంగా కొనసాగగలదనీ, సాహితీ తపోమూర్తుల సందేశాన్ని అందించగల దనీ, తెలుగుప్రజల ఆశీస్సులను పొందగల దనీ ఆశిస్తున్నాము.

ఇది యువభారతికృషి. స్థూలంగా వివరించాము. చైతన్యపూరితమైన ఆశయసాధనాసంరంభాన్ని జడమైన అచ్చుసిరాద్వారా అందించగలగడం కష్టం. మాకృషి వెనుక నున్న చైతన్యస్రవంతిని సహృదయులు పోల్చుకోగలరని ఆశిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు.

యువభారతి




# ఎందరో మహానుభావులు ....

'ఎందరో మహానుభావులు' 'అందరికీ మా వందనములు'. నిజానికి ఈ ఒక్క రెండుమాటలు మనసారా చెప్పివేయటంతో మా ఎదపొరలలోని బరువులు చాలావరకు దిగినట్లున్నాయి. కాని ఒక్కోసారి ఎంతచెప్పుకున్నా ఇంకా తరగకుండా ఏదో మిగిలిపోయినట్లు మనసుకు అనిపిస్తూనే వుంటుంది. ఎందరో, ఎన్నివిధాలో అందించిన తమ మనస్ఫూర్తిసహకారం ఆధారంగా ఈ కార్యక్రమాలు విజయవంతం కాగలిగాయి. కృతజ్ఞతలకు అక్షరాకృతి కల్పించడమే ఈ ప్రయత్నం.

కావ్యలహరి కార్యక్రమాలను నిర్వహించిన మాపై బాధ్యత పెరిగింది. 1972 యువభారతి నవమవార్షికోత్సవసంవత్సరమే కాక భారతస్వాతంత్ర్యరజతోత్సవసంవత్సరంకూడా కావటంతో మాపై నున్న బాధ్యత మరింత పెరిగింది.

చైతన్యలహరి కార్యక్రమానికి సంబంధించిన ఆలోచనలకు రూపుదిద్దటానికి తమ సముచితసలహాలతో సహకరించిన పెద్దలు, యువభారతి గౌరవ సభ్యులు శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావుగారు, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు, డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగార్లకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు.

ఈ కార్యక్రమాల నిర్వహణకై ఆంధ్రసారస్వతపరిషత్ ఆవరణల నొసగుటయేకాక తమ ఆవరణలో తాత్కాలికకార్యాలయం ఏర్పరచటాని కనుమతించి మాకు ఉనికినీ, ప్రోత్సాహాన్నీ ఇచ్చిన పెద్దలు, ఆంధ్రసారస్వతపరిషత్ ఉపాధ్యక్షులు శ్రీదేవులపల్లి రామానుజరావుగారికి మాహృదయపూర్వక కృతజ్ఞతలు.

యువభారతి నిర్వహించ తలపెట్టిన భారతస్వాతంత్ర్యరజతోత్సవాలకు అధ్యక్షులుగా ఉండటానికి అంగీకరించి చైతన్యలహరి కార్యక్రమాలకు కూడా

తమ ప్రోత్సాహాన్నీ సహాయాన్నీ అందించిన శ్రీ అక్కిరాజు వాసుదేవరావుగారికి మా కృతజ్ఞతాంజలులు.

ద్రష్టలై, స్రష్టలై, చైతన్యమూర్తులై తరతరాలకు మార్గదర్శకులై నిలచిన ప్రతిభావంతులపై ఉపన్యాసా లివ్వటానికి అంగీకరించిన ప్రసిద్ధాంధ్ర సాహిత్యాచార్యులు - ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీ గడియారం రామకృష్ణశర్మ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి, డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావుగార్లకు మనఃపూర్వకాభివందనములు.

సాహిత్యపఠనాభిలాషను పెంపొందించటానికి మేము తలపెట్టిన ఈకార్యక్రమానికి సాదరంగా ఆశీస్సులను అందించి, "ఆముఖం" కూర్చి చైతన్యలహరి శీకరాలను చిందింపజేసిన సహృదయులు డాక్టర్ సి. నారాయణరెడ్డిగారికి మా నమోవాకములు.

చైతన్యలహరి ఉపన్యాసమంజరి జయప్రదమయ్యేందుకు ప్రత్యక్షంగా పాలుపంచుకున్న పెద్దలు - ఆయారోజుల్లో అయిదు సమావేశాలకూ అధ్యక్షులుగానూ, ముఖ్యఅతిథులుగానూ విచ్చేసి సభను జయప్రదంగా నిర్వహించిన సాహితీవేత్తలకు మా మనఃపూర్వక కృతజ్ఞతాంజలులు. చైతన్యలహరిని ఆవిష్కరించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ అధ్యక్షులు మాన్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతాభివందనములు.

చైతన్యలహరి విషయకంగా సాహిత్యసంబంధమైన అవసరమేర్పడినప్పుడు తగుసలహాల నందజేసి చైతన్యం పుస్తకరూపంలో అవతరించేందుకు పూర్తిబాధ్యత స్వీకరించిన డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి నమస్సుమాంజలులను ఘటిస్తున్నాము.

యువభారతి సభల నిర్వహణ తీరును గమనించిన పెద్దలకు వాటికయ్యే ఖర్చు తీరుతెన్నులనుగూర్చి అంచనావేసే అవకాశం ఉంటుంది. ఏదయినా డబ్బుతోనే సాధ్యపడుతుంది. ఈ కార్యక్రమాల కవసరమైన వేలాది రూపాయలను సేకరించటంలో తోడ్పడిన వందలాది మిత్రులకు యువభారతి ఋణపడి వుంటుంది. ఆర్థికవనరుల సేకరణ కార్యంలో అత్యధికప్రాధాన్యాన్ని వహించిన శ్రీ అక్కిరాజు వాసుదేవరావు, శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి, శ్రీమతి వసుమతి రెడ్డి, శ్రీ జి. ఎల్. సంఘిగార్లకు మా హృదయపూర్వక వందనములు.

అచ్చుకు కావలసినకాగితం కొద్దిపాటి తక్కువధలకు లభింపజేయటంలో తమ సహృదయాన్ని ప్రదర్శించిన ఓరియంట్ పేపర్ మిల్స్ పంపిణీదారులు

ఆర్. ఎం. త్రివేదీ అండ్ సన్స్‌వారికి, ముఖ్యంగా శ్రీ రాజమణిగారికి మా వందనములు.

అవసరమైనప్పుడు ఆర్థికంగా ఆదుకొని సాయపడిన శ్రీ జి. ఎల్. సంఘి, శ్రీ పి. శ్రీరామశర్మ, శ్రీ వి. రామకృష్ణయ్య, శ్రీ ఎస్. పాండురంగారెడ్డి, శ్రీ కె.బి. సత్యనారాయణ, శ్రీ కె. విఠల్‌రెడ్డిగార్లకు మా కృతజ్ఞతలు.

సమావేశాలను ఏర్పాటుచేయటంలో మాతో పాలుపంచుకొని, తమ పూర్తి సహకారాన్ని అందించిన ఆంధ్ర సారస్వతపరిషత్‌వారికి - ముఖ్యంగా శ్రీ హరి కిషన్‌రావుగారికి మా నమస్సులు.

మామనసులో నిభావాలకు సరియైన ఆకృతి నిచ్చేలా చైతన్యలహరి ముఖ చిత్రాన్ని మలచియిచ్చినవారు, మాకు సన్నిహితులు ఐన శ్రీ శీలా వీర్రాజు గారికి మావందనములు. అవసరమైనచోట అక్షరాలంకరణ కావించి పుస్తకం అంద చందాలు ఇనుమడించటంలో తోడ్పడిన మాసభ్యులు శ్రీసుధామకు కృతజ్ఞతలు.

ఆలోచనకు రూపంయివ్వటంలో ఎంతకష్ట ముందో కృషికి కార్య రూపం ఇవ్వటంలో అంతకన్న ఎక్కువ కష్టం ఉంటుంది. మాలో ఒకరై, మాబరువుబాధ్యతలలో పాలుపంచుకొని ఈకార్యక్రమం తమదేనన్నట్లు అచ్చు బాధ్యతను స్వీకరించిన శ్రీదాసు నరసింహారావుగారికి మనఃపూర్వకకృతజ్ఞతలు.

చైతన్యలహరి ముఖచిత్రం చైతన్యమూర్తి-నటరాజు. తమఆవరణలోని నటరాజవిగ్రహాన్ని వివిధకోణాలనుండి ఛాయాచిత్రాలు తీయటానికి అనుమ తించిన రామకృష్ణా 70 ఎం. ఎం. థియేటర్ యాజమాన్యంవారికి, ఆఛాయా చిత్రాలను అతినిపుణతతో తీసిన శ్రీగణేశ్‌గారికి కృతజ్ఞతలు.

వివిధవిషయాలలో తమసహాయసహకారాలతో తోడ్పడిన రవీంద్రభారతి మానేజర్ శ్రీ పాతూరి శ్రీరామశాస్త్రిగారికి మాకృతజ్ఞతలు.

అట్టను అచ్చులో సింగారించటంలో మనస్ఫూర్తిగా తోడ్పడిన శ్రీవిష్టాస్‌ప్రింటర్స్ నారాయణ్‌గారికి కృతజ్ఞతలు.

చైతన్యలహరికార్యక్రమానికి సంబంధించిన ఇతరఅచ్చుపనంతా నిర్వ హించిన డి. యస్. ఎన్‌టర్‌ప్రైజెస్‌వారికి, వందనములు. మనసుపడి ముద్రాక్ష రాలను ముచ్చటగా కూర్చి చైతన్యలహరి రూపురేఖలను అక్షరాకృతిగా అలంక రించిన శ్రీ పులిపాక అప్పారావుగారికి మా కృతజ్ఞతలు.

అందమైన బ్లాకులను తయారుచేసి సహకరించిన శ్రీమోహన్‌ప్రోసెస్ వారికి ధన్యావాదాలు.

సమావేశాలు జయప్రదంగా నిర్వహించటంలో శబ్దగ్రహణపు ఏర్పాట్లను సమర్థవంతమైన పద్ధతిలో ఏర్పరిచి తోడ్పడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచారశాఖ డైరెక్టర్ శ్రీ పి. వామనరావుగారికీ, రేడియోవిభాగంవారికీ మా కృతజ్ఞతలు.

కార్యక్రమవివరాలు నలుగురికీ తెలపటంలో తోడ్పడిన పాత్రికేయులకు ముఖ్యంగా శ్రీ పి. ఎస్. ఆర్. అంజనేయశాస్త్రిగారికి, శ్రీ పి. దామోదరస్వామిగారికి, శ్రీకాశీనాథుని సుబ్రహ్మణ్యంగారికి మనఃపూర్వకకృతజ్ఞతలు.

యువభారతి వ్యాపారసంస్థ కాదు. సాహితీప్రియుల ఆదరణ పెట్టుబడిగా, సహృదయులసహకారం ఊతగా వీలైనంత ఎక్కువమందికి వీలున్నంత తక్కువధరకు చైతన్యలహరి అందించగలుగుతున్నాం. విరాళాల సేకరణలో తోడ్పడిన వందలాదిమిత్రులకు, విరాళా లందించిన వేలాదిసాహితీప్రియులకూ మాకృతజ్ఞతలు. అందుకే ఎందరో మహానుభావులు—

# అందరికీ మా వందనములు




నవమ వార్షికోత్సవ ప్రచురణలు



# చైతన్యలహరి

ఉపన్యాస మంజరి



# మహతి

సమీక్షా వ్యాస సంకలనం

# చైతన్యలహరి

# అనుక్రమణిక

# ఆముఖం

డా॥ సి. నారాయణరెడ్డి.

‘మిత్రో జనాన్ చేతయతే’ (సూర్యుడు జనాన్ని మేల్కొలుపుతున్నాడు). ఇది వేదఋక్కు. యుగయుగాలుగా ప్రకృతీ, ప్రజలూ నిత్యం అనుభవిస్తున్న సత్యవాక్కు. నిద్ర సగం మృత్యువు. జీవులకు ఇది ఏనాడూ తప్పదు. అంత మాత్రాన నిద్ర కాదు గెలిచేది జాగృతి. తమస్సు కాదు నిలిచేది ఉషస్సు. కాంతి చైతన్యస్వరూపం. అందుకే ప్రతిదినం ఉదయదిశలో అరుణారుణ భానుదీపం.

సూర్యుడు సృష్టికి మిత్రుడు, కవీ; అంతే. చీకటిముప్పటి కప్పుకుని గురకపెట్టేలోకంకనులు విప్పేవాడు రవి. జడత ఆవరించిన జనం మనసుపొరలను విదలించి చైతన్యం నింపేవాడు కవి.

మతాలు కొందరినే మేల్కొల్పుతాయి. రాజకీయాలు కొందరినే రగుల్కొలుపుతాయి. పదునున్న కవిత – సమాజాభ్యుదయం అద నెరిగిన కవిత అందరినీ మేల్కొలుపుతుంది. అన్నికాలాల్లోనూ చైతన్య విస్ఫులింగాలను రగుల్కొలుపుతుంది. అందుకే అసలైన కవిత విశ్వజనీనం. సార్వకాలికం.

ఈ సంపుటి పేరు ‘చైతన్యలహరి’. తెలుగు కవితను మలుపులు తిప్పిన – తెలుగుజాతికి మెలకువలు నేర్పిన – అయిదుగురు ఆంధ్రకవుల చైతన్య

స్ఫూర్తిని గూర్చి అయిదుగురు ఆలోచనాలోచనాలు అందించిన ఉపన్యాసాల సంకలన మిది.

ఇంతకూ చైతన్య మంటే యేమిటి ? 'చిత్' కుదుట పుట్టిన మాట యిది. 'చితి సంజ్ఞానే' అని వ్యుత్పత్తి. చిత్, చిత్తం, చేతన_అన్నీ ఒకటే. చేతనా శబ్దభావార్థక మే చైతన్యం. చైతన్య మంటే స్థూలంగా జ్ఞానం. వేదాంతగ్రంథాల్లో చైతన్యమంటే 'అపంచీకృతజ్ఞానం'. (original undifferentiated consciousness). వేదాంతులదృష్టిలో ఇది నిరుపాధికం. శరీరాదింద్రియ సంపుటిచేత అనవచ్ఛిన్నం.అంటే ఇంద్రియాలచేత కప్పబడనిది. ఆత్మ అవచ్ఛిన్నం. పరమాత్మ అనవచ్ఛిన్నం. ఈదృష్ట్యా చైతన్యమంటే పరబ్రహ్మస్వరూపం. 'సర్వచైతన్యరూపాంతాం ఆద్యాం దేవీం చ ధీమహి' అని దేవీ భాగవతంలో వుంది. దేవి చైతన్యరూపిణి. అఖిలశక్తి స్వరూపిణి. ఇక్కడ చైతన్యమంటే Cosmic universal consciousness. ప్రాచీనుల దృష్టిలో చైతన్యమంటే దివ్యశక్తి, ఆధ్యాత్మికస్ఫూర్తి, పరమజ్ఞానం, బ్రహ్మజ్ఞానం. ఎఱ్ఱన నృసింహ పురాణాన్ని 'విజ్ఞానాత్మక వాఙ్మయం' అంటాడు. ఇక్కడ విజ్ఞానం అంటే ఈనాడు మనం అనుకునే 'సైన్సు' కాదు. అది 'పెంజీకటి కవ్వలివెలుగు'. 'చదువులో మర్మం' పరమాత్మ పరిజ్ఞానం. ఈరకంగా ప్రాయికంగా ఆధ్యాత్మిక పరిధిలో వాడబడే 'చైతన్య' శబ్దం ఈనాడు భౌతికదృక్పథంలో వాడుకలో వుంది. 'జాతిలో చైతన్యం' అని వాడుక. ఇందులో స్వాతంత్ర్యకాంక్ష, సమసమాజనిర్మాణధ్యేయం ద్యోతకమవుతున్నాయి. 'వెనకబడిన వర్గాల్లో చైతన్యం' _ తరతరాలుగా పాలకవర్గాలు, అగ్రవర్ణాలు తమ నోళ్ళకూ నొసళ్ళకూ బిగించిన సంకెళ్ళను తెంచుకునే ప్రతిఘటన దృక్పథం ఇందులో ధ్వనిస్తుంది. 'విద్యార్థుల్లో చైతన్యం' పాఠాలు - చదవడ మేకాదు; అవసరమైతే తమ హక్కులకోసం పోరాటాలు చేసే ఉద్యమ స్ఫూర్తిని ఈమాట సూచిస్తుంది.

ఈ సంపుటిలోని చైతన్యమూర్తులైన కవులను ఈ రెండు దృక్కోణాలతోనూ చూస్తున్నాను. తిక్కన, పాల్కురికి సోమనాథుడు, కృష్ణదేవరాయలు, వేమన, గురజాడ_ఈ అయిదుగురూ చైతన్యస్వరూపం అవగాహన చేసుకున్నవారే. తాము కాలూని వున్న కాలాన్ని తమ కృతులతో, చేతలతో చైతన్యదీప్తం చేసినవారే.

తిక్కన్న ఉన్నాడు. ఏమిటి ఈయన కలిగించిన చైతన్యం ? 'మామా' అని పిలిచిన మనుమసిద్ధికి ఓ కృతికన్యను ధారవోయడం కాదు. ఉకలుకలాడు.

తున్న ఆ ప్రభువు గద్దెను తన విజ్ఞతతో, రాజనీతిజ్ఞతతో నిలబెట్టడమూ కాదు. హరి మేలని, హరుడు మేలని కీచులాడుకుంటున్న ధార్మికరంగంలో సరికొత్త సమన్వయ దృక్పథాన్ని ప్రతిపాదించడం; హరిహరాద్వైతాన్ని స్థాపించడం. అలా శివకేశవ విభేదాలతో కుమ్ములాడుకుంటున్నవారు అజ్ఞులు కారు. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి "అన్న ఆర్షోక్తిని వల్లించేవారే. పేర్లు వేరైనా దేవుడొకడే నని, పూలు వేరైనా పూజ ఒకటేనని గ్రహించినవారే. అయినా ఆనాడు తప్ప లేదు భిన్నమతాల ప్రాగల్భ్యం; ఈనాటి రకరకాల పార్టీల రాజకీయాలలాగా. సమాజంలో ఇప్పుడు రాజకీయాలకున్న ప్రాబల్యం ఆరోజుల్లో మతాల కుండేదని తాత్పర్యం.

తిక్కన్న వ్యాసభారతాన్ని 'ధర్మాద్వైత' దృష్టితో సమీక్షించాడు. వేదాలకు, అఖిలస్మృతివాదాలకు, బహుపురాణవర్గాలకు వాదైనచోట భారతమే నాలుగు పురుషార్థాలకూ న్యాయపీఠమని చెప్పాడు. నన్నయ - కూడా అన్నాడు "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని' భారతాన్ని కొనియాడుతారని. అంతటితో ఆగలేదతడు అధ్యాత్మవిదులకు, ఐతిహాసికులకు, నీతివిచక్షణులకు, కవివృషభులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క రకంగా - తమతమ దృక్కోణాలను బట్టి భారతం గోచరిస్తుందని వివరించాడు. తిక్కన ఒక ధర్మాంశం మీదే తనదృష్టిని కేంద్రీకరించాడు. ఆ ధర్మాన్ని తానూ అద్వైతదృష్టితోనే ఆకళించుకున్నాడు. ధర్మాచరణలో మతప్రమేయము లేని అద్వైత పథాన్ని అనుసరించాడు. అదే హరిహరాద్వైతం. తిక్కన్న ప్రతిపాదించిన ఈ నూతనతత్త్వం ధార్మికజగత్తులో అపూర్వచైతన్యాన్ని కలిగించింది. తదనంతర కవులైన మారన, నాచన సోమన వంటి వారు ఈదృక్పథాన్ని పాథేయంగా స్వీకరించి పయనించారు. పోతన్న కూడా భాగవతంలో పూర్వకవిస్తుతిలో తిక్కన్న మనీషిని "హరిహర చరణారవింద వందనాభిలాషి" గానే సంభావించాడు.

తిక్కన్న చేసిన మరోగొప్పపని "జాత్యము గామి ఒప్పైన సంస్కృత మెన్నడు జొన్ప''నని ప్రతిజ్ఞ చేయడం. అంటే తెలుగును తెలుగువాడిలా తెలుగులా వ్రాయడమన్నమాట. తిక్కన్న అనగానే తెలుగు గుర్తుకొచ్చేది అందుకే. వేదవేదాంతవిషయాలనైనా అలతి అలతి తెలుగు పలుకులతో అందించవచ్చునని, ఆ భాష కంతటి జీవముందని అలనాడే నిరూపించిన మహాకవి తిక్కన్న. నన్నయ భారతాన్ని "జగద్ధితంబుగ" అనువదిస్తే; తిక్కన్న "ఆంధ్రావళి మోదముంబొరయు నట్లుగ" రచించాడు. అంతే తేడా.

తిక్కన్న అభిమానించిన తెలుగునే మరింతగా అతిశయింపచేసినవాడు పాలకురికి సోమన్న. పాలకురికికాలానికి వృత్తరచనదే పెత్తనం. చంపూ కావ్యాలదే సామ్రాజ్యం. సంస్కృతపదభూయిష్ఠరచనదే సార్వభౌమత్వం. అప్పుడు పట్టుకున్నాడు సోమన్న జానపదుల నోళ్ళలో, రోళ్ళలో, రోకళ్ళలో, తిరగళ్ళలో తిరుగుళ్ళు పడుతున్న ద్విపద గీతులను. వీటిని తెలుగుమాటల నొదుగు వేదాలు సుమా అని ఎలుగెత్తాడు. సూటిగా తేటగా కవిత చెప్పాలంటే జాను తెనుగుకు టీటు లేదని చాటాడు. వీధిమానిసి మాట్లాడుకునే తెలుగును అపౌరుషేయాలైన వేదాల సరిబంతిలో నిలపడం పాలకురికి కలేజాకు నిదర్శనం. ఇతడు ఇతివృత్తం కోసం ఏ వ్యాసుణ్ణో ఆశ్రయించలేదు. ఏ పురాణాలనూ తవ్వలేదు. తనకు కొంచెం ముందుగా బసవని ధర్మవీరుడుగా వీరవిహారం చేసిన చరితను ఎన్నుకున్నాడు. ఆబసవనికాలంలోనే మట్టిలో పుట్టి మాణిక్యాలుగా విలసిల్లిన మడివాలు మాచయ్యావంటి సామాన్యజనుల జీవితగాథలను స్వీకరించాడు. చదువు రాని జానపదుల గుండెచప్పుళ్ళకు వాహికలైన రెండు కాళ్ళ ద్విపదలలో దండికావ్యాలు సృష్టించాడు. శబ్దాన్ని వ్యాకరించ గలిగే అపారవ్యుత్పత్తి ఉన్నా జనసామాన్యంలో వాడుకలో ఉన్న వైరిసమాసాలకు, వ్యావహారిక పదరూపాలకు కావ్యగౌరవం కలిగించాడు. ఆవేశం కావ్యానికి ప్రాణభూతమని అక్షరాలా నిరూపించాడు. భాషలో, భావనలో, వస్తువులో, ఛందస్సులో ఆధునికులకు తలబంతి కాగలిగిన ప్రతిఘటన దృక్పథాన్ని ప్రదర్శించిన చైతన్యమూర్తి పాలకురికి సోమనాథుడు. అయితే ఇంతటి వైతాళికుడు ఆరోజుల్లో రాశికి రాకపోవడానికి కారణం మతంపట్ల అతని కున్న పాక్షిక దృక్పథం. తాను భవితో (శైవేతరునితో) భాషింప నన్నాడు. ఫరవా లేదు. ఆ భవిని తాకినా, కనీసం చూసినా పంచమహాపాతకాలు చుట్టుకుంటా యన్నంతగా గిరిగీసుకున్నాడు. భాషావిషయంలో, కవిత్వవిషయంలో అంతటి స్వచ్ఛందతను చూపిన ఈ దేశికవీంద్రుడు మతవిషయంలో అంతగా ఎందుకు కుంచించుకుపోయాడో ఆశ్చర్యం వేస్తుంది.

కృష్ణదేవరాయలు ఆంధ్రకర్ణాటాధీశ్వరుడు. సాహితీ సమరాంగణ సార్వభౌముడు. రాజకవి. కవిరాజు. అయినా అతణ్ణి దొడ్డకవిగా నిలబెట్టినవి ఈ సనదులూ, బిరుదులూ కావు; చేవగల తెలుగులో "ఆముక్తమాల్యద" వంటి ప్రౌఢకావ్యం వ్రాయడం. అంతకుముందు అతడు వ్రాసినవన్నీ సంస్కృత కావ్యాలే. అప్పటికి తెలుగు ఈ రాయల దృష్టికి ఆనినట్టు లేదు. కలలో శ్రీకాకు

శంలో వెలసిన తెలుగు రాయడు ఆనతిచ్చాడు గోదాదేవిగాథ తెలుగులోనే వ్రాయవలసిందని. ఇంకేమి? ఆ కన్నడరాయడు గంట మందుకున్నాడు. ఎక్కడెక్కడి తెలుగు పలుకుబళ్ళనో ఏరి రాశిపోశాడు. "దేశ భాషలందు తెలుగు లెస్స" అంటూ ఏనాడో శ్రీనాథుడు అలవోకగా అన్నమాటను కృత్యాదిలో తిరగవేశాడు. తెలుగు కలకంఠ అని ఆనాటి అన్యభాషీయులకు కన్నుగుట్టేట్టు చాటి చెప్పాడు. సమకాలిక ప్రబంధకవులు చేయని మరో మంచిపని కూడా చేశాడు. వారికెవ్వరికీ అగుపడని సామాన్య గృహస్థుల ఇళ్ళనూ, వాకిళ్ళనూ, చూరులనూ, వారి బ్రతుకు తీరులనూ హృదయంగమంగా చిత్రించాడు. "విలసద్భావరసాద్యలం కృతులచే విప్పారు" ఆంధ్ర మహాకృతులెన్ని వున్నా "తెలుగంచు" చెవిపెట్టని పండితుల తుప్పు దుల్పాడు. అయితే తెలుగుతనానికి కలికి తురాయి కూర్చిన ఈ కవిరాజే "ఉషఃస్నాతప్రయాత ద్విజావళి పిండీకృత శాటు" లంటూ మధ్య మధ్య తెలుగువారి గూబ లదరగొట్టాడు. అందుకు కొంతవ్యథ కలిగినా ఒక్కటి మాత్రం చెప్పుకోవాలి. తన ఆస్థానంలో అష్టదిగ్గజాలను పోషించడంలోనేమి, మనుచరిత్ర, పారిజాతాపహరణం వంటి రసవత్ప్రబంధాలకు కృతిపతిత్వం వహించడంలోనేమి, "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి" వీధిలో వెళ్ళే తెలుగుకవికి కేలూత నొసగి ఎక్కించుకోవడంలోనేమి, పరదురాక్రమణలో మగ్గిపోతున్న తెలుగునేల నాలుగు చెరగులను ఒక్కటిగా ముడిచి, తెలుగు సంస్కృతిని వెల్లగొడుగుక్రింద నిలిపి, తెలుగువారి యశోరశ్మిని ఖండాంతరాల దాకా వ్యాపింపజేయడంలో నేమి కృష్ణరాయడు నాన్యతోదర్శనీయుడు; ప్రాతః స్మరణీయుడు.

పాలకురికి సోమన్న ద్విపదల్లో కావ్యం వ్రాయడం గొప్ప ప్రయోగమే. కానీ అప్పుడప్పుడు, ఆవేశం అంచులు ముట్టినప్పుడు, కావ్యకళాప్రౌఢి కాకలు తీరినప్పుడు అతడు పదేసి పంక్తులుదాకా సంస్కృత సమాసాలతో సాముగరిడీలు చేశాడు. మరి వేమన్న అలా కాదు. ఇతడు దేశికవి. ఇతడు వరించినఛందస్సు తెలుగునాట గజ్జెలు కట్టుకున్న ఆటవెలది. ఆ ఆటవెలది పద్యంలో చివరి పంక్తి "విశ్వదాభిరామ వినురవేమ"కే సరిపోతుందాయె. ఇక మిగిలినవి మూడు పంక్తులు. ఆ మూడు పంక్తుల్లో ముల్లోకాల జీవరహస్యాలను ఇమిడించాడు. తిక్కన్న తరువాత తెలుగునుడికి ఎంతటివాడి వుందో రుజువు చేశాడు. "కొండ అద్దమందు కొంచమై యుండదా" అన్నట్టు బ్రహ్మాండమంతటి విషయాన్ని చిన్నచిన్నపద్యాలలో కుదించి చెప్పాడు. "అల్పాక్షరముల అనల్పార్థరచన"

అన్న పాలకురికి నినాదాన్ని గుట్టుచప్పుడు గాకుండా ఆచరించి చూపాడు. ఇంతకూ వేమన్న తెలుగుజాతి కిచ్చిన కానుకలు ఇంకా ఉన్నాయి. సమకాలీన సమాజంలోని మేడిపళ్ళ పొట్టలు విచ్చిచూపడం, పురుషు లెవరో, పుణ్యపురుష లెవరో విడమరిచి చెప్పడం, అవసరమైతే కవి తన కలాన్ని కత్తివాదరలా ప్రయోగించగల డని నిరూపించడం. ఈ ఒక్కపద్యం చాలు ఈనాటి సంఘాన్ని ఎడాపెడా వాయించడానికి—

"కులము గల్గువారు గోత్రము గలవారు
విద్దెచేత విఱ్ఱవీగువారు
పసిడి గల్గువాని బానిసకొడుకులు
విశ్వదాభిరామ వినురవేమ."

కాదంటామా? పెదవులు కాదన్నా హృదయం ఎదురు తిరుగుతుంది. మత మౌఢ్యాలనూ, పైపై మెరుగులనూ, దగాలనూ, దౌష్ట్యాలనూ అడుగడుగునా ఎత్తి చూపి, ఈనాటికీ తెలుగువారి గుండెల్లో గూడుకట్టుకుని వున్న ప్రజాకవి వేమన్న. బతికివున్నప్పుడు అతని పద్యాలు సామాన్యజనంలో ఎంతటి సంచలనం కలిగించాయో నేటికీ అఖిలాంధ్రకోటికి అంతటి చైతన్యాన్నే కలిగిస్తున్నాయి. తెలుగుకవితకు ఖండాంతరకీర్తిని తెచ్చిపెట్టింది వేమన్నే. "నీ భాషకు మూల ధనంఏద'ని ఎవరైనా అడిగితే దోసిళ్ళకొద్దీ ఎత్తిచూపగలిగేవీ వేమన్నపద్యాలే.

గురజాడను వాల్మీకి అన్నారు. వాల్మీకి రామకథను కావ్యంగా మలిచాడు. రాముడు ఆదర్శపురుషుడు. ఆ రామకథను యుగయుగాలకూ స్మరణీయంగా చేసింది వాల్మీకే. మరి గురజాడను వాల్మీకితో ఎందుకు పోల్చారు? ముత్యాల సరాలు సృష్టించినందుకా? కాదు. అంతవరకు మిశ్రగతిలో, వృషభగతి రగడలో, మేలుకొలుపు పాటల్లో తలదాచుకున్న ఛందస్సే అది. వ్యావహారిక భాషను కవిత్వంలో ప్రవేశపెట్టినందుకా? కాదు. జానపదగేయాల్లో చిరకాలంగా ఉన్నదే అది. నా దృష్టిలో ఒక్క 'దేశభక్తి' గీతం చాలు గురజాడను వాల్మీకి అనడానికి. రామాయణం వల్ల ఆదర్శ మానవు లెవరో తెలిసింది. దేశభక్తిగీతం వల్ల దేశమంటే రాళ్ళకూ, రప్పలకూ, చెట్లకూ, చేమలకూ అతీతమైన 'మనిషే' నని తెలిసింది.

"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

మనిషిని ఇంత నిర్దిష్టంగా దివ్విటీ పట్టి చూపిన కవిత తెలుగులో మరొకటి లేదు. మనిషిని మనిషిగా చూపడంకన్న మహత్తర కవిత మరేదీలేదు. అందుకే అంటున్నాను-'దేశభక్తి' గీతం ఒక్కటే చాలు గురజాడను ప్రవక్తగా నిలబెట్ట డానికని. కాలం గడుస్తున్న కొద్దీ గురజాడ ప్రభావం తెలుగునాట మరింతగా కుదురుకుంటున్నది. ఇరవయ్యో శతాబ్ది తొలిజాములో అత డందించిన చైతన్యం క్రమంగా మధ్యాహ్నమార్తాండబింబంలా ప్రకాశిస్తున్నది. ఆధునికుల భావ చైతన్యానికి అడుగుజాడ గురజాడదే.

ఈ ఐదుగురు కవులూ భిన్నభిన్న కాలాల్లో వున్నవారు. ఐదుగురి తీరు తెన్నులూ వేరువేరు. కానీ వీరందరూ సమకాలీన సమాజాన్ని, ఆ తరువాతి తరాలనూ ప్రభావితం చేసినవారే. అయితే ఒక విశిష్టలక్షణం ఈ అయిదుగురినీ ఏకసూత్రంలో ముడివేస్తున్నది. అదే దేశీయత, ఈ అయిదుగురు తెలుగు పలుకు బడికి పట్టంకట్టిన వారే. తెలుగుతనాన్ని తమ రచనలద్వారా దీపింపజేసిన వారే. తెలుగువాడు తరతరాలకూ చెప్పుకోగలిగిన ఉత్తమకృతులు రచించిన వారే. మొక్కవోనివ్యక్తిత్వ ముద్ర గలవారే.

వీరినిగూర్చి సమీక్షించిన అయిదుగురు ఉపన్యాసకులు తమ తమ రంగాల్లో చేయి తిరిగిన వారు. ఆచార్య దివాకర్లవారు తిక్కన్న బహుముఖ వ్యక్తిత్వాన్ని సమగ్రంగా సమాలోచించి చూపారు. గడియారంవారు పాలకురికి ప్రతిభావ్యుత్పత్తులను సునిశితంగా పరిశీలించి చూపారు. పుట్టపర్తివారు కృష్ణరాయల కృతిలోని వైష్ణవ ముద్రను అపూర్వవిద్వత్తతో విమర్శించి చూపారు. మరుపూరువారు వేమన్న పద్యాలకూ జీవితానికీ వున్న లంకెను వివరించి చూపారు. కొత్తపల్లివారు ఆధునిక తెలుగుసాహితికి గురజాడ దిద్దిన సరికొత్త కళలను సమన్వయించి చూపారు.

దర్శనప్రతిభతోపాటు విమర్శనప్రతిభకూడా వున్న ఈ అయిదుగురు పండితులచేత ఆ అయిదుగురు తెలుగుకవుల రచనా చైతన్యాన్ని ఆవిష్కరింప జేసి వారి ఉపన్యాసాలు గాలిలో కలిసిపోకుండా అందమైన గ్రంథంలో సంత రింప జేసిన "యువభారతి" కృషి ప్రశంసనీయం. సంప్రదాయంలోని మేలి నిగ్గులను ఈ తరంవారికి చవి చూపడంలో "కావ్యలహరి"ద్వారా "యువభారతి" నిర్వహించిన పాత్ర ఈవరకే చరిత్రకెక్కింది. ఈ "చైతన్యలహరి" ఆ చరిత్రకు మరోపుటను తొడుగుతుంది. అదే నా ఆకాంక్ష!

# తిక్కన సోమయాజి

## — ఆచార్య దివాకర్ల వేంకటావధాని

తిక్కన కారణజన్ముఁడైన మహాకవి. మహాకవులు పలువు రుండవచ్చును. వారి ప్రభావము భాషావాఙ్మయములందేకాని యితరరంగములం దంతగా కనిపింపదు. తిక్కన తనరచనలచే నొకవంక నాంధ్రభాషావాఙ్మయములకు సుస్థిరమైన రూప మొసంగుట యటుండఁ దనరాజకీయనైపుణీధౌరంధర్యము చేతను, మతసామరస్యసంపదచేతను, వైదికలౌకికప్రవృత్తిప్రావీణ్యము చేతను, సామాజికసంబంధసామీచీన్యముచేతను, సౌశీల్యసౌమనస్యములచేతను ఆరోజులలో నాంధ్రదేశము నలుమూలల నపూర్వమైన ప్రశస్తి నార్జించి యభినందింపఁబడిన మహనీయుఁడు. అతనికవిత్వమువలెనే వ్యక్తిత్వమును సర్వాంధ్రజనారాధ్యమైనట్టిది. అందుచేతనే అతనిని కేవలము మహాకవిగనే కాక కారణజన్ముఁడైన మహాపురుషుఁడుగా స్మరించుటయు, నాంధ్రదేశమున చైతన్యగంగాలహరిని బ్రవర్తింపఁజేసిన యపరభగీరథుఁడుగా నారాధించుటయు జరుగుచున్నది.

తిక్కన నిర్వచనోత్తర రామాయణ విరాటపర్వారంభములందు తన్ను గూర్చి కాని తనవంశమునుగూర్చి కాని వివరము లేమియు చెప్పియుండ లేదు. కాని అభినవదండి బిరుదాంకితుఁడైన మూలఘటిక కేతన తాను రచించిన దశకుమారచరిత మను చంపూకావ్యమును తిక్కన కంకితము చేయుచు నం దాతని వంశమునందలి పూర్వులను, వారి గుణగణములను, తిక్కన రూపౌదార్య కవితాపాండితీ ప్రతిభాపాటవములను విశదముగా వర్ణించియుండెను. దానినిబట్టి మనము తిక్కనను గూర్చియుఁ దద్వంశమును గూర్చియుఁ గొన్ని

విశేషములను దెలిసికొనుట కవకాశము కలుగుచున్నది. నిర్వచనోత్తర రామాయణమునందలి

అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించుశి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికి న్సుతుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్. ౧-13

అనుపద్యమును బట్టి అన్నమాకొమ్మనమంత్రులు తిక్కనతల్లిదండ్రు లనియు, నతఁడు గౌతమగోత్రుఁ డనియు, నాపస్తంబసూత్రుఁ డనియుఁ దెలియుచున్నది. అంతకు ముందున్న పద్యమున సారకవితాభిరాముఁడును, గుంటూరి విభుఁడు నైన మంత్రిభాస్కరుఁ డాతని పితామహుఁ డని చెప్పఁబడినది. విరాటపర్వమందలి "మజ్జనకుండు సమ్మాన్య గౌతమ గోత్రమహితుం" డిత్యాది సీసము కొమ్మన దండనాథుఁ డనియు, మధురకీర్తి విస్తరస్ఫారుఁ డనియు, సాంగవేద వేది యనియు, కేతన మల్లనసిద్ధనామాత్యవరుల కూరిమితమ్ముఁ డనియుఁ దెల్పుచున్నది. కేతన దశకుమారచరిత్రమున తిక్కనగృహనామము కొట్టరువువా రని చెప్పియున్నాఁడు. కొన్నిశాసనములలో కోష్ఠాధిపతి యను సంస్కృతశబ్దమునకు కొట్టారువు అను తెలుఁగుపదము వాడఁబడిన దనియు, తిక్కనపూర్వు లెవ్వరో కోష్ఠాధిపతి పదవిని నిర్వహించియుండుటచే వారికి కొట్టారువు అను నింటిపే రేర్పడి కాలక్రమమున కొట్టరువుగా మాఱియుండుననియు కీ.శే.చాగంటి శేషయ్యగా రూహించియున్నారు. తెలిసినంతవఱకు తిక్కనవంశమునకు మూల పురుషుఁడు మావెన. మావెన యనుపేరుగల యొకఁడు వస్తువులపై పన్ను రాఁబట్టెడి యధికారి (సుంకవ్రెగ్గడ)గా నుండి, యాపన్ను గుంటూరుమండలమందలి సత్తెనపల్లితాలూకాలోని మావెందలగ్రామమున నున్న సకలేశ్వరదేవునకు దీపమునకై ధారవోసినట్లు క్రీ. శ. 1129వ సంవత్సరమునందలి యొక శాసనమువలనఁ దెలియుచున్నది. ఈమావెనయే తిక్కనవంశమునకు మూల పురుషుఁ డైన మావెన యై యుండవచ్చును. కాలముకూడ కొంచెము మించు మించుగా సరిపోవును. మావెనకుమారుఁడు గుండశౌరి; పౌత్రుఁడు కేతన. కేతనకు గుండన, భాస్కరమంత్రి, మహేశ్వరుఁడు అను ముగ్గురుకుమారు లుండిరి. వీరిలోని భాస్కరమంత్రియే సారకవితాభిరాముఁడును, గుంటూరి విభుఁడు నని తిక్కనచేఁ బేర్కొనఁబడిన యతనిపితామహుఁడు. ఇతఁడు పూర్వరామాయణమును రచించియుండె నని విమర్శకుల అభిప్రాయము. కేతన,

మల్లన, సిద్ధన, కొమ్మన అనువారు నలువురు సీతనిపుత్త్రులు. వీరిలో కేతన పద్యకాదంబరీకావ్యమును రచించె నని ప్రతీతి. సిద్ధనయు నతనికుమారుఁడైన ఖడ్గతిక్కనయు చోడతిక్కరాజుకడ మంత్రియు సేనాధిపతియునై పేరు గాంచిరి. కొమ్మన తండ్రివలెనే గుంటూరి విభుఁడై యుండెను. అతఁడన్నమ యను సకలకల్యాణగుణాలవాల యైన ధర్మపత్నియందుఁ గాంచిన కుమారరత్నమే తిక్కన.

తిక్కన తనతండ్రియు తాతయు గుంటూరివిభు లని చెప్పియుండెను. గుంటూరివిభు లనఁగా గుంటూరికి కరణములై యుందు రని కొందఱి యభిప్రాయము. వారు కరణములై యుండిన నుండవచ్చును గాని యంతమాత్రమున వా రిప్పటి కరణములవలె వట్టిలెక్కలు వ్రాయువారుగా నుండిరని భావింపరాదు. తిక్కన కేతనకు విభు, దండనాథపదములను వాడుటయే కాక యతఁడు గాండీవధన్వుఁడో యన నెగడి సూర్యవంశభూపాలసుచిరరాజ్యవసంతుడై యుండెననియు చెప్పియుండుటను బట్టి వారు శౌర్యధైర్యపరాక్రమధుర్యులైన దండనాథులును, బరిపాలకులుగను గూడ వ్యవహరించి యుందురని చెప్పవచ్చును. కొమ్మనకూడ చోడవంశరాజులకడ దండనాథుఁడుగా నుండి నెల్లూరుప్రాంతమున జరిగిన యొకయుద్ధమున వీరమరణము నొందె ననియు నావార్త విని గుంటూరునం దున్న అన్నమ సహగమన మాచరించె ననియు చెప్పుదురు. ఆకాలమున మంత్రిదండనాథాదులు తమకుమారులకు కృతజ్ఞతాపూర్వకముగాఁ దమప్రభువులపేర్లు పెట్టుకొనునాచార ముండుటచే కొమ్మన తనకుమారునికి మనుమసిద్ధితండ్రి యైన తిక్కరాజుపేరే పెట్టె నని తోఁచుచున్నది. తిక్కనయనుపేరు శ్రీకాళహస్తియందలి తిరుకాళత్తిదేవునిబట్టి యేర్పడినదే. తిక్కరాజునకు తిరుకాళత్తిదేవచోడుఁ డను నామముకూడ నుండుట యిందుకు నిదర్శనము.

తిక్కనబాల్యమునుగూర్చి కేతనకూడ నేమియుఁ దెల్పియుండలేదు. చిన్నతనమునందే తల్లిదండ్రులను గోల్పోవుటచే నతఁడు నెల్లూరున మంత్రిపదవియం దుండిన పెదతండ్రి సిద్ధనామాత్యునికడ కేగి యచటనే విద్యాబుద్ధులు నేర్చె నని చెప్పుదురు. అతఁ డచ్చట వేదవేదాంగములతో పాటు మనుమసిద్ధికి మిత్రుఁడును సహపాఠియునై రాజనీతిని గూడ నభ్యసించి యుండును. కేతన తిక్కనకు వాడిన "రాజనయవిధాప్రయోజనవిశారదుఁడు, నరపతినయవిద్యానైపుణ్యప్రౌఢభావుఁడు, నీతిచాణక్యుఁడు" మున్నగువిశేషణము

లిందుకు సూచనలు. మనుమసిద్ధి తన్ను వరుసకు మామా యని పిల్చుచుండి నట్లు తిక్కన నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పియుండుటచే నతఁడు మనుమసిద్ధికంటె నించుక పెద్దవాఁడై యుండు నని యూహింపవచ్చును. తిక్కరాజు మరణానంతరము మనుమసిద్ధి రాజ్యాభిషిక్తుఁడు కాఁగానే తిక్కన మంత్రిపదవి నధిష్ఠించియుండును. తిక్కరాజుశాసనములు క్రీ.శ. 1252 వఱకుఁ గానిపించుచుండుటచే మనుమసిద్ధి రాజత్వమును తిక్కన మంత్రిత్వమును క్రీ. శ. 1253 వ సంవత్సరమునఁ బడసియుందు రని యూహింపవచ్చును. కేతన తిక్కనకు దండాధీశుఁడు, చమూపుఁడు అనువిశేషణములనుగూడ వాడియుండెను. కేతన దశకుమారచరితము నవతారికయందును, ఆశ్వాసాద్యంతములందును వాడినవిశేషణములనుబట్టి తిక్కన దశదిశావిశ్రాంతయశుఁ డనియు, శుభచరిత్రుఁ డనియు, సకలవిద్యాకళాపారగుఁ డనియు, ధైర్యగాంభీర్యాదిగుణసంపన్నుఁ డనియు, అర్థిజనరాధేయుఁ డనియు, కవీంద్రలోకాధారుఁ డనియు, దేవేంద్రవిభవుఁ డనియు, నభిరూపభావభవుఁ డనియు, జితేంద్రియుఁ డనియు, వేదవిద్యాప్రవీణుఁ డనియు, శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరుఁ డనియు, ఉభయకవిమిత్రుఁ డనియు, నీతివిద్యానిపుణుఁ డనియు, చిత్తనిత్యస్థితశివుఁ డనియుఁ దెలియవచ్చును. శ్రీకాంతచరణయుగళీకోకనదమధువ్రతుఁడు మున్నగు కేతనప్రయుక్తవిశేషణములు తిక్కన విష్ణుసేవాపరాయణుఁ డని కూడ వ్యక్తముచేయుచున్నవి. "మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుఁ" డయ్యును అతఁడు విష్ణుద్వేషిమాత్రము కాఁడు. అతనిపూర్వులలోఁ గొందఱు హరిపూజాపరాయణులుకూడ నుండిరి. ఆవంశమువారికి శివకేశవులందు భక్తి కొంచె మించుమించుగా సమానమే. అట్లు కానిచో భాస్కరమంత్రి పూర్వరామాయణమును, తిక్కన నిర్వచనోత్తరరామాయణమును రచించుట సంభవించి యుండదు.

తండ్రి మరణానంతరము మనుమసిద్ధి నెల్లూరుసింహాసనము నధిష్ఠించినను ఆరంభకాలమున నాతనిరాజ్యము ప్రశాంతముగా సాగినట్లు కనిపింపదు. అక్కన బయ్యన లను దాయాదు లాతనిసింహాసనభ్రష్టుని గావించి రాజ్యము నాక్రమించిరి. మనుమసిద్ధికి వారిని దిరిగి జయించు శక్తిసామర్థ్యములు లేకుండెను. అప్పుడు మంత్రియు మిత్రుఁడు నైన తిక్కన యోరుగల్లు సామ్రాజ్యమును బాలించుచుండిన గణపతిదేవుని దర్శించి యాతనిసాహాయ్యము నర్థింప గణపతిదేవుఁడు పెద్దసేనతో వచ్చి, వెలనాటిరాజును జయించి, యప్పన

ములు గొని పిమ్మట అక్కనబయ్యనలను బాలఁద్రోలి మనుమసిద్ధిని మరల నెల్లూరురాజ్యమునఁ బునఃప్రతిష్ఠితుని గావించె నని సిద్ధేశ్వర చరిత్రము, సోమదేవరాజీయము అను గ్రంథములవలనఁ దెలియుచున్నది. గణపతిదేవుని నాయకపల్లిశాసనముకూడ నీవృత్తాంతమును సూచించుచున్నది. సిద్ధేశ్వర చరిత్రము ద్విపదకావ్యము. దానిని రచించిన కాసె సర్వప్ప క్రీ. శ. 15 వ శతాబ్దిలో నివసించెను. దాని నాధారముగాఁ జేసికొనియే 18 వ శతాబ్దియం దుండిన కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయమును రచించినట్లు కనిపించును. తిక్కన గణపతిదేవుని దర్శించిన వృత్తాంతము నారెండుకావ్యములును ఒకే విధముగా వర్ణించుచున్నవి. సర్వప్ప దిక్కుదిక్కులనుండి విద్యార్థు లరుదెంచి కావ్యములందలి శ్లోకములను వినిపించుచుండ వానిని జక్కఁగా వినుచు తిక్కన యందలముపై నోరుగంటి కరుదెంచె ననియు, నతనిరాక ప్రతిహారులవలన నెఱింగి గణపతిదేవుఁ డెదురేగి యాతనిఁ దన కొలువునకుఁ గొనివచ్చి యత్యంతభక్తితో నాదరించె ననియు, తిక్కన భారతాఖ్యాన మును భారతవీరు లొనరించిన యుద్ధప్రకారములను విశదముగా వర్ణింప గణపతి దేవుఁడు విని మెచ్చి యతనికి వివిధవస్త్రభూషణాదులు బహుమానముగా నొసంగె ననియుఁ దరువాత తిక్కన తాను వచ్చినపని విన్నవింప గణపతిదేవుఁడు పెద్దసేనతో నేగి వెలనాటిరాజును గెల్చి, అక్కనబయ్యనల నోడించి మనుమ సిద్ధిని నెల్లూరున పునఃప్రతిష్ఠితుని గావించె ననియు వర్ణించి యున్నాఁడు. సోమదేవరాజీయమున తిక్కన గణపతిదేవునకు భారతార్థములనేకాక ద్వైతా ద్వైతమతతత్త్వములను, ధర్మాధర్మపద్ధతులను, రాజనీతిప్రకారములను గూడఁ దెల్పె ననియు, గణపతిదేవుఁ డనుమకొండలోని బౌద్ధజనులను రావించి వారిని తిక్కనతో వాదింపఁజేయ తిక్కన వారిని సులభముగా నోడించె ననియు, నప్పుడు గణపతిదేవుఁడు బౌద్ధదేవాలయములను గూలఁద్రోయించి తిక్కనను బహుప్రకారములఁ బూజించె ననియుఁ దెల్పుచున్నది. అప్పటికి తిక్కన యింకను నిర్వచనోత్తరరామాయణమును గాని భారతమునుగాని రచించి యుండలేదు. అతఁడు తన కత్యంతాభిమానపాత్ర మైన సంస్కృత భారతమును బురస్కరించుకొనియే భారతకథాయుద్ధవిశేషములను, ధర్మతత్త్వాదులను గణపతిదేవునికిఁ జెప్పియుండును. ఆరాజాతనివాగ్మితా పాండితీపాటవములకును వివరణపద్ధతికిని, వాదప్రౌఢికిని మెచ్చి యాతని బహువిధముల గౌరవించియుం డును. ఈ విధముగా గణపతిదేవుఁడే కాక తిక్కనయు మనుమసిద్ధిరాజ్యస్థాప నాచార్యబిరుదమునకుఁ దగియున్నాఁడు.

మనుమసిద్ధికంటె తిక్కన కొన్నియేండ్లు పెద్దవాఁడై యుండు నని యిదివఱకు సూచింపఁబడినది. మనుమసిద్ధితండ్రి యైన తిక్కరాజు క్రీ. శ. 1190ప్రాంతమునఁ బుట్టి 1252 వఱకు రాజ్య మేలినట్లు తెలియుచున్నది. మనుమసిద్ధిమరణకాలము 1260ప్రాంత మని కొందఱును, 1263వ సంవత్సర మని కొందఱును చెప్పుచున్నారు. అతఁడు తిక్కరాజునకు 25 ఏండ్లప్రాయమున జనించియుండు ననుకొన్నచో నతనిజననకాలము 1215ప్రాంత మగును. అతనికంటె నించుక పెద్దవాఁడైన తిక్కన 1210ప్రాంతమున జనించియుండును. అతఁడు శా.శ.1210సంవత్సరమున (క్రీ.శ.1288) మరణించె నని తెల్పుపద్య మొక టున్నది. ఆపద్యము నంతగా విశ్వసించుట కవకాశము లేకున్నను తిక్కనమరణకాల మించుమించుగా 1290ప్రాంతమై యుండు నని భావింపవచ్చును. అతఁడు పూర్ణపురుషాయుషజీవి యై సుమా రెనుబదియేండ్లు జీవించె నని ప్రతీతి. దీనినిబట్టి యతనిజీవితకాలము క్రీ. శ. 1210నుండి 1290వఱకు నని నిర్ణయింపవచ్చును. మనుమసిద్ధికి కాటమరాజతో యుద్ధము జరిగినప్పుడు తిక్కన యాతనికి మంత్రియై యుండినను ఆయుద్ధమున నతనిప్రసక్తి యిసుమంతయు లేకుండుట వింతగా నున్నది.

తిక్కన నిర్వచనోత్తరరామాయణ భారతపర్వములనేకాక విజయసేనము, కవిసార్వభౌమచ్ఛందస్సు, కృష్ణశతకము అనువానినిగూడ రచించె నని లోకమునఁ బ్రతీతి యున్నది. పెదపాటి జగ్గకవి తాను సంకలనము చేసిన ప్రబంధరత్నావళిలో విజయసేనములోని వని కొన్నిపద్యము లుద్ధరించి యున్నాఁడు. అప్పకవియు కస్తూరిరంగకవియు సంశయప్లుతయతికి లక్ష్యముగా విజయసేనములోని దని

వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచితస్థితికి న్ననుఁ బాపఁజూచినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నే మనువా రెఱింగి రే
నుల్లమ! యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా!

యనుపద్యము నుదాహరించియుండిరి. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున నీపద్యము అమరేశ్వరుని విక్రమసేనములోని దని చెప్పియున్నాఁడు. విక్రమసేనవిజయసేనములలో నేదియు నిప్పుడు లభింపనికారణమున వానికర్తృత్వమునుగూర్చి యిదమిత్థ మని నిర్ణయించుట కవకాశము లేకున్నది. కవివాగ్బంధన మను నామాంతరము గల కవిసార్వభౌమచ్ఛందమునందలి చివరి

పద్య మది తిక్కనయే రచించినట్లు తెల్పుచున్నది. కాని యందు 'పాలవార్ధి శయన'వంటి యపప్రయోగములు కొన్ని కానవచ్చుచుండుటచేతను, యతుల సంఖ్య యిరువదియేడుగాఁ జెప్పఁబడియుండుటచేతను అది తిక్కనరచన కాదనియు, ననంతామాత్యుని సమకాలికుఁడుదో యతనితరువాత నుండిన మఱియొకకవియో దానిని రచించియుండు ననియు విమర్శకులు తలంచుచున్నారు. "అరయన్ శంతనుపుత్రుపై దనుజుపైఁ నక్రూరుపైఁగుబ్జపై....కృష్ణ! భక్తప్రియా!" అనుపద్యము తిక్కనరచిత మైన కృష్ణశతకములోని దని కొందఱు నుడువుదురు. "కృష్ణ! భక్తప్రియా" అనుమకుటము గల శతక మిప్పు డెచ్చటను లభించుటలేదు. ఆశతకమంతయుఁ గాని యందలి మఱికొన్నిపద్యములు కాని లభించువఱకు దానికర్తృత్వమును నిర్ణయించుటకు వీలులేదు.

తిక్కన నిర్వచనోత్తరరామాయణమునఁ దా నుభయకావ్యప్రౌఢిఁ బాటించుశిల్పమునం బారగుఁడ నని చెప్పుకొనియుండెను. కేతనయు మారనయు నతఁ డుభయభాషలయందుఁ గవి యని కీర్తించియుండిరి. అతని కుభయకవిమిత్రుఁడను బిరుద ముండనేయున్నది. దీనినిబట్టి తిక్కనసంస్కృతమునఁగూడఁ గొంతరచన చేసియుండినట్లు కనవచ్చుచున్నది. కంపరాయల భార్య యైన గంగాదేవి తనమధురావిజయ మను సంస్కృతకావ్యమున వాల్మీకి మొదలు లీలాశుకునివఱకుఁ గల కొందఱు సంస్కృతకవులను సంస్తుతించి చివర తిక్కయ, అగస్త్యుఁడు, గంగాధరుఁడు, విశ్వనాథుఁడు అనుకాకతీయ యుగమునందలిఆంధ్రు లైన సంస్కృతకవులనుగూడ సన్నుతించెను. తిక్కయ యనుసంస్కృతకవి యొకఁ డుండినట్లు నిదర్శనములు లేవు. ఆమె 'తిక్కయస్య కవేస్సూక్తిః" అనునెడ "తిక్కయజ్వ కవేస్సూక్తిః" అని వ్రాసియుండినచో నతఁడు తిక్కనసోమయాజియే యని నిర్ణయించుట కెక్కువ సౌలభ్య మేర్పడియుండును. తిక్కయనామముచే నామె యెవ్వరి నుద్దేశించియుండెనో తెలియదు. కాని యాంధ్రులైనసంస్కృతకవులలో నాపే రుండుటచేతను, ఆపేరు గల సంస్కృతకవి మఱెవ్వరును వినఁబడకుండుటచేతను అతఁడు తిక్కనయే యని యూహించుట కభ్యంతర ముండదు. తిక్కన రచించిన సంస్కృత శ్లోకములు రెండే మనకు లభించుచున్నవి. అందొకటి నిర్వచనోత్తరరామాయణమునందలి యారంభమంగళశ్లోకము. రెండవది విరాటపర్వారంభమునందలి "కిమస్థిమాలా" మిత్యాదిహరిహరనాథవర్ణనశ్లోకము. ఈ రెండుశ్లోకములనుబట్టియే గంగాదేవి యాతనిని సంస్కృతకవులపట్టికలోఁ జేర్చియుండదు.

మఱియు కేతన "లలితనానాకావ్యములు చెప్పు నుభయభాషలయం" దని స్పష్టముగాఁ దెల్పియున్నాఁడు. అవికత్థనుఁడైన తిక్కన తా "నుభయకావ్య ప్రౌఢిఁ బాటించుశిల్పమునం బారగుఁడ"నని యూరక చెప్పుకొనియుండునా? అందుచే నతఁడు సంస్కృతమునఁగూడఁ గావ్యమో కావ్యములో వ్రాసి యుండును. అవి లభ్యములు కాకుండుట దురదృష్టము.

కేతన తిక్కనకుఁ బద్యాదిత్రివిధకావ్యపారీణుఁ డనువిశేషణము వాడి యుండెను. త్రివిధకావ్యము లనఁగా పద్యగద్యచంపూకావ్యములు. నిర్వచనోత్తరరామాయణ మతనిపద్యకావ్యము; భారతము చంపూకావ్యము. ఇంక నతఁడు రచించిన గద్యకావ్య మేదో మనకుఁ దెలియదు. అది యేదైన నుండి లభించినచో నాంధ్రగద్యవాఙ్మయమున కావ్యము నవద్యము నైనయలంకారమై భాసిల్లును.

తిక్కన తొలిరచన నిర్వచనోత్తరరామాయణము. దీని నాతఁడు మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చిన మూఁడునాలుగేండ్లకు రచించియుండును. మనుమసిద్ధి 1253 వ సంవత్సరమున పట్టాభిషిక్తుఁడై యుండును. అందుచే నిర్వచనోత్తరరామాయణరచన 1256 ప్రాంతమున జరిగియుండు నని చెప్ప వచ్చును. తిక్కన కప్పటికి సుమారు 46 ఏండ్లుండును. అప్పటి కింకను ఆతఁడు యజ్ఞము కావించియుండలేదు. నిర్వచనోత్తరరామాయణమునందలి ఆశ్వాసాంతగద్యలలో నతఁడు 'బుధారాధనవిధేయ తిక్కననామధేయప్రణీతం బైన' అని మాత్రమే వ్రాసికొనియుండెను. భారతమునాఁటి కది 'బుధారాధన విరాజి తిక్కనసోమయాజి'గా మార్పుచెందినది. తిక్కనతాత యైన భాస్కర మంత్రి పూర్వరామాయణమును రచించె ననియు దానిని బూర్తికావించుటకే తిక్కన యుత్తరరామాయణమును రచించె ననియుఁ బ్రతీతి. అందుకు నిర్వచనోత్తరరామాయణమున నతఁడు వ్రాసిన

సారకవితాభిరాము గుంటూరివిభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు
వేఱ నాకృతిగుణములు వేయు నేల ౧-12

అనుపద్య మాధారము. ఇందు మంత్రిభాస్కరుఁడు సారకవితాభిరాముఁ డనియే యున్నది. కాని యాతఁడు రామాయణము రచించె ననుటకు సూచన లేమియు లేవు. కాని తిక్కన పూర్వరామాయణమును విడిచి కరుణమయమైన

యుత్తరభాగ మొక్కచే యేల వ్రాసియుండె నని యాలోచించినచో పూర్వ రామాయణ మంతకుముందే యాతనితాత రచించియుండెనేమో యను నను మాన ముదయింపక మానదు. ఆయనుమానమును పై పద్యము బలపఱుచును. మఱియు రామాయణమున నాయకుఁడైన శ్రీరామచంద్రునిగుణగణములుకూడ నతనిరామాయణరచనమునకుఁ బురికొల్పియుండును.

ఎత్తఱి నైనను ధీరో
దాత్తనృపోత్తముఁడు రామధరణీపతిస
ద్వృత్తము సంభావ్య మగుట
నుత్తరరామాయణోక్తియుక్తుఁడ నైతిన్ ౧-11

అని యాతఁడే కావ్యారంభమునఁ జెప్పియుండెను.

తిక్కననిర్వచనోత్తరరామాయణమును నెల్లూరివిభుఁడును దనకుప్రభువు నైన మనుమసిద్ధిభూపాలుని కంకిత మొనరించెను. ఆరాజొకనాఁడు తిక్కనను రాఁబనిచి,

ఏ నిన్ను మామ యనియెడు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక, నా
కీ నర్హుఁడ వగు దనినను
భూనాయకుపల్కు చిత్తమున కింపగుడున్. ౧-3

తిక్కన యారాజుగుణగణము లెంచి, యాతనిపల్కులయౌచిత్యమువ కలరి యట్లు చేయుటకు సముత్సుకుఁ డయ్యెను. నిర్వచనోత్తరరామాయణము తన తొలిరచన యగుటచే నతఁ డందు స్వీయకవితామార్గనిరూపకములును, భావికవి మార్గదర్శకములుసు, బూర్వకవిమార్గనిరాసకములు నైన కొన్నికవితానియమ ములను వెల్లడించెను. పలుకులపొందు లేకుండ ప్రాఁతవడ్డమాటలతో రస భంగ మొనర్చుచు కావించురచన వ్రాయుకవులకు మెచ్చు కలిగించినను బర హృదయముల నలరింపఁజాల దనియు, కవు లర్థానుగుణములైన పదములనే గ్రహింపవలయు ననియు, యతిప్రాస లుచితరీతి నిలుపక పులిమిపుచ్చరా దనియు, సంస్కృతశబ్దములకుఁ దెలుఁగువిశేషణములను వాడునపుడు లింగ వచనభేదము కలిగించుట యుచితము కాదనియు, వ్యాకరణయుక్తము లైనను, సుప్తిఙంతాది సంస్కృతపదములను తెలుఁగున ప్రయోగించుట జాత్యము కాదనియు, శ్రుత్యనురూపము లను భావముతో ప్రాసాక్షరములందు వేఱగు నక్షరములను జేర్పరాదనియు, కాహల సంధించునప్పుడు వినఁబడు ధ్వనిఖండ

ములవలె నలఁతియలఁతితునియలుగఁ బదములు వాడవలె ననియు నతఁడు ప్రకటించినకొన్నినియమములు. శైవకవులలో నిందలికొన్నినియమములకు వ్యతిక్రమము కనిపించును. భారతమునాఁటికి తిక్కనయే యీనియమములం దొకటిరెండింటిని సడలించియుండెను.

సంస్కృతమున తొల్లింటి శ్రవ్యకావ్యములన్నియు నాద్యంతశ్లోకమయములే. తరువాత నందు వచనకావ్యములు చంపూకావ్యములు బయలుదేఱినవి. ఆపూర్వసంస్కృతకవుల ననుసరించి తిక్కన తనతొలికావ్యమును నిర్వచనముగనే రచించెను. ఆరోజులలోఁ బద్యమున కున్నంతగౌరవము గద్యమున కున్నట్లు కన్పింపదు. "వాక్యసాంగత్యము చేయుచోనయిన గద్యము తోడుగఁ జెప్పి పెట్ట"ననునది తిక్కన కావించుకొన్న నియమములలో నొకటి. ప్రౌఢులైనవారు వచనము లేకయు వర్ణనలు రచింపవచ్చు ననియు, కథలను బద్యములందే చెప్పుట ఆర్యస్తుత్యమగు ననియు నీతని యప్పటిభావము. భారతమునాఁటి కతఁ డీయభిప్రాయము మార్చుకొని నన్నయవలె చంపూమార్గమునే యవలంబించెను. ద్విపదశతకకవులను విడిచినచోఁ బూర్వకవులలో నిర్వచనకావ్యము వ్రాసినవాఁడు తిక్కన యొక్కఁడే. నన్నయభారతాంధ్రీకరణము నుపక్రమించుచు దానిని సంస్కృతశ్లోకముతో నారంభించుటచే తిక్కనయుఁ దనతొలిరచనలో నాపద్ధతినే యవలంభించి "శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తంభే" యని యారంభాశీర్మంగళమును సంస్కృతములోనే రచించెను. తరువాత విరాటపర్వమును మాత్ర మాతఁడు తెలుఁగుపద్యముతోనే యారంభించెను.

వాల్మీకి రామాయణమునందలి యుత్తరకాండమే తిక్కననిర్వచనోత్తర రామాయణమునకు మూలము. భారతము వలెనే యిదియు యథామూలానువాదము కాదు. కథను మాత్ర మనుసరించుచు నెడనెడ మార్పుచేర్పు లొనరించుచు నతఁ డీకావ్యమును రచించెను. అతఁ డిందు పెక్కుభాగములను సంక్షేపించెను; కొన్నిటిని దొలఁగించెను. అందు శ్రీరామనిర్యాణగాథ ముఖ్యమైనది. తరువాత జయంతి రామభట్టను కవి నిర్వచనోత్తరరామాయణమును బూర్తి చేయుటకో యన నాకథను మాత్రమే గ్రహించి యేకాశ్వాసముగా రచించెను. తిక్కన పెంచినభాగములు పెక్కువర్ణనాత్మకములు. ఇవి యష్టమాశ్వాసమునఁ గనిపించును. అతఁ డుత్తరరామాయణమునందలి శ్లోకములను యథాతథముగ ననువదించినపట్లుకూడఁ గొన్ని కలవు. అసలు పూర్వ

కవులు_అందును గవిత్రయమువారు_అనువాదమునకే కడంగినను ప్రతిపదానువాదమునకై యత్నించియుండలేదు. మూలకథాతత్త్వములకు భంగము కలుగకుండ భాషాజాతీయముల కనుగుణముగ సంస్కృతగ్రంథములను తెలుఁగువారి కంటీయవలె ననియే వారియుద్దేశము. ఈ పద్ధతియే నిర్వచనోత్తరరామాయణమునఁ గూడ కనిపించును.

నిర్వచనోత్తరరామాయణ మయోధ్యావర్ణన పూర్వరామాయణ కథాసంగ్రహములతో నారంభించుచున్నది. తిక్కన తాను జెప్పఁదలఁచుకొన్నది యుత్తరరామాయణకథమాత్రమే యగుటచే కావ్యారంభమున పూర్వకథావిషయములను సంగ్రహముగాఁ జెప్పి కావ్యమున కొకసమగ్రత కలిగించినాఁడు. ఇది యుత్తరరామచరితనాటకమునందలి చిత్రపటవృత్తాంతమువలె పూర్వోత్తరరామాయణకథాసందర్భముల నతుకుచున్నది. నిర్వచనోత్తరరామాయణమునందలి మొదటియేడాశ్వాసములలో రావణాదులయొక్కయు వారిపూర్వులయొక్కయు చరిత్రలు పరాక్రమాదులు వర్ణింపఁబడినవి. తరువాతి మూఁడాశ్వాసములలో సీతాపరిత్యాగము, లవణాసురవధ, రామాశ్వమేధము మున్నగు విషయములు చెప్పఁబడినవి. వాల్మీకి రావణాదుల జననాది వృత్తాంతములను బూర్వరామాయణమున చెప్పియుండనికతమున నుత్తరరామాయణమున వానికేదోవిధముగా ప్రసక్తి కల్పింపఁబడినది రావణవధానంతరము రాముఁడు పట్టాభిషిక్తుఁడై రాజ్యము పాలించుచుండ నగస్త్యాదిమును లాతని నభినందించుటకై యరుదెంచినప్పుడు రాముఁడు రావణాది రాక్షస వీరుల తపశ్చర్యాశౌర్యాదులను గూర్చి తెల్పుమని యగస్త్యు నడుగ నతఁ డావృత్తాంతమంతయు వివరముగా నెఱింగించెను.

నిర్వచనోత్తరరామాయణ ద్వితీయాశ్వాసమున మాల్యవదాదుల వృత్తాంతమును, తృతీయచతుర్థపంచమషష్ఠాశ్వాసములలో రావణుఁడు, అతనిసోదరులు, ఇంద్రజిత్తు, వాలిసుగ్రీవులు, హనుమంతుఁడు మున్నగువారి జననాదివృత్తాంతములును రమ్యముగాఁ జెప్పఁబడినవి. పూర్వరామాయణమునఁ గనిపించు వారి పరాక్రమ ప్రాభవములకుఁ గారణమంతయు నిక్కడ వ్యక్తమగును. ఇందు చాలభాగము రావణదిక్పాలవిజయమునకు సంబంధించినది. ఆ సందర్భములం దతఁడు ప్రదర్శించిన పరాక్రమ మప్రతిమానమైనది. పంచమాశ్వాసమునందలి వేదవతివృత్తాంత మత్యంతరమణీయమైనది. ఆమె రావణునిచే బన్నమొందియు

తపఃప్రభావోన్నతికిఁ జేటుకలుగు నని యతని శపింపక తన్మృత్యుకారణమై యయోనిజగా నుద్భవమందెను.

మొదటియేడాశ్వాసములందలి యుద్ధవర్ణనలలో భారతయుద్ధపర్వములందు తిక్కన ప్రదర్శించిన యద్వితీయయుద్ధవర్ణనకౌశలమునకు బీజములు పొడగట్టును. విష్ణువు మాల్యవదాదులతో పోరి వారి నోడించుటయు, రావణుఁడు దిగ్విజయ మొనర్చి యమవరుణకుబేరాదులఁ బరాభవించుటయు వీరరౌద్రముల కాటపట్టులై వారియనన్యసామాన్యపరాక్రమమును చాటుచున్నవి. మేఘనాథుఁ డింద్రు నోడించి చెఱపెట్టినవృత్తాంత మట్టులే తిక్కనయుద్ధవర్ణననైపుణమున కింకొకనిదర్శనము. హనుమంతుఁ డద్వితీయపరాక్రమశాలి యయ్యు వాలితోఁ గలిగినపోరాటమున సుగ్రీవునకు సాహాయ్యము చేయఁజాలకపోవుటకు కారణము నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పఁబడినది. అష్టమనవమదశమాశ్వాసములు సీతారాములచరిత్రకు సంబంధించినవి. అష్టమాశ్వాసము దివ్యప్రణయసంపన్నులైన సీతారాములవిహారవిశేషములను వర్ణించును. ఇచ్చటి వర్ణనము లించుక దీర్ఘతరములుగా నున్నవి. అవి యట్లుండుట కావశ్యకత కూడ నున్నది. అవి సీతారాములప్రణయముయొక్క నైర్మల్యమును అగాధతను సూచించును. తరువాతఁ గనవచ్చు సీతాగర్భధారణవృత్తాంతమును బురస్కరించుకొని చూచినచో నీవర్ణన లౌచిత్యభాసురములుగనే కనిపించును. మఱియు సీతారాములప్రణయమందలి నైశిత్యమును గ్రహించినఁగాని తరువాత సీతాపరిత్యాగసందర్భమున రాముఁడు ప్రజానురంజనమునకై చేసినత్యాగగరిమ బోధపడదు. ప్రజారంజనమునకై రాముఁ డనన్యాదృశమైన యట్టియనురాగమునుగూడఁ దృణీకరించి యనపరాధ యని యెఱింగియు సీతను బరిత్యజించెను. అది రాముఁడు తప్ప నితరులు చేయలేనిపని.

రామునిరాజధర్మప్రవణత్వమున కుత్తరరామాయణమున మఱికొన్ని నిదర్శనములు కూడ నున్నవి. శత్రుఘ్నుఁ డన్నయానతిపై లవణాసురుని సంహరించి, మధురాపురమును బాలించుచుఁ బండ్రెండేండ్లనపిమ్మట నన్నను జూచుట కరుదెంచి "మిముఁ గొలుచుసుఖంబునకు రాజ్యముసౌఖ్యం బీడుగామి నం దునికికిఁ జిత్తము గొలుపక వచ్చితి" నని చెప్పెను. రాముఁడు నవ్వి "నానావిధదేహదుఃఖము మనంబున నోర్చినఁగాక రాజ్యలక్ష్మివిభవంబు చొప్పడునె కేవలమే నృపతిత్వ మారయన్" అని పల్కి మరల నతనిఁ బంపివైచెను. అతని రాజధర్మపరిపాలనతత్పరత్వ మట్టిది. శంబూకవధఘట్టమున

రాముఁడు విప్రపుత్త్రునిమరణమునకు రాజైన తనలోపమే కారణమై యుండు నని భావించెను. ఆలోపమును దీర్చుటకై యతఁ డనన్యగతికుఁడై శంబూకుని వధించెను. అతనిచేతిమృతి శంబూకుని కుత్తమగతిప్రాప్తిహేతు వయ్యెను. భవభూతికూడ నీసందర్భమున నీవిధముగనే శ్రీరామునికార్యమును సమర్థించెను.

దశమాశ్వాసమున రాముఁ డొనరించిన యశ్వమేధమును తిక్కన సంగ్రహముగా వర్ణించెను. అది రామకుశలవసమాగమమునకుఁ గారణ మయ్యెను. వాల్మీకి రామునికి సీతనుగూడ గ్రహింపవలె నని యుపదేశించెను. రాముఁ డామె శపథము చేయవలె నని పల్కెను. సీత రామవిభుని కేను దప్పనిదాననేని నన్ను నీలోఁ జేర్చుకొను మని భూమిని ప్రార్థించెను. భూమి యట్లే చేసెను. కుశలవులు వాల్మీకియుపదేశము ననుసరించి భూదేవి తప్పు సైరింపవలె నని రాముని ప్రార్థించిరి. ఈవిధముగా రామునికి పుత్త్రసమాగమము కలిగినను పత్నీవియోగము తప్పినదికాదు. ఇది కావ్యమును విషాదాంతముగాఁ జేయుచున్నది. తరువాతి రామనిర్యాణ వృత్తాంతమును తిక్కన విడచిపెట్టెను.

నన్నెచోడుని కుమారసంభవమునందువలెనే తిక్కన నిర్వచనోత్తర రామాయణమునఁ గూడ పెక్కుప్రబంధలక్షణములు కనిపించును. అందలి వర్ణనములను జూచినచో నీవిషయము తేటతెల్లమగును. ప్రథమాశ్వాసమందలి అయోధ్యావర్ణనమును, షష్ఠాశ్వాసమందలి కైలాసవర్ణనమును, అష్టమాశ్వాసమునందలి సీతారాముల వినోదవిహార జలవిహారలీలావిహారాది వర్ణనములును ప్రౌఢములును అలంకారప్రచురములునై తరువాతిప్రబంధములందలి అష్టాదశవర్ణనములకు మేలుబంతు లనఁదగియున్నవి. రంభారావణులసంవాదమునకు ముందు కావింపఁబడిన అంధకార చంద్రచంద్రికాదివర్ణనము లందలి కావ్యత్వమునకే కాక తరువాత వర్తిల్లిన రావణుని కామప్రవృత్తికిఁ గూడ దోహదము కల్పించుచున్నవి. సీతారాముల విహారవర్ణన మౌచిత్యము నతిక్రమింపక యత్యుదాత్తమై యాపవిత్రదంపతుల హార్దమైనయనురాగసంపదను సహస్రవిధముల వ్యక్తము చేయుచున్నది.

నిర్వచనోత్తరరామాయణమున మొదటియేడాశ్వాసములలో యుద్ధవర్ణనసందర్భములందును, లవణాసురసంహారసందర్భమునందును వీరరౌద్రములు చక్కగా పోషింపఁబడినవి. రాముఁడు ప్రజానురంజనమునకై సీతను పరిత్యజించునెడ ధర్మవీరము పరాకాష్ఠ నందినది. రావణరంభాసంవాదసందర్భము

నను వేదవతీవృత్తాంతమునందును శృంగారరసాభాసమున్నది. వేదవతీ వృత్తాంతము కరుణరౌద్రచ్ఛాయలతోఁ గూడి యత్యంతరంజకముగా నున్నది. అష్టమాశ్వాసమున ధర్మ్యమైనశృంగారము పోషింపఁబడినది. రావణునిచేఁ జెఱపెట్టఁబడినస్త్రీలు విలపించుసందర్భమునను, సీతాపరిత్యాగసందర్భమునను, రాముఁడు సీతకొఱకై విచారించుసందర్భమునను కరుణరసము నిర్భరమై యున్నది. భూదేవి సీతను దనలోనికిఁ దీసికొనుసందర్భమున నద్భుతరస మున్నది. నందికేశ్వరుఁడు రావణుని శపించినప్పుడు రావణుఁడు "వానర వదనంబునట్టు లున్న నందిమొగ మప్డు తేరఁ గానంగఁ జూచి కడుఁ బెల్చనవ్వి యగు నీవడువునఁ జెలువంబుగల్గు వారలచేతం జెడఁడే యీతఁడు నుడువక యుడుగు" మని యుల్లసమాడుసందర్భమున హాస్యము గోచరించుచున్నది.

రాక్షసులు సాధారణముగా నిష్కరుణులై క్రూరతకు నిలయములై యుందురని మనము భావింతుము. తిక్కన మొదటియేడాశ్వాసములలో మాల్యవ ద్రావణాదులను మహావీరులుగనే కాక దయాప్రీతిసానుభూతిప్రముఖగుణగణ ముల కాటపట్టులుగాఁ గూడ వర్ణించెను. చెల్లెలైన శూర్పణఖకు వివాహ మొనరించుటనుగూర్చి రావణుఁ డనుజన్ములతో నాలోచించుట, శూర్పణఖ భ్రాతృనిహతుఁడైన భర్తకై విలపించుట మున్నగు ఘట్టము లిందుకు నిదర్శన ములు. ఉత్తరభాగమున తిక్కన సీతారామలక్ష్మణులపాత్రల నద్భుతముగా పోషించెను. రామునిరాజధర్మప్రవణత యసామాన్యమైనది. ప్రజానురంజన భార్యానురాగము లను భావములకు సంఘర్షణము సంభవించినప్పు డాతఁడు ధైర్యము నుజ్జగింపక యుత్కృష్టతరమైనధర్మము నవలంబించెను. లక్ష్మణుఁడు భ్రాతృభక్తికి నిధానము. రామునియందలిభక్తి, సీతయందలిగౌరవము సీతాపరి త్యాగసందర్భమున నాతనిహృదయమునం దొకప్రళయము కలిగించినవి. అం దుండి శాంతుఁడై బయటఁబడుట యాతనిధీరతకుఁ దార్కాణము. లక్ష్మణుఁడు పరిత్యాగవార్త నెఱింగించినపిమ్మట సీత యాతనితోఁ బల్కినపల్కు లామెపాతి వ్రత్యమును ఆభిజాత్యమును వేయివిధముల వెల్లడిచేయుచున్నవి. ఇట్లే తిక్కన భరతశత్రుఘ్నులపాత్రలను గూడ నుచితరీతిని జిత్రించెను.

తిక్కనశైలి భారతమునందుకంటె నిర్వచనోత్తరరామాయణమున నించుక యపరిపక్వదశలో నున్న దని కొందఱిఅభిప్రాయము. కాని యది సరికాదు. ప్రౌఢతయందును, భావనాబలమునందును, పదప్రయోగమునందును, రసపాత్రపోషణాదులందును మహాకవి తిక్కనయే యందును గోచరించును.

నిర్వచనోత్తరరామాయణమున సంస్కృతాంధ్రములకు సమానప్రాధాన్యము కలదు. అందలివర్ణనములం దలంకారములు హెచ్చు. వీనిని జూచియే తరువాతిప్రబంధకవులు వాని కధికమైన ప్రాధాన్య మొసంగిరి. నిర్వచనోత్తర రామాయణమున నందందు శబ్దాలంకారములు కనిపించును. అవి అప్రయత్న సిద్ధములైనవే. అందలిపద్యములను గొన్నిటిని తిక్కన భారతమునం దాయా సందర్భములం దించుకమార్పులతోఁ బ్రవేశపెట్టుట యతని కందలికవిత్వమునఁ గల యభిమానమునకుఁ దార్కాణ. అది తిక్కనతొలిరచన యయ్యు రచనా భావభావనామహిమలయం దెన్నఁదగినదై రసాలంకార శోభితమై యౌచిత్యపూరితమై చక్కనిప్రబంధమువలె నలరారుచున్నది.

తిక్కన యశస్సౌధమునకు మూలస్తంభ మనిచెప్పఁదగినది యతని పదేనుపర్వములభారతరచన. అతఁడు చిన్నప్పటినుండియు వ్యాసరచితమహాభారతమును బఠించుచు నందలి కథాసంవిధానముచేతను, పాత్రపోషణపాటవముచేతను, ధర్మాద్వైతనిరూపణసామర్థ్యముచేతను ఆకర్షింపఁబడి దాని నాదర్శ మహాగ్రంథముగా నారాధించుచుండియుండును. అది లేఖ్యంబైన యామ్నాయ మని యతనియభిప్రాయము. విరాటపర్వారంభమున నతఁడు

విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు, విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు, సంయమిప్రకరసంభావ్యానుభావుండు, కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన యామ్నాయమున్

అని భారతమును దత్కర్తయైన వ్యాసమహర్షిని బ్రశంసించియుండెను. మనుమసిద్ధికి రాజ్య మిప్పించుటకై గణపతిదేవునికొలువున కరిగినప్పు డతఁ "డగు భారతాఖ్యాన మావీరవరులు తగఁ జేసినట్టి యుద్ధప్రకారములు" కనినట్లు చెప్పి యామహారాజును మెచ్చించి యతనిసత్కారములు వొందియుండెను. ఈవిధముగా నతని యేకశిలానగరప్రయాణము కేవలరాజకీయకార్యప్రేరితమే కాక సారస్వతప్రతిభాప్రదర్శకముగాఁ గూడఁ బరిణమించెను. అతఁడు గణపతిదేవునికొలువునఁ గావించిన భారతాఖ్యానమునకు సంబంధించిన ప్రసంగము సంస్కృతభారతావలంబనమైనట్టిదే. అతఁ డప్పటి కింకను ఆంధ్రమున భారతరచన కావించియుండలేదు. కాని యాసన్నివేశ మతఁ డభిమానపూర్వకముగా భారతమును బఠించుచు నందలిపలువిషయములను మననము చేయుచుండె నని తెల్పుచున్నది. దాని నతఁ డాంధ్రీకరింప నారంభించుట కింకను

గొంతకాలము పట్టెను. ఈమధ్యకాలములో నతఁడు పంచమవేదమైన యీ మహాగ్రంథమును రచించుటకుఁ దగిన బాహ్యాంతరప్రవృత్తి పరిణతత్వమును గూడ సంపాదించుకొనెను. ఈవిధముగా నన్నయమరణానంతరము భారత రచన మరలఁ గొనసాగింపఁబడుటకు సుమారు రెండుశతాబ్దులకాలము పట్టెను. దీని కప్పటిరాజకీయమతపరిస్థితులుకూడఁ గొంతవఱకుఁ గారణము లయ్యెను.

రాజరాజుననంతర మతనికుమారుఁడైన కులోత్తుంగచోళుఁడు మాతామహుని చోళసామ్రాజ్యమునకు వారసుఁడై వేంగిరాజ్యమునఁ బినతండ్రిని రాజప్రతినిధిగా నియమించి తమిళదేశమునకు వెడలిపోయెను. అతఁ డచ్చట నుండి యాంధ్రకవులనుగాని యాంధ్రభాషావాఙ్మయములను గాని పోషించుట కవకాశము లేకపోయెను. ఇంక నతనిపినతండ్రి విజయాదిత్యుఁ డన్నయైన రాజరాజు కాలమునుండియు చాళుక్యరాజ్యమును సంపూర్ణముగా స్వాయత్తము కావించుకొనుటకై పశ్చిమచాళుక్యుల సాహాయ్యముతోఁ బ్రయత్నములు సాగించుచునే యుండెను. అతఁ డిప్పు డన్నమరణముచేతను అన్నకుమారుని దూరస్థితిచేతను గలిగినయవకాశమును జాఱవిడువక రాజ్యము చేఁజిక్కించుకొనుటకై యత్నించుచు వాఙ్మయకళాపోషణమువంకకు దృష్టి సారింపఁడయ్యెను. ఇది నన్నయ యనంతరము వెంటనే భారతాంధ్రీకరణము కొనసాగింపఁబడుట కొకవిధముగాఁ బ్రతిబంధక మయ్యెను.

ఇంక నప్పటిమతపరిస్థితులుకూడ భారతమువంటి వైదికమతప్రతిపాదకగ్రంథముయొక్క పునఃప్రారంభమున కనుకూలములుగా లేకుండెను. క్రీ. శ.12 వశతాబ్దిమధ్యభాగమున పశ్చిమచాళుక్యరాజ్యము నాక్రమించిన బిజ్జలునిమంత్రియు బండారియునైన బసవేశ్వరుఁడు భక్తిప్రధానమైన వీరశైవమతమును స్థాపించి నిశ్చలమైన శివభక్తి యున్నచో మోక్షము కరతలామలకమగు ననియు, యజ్ఞయాగాదికర్మాచరణమువలన నెట్టిలాభము చేకూర దనియు, వేదప్రామాణ్యమునుగాని వర్ణాశ్రమాచారభేదములనుగాని యంగీకరింప నవసరము లేదనియు ప్రచారము కావింప మొదలిడెను. అతిలోకమహిమానుభావసంపన్నుఁడైన యతఁడు ప్రదర్శించిన మహిమలును, కావించిన బోధలును బలువురి నాకర్షించెను. క్రమముగా నామతము కన్నడదేశమందే కాక పరిసరదేశములందుకూడ వ్యాపించెను. ఆంధ్రదేశమున సామాన్యజనులతోపాటు పలువురు కవులును పండితులును ఆ నూతనమతము నవలంబించి తమ కవితాపాండితీపాటవములను దత్ప్రచారమునకై వినియోగింప నారంభించిరి.

అట్టివారిలో శివతత్త్వసారకర్త యైన మల్లికార్జునపండితారాధ్యుఁడును, బసవపురాణపండితారాధ్యచరిత్రల రచించినవాఁడును వీరశైవమతమునకు గురుపీఠమని చెప్పఁదగినవాఁడు నైన పాల్కురికి సోమనాథుఁడును ముఖ్యులు.

ఈ విధముగా నాంధ్రదేశమున వీరశైవము వ్యాపించుచుండ రామానుజప్రతిపాదితమైన విశిష్టాద్వైతముకూడ ప్రచారము పొందుచుఁ గొంద అనుయాయుల నాకర్షించెను. సిద్ధాంతములలోఁ గొన్ని భేదము లున్నను వీరశైవమునకు, దీనికిని భక్తి ప్రాధాన్యమున మాత్రము సమానత్వమున్నది. వీరశైవమతాభిమానులైనకవులు తన్మతప్రచారమునకు దోహదము కలిగించురచనలు కావించుచుండ విశిష్టాద్వైతమతానుసారులైనకవు లామతమునకు ప్రచారము కావించు రచనలు వెలువరింపఁ దొడంగిరి. తిక్కన తాతయైన భాస్కరుఁడు శ్రీమన్నారాయణుని యవతారమైన శ్రీరాముని చరిత్రను వర్ణించు రామాయణమును రచించిన మాట నిజమే యైనచో నందుకు బహుశః అప్పు డురవడితో సాగుచున్నవీరశైవమతప్రచారమునకుఁ బ్రతియోగముగా వైష్ణవమత ప్రచారము కావింపఁ దలంచుటయే కారణమై యుండును. క్రీ. శ. 12 వ శతాబ్దిచివరిపాదమున జరిగిన పల్నాటి యుద్ధమునఁ బ్రధానపాత్రలు వహించిన నాగాంబాబ్రహ్మనాయకులలో బ్రహ్మనాయకుఁడు విష్ణుభక్తాగ్రేసరుఁడై పల్నాటివిష్ణు వని ప్రఖ్యాతిగాంచెను. వర్ణభేదమును బాటింపక యన్నివర్ణములవారును గలసి 'చాపకూడు' భుజించు నాచారమును నెలకొల్పినవాఁ డతఁడే. దీనినిబట్టి ఆరోజులలో వీరశైవమత మంత కాకపోయినను వైష్ణవమతముకూడ నంతోయింతో ప్రచారము పొందుచుండె నని తెలియుచున్నది. వీరశైవవైష్ణవమతముల నవలంబించిన యాకాలపుకవులు తమతమమతముల ప్రాధాన్యప్రాశస్త్యములను దెల్పురచనలు వ్రాయఁదొడంగిరే కాని వైదికధర్మప్రతిపాదకమైన భారతాంధ్రీకరణమునం దుత్సాహము వహింపరైరి. ఈవిధముగా నన్నయమరణానంతరము చాలకాలము మహాభారతాంధ్రీకరణమున కవకాశము కాని ఆనుకూల్యము కాని లేక పోయెను.

వీరశైవ విశిష్టాద్వైతములు రెండును భక్తిప్రధానములే యైనను ఆభక్తికి విషయములైన యుపాస్యదైవములయెడ భేదభావమునకుఁ దావొసంగెను. వీరశైవులు విభూతిరుద్రాక్షమాలాధారియు పన్నగభూషణుఁడు నైన శివుఁడే పరదైవ మని భావింప వైష్ణవులు పన్నగశాయియు కౌస్తుభవనమాలాలంకారుఁడు నైన శ్రీమన్నారాయణుఁడే పరమదైవ మని భావించుచుండిరి. ఈభేదము క్రమముగాఁ బెంపొంది యారెండుమతములనడుమ ద్వేషవైషమ్యములు

కలుగుటకు కారణమయ్యెను. పేర్లు భిన్నములైనను భగవంతుఁ డొక్కఁడే యనియు, భక్తులు తమయభిరుచివిశేషముల ననుసరించి భగవంతు నాయా రూపములతో భజింపవచ్చు ననియు వివేచనచేయక "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" యనువేదవాక్యమునర్థము విస్మరించి వీరశైవులు శివుఁడే యధికుఁడనియు వైష్ణవులు విష్ణువే యధికుఁ డనియు వాదించుచు, నొండొరుల ద్వేషించుటకును నిందించుటకును మొదలుపెట్టిరి. ఒక్కొక్కప్పు డీద్వేషవైరుధ్యములు పరస్పరహింసనమునకుఁ గూడ దారితీసెను. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే" యను భావము కేవలసిద్ధాంతరూపముననే నిల్చిపోయెను. శైవవైష్ణవు లావేశపూరితులై పరస్పరదర్శనస్పర్శన భాషణము లను గూడఁ బరిహరించుదుస్థితి యేర్పడెను. పండితారాధ్యసోమనాథులు రచించిన కొన్నిపద్యములలో భవిజనులయెడ రోఁతయు, ద్వేషమును స్పష్ట ముగాఁ గానవచ్చుచున్నవి.

కా దప్పుగొనఁగ నప్పిఁ
గా దీఁగొనఁ గాదు కనఁ దమలో నా
హ్లాదమునఁ బలుకఁ గాదు మ
హాదేవపరాఙ్ముఖాత్ములగు పతితులతోన్. శివ. 268

**శివభక్తులయెడ భయమును**

శివునెడ నతివీరగుణము శీలంబులయం
దవికల్పం బగు చలమును
భవియెడ రోఁతయును వలయు భక్తుల కెందున్. అనుభవ. 58

మున్నగు పద్యము లిందుకు నిదర్శనములు. వైష్ణవులయం దింతవీరావేశము లేక పోయినను వారుకూడ శైవులను ద్వేషించుచు దూషించుచుండి రనుటకు మాత్రము సందేహములేదు. శైవవైష్ణవములు రెండును హిందూమతమునకుఁ జెందిన శాఖలే. ఆశాఖలు రెండు తత్త్వము మఱచి పరస్పరద్వేష విరోధములకుఁ బట్టుఁగొమ్మలై సానుభూతి లేక యొండొంటియెడ ఘోరముగను క్రూరముగను వర్తించుచుండుట సంఘమునఁ గల యుదాత్తచిత్తులైన పెద్దలకు వేదనాకరమై యుండుటయు, వారు యథాశక్తిగా సానుభూతిసామరస్యములఁ గలిగింప యత్నించుటయు సహజము. అట్లు యత్నించినవారిలో మహాపండితుఁడును, కవిపుంగవుఁడును, ధీరధిషణావధీరితదివిషదాచార్యుఁడును, మంత్రిచూడా మణియు నైన తిక్కనసోమయాజి యొక్కఁడు. అందుచేత నే యతఁడు

కేవల కవిమంత్రిమాత్రుఁడుగాఁ గాక కారణజన్ముఁడుగా భావింపఁబడుచున్నాఁడు.

సంఘమునందలి ద్వేషవైషమ్యములను గాంచి సర్వధర్మసమన్వయసంధానదక్షమైన మహాభారతేతిహాసతత్త్వము నెఱింగినవాఁ డగుటచే తిక్కన తదాంధ్రీకరణమును గొనసాగించినచో నది ప్రజలలో సమన్వయసామరస్యముల నెలకొల్పుటకుఁ దోడ్పడవచ్చు నని తలంచెను. భారతరచన కావశ్యకము లైన రాజనీతి, యుద్ధవిద్యానైపుణ్యము, తత్త్వజ్ఞానవైశారద్యము, కవితాకళాకౌశలము అనుగుణములన్నియు నతనియందు పుష్కలముగా నుండెను. నిర్వచనోత్తరరామాయణరచనమునాఁటికే యతఁడు సునిశ్చిత మైన యొకకవితామార్గము నేర్పఱచుకొని యందు కృతహస్తుఁడై యుండినను భారతరచనావశ్యకమైన యాధ్యాత్మికసిద్ధి నింకను బడసియుండలేదు. వైదికమార్గనిష్ఠమగు వర్తనమును నిర్వహించుచు, భేదము లేని భక్తిమార్గమును నిర్మలవృత్తితో ననుసరించుచు, నిత్యకవితాకళోపాసనము కావించుచు నాతఁ డాసిద్ధినిగూడ సంపాదించి, యజ్ఞాచరణముచేఁ బవిత్రుఁడై భారతరచన కుపక్రమించెను. అప్పటికి మనుమసిద్ధి మరణించియుండును. అతఁడు 1263 వసంవత్సరమున పాండ్యులతో మోతుకూరుకడ జరిగినయుద్ధమున మరణించె నని కొందఱును కాటమరాజుతో యుద్ధమున పరాజయము పొందిన పిమ్మట మరణించె నని కొందఱును చెప్పుచున్నారు. అతనిమరణానంతరము తిక్కన లౌకికప్రవృత్తి చాలించుకొని భావితాంతఃకరణుఁడై పంచమవేదరచనకుఁ బూనుకొనెను. నిర్వచనోత్తరరామాయణమున "అమలోదాత్తమనీష నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ బారగుఁడన్, మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ" నని చెప్పుకొన్న తిక్కనయే భారతకాలమున ననహంకారనిరూఢభావనారాధ్యుఁడైన హరిహరనాథు నారాధించుచు 'నా నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికి" నని సవినయముగా నుడివియుండుట మధ్యకాలమున నాతనిమనమునఁ గలిగిన పరివర్తనమును చక్కగా సూచించుచున్నది. అంతకుఁ బూర్వ మాతఁడు శివభక్తుఁడే యైనను ఆశివభక్తి యన్యమతసహనము లేనిదియు ద్వేషావేశపూరితము నగు వీరశైవమునకు సంబంధించినది కాదు. అందుచేతనే యాతఁడు విష్ణ్వవతారమైన రామునిచరిత్రను వర్ణించు నిర్వచనోత్తరరామాయణమును రచించుట సంభవమయ్యెను. అతఁ డప్పుడు శివుని విష్ణువును గూడఁ గొల్చుచుండినను "తథాపి భక్తి స్తరుణేందు

శేఖరే" యనునట్లాతనిమనస్సు శివునియెడ మొగ్గుచూపుచుండియుండును. క్రమముగా నాతని మనస్తత్త్వమునఁ బరిణామము కలిగెను. వేదవేదాంత విదుఁడును సమదర్శియునైన పండితుఁ డగుటచే నతఁడు నామభేదమున్నను, భగవత్తత్త్వ మేకైకమే యని గ్రహింపఁజాలెను. ఆకాలమునందలి విపరీతమత పరిస్థితు లాభావము నాతనిలో మఱింత బలపఱిచెను. అతఁడు శివకేశవాద్వైత మును చాటించుచు హరిహరనాథదేవుని త్రికరణశుద్ధితోఁ గొల్చుచుండెను. చిన్న దైనను ఆదేవతాద్వయమునకుఁ గల యభేదమును రమ్యముగా సూచించు నీక్రిందిశ్లోక మతఁ డాకాలమున రచించినట్టిదే.

కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే.

ఈహరిహరనాథుఁడు తిక్కనభావనాకల్పితుఁడా లేక యాపేరుగలదేవుఁ డారోజు లలో జనారాధితుఁడై వెలయుచుండెనా యను విషయమున నభిప్రాయ భేదము లున్నవి. తిక్కన హరిహరనాథునికి వాడిన "అనహంకారభావనారా ధ్యుఁడు, నైర్గుణ్యసముద్భాసిరహస్యానుభావుఁడు, హృదయకమలమధురూపుఁడు, వ్యాసాదిమునీంద్రభావ్యుఁడు" మున్నగువిశేషణములు మొదటియభిప్రాయమును బలపఱుచుచున్నవి. కాని కొందఱు తిక్కనకాలమున నెల్లూరున హరిహరనాథ దేవాలయ ముండెననియు, తిక్కన యా దేవాలయముననే కూర్చుండి భారత రచన కావించె ననుట కాతఁ 'డీదృశంబులగు పుణ్యప్రబంధంబులు దైవసన్నిధిం బ్రశంసించుటయు నొకయారాధనవిశేష' మని వ్రాయుట నిదర్శనముగా నున్న దనియు, నెల్లూరుననే కాక సప్తగోదావరసంగమమునఁగూడ నొక హరిహరనాథదేవాలయ ముండెడి దని ద్రాక్షారామమునందలి యొకశాసనము వలనఁ దెలియుచున్న దనియు, పదునైదవశతాబ్దియందలి బైచరాజు వెంకట నాథుఁడుకూడ తనపంచతంత్రమును హరిహరనాథునికే అంకితముచేసియుండు టచే నంతవఱకు హరిహరనాథదేవాలయ ముండియుండు ననియు విశ్వసించు చున్నారు. నిజముగా నాకాలమున హరిహరనాథదేవాలయ మొకటి యుండినచో తిక్కన వాడిన పైవిశేషణములు పరబ్రహ్మస్వరూపుఁడైన యుపాస్యదైవమును గూర్చి తత్త్వజ్ఞులు సాధారణముగా వాడువిశేషణములే యని భావింపవచ్చును.

తిక్కనభారతరచన కుపక్రమించి దానిని హరిహరనాథదేవుని కంకితము

చేసిన పరిస్థితులను విరాటపర్వారంభమున నత్యంతరమణీయముగా వర్ణించియున్నాఁడు. అతఁడు భారతరచనాయత్తచిత్తుఁడై "ఈప్రబంధమండలి కధినాధునిగా నేపురుషుని బేర్కొనువాఁడనొ యనుతలంపు కూరిన మదితో" నించుక నిద్రించుసమయమున నతనితండ్రి కొమ్మన కలలోఁ గనిపించి "కి మస్థిమాలా" మిత్యాదిగా నీవు తొల్లి రచించినశ్లోకమును గాఢాదరమున నవధరించి భక్తవత్సలుఁడైన హరిహరనాథదేవుఁడు నీదెస దయాళుఁడై నిన్నుఁ గృతార్థుఁ గావింప నిడుగో విజయంచేసియున్నాఁ" డని పల్కి యాతనిఁ జూపెను. తిక్కన సంభ్రమసంభరితహృదయుఁడై యాదేవు నాలోకించి, సాష్టాంగదండప్రణామ మాచరించి లేచి నిలఁబడెను. అంత నాదేవుఁడు చిఱునవ్వు నవ్వుచు నతనిభక్తిప్రపత్తులను బొగడి "నీవు పారాశర్య కృతమైన పంచమవేదము నాంధ్రీకరింపఁ బూనుట కెంతయు నలరి కృతి పతిత్వ మర్థించుటకై వచ్చితి" నని పలికెను. తిక్కన యతనికిఁ బునఃపునః ప్రణామము లాచరించి "దేవా! నిగ్రహానుగ్రహసమర్థుఁడ వైన నీవు నాచే నిన్నుఁ బొగడించుకొన నెంచుటలో నచ్చెరువులేదు. నీకరుణకతముననే నిట్లు పదస్థితుఁడ నైతిని. ఇంక జన్మాంతరదుఃఖములు తొలఁగున ట్లొనరించి నన్నుఁ గృతార్థుఁ గావింపు మని ప్రార్థించెను. అంత నాజగన్నాథుఁడు "జననమరణరూపమైన సంసారమునుండి తొలంగుతెరువు కనువెలుంగు నీ కిచ్చితి" నని పలికి యంత ర్హితుఁ డయ్యెను. తిక్కన సంతోషదంతురితాంత రంగుఁడై మేల్కాంచెను. తరువాత నతఁడు భారతరచనకు, బూని దాని నాహరిహరనాథదేవునికే యంకిత మొనరించెను. ఆంధ్రవాఙ్మయమున భగవంతుఁడు కవికి స్వప్నమునఁ గనిపించి కృతిరచింపు మని కోరిన ప్రథమ సన్నివేశ మిదియే. ఇది తిక్కనభగవత్తత్పరతను, మహనీయతను, భగవంతుని భక్తపరాధీనతను జక్కగాఁ జాటుచున్నది.

నన్నయ ఆదిసభాపర్వములను, అరణ్యపర్వమున మూఁడాశ్వాసములపై నూటనలుపదిరెండుపద్యములు మాత్రము రచించి దివంగతుఁడయ్యెను. తిక్కన యాతఁడు విడిచినచోటనుండి యారంభింపక యరణ్యపర్వశేషమును విడిచిపెట్టి నాల్గవదియైన విరాటపర్వముతో, దనరచన యారంభించెను. అతఁ డరణ్యపర్వశేషము నేల విడిచిపెట్టెనో, ఆరంభమున విడిచినను భారత మంతయుఁ బూర్తిచేసినపిమ్మట నైన నేల రచింపలేదో మనము చెప్పఁజాలము. అతఁడు భారతమును ప్రబంధమండలిగా భావించెను. అం దొక్కొక్కపర్వము

లేక యొక్కొక్కయుపాఖ్యాన మొక్కొక్కప్రబంధ మని యాతనిభావన. అం దరణ్యపర్వమనుప్రబంధమునందు సగముభాగము రాజరాజున కంకితమై పోఁగా మిగిలినసగమును హరిహరనాథున కంకితము చేయుటకుఁ గాని హరిహరనాథునికిఁ గాక రాజరాజునకే యంకితముగా రచన కావించుటకుఁ గాని యాతనికి సమ్మతము కాకపోయియుండవచ్చును. అరణ్యపర్వము రచించుట చేతనే నన్నయ మతిభ్రష్టుఁడై మరణించె నను ప్రతీతి విని దానిని పూర్తి చేసినచోఁ దనకుఁగూడ నట్టికీడు కలుగునేమో యను భీతిచే నతఁడు దానిని విడిచిపైచె ననుకొనుట కవకాశము లేదు. ధీరోదాత్తుఁడును పండితప్రకాండుఁడు నైన యాతఁ డట్టి మూఢవిశ్వాసజనితమైన భీతికి గుఱియై యుండఁడు.

తిక్కన విరాటపర్వారంభమున "నం దాది దొడంగి మూఁడు కృతులాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని చెప్పుటయు, నతనిశిష్యుఁడైన మారనకూడ నన్నయ మూఁడుపర్వములను రచించె నని తెల్పుటయు నాధారములుగాఁ గొందఱు తిక్కననాఁటికి నన్నయకృతమైన యరణ్యపర్వమంతయుఁ బూర్తిగా నుండె ననియు, నందుచేతనే తిక్కన నాల్గవపర్వము నారంభించె ననియుఁ దలంచుచున్నారు. కాని పైయిరువురును మూఁడుపర్వములను నన్నయ రచించె నని తెల్పుట బాహుళ్యమును బట్టి దాదాపుగాఁ జెప్పినదే కాని యథాక్షరముగాఁ జెప్పినది కాదు. మఱి యరణ్యపర్వశేషమును విడిచి విరాటపర్వము నారంభించినచోఁ గథాసూత్రవిచ్ఛేదమువలన పాఠకులకుఁ గలఁత కలుగదా యన్న మహాభారతకథ జగత్ప్రసిద్ధము కావున దానివిషయమున నట్టిక్లేశముండఁజాలదు. ఈవిషయమునే తిక్కన

కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వప
ర్వార్థయుక్తి చేయునట్టియెడల
యత్న మించుకంత యైనను వలవదు
వలసినట్లు చెప్పవచ్చి యుండు విరా ౧-42

అని వివరించి యుండెను.

ఆంధ్రీకరణవిషయమున తిక్కన నన్నయనే యొజ్జబంతిగా గ్రహించెను. కవిత్రయమువారు వ్యాసభారతమును యథాతథముగా ననువదించినవారు కారు. మూలమును క్షుణ్ణముగాఁ బఠించి, యందలి కథాతత్త్వాదులను లెస్సగా గ్రహించి, యనవసరము లని తోఁచినచోట్లఁ గొన్నిభాగములను సంగ్రహిం

చియు, నవసర మని తోఁచిన చోట్లఁ గొంత పెంపు కావించియు, నశ్లీల మని తోఁచినయెడ నన్యథాకరించియు, మూలమే రసవంతముగా నున్నయెడ దానిని సన్నిహితముగా ననుసరించియు వారు తమయాంధ్రీకరణమును రసవంతమును మనోహరమును నగునట్లుగాఁ దీర్చిదిద్దిరి. వా రిట్లు మార్పుచేర్పులు కావించుటకు భారతరచనమున వ్యాసునికిని వారికిని గల దృష్టిభేదమే కారణము. వ్యాసు నిది ప్రధానముగా పౌరాణికనైతికదృష్టి. అవకాశము దొరకినచోట్ల నెల్ల నాతఁడు భారతమున నీతిధర్మతత్త్వాదులను ప్రపంచించుచునే యుండును. కవిత్రయము వారికి నీతిధర్మాదులయెడ వైముఖ్యము లేకపోయినను వారిది ప్రధానముగా కావ్యకళాదృష్టి యని చెప్పవచ్చును. అందుచే వారు కథారసపోషణాదుల కాటంకము కలుగునని తోఁచుపట్ల వానిని సంక్షేపము చేయుచుందురు. తిక్కన విరాటపర్వారంభమున "అంతస్సన్నిధి" గలిగించుకొని యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద" నని చెప్పియుండుటనుబట్టి యాతఁడు భారతమును మహాకావ్యముగా భావించె ననియు, సంస్కృతభారతమును యథాతథముగా ననువదించుటకుఁ గాక యందలి యర్థమును సంగతము చేయుటకే యత్నించె ననియుఁ దెలియవచ్చును. కీ.శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగా రన్నట్లు సంస్కృతభారత మొకబంగారుముద్ద. కవిసౌన్నారులు దానినుండి కావలసినంత కనకమును గ్రహించి తమశక్త్యభిరుచుల కనుగుణముగా నగిషీ పను లొనరించి జననయనమనోహరములైన సుందరారవిందములను నిర్మించి యుండిరి. ఆసౌన్నారిపనితనమునఁ గవిత్రయమువారు మువ్వురును కృత హస్తులే.

తిక్కనభారతాంధ్రీకరణమును దలంచినంతనే యతఁడు సర్వోపనిషత్సార మనియు యోగశాస్త్ర మనియు గౌరవింపఁబడు భగవద్గీతను జాల సంక్షేపించుటయు, నట్టిదే యై శంకరభగవత్పాదులభాష్యమునకుఁ బాత్రమైన సనత్సుజాతీయమును బూర్తిగాఁ బరిహరించుటయు స్మృతికిఁ దగులక మానవు. వేదాంతతత్త్వప్రతిపాదకముగా భగవద్గీత కున్న ప్రాముఖ్యప్రభావములు సోమయాజి గుర్తెఱుంగకపోలేదు. దానిని మూలానుసారముగాఁ దెనిఁగించుట కతనికి శక్తి చాలకయుఁ బోలేదు. కాని కావ్యకళాదృష్టితోఁ జూడ నాసందర్భమున నంతదీర్ఘతరమైన వేదాంతచర్చ అనుచితమును అసందర్భమును అగుటయే కాక కథాగమనమున కాటంకముగాఁ గూడఁ గనిపించుటచే నతఁ డందలి సారభూతములైనశ్లోకముల నన్నింటిని జక్కఁగా సంగ్రహించుచు సంక్షేపరచన

సాగించెను. అతఁ డర్జునువిషాదయోగమును వివరముగాఁ దెల్పి, విశ్వరూప యోగమువఱకును గల భాగమును సంగ్రహించుచు "అశోచ్యానన్వశోచ స్త్వ" మిత్యాదిశ్లోకము ని ట్లనువదించెను.

వగవఁగ నేమియుం దగనివారికినై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధి మాటలును వావిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగువగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్. ఛీ. ౧-195

తరువాత నతఁడు విశ్వరూపసందర్శనమును గొంత వివరించి, "మత్కర్మ పరుండును మద్భక్తుండు నైన వానికి ననుఁ బడయవచ్చు" నని కృష్ణు డర్జును నాశ్వాసించినతెఱం గెఱింగించి, మిగిలినభాగమునంతను

అతఁడు మఱియును బ్రహ్మవిద్యాన్వయమునఁ
దనకు సందిగ్ధ మైనట్టి దానినెల్ల
నడుగఁగా నమ్మహాత్ముఁ డత్యంతకరుణఁ
దెలియఁజెప్పుచు హృదయసంచలత మాన్చె. ఛీ. ౧-222

అని యొక్కపద్యములోఁ జెప్పివైచెను. ఈవిధముగా నతఁడు సుమా రేడువం దలశ్లోకములతోఁ గూడిన భగవద్గీతయందలిసారాంశము నేఁబదిపద్యగద్యము లలో సంగ్రహించెను. సంస్కృతమున సనత్సుజాతీయమును బూర్తిగా వినిన పిమ్మటఁగూడ ధృతరాష్ట్రునిమనమున నెట్టిపరివర్తనమును గలిగియుండలేదు. ఆమహర్షి చెప్పినదంతయు వృథాకంఠశోషయే యయ్యెను. మహర్షిప్రబోధము విఫలమయ్యె నని సూచించుట కిష్టము లేక కాఁబోలు తిక్కన గూఢవేదాంత తత్త్వప్రతిపాదక మగు నాఘట్టమును సూచ్యమాత్రము కావించి విడిచివైచెను. ఇట్లేతిక్కన సంక్షేపించినవో, విడిచివైచినవో ఘట్టములు శాంత్యాదిపర్వము లలో గూడఁ గొన్ని గలవు. సంస్కృతభారతమున నాశ్రమవాసపర్వ మునకు సంబంధించిన పుత్రదర్శనపర్వములో ధృతరాష్ట్రాదులు మృతులైన పుత్రులను దర్శించిన ట్లున్నది. జనమేజయుఁ డది విశ్వసింపక వ్యాసుఁడు మరణించిన నాతండ్రిని నాకుఁ జూపి యనుగ్రహించినచో నే నాసంఘట నము సత్య మని నమ్మెద నని పల్కెను. అప్పుడు వ్యాసుఁ డతనికి పరీక్షిత్తునే కాక శమీకుని శృంగిని గూడఁ జూపి తనమహత్త్వమును రుజువు చేసికొనెను. వ్యాసునిమహత్త్వమును జనమేజయుఁడు శంకించుట యాతనిశీల మునకు లాఘవము నాపాదించు ననియు మృతప్రదర్శన మతిమానుషమైన

యద్భుతకార్య మనియుఁ దలంచి తిక్కన యాసన్నివేశము నాంధ్రీకరింపక విడిచివైచెను. కావ్యకళానుగుణమైన సంగ్రహీకరణము తిక్కన భారతరచన కొకయలంకారము. దానిని బురస్కరించుకొని యతని కళ క్తత నారోపించుట యపరాధము. వలసినచోట్ల శాంత్యనుశాసనపర్వములలో నట్టిగూఢతత్త్వ విషయములనుగూడ నతఁ డతిసమర్థతతో నిర్వహించియుండెను.

భారతమున తిక్కన సందర్భానుగుణముగాఁ బెంచిన ఘట్టములు కూడఁ బెక్కు గలవు. అందు విరాటపర్వమునందలి కీచకునిప్రణయమును, సంజయ శ్రీకృష్ణులరాయబారపుఘట్టములును ముఖ్యములైనవి. కీచకునిప్రణయమును వర్ణించుపట్ల నతఁడు కాముకమనోవృత్తి సూచకముగా నద్భుతములైనభావములను వర్ణనలను బెంచి యాభాగము నొక యుదాత్తప్రబంధముగాఁ బరిష్కరించెను. కీచకుఁ డుద్యానవనమున విహరించుచు ద్రౌపది రాఁగానే యిట్లు చేసెద నట్లు చేసెద నని "నిగుడు మనోరథంబులను, భావరతంబులను, శిశిరోపచారంబులను బ్రొద్దుగడపి కడగానక" తల్లడ మందినవిధము తిక్కన యిట్లు వర్ణించెను :

మాయురవి యేల క్రుంకఁడొ
కో యను, నిట్టెల తడసెనో యనుఁ గ్రుంకం
బో యెడుఁజూ యిప్పుడ యను
దాయపఱిచె నను మనోజతాపము పేర్మిన్.

దివము కాని యింక భువనంబునం దిట
వట్టిరాత్రి లేనియట్టు గాఁగఁ
జెసెనొక్కొ విధి విశేషించినాక కా
నేఁడ దివము సాగి నిలిచెనొక్కొ.

అనుచుఁ గ్రుంకింపరానిప్రొద్దరసి యరసి
శిశిరపర్యంకమున మేను చేర్చి చేర్చి
వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి
మిగుల వందురి కందురి పొగిలి పొగిలి. విరా. ౨-312-314

ఈపద్యములే తరువాతి ప్రబంధములందలి చంద్రమన్మథాద్యుపాలంభములకును శీతలోపచారములకును దారితీసిన వని చెప్పవచ్చును. ఇట్లే యీఘట్టమున తిక్కన కావించిన సూర్యోదయాస్తమయాంధకారాదివర్ణనములును ప్రబంధ కర్తల కాదర్శప్రాయము లైనవి.

సంజయశ్రీకృష్ణుల రాయబారములను వర్ణించునప్పుడు తిక్కన మూలమున లేని పెక్కుభావములను కల్పించి తనరాజనీతిపరిజ్ఞానమును, వాక్చాతుర్యమును, సభాభాషణౌచిత్యమును జక్కగాఁ బ్రదర్శించెను. ఇచ్చట రాయబారము నెవ్వరు నిర్వహించినను వారు చెప్పవలసినవిషయము సమానమే. అయినను తిక్కన పునరుక్తి తోఁపకుండునట్లును, ఆయారాయబారుల కనుగుణముగా నుండునట్లును సంభాషణములను దీర్చిదిద్ది యాసన్నివేశములను లోకోత్తర సౌందర్యశోభితములఁ గావించెను. రాయబారము సందర్భమున "ద్రుపద పురోహితుని యుపన్యాసమునకు పారుష్యమును, సంజయునియుపన్యాసమునకు చాతుర్యమును, కృష్ణునియుపన్యాసమున కౌజ్జ్వల్యమును బ్రధానలక్షణము లన వలసివచ్చును. రాయబారపుసభలో కృష్ణునిద్వారా తానుప్రదర్శించిన శిల్పమును తిక్కన "ఏనును నాయోపినంత సామవాదంబు లాడితి. నారదాది మహామునులును సుయోధనునకు బుద్ధు లేమి చెప్పినను నెంతటఁ బోకున్నం గినుకతెచ్చుకొని జంకించియు, భంగించియు, ధిక్కరించియుఁ దృణీకరించియుఁ జూచితి కార్యంబు భగ్నంబగుట నొల్లక వెండియు శాంతవచనంబులు పలికితి" నని కృష్ణునిచేతనే చెప్పించియున్నాఁడు. శ్రీకృష్ణుని యుపన్యాసము సభ్యులపైఁ గావించిన ప్రభావము నతఁ డీక్రింది పద్యమున వర్ణించియున్నాఁడు.

**అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యు లె**
**ల్లను బ్రియమంది నెమ్మనములం బురుషోత్తముఁ డింతయొప్పఁ బ**
**ల్కనె మరుమాటలాడ నయకోవిదుఁ డెవ్వఁడు, ధీరుఁ డెవ్వఁ, డిం**
**దనువరి యెవ్వఁ డంచు నచలాకృతులై నెఱి నూరకుండఁగన్.**

తిక్కన నూత్నసన్నివేశములను, సంఘటనములను కల్పించి నట్లే వ్యాసుఁడు సూచ్యమాత్రముగాఁ జెప్పిన భావములను గ్రహించి వాని నౌచిత్య శోభితముగాఁ బెంచి వ్రాసినపద్యము లనేకము లున్నవి. ఒండురెం డుదాహరణములు మాత్ర మొసంగెను. జనమేజయుఁడు వైశంపాయనుని

**కథం విరాటనగరే మమపూర్వ పితామహాః**
**అజ్ఞాతవాస ముషితాః దుర్యోధనభయార్దితాః**

అని అడిగినట్లు సంస్కృతమున విరాటపర్వారంభమం దున్నది. తిక్కన యీ శ్లోకమును

**మహితసముజ్జ్వలాకృతులు, మానధనుల్, జనమాన్యు, లంగనా**
**సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయనిగూఢవృత్తిమె**

సహితుల కప్రభేద్యముగ నాపదుమూఁడగునేఁడు మత్పితా
మహులు చరించి రంతయు గ్రమంబున నా తెఱఁగంగఁ జెప్పుమా

అని యాంధ్రీకరించెను. మూలమున పాండవులజ్ఞాతవాసము నెట్లు గడపి రని జనమేజయుఁడు సందేహించుటకుఁ గారణములు చెప్పఁబడియుండ లేదు. తిక్కన పద్యమున వాడిన విశేషణాదులచే నాసందేహమును జక్కఁగా వెల్లడి చేసియున్నాఁడు. పాండవు లజ్ఞాతముగా నుండి పోవుటకు సామాన్య మానవులు కారు. సముజ్జ్వలాకృతులు. ఏపనినైనఁ జేయ నంగీకరించుట కల్పులు కారు; మానధనులు. వట్టి పాండవులే యైనచో నేదో విధముగా నజ్ఞాత వాసమును గడపియుందురు. ద్రౌపదికూడ వారివెంట నున్నది. వా రెంత జాగ రూకులై వర్తించినను దుర్యోధనుఁడు వా రెచ్చట నున్నారో కనుఁగొనుటకై తీవ్రప్రయత్నము లొనరించుచునే యుండును. అందుచే వా రహితుల కప్ర భేద్యముగ వర్తింపవలయును. ఈకారణములచే నజ్ఞాతవాసము వారికి బహుక్లేశ కరమైనది. ఆక్లేశమునకుఁ గల హేతువులన్నియు తిక్కన పద్యములో విశేషణములద్వారా వ్యక్తము చేసియున్నాఁడు.

మహాప్రస్థానపర్వమున ధర్మజుఁడు భార్యానుజులతో నరుగుటకుముందు హస్తినాపురమున పరీక్షిత్తును, ఇంద్రప్రస్థమున వజ్రుని అభిషిక్తులను గావించి, వారి నిరువురి నరసికొను మని సుభద్రకుఁ జెప్పుసందర్భమున సంస్కృత భారతములో "దుఃఖార్త శ్చాబ్రవీ ద్రాజా సుభద్రాం పాండవాగ్రజః" అని యున్నది. తిక్కన యాభావమును యథోచితముగా పెంచి యీక్రిందిపద్యమును రచించెను.

భవదీయాత్మజు నాత్మజుండు కురుభూభారోద్వహుం డయ్యె యా
దవవంశోత్తరుఁ డైన వజ్రునకు నింద్రప్రస్థరాజ్యంబు గౌ
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రా! రక్షణీయంబు లై
నవి యీయిండుఱుఱెండు నీవు దృఢధైర్యం బొప్ప రక్షింపుమీ.

మహాప్రస్థాన మొనరించుధర్మజుఁడు దుఃఖార్తుఁ డగుట యుచితము కాదు. అతఁడే దుఃఖార్తుఁ డగుచో వారిభవిష్యద్వియోగముచే వనరుచున్నదియు నబ లయు నగు సుభద్ర మఱింత దుఃఖిత యగుటయే కాక వారితోఁ దానును బయలుదేఱుట కవకాశ మున్నది. అందుచే తిక్కన ధర్మజుఁడు దుఃఖితుఁ డయ్యె నను విషయము విడిచి సమయానుకూలముగా సుభద్రకుఁ గర్తవ్యబోధ కావించినట్లు మాత్రము పైపద్యమున వర్ణించియుండెను.

శాంతిపర్వమునందలి చిరకారికథలో జననీమహత్త్వ మీక్రిందిశ్లోకమున నుగ్గడింపఁబడినది.

**యో హ్యాయం మయిసంఘాతో మర్త్యత్వే పాంచభౌతికః**
**అస్య మే జననీ హేతుః పావకస్య యథారణిః.**

తిక్కన యిందలిభావమును సమయోచితముగాఁ బెంచి

కరచరణాదిసంఘటితకాయము సంజననంబు వహ్నిపు
ట్టరణికిఁ బోలె తల్లి దెస నైనది కాదొకొ, యట్లుగాక దు
ర్భర మగు గర్భభేదమునఁ బట్టికినై నిజదేహచింతపై
భర మొకయింత లేక పడుపాటులు నక్కట యెక్కుడింతకున్
(శాం. 5-273)

అనుపద్యమును రచించెను. ఇందలి యుత్తరార్ధ మమూలకమై మాతృమహత్త్వ మును లెస్సగా వివరించుచున్నది.

తిక్కన యౌచిత్యదృష్టితో మూలమును మార్చి వ్రాసినభాగము లనేకము లున్నవి. అరణ్యవాసమైన పిమ్మట నర్జునుఁడు బృహన్నలయై విరటుకొల్వున కరిగి తనకు సంగీతనాట్యములం దుండినకౌశలము నెఱింగించి రాజకన్యల శిక్షణమునకై త న్నంతిపురమున నుంచుకొమ్మని ప్రార్థించెను. విరాటునికి బృహన్నలను సంగీతనాట్యాచార్యత్వమున నియోగింపవలెనను నభిలాష జనించెను. కాని నిజముగా నతఁడు నపుంసకుఁ డగునో కాదో యనుసంశయము కూడఁ గలిగెను. ఈసందర్భమున సంస్కృతభారతములో నతఁడు కొందఱు స్త్రీలను బిల్చి యాతని బరీక్షింప నియోగించె ననియు, వా రతఁడు చెప్పినది నిజమే యని తెల్పినపిమ్మట బృహన్నల నంతిపురికిఁ బంపె ననియు నున్నది. (పరీక్ష్యచైనం ప్రమదాభి రాశు వై అపుంస్త్వ మప్యస్య నిశమ్య చ స్థిరమ్). ఇది విరాటుని కంతఃపురరక్షణమున నున్న జాగరూకత నెంతగా చాటుచున్నను అసంభవమును, అనుచితమునై యున్నది. ఆస్త్రీలు బృహన్నల నెట్లు పరీక్షించిరి ? అందుచే తిక్కన విరాటుఁడు స్త్రీలను బిల్చి బృహన్నలను బరీక్షింపుమనుటయు, వా రట్లొనరించి యతఁడు పేడియే యని చెప్పుటయుఁ దొలంగించి "నైపుణంబున నుచితంబుమై నరసి పొచ్చెము లేమిఁ దదీయసేవఁ గైకొనుట" కతఁడు నిశ్చయించె నని యౌచిత్యశోభితముగా రచించెను. సూక్ష్మముగాఁ బరిశీలించినచో నట్టివారిత త్త్వము నెఱుంగుట యంత దుష్కరము కాదు గదా!

కీచకునిచేఁ బరాభవింపఁబడిన ద్రౌపది రాత్రిసమయమునఁ దనభంగపాటు

భీముని కెలింగించుటకై మహానసగృహంబున కరిగెను. అతఁ డప్పు డచ్చట నిద్రించుచుండెను. ద్రౌపది యాతనిఁ గాంచి

ఉత్తిష్ఠోత్తిష్ఠ కింశేషే భీమసేన యథా మృతః
నామృతస్య చ పాపీయాన్ భార్యా మాలభ్య జీవతి

యని పల్కుచు నాతని లేపెను. "భీమసేనా! లెమ్ము లెమ్ము. చచ్చినవానివలె నిద్రించుచుంటివేమి? చావనివానిభార్యను స్పృశించి యేపాపాత్ముఁడు జీవించు" నని యిందలి యర్థము. ఏభార్యయు భర్తనుగూర్చి యిట్లు పల్కదు. అందును ద్రౌపదివంటి పతివ్రత యెంతభంగపాటు నొందినను ఇట్లనుచితముగా పల్కదు. అందుచే తిక్కన యాయనౌచిత్యమును దొలఁగించి,

నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్నమొగుడ్చునూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా!

వి. ౨ - 166

అను పద్యము రచించెను. ఇందును కొంచె ముపాలంభము లేకపోలేదు. కాని యది యెంతయు సముచితమై యున్నది.

విరాటపర్వమున వ్యాసుఁడు భీమకీచకులపోరాటమును దీర్ఘముగా వర్ణించెను. వారిరువురును మహావీరు లగుటచే వారు పోరాడుసమయమునఁ గలిగిన యలజడినంతను అతఁడు విశదముగా వ్యక్తము చేసెను. కాని యాపరిస్థితులను బట్టి చూడ వార ట్లుపద్రవకరముగా బహిరంగయుద్ధ మొనరించుట యుచితముగాఁ గనిపింపదు. అందుచే తిక్కన యావర్ణనమంతయు విడిచిపైచి యీ క్రిందికందపద్యమును మాత్రము వ్రాసెను.

తనయగపా టొరు లెఱుఁగుదు
రని భీముఁడు సమయభంగ మగుటకు సూతుం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢవిమర్దనప్రహారములఁ దగన్.

తిక్కన వారిరువురును గూఢవిమర్దనప్రహారములతో రహస్యముగా యుద్ధము చేసిరని తెల్పుచుఁ దాను గావించినమార్పునకు గారణముకూడ మొదటిరెండుపాదములలోఁ దెల్పియున్నాఁడు. ఈ సందర్భమున తిక్కన ప్రదర్శించిన యౌచిత్యము మిక్కిలిప్రశంసనీయముగా నున్నది.

అర్జునుఁడు తనసోదరులను దన్నును ఉత్తరున కెఱింగించుసందర్భమున "అహ మస్మ్యర్జునః" అని మొదటఁ దన్నే తెల్పుకొన్నట్లు మూలమున నున్నది. పేడియై యుండినతా నర్జునుఁడ నని చెప్పినచో నుత్తరుఁ డెంతమందబుద్ధియైనను విశ్వసించుట కవకాశ ముండదు. అందుచే తిక్కన వరుస మార్చి,

కంకుఁడు ధర్మసుతుఁడు వల
లాంకుఁడు భీముండు కవలు హయశిక్షకగో
కింకరులు సెప్పఁ దొడఁగితి
నింకఁ గొఱఁత వెట్ట నేల యే నర్జునుఁడన్.

అని ముందు ధర్మజభీమనకులసహదేవులవిషయము తెల్పి యాతనికి విశ్వాసము కలిగినపిమ్మట "ఇంకఁ గొఱఁతపెట్టనేల యే నర్జునుఁడన్" అని తనసంగతి వివరించెను. అప్పు డాశ్చర్యముతో నైన నుత్తరుఁ డావిషయము నమ్మక తప్పినది కాదు. అజ్ఞాతవాసానంతరము విరటునికిఁ దమ్మెఱుకపఱుచుచు నర్జునుఁడు తనసంగతికూడఁ దానే చెప్పినట్లు మూలమున నున్నది. తిక్కన యర్జునుఁడు తనసోదరులనుగూర్చియు ద్రౌపదిని గూర్చియుఁ జెప్పినపిమ్మట భీముఁ డందు కొని యర్జునునిగూర్చి తెల్పినట్లు మార్చి వ్రాసి యౌచిత్యమును బ్రదర్శించెను.

యుద్ధానంతరము విషణ్ణచిత్తుఁ డైన ధర్మజు నాశ్వాసించుచు భీముఁడు

వయ మే వాత్ర గర్హ్యా హి యద్వయం మందచేతసం
త్వాం రాజ న్ననుగచ్ఛామో జ్యేష్ఠోయ మితి భారత

అని యుధిష్ఠిరుని మందచేతసుఁ డని నిందించినట్లు మూలమునం దున్నది. తిక్కన యీయనౌచిత్యమును బరిహరించి,

నీ పదవి కరుగ నొడఁబడి
నీ వెనుకన వచ్చునపుడు నిందింతురు మ
మ్మీ మెఱ్ఱు లితని మాన్పం
గా వలఁతులుగా రయని జగజ్జను లధిపా. శాం. ౧-౮౪

అని జనులు తమ్ము మందబుద్ధులుగాఁ దలంచి నిందింతు రని భీముఁడు చెప్పినట్లు మార్చి వ్రాసెను.

శాంతిపర్వముననే బృహస్పతి వసుమన్యునకు నీతులు చెప్పుచు

యదా పశ్యతి చారేణ సర్వభూతాని భూరిశః
న పుత్రపౌత్రాన్ సామీప్యాన్ తదా భవతి సోంతకః.
యద్వాత్వ ధర్మకాన్ సర్వాన్ తీక్ష్ణై ర్దండై ర్నియచ్ఛతి
ధర్మకాం శ్చానుగృహ్ణాతి భవత్యథ యమ స్తదా.

అని రాజు చారులచే సర్వభూతములను సమీపస్థులను దర్శించునప్పు డంతకుఁ డగు ననియు, నధర్మావలంబులను దండించుచు ధర్మాత్ములనను గ్రహించునప్పుడు యముఁ డగుననియుఁ దెల్పియుండెను. అంతక యమ శబ్దములు రెండును సమానార్థకములు. రెండుసందర్భములందును రాజు యమునివలెనే వర్తించునసుట కంటె నించుకమార్పు సూచించుట యుక్తముగా నుండు నని తిక్కన

చారచక్షుఁడై కను నెల్లజగము నపుడు
సూర్యుఁ డంద్రదు నరేంద్రదు, నకార్యకరుల
దునుమునయ్యెడ జముఁడునాఁ జను నతండు

అని చారచక్షుఁడై కనునప్పుడు రాజును సూర్యుఁ డందురనియు, నకార్యకరుల దునుమునప్పుడు యముఁ డందురనియుఁ దెల్పుటయే కాక "దేవతాత్ముఁ డగుట సందియమె యధిప" యని రాజుదేవతాత్మతనుగూడ నిపుణముగా నిరూపించెను. తిక్కన యౌచిత్యమునకై యిట్లు మార్చి వ్రాసినభాగము లింకను అనేకము లున్నవి.

విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుఁడైన వ్యాసభగవానుఁడు సంస్కృతమున రసవన్మనోహరముగాఁ దీర్చిదిద్దినఘట్టములు, వ్యక్తీకరించిన భావములు అనేకము లున్నవి. అట్టియెడ నాసౌందర్యమును గ్రహించి మూలమున కెట్టి లాఘవమును జేకూరకుండునట్లు వాని ననువదించుట ప్రతిభైకసాధ్యమైనపని. తిక్కన మహర్షిభావముల స్వాయత్తము చేసికొని పరమవిధేయతతో ననువదించిన భాగములు చాల కనిపించును. బృహన్నల సారథియై యుత్తరునితోఁ గురువీరుల నెదిరించుటకై యరుగుసందర్భమున సుత్తర శత్రువీరులయుష్ణీషములను బొమ్మపొత్తికలకై తెమ్మని గురువరుని గోరియుండెను. అప్పుడు బృహన్నల

యద్యుత్తరోయం సంగ్రామే విజేష్యతి మహారథాన్
తదా హరిష్యే వాసాంసి దివ్యాని రుచిరాణి చ

అని పల్కినట్లు వ్యాసుఁడు వ్రాసియుండెను. "యద్యుత్తరోయం.... విజేష్యతి" అనుచో యది శబ్దముచే నుత్తరుఁడు కురువీరుల జయించుట సందేహాస్పదమనువిషయము ధ్వనితమగుచున్నది. ఉత్తరుఁడు కురువీరుల జయింపఁజాలఁ డని బృహన్నల యెఱుంగును. తిక్కన యీధ్వనిని గ్రహించి

అనుడు బృహన్నల యిట్లను
జననాయకనందనుండు జయలక్ష్మిం జే

కొనునడె చీరలు తెచ్చుట
పనియే యటు చూడు మెల్లభంగులఁ దెత్తున్

అని మూలమునందలి హేళన స్ఫురించునట్లుగా చక్కఁగా ననువదించెను.

అజ్ఞాతవాసాంతమున యుధిష్ఠిరుఁడు విరాటునకు కృతజ్ఞత వెల్లడించు సందర్భమున మూలమున "గర్భవాస ఇవ ప్రజాః" అను నుపమానము వాడఁబడినది. తిక్కన దానియౌచిత్యమును గ్రహించి

చాల దుస్తరమైన యజ్ఞాతవాస
వత్సరంబు భవద్గర్భవాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్తచిత్త
వృత్తి నేము నిర్భయులమై యిందులట్లు విరా. ౫-344

అని గర్భవాసపదమును విడువక రమ్యముగా ననువదించెను. మాతృగర్భమున జీవునికి భగవంతుఁడు కల్పించుసౌకర్యము లవాఙ్మనసగోచరములు కదా!

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః" అను భగవద్గీత యందలి ప్రథమశ్లోకమును తిక్కన

మానుగ ధర్మక్షేత్రం
బైన కురుక్షేత్రమున మహాహవమునకున్
బూని మనబలము పాండవ
సేనయు నిటు వన్ని యేమి చేసెం జెపుమా!

యని యథామూలముగా ననువదించెను. అట్లే భగవద్గీతసారాంశ మని చెప్పఁబడు 18 వ అధ్యాయములోని

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి మాశుచః.

అనుశ్లోకమును తిక్కన

క్రందుకొను సర్వధర్మవికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నే నొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకుఁ దొలఁగింతు నిన్నుఁ బ్రమోదమంద

అని యథాతథముగా ననువదించుచు 'క్రందుకొను' 'వికల్పములను' అనుపదములచే మూలభావమునకు వన్నె కలిగించెను.

ఈవిధముగా సంస్కృతభారతము ననువదించునెడ తిక్కన మక్కికి మక్కిగా ననువాదమును సాగింపక వలసినచోట్ల ప్రతిభానమంచితములైన

మార్పుచేర్పులు చేయుచు, నెడనెడ యథాతథముగా ననువదించుచుఁ దెలుఁగున దానికి హృద్యానవద్యమైన రూపసౌష్ఠవము నొసంగెను. అందుచేతనే యతని రచన కథావిషయమున మూలానుసారియయ్యు రసపాత్రపోషణాదుల విషయమున స్వతంత్రప్రాయమై యలరారుచున్నది. భారతమున తిక్కన రచించిన పదునైదుపర్వములభాగము వస్తువైవిధ్యముతోడను రసవైవిధ్యముతోడను గూడినట్టిది. అందు రాజనీతి, యుద్ధతంత్రము, ధర్మనీతి, తత్త్వోపదేశము, గృహజీవితము, యజ్ఞనిర్వహణము మున్నగువిషయము లెన్నో విస్తరింపఁబడి యున్నవి. మానవజీవితమునందలి బహువిషయముల కందు ప్రసక్తి కలదు. ప్రధానకథలో నందు ప్రసక్తానుప్రసక్తముగా పెక్కుపాఖ్యానములు ప్రవేశపెట్టఁబడినవి. ఇంత వస్తువైవిధ్యము గల రచన సమర్థముగా సాగించుటకు భాషాకవితాకౌశలముతోపాటు విశేషమైనలోకానుభవముకూడ కావలయును. తిక్కనయం దివియన్నియు రాశీభూతములై యున్నవి. అతనిజీవితమే యొక యితిహాసము వంటిది. అందుచే భారతేతిహాసరచన యతనిచేతఁ బడుట యన్యోన్యాలంకారమున కాస్పదమై ఆంధ్రసరస్వతి కందచందములు కూర్పఁ జాలినవి.

తిక్కనభారతమునందలి వివిధాంశములను బహువారములు మననముచేసి అంగాంగిభావసామరస్యమున కాటంకము లేకుండ నాయితిహాసమూర్తిని దీర్చి దిద్దెను. అనువాదసందర్భమున నతఁడు కావించిన సంకోచవ్యాకోచముల కీసామరస్యసంధానదృష్టియే కొంతవఱకు కారణము. ప్రధానకథాభాగమునకును ఉపాఖ్యానములకును గలసంబంధము సడలనీకుండ సర్వాంగసౌష్ఠవోపేతముగా మహాకావ్యనిర్మాణము కావించుటలో నతఁడు చూపిన నేర్పనన్యసామాన్యమైనది. లుబ్ధకపోతోపాఖ్యానము, హంసకాకీయోపాఖ్యానము, గృధ్రజంబుకోపాఖ్యానము, చిరకారిచరిత్ర, నాడీజంఘునికథ, సక్తుప్రస్థునివృత్తాంతము, గరుడోపాఖ్యానము మున్నగునవి యతనియుపాఖ్యానములలో నుత్తమము లైనవి. అతఁడు ప్రతిపర్వము నొకప్రబంధముగా భావించినట్లే పర్వాంతర్గతమైన ప్రతి ఉపాఖ్యానమును ఒక చిన్నకావ్యముగా భావించి దానియందు వస్త్వైక్యమును సంఘటించుటకు యత్నించెను.

తిక్కన యితిహాసమును కావ్యముగా నిర్మింపఁదలచినవాఁ డగుటచే రసపోషణమునం దత్యంతశ్రద్ధ వహించెను. అందుచేతనే శ్రీనాథుఁ డతనిగూర్చి "భాషింతు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్కమా"

టని చెప్పి యతనిరచనయందు రసాభ్యుచితబంధమునకుఁ గల ప్రత్యేకత నగ్గించెను. తిక్కన విరాటపర్వారంభమున 'హృదయాహ్లాదిచతుర్థ మూర్జితకథో పేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వ' మని యాపర్వమునందలి ప్రధానలక్షణములను పేర్కొనియుండెను. ఆవిశేషణము లొక్క విరాటపర్వము నకే కాక యతఁడు రచించిన యన్నిపర్వములకు సమానముగా నన్వయించును. తిక్కన విరాటపర్వమున నుత్తరాభిమన్యులవివాహ సందర్భమున శృంగారరస మును, కీచకప్రణయసందర్భమున శృంగారరసాభాసమును, ఉత్తరదక్షిణగోగ్ర హణములందును, యుద్ధపర్వములందును, వీరరౌద్రబీభత్సములను, ఉద్యోగమున వీరరసమును, శాంత్యనుశాసనములందు శాంతరసమును, ద్రౌపది తనభంగపాటు చెప్పుకొనుసందర్భమునను, అభిమన్యువధసందర్భమునను, స్త్రీపర్వమునందును కరుణరసమును, విశ్వరూపసందర్శనసందర్భమునను, పాండవులు తమ్మోఱిం గించుకొనుసందర్భమునను, వ్యాసుఁడు యుద్ధమృతులను రావించి చూపిన సందర్భమునను, అద్భుతరసమును చక్కగాఁ బోషించియుండెను. ఆనందవర్ధ నుఁడు కావ్యచ్ఛాయాన్వయి యైన మహాభారతశాస్త్రమునందు యాదవక్షయము, పాండవమహాప్రస్థానము, శ్రీకృష్ణునికి వ్యాధునివలనమృతి కల్పించి వ్యాసుఁడు మోక్షపురుషార్థమును, శాంతరసమును ముఖ్యముగా వివక్షితములు కావించె ననియు

యథాయథా విపర్యేత లోకతంత్ర మసారవత్
తథాతథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః

అను భారతశ్లోకమున నీవిషయమునే వ్యక్తీకరించె ననియు, భారతమున శాంతమే అంగిరస మనియు సూచించియుండెను.

విరాటపర్వద్వితీయాశ్వాసమునందు కీచకుఁడు ద్రౌపదిని జూచినసందర్భ మున భయాదిభావములచే ద్రౌపదిమేనఁ గంపస్వేదాదులు బొడసూపుటయు, వానిని జూచి శృంగార లక్షణము లని భ్రమించి కీచకుఁడు మదనవికృతికి లోనగుటయు తిక్కన యీక్రిందిపద్యమున నెంతో నిపుణముగా వర్ణించి యుండెను.

వెఱవక ననుఁ జూచె వీఁ డని యెదఁ గలు
షించిన నొండొండ చెమట పుట్టి
ననుచితకృత్యంబు లాచరించు విధాతృ
బలిమికి నివ్వెఱపాటు తోఁప

నిచ్చట దిక్కులే రెవ్వరు నా కను
భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమియుపాయంబు లేమి నా
ననమున వెల్లఁదనంబు గదుర
నున్నపాంచాలిఁ గనుఁగొని యన్నరాధ
ముండు వివేకవిహీనుఁడై ముదితుఁ డగుచు
మదనవికృతియగాఁ దనమదిఁ దలంచి
రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె. విరా. ౨-౩౩

భ్రాంతి కీచకుని వివేకహీనతను సూచించుచున్నను స్వేదాదులు శృంగారసంబంధి సాత్త్వికభావము అని గ్రహించుట యాతనిపాండితీపాటవమును బ్రకటించు చున్నది. పైపద్యము తిక్కనరసపోషణపరాయణత్వమును లెస్సగా వ్యక్తము చేయుచున్నది.

విరాటపర్వాంతమున నుత్తరాభిమన్యుల వివాహసందర్భమున తిక్కన హృద్యమైన వధూవరులయనురాగమును, స్నిగ్ధసుందరములైన చూపులను విపులముగా వర్ణించి ధర్మ్యమైన శృంగారమును మనోహరముగాఁ బోషించియున్నాఁడు. ఇట్లే ఆనుశాసనికపర్వమున అగ్ని సుదర్శన యను రాజకన్యను బ్రేమించిన వృత్తాంతమును తిక్కన విభావానుభావసామగ్రీపురస్సరముగా చక్కగా వర్ణించియున్నాఁడు. మూలమున నావృత్తాంతము "తా మగ్ని శ్చకమే సాక్షాద్రాజకన్యాం సుదర్శనామ్" అని అతిసంగ్రహముగా నున్నది. తిక్కన సుదర్శనను రా జగ్నిహోత్రపరిచర్యకు నియోగించె నని తెల్పి, వారికిఁ బరస్పర సాన్నిహిత్యదర్శనములు కలిగించి

అర్చించునప్పు డయ్యంగన కెంగేలి
జిగిపెంపు చిత్తంబు దిగిచికొనఁగ
నరసి కనుఁగొనునప్పు డయ్యంతికనుఁగవ
పొలపంబు రాగంబు పొదలఁజేయ
నన్యులఁ బనిపంచునప్పు డమ్ముద్దియ
పలుకులతీపు కోర్కులఁ గెరల్ప
నల్లన యూదెడునప్పు డక్కొమ్మ వా
తెఱతావి ధైర్యంబు ద్రిప్పిగొలుప
మరుఁడు తోడ్తోడఁ దేకువ మాని కదిసి
తూపుగములఁ గ్రొవ్వాడిమి సూప నంత

కంత కగ్గలమగు వలపంతఁ దూలి
పోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర ! ఆను. ౧-48

అని యగ్ని క్రమక్రమముగా నెట్లు వలపెంత కగ్గమయ్యెనో నిపుణముగాఁ బ్రద ర్శించెను. ఈకథలో నతఁ డగ్నికాముకస్వభావమును, సుదర్శనకులకన్యోచిత వర్తనమును సముచితముగాఁ బ్రదర్శించెను.

ఉత్తరుఁడు కౌరవసేనను జూచి భయపడి వెనుకకుఁ దిరిగిపోవుటయే మంచి దని పలుక బృహన్నల యతనికి ధైర్యము చెప్పుచు రథము పోనిచ్చు చుండెను. అప్పు డుత్తరుఁ డాననము పల్లటిల్ల మానసము తల్లడిల్ల

దవ్వుల విఱిగినఁ బేరులు
నవ్వుదురఁటె మేలుమేలు నను నాగకు నీ
క్రొవ్వు ఱుగదేనిఁ దలపడు
మెవ్విధిఁ జనితేని యనుచు నెత్తినభీతిన్.

శరములు శరాసనములు న
య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బఱిదెనకును లజ్జ వీటిబోవం బాఱెన్. విరా. ౪-72

అప్పుడు బృహన్నలయుఁ దే రుడిగి యతని బట్టితెచ్చుటకై వెనుకఁ బరుగిడెను. ఇచ్చట హాస్యరసము చక్కఁగాఁ బోషింపఁబడినది. తిక్కనయు నీసందర్భ మున గూఢరూపరేఖాజ్ఞత లేమిచే కౌరవబలమునందలి యజ్ఞులు కొంద అపహా సము చేసి రని వ్రాసియున్నాఁడు.

తిక్కన భారతమున నాయాసందర్భముల కనుగుణముగా పెక్కువర్ణన ములు కావించియుండెను. అందుఁ గొన్ని మానవతిర్యగ్జడరూపములకును, గొన్ని యుద్ధాదిసంఘటనములకును, గొన్ని సాయంప్రాతరాదిప్రకృతిదృశ్య ములకును సంబంధించినవి. అతనివర్ణనలు రసానుగుణములై దృశ్యములను బఠితలకు సాక్షాత్కరింపఁజేయుచుండెను. మానవరూపములను వర్ణించు నప్పు డతఁడు బహిస్స్వరూపమునకుఁ గాక ఆంతరములైన కాంతిసౌష్ఠవముల కెక్కువప్రాధాన్యము నొసంగుచుండును. కీచకుఁడు ద్రౌపదిని వర్ణించిన తెఱంగు పరికించిన నిది తేటతెల్లమగును. "తెలికన్నుఁగవకాంతి పొలుపార నించుక కనువిచ్చి చూచినఁ గాదె యబల, చెలువంపునెమ్మోము నెలమి నొం పిసు మడిగా నల్ల నవ్వినఁ గాదె యింతి" మున్నగుపద్యములలో నాతఁడు కాంతి, ఎలమిసొంపు, రుచి మొదలగు నాంతరగుణములయెడనే యెక్కువమక్కువ

చూపెను. ఉత్తరాభిమన్యులవివాహసందర్భమున నతఁడు లౌకికవైదికక్రియా కలాపముతోపా టనురాగసూచకములైన వధూవరులచూపులను గూడ నెంతో హృద్యముగా నిట్లు వర్ణించియుండెను.

వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱి
తివుటమై నునుఁగాంతి తిప్పగ్రోలు
సుందరీరత్నంబుచూపు మనోరము
నడుగులయొప్పుమై నల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైతీవఁ
గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు
వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
నెగసి మోమునఁ జోకిఁ మగిడివచ్చు
నొండొరువుల లేఁజెమటల నూని ప్రేగు
పడినచాడ్పున నవయవభంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱ విశాల
నయనదీప్తుల నెఱుకువ బయలుపడఁగ. విరా. ౫-396

అతఁడు వాచ్యముగా వ్యక్తులప్రత్యంగవర్ణనము కావింపక వారి గరువతనమును గాంభీర్యమును వ్యంగ్యముగా వెల్లడిచేయుచుండును. "సుదతి నీమై చక్కఁ జూచుట కోడెదఁ గనుఁబాటు వొరయునో యని తలంచి, మది నిగిర్చిన మాట మగువ నీపెంపునఁ గుదిసి నానాలుకతుదికి రాదు" (విరా. ౨-47) అనుపద్యము ద్రౌపదిగరువతనమును సౌందర్యవిశేషమును గూడఁ జాటుచు "మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ బడయవచ్చునె యెన్నియుపాయములను" అనుచో కీచకునిఅసాధారణమహత్త్వమునుగూడ సూచించుచున్నది. అతఁడు నన్నయవలె దృశ్యములస్థిరవిన్యాసమును గాక ప్రతిక్షణచాంచల్య మానదశావిపర్యయమును విశదముగాఁ బ్రదర్శించుచుఁ జలనచిత్రమునందువలె వానిబహుముఖములను బఠితకన్నులకుఁ గట్టుచుండును. అతనివర్ణనములు విశితమైనపరిశీలనముతోపా టొకానొకక్రమపరిపాటినిగూడ వ్యక్తముచేయుచుండును. ఉత్తరసారధికమైన రథ మెక్కి యర్జునుఁడు కౌరవసైన్యమును గదియ నేగునప్పు డతఁడు

దేవదత్తాఖిలరావంబు వెసఁ గర్ణ
ముల దీటుకొన లేటమొగము పడుచు
రథనేమిదళితధరాధూళి యంగంబు
లెల్లఁ గప్పఁగ వెలవెల్ల నగుచు

బహుళకపిధ్వజప్రభలు లోచనములు
మిఱుమిట్లుగొనఁ బర్వ మేడుపడుచు
నుద్భటాకారసముద్ధతి మనము లు
త్తలపాటు దోఁపంగఁ దల్లడిలుచు
నడచు కౌరవరాజసైన్యంబు గదిసెఁ
దీఁగ దిగిచినగతిఁ దనతేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయభైరవసహస్ర
గర్జనోదగ్రతర్జనుం డర్జునుండు

అనుపద్యమును వ్రాసెను. ఇందు మొదటి దేవదత్తాభీలరావము, తరువాత రథ నేమిదళితధరాధూళి, పిమ్మట బహుళకపిధ్వజప్రభలు, అనంతర ముద్ధతాకారార సముద్ధతి అనునవి వర్ణితమగుట క్రమబద్ధమై యెంతో సహజముగా నున్నది. కీచకుఁడు ద్రౌపదిపై మోహమున బరితపించుసందర్భమున వ్రాయఁబడిన "పొడ సూపినట్లైనఁ వడిఁబట్టసమకట్టు పరికించి కానక బమ్మరించు, మెలఁగినయట్లైన బరికింపఁ దలఁచి నిరూపించి లేమి నవ్రశులు వహించు" (విరా. ౨–301) అను పద్యమున పొడసూపుట, మెలఁగుట, కదియుట, ఒడఁబడుట, విహారమున కెలసి పొలయుట అనువానిని క్రమముగా వర్ణించి తిక్కన సహజస్థితిని జక్కగాఁ బోషించినాఁడు. ఈవిధముగా నాతనివర్ణనలు చిన్నవైనను పెద్దవై నను సుపరిష్కృతములై పరిణతమైన శిల్పమును బ్రదర్శించుచుండును.

తిక్కన యెడనెడఁ గావించినప్రకృతివర్ణనలు నాతిదీర్ఘములై సాధారణ ముగా నచ్చటిపాత్రలతోడను కథాసందర్భముతోడను సంబద్ధములై రమ్యముగా నుండును. విరాటపర్వద్వితీయాశ్వాసమున మహానసములో నిద్రించు భీమునికి ద్రౌపది తనభంగపాటు తెలిపి యరిగినయనంతరము ప్రభాతమును తిక్కన

ద్రుపదనందన పరిభవదుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచునున్నసరసి
వేఁడినిటూర్పులో యన వెడలెఁ గ్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మివిరుల 236

అని వర్ణించెను. ఇది ద్రౌపదిదుఃఖమునకుఁ బ్రకృతి సహితము సానుభూతి వహించి దుఃఖించుచున్న దని తెల్పుచు రమణీయముగా నున్నది. ఇట్లే

తనకులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు
కంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు ఉద్యో. 3-107

అని సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రుని కధ్యాత్మబోధ కావించి యరిగిన పిమ్మటఁ నతఁడు చంద్రునివైవర్ణ్యమునకుఁ దనకులమునఁ బుట్టిన కౌరవపాండవు లొండొరులతో విగ్రహించుటవలని దుఃఖము కారణముగాఁ జెప్పియుండెను. యుద్ధపర్వములం దతఁడు యుద్ధారంభవిరామములను సూచించుటకై దినాద్యంత సంధులను వర్ణించుచు సూర్యునియుదయాస్తమయములతోఁ బోల్చి యావర్ణనము లకుఁ గథాసన్నివేశములతో సన్నిహితమైన సంబంధము కల్పించుచుండును. వనవర్షాదివర్ణనములనుగూడ నాతఁ డాయాఘట్టములందు సందర్భోచితముగాఁ దీర్చిదిద్దుచుండును.

తిక్కన యుద్ధవర్ణనములం దందెవేసినచేయి. ఇందు కాతఁడు స్వయ ముగా యుద్ధము లాచరించినను ఆచరించియుండకపోయినను పెక్కుయుద్ధ తంత్రములను బరిశీలించి నిర్వహించియుండినవాఁ డగుటయే కారణము. వ్యూహ నిర్మాణములను, ద్వంద్వసంకులాదిసమరభేదములను అతఁ డెదుటఁ జూచు చున్నట్లు విశదముగా వర్ణించుచుండును. విరాటుఁ డుత్తరుని సమరప్రకార మడుగుసందర్భమున తిక్కన

బాసట లేదు క్రొవ్వడర బంటుతనంబునఁ దాఁకితేనియుం
బాసినచోట వాయుఁ బెలుపట్టుల వీరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొకమోహర మమ్ముల ముగ్గెనేని నా
సాసల నొక్కరుండ యనునాగ్రహవృత్తి బలంబు పైఁ బడున్.

విరా. ౫-280

అనుపద్యము నొక వీరుఁడు పలువురుయోధులఁ దాఁకుసందర్భమునందలి చిక్కుల నెంతో విశదముగా వర్ణించియున్నాఁడు. ఇతరకవులవలె నతఁడు పాఠకులను కేవలబాణసంఖ్యావివరములతో విసిగింపక యాయాసందర్భము లందలి క్లిష్టపరిస్థితులను, యోధులశౌర్యధైర్యములను వివరించి యన్యథా శుష్కముగా నుండువర్ణనములకు సహజత్వ మాపాదించుచుండును. యుద్ధ రంగములందలి వాతావరణము సహజముగా గజతురంగయోధాదుల రక్తమాంస ములతోడను గళేబరములతోడను గూడి బీభత్సమున కాకరమై యుండును. తిక్కన యట్టిచోట్లఁ గూడఁ దునిసిపడియున్న కరచరణాదులకు లలితసుంద రము లైన యుపమానములను గూర్చుచు నొకవిధమైన సౌందర్యవాతావరణము కల్పించుచుండును. "గుత్తులకొలందికిఁ గృత్తంబులై పడియున్న పాదంబుల వలనం గెందలిరులసెజ్జలచందంబు లగుచోట్లును, దునిసి చిక్కుపడియున్న

యూరుకాండంబులవలన మదగజంబులు నొచ్చిన కదళీవనంబులు వోనియెడలును, గీలాలజాలంబుపయిం దేలుచు నవ్వుచున్న ట్లున్న శిరంబులవలన వికచారవింద దీర్ఘికల విడంబించుతావులును" – ఇత్యాదిభాగము లిందుకు నిదర్శనములు. అందుచేతనే "తిక్కన సంగ్రామం బభిరామం బయ్యె ఘోరప్రకారం బయ్యె" నని యభిరామతాఘోరత్వములు రెండింటిని సమ్మేళనము చేసి చెప్పుచుండును.

విస్తృతమైన భారతేతిహాసమునందలి పాత్రలసంఖ్య అనల్ప మయ్యు తిక్కన యాపాత్రల నందఱిని సుస్పష్టరూపరేఖలతోఁ దీర్చిదిద్ది యొక్కొక్కరి యందు విలక్షణమై యుండు వ్యక్తిత్వమును వెల్లడిచేయుచుండును. దుర్యోధనునిదురభిమానమును, ధృతరాష్ట్రుని పుత్రపరాధీనతను, శకుని కైతవమును, కర్ణుని రాజభక్తి పరాక్రమములను, భీష్మద్రోణాదుల ధర్మపరాయణతను, శ్రీకృష్ణుని దుష్టశిక్షణశిష్టరక్షణరాజనీతి ధౌరంధర్యములను, ధర్మజుని మెత్తని పులితనమును, భీముని అమాయికతను, అర్జునుని యుదాత్తతా విక్రమములను, నకులుని సౌజన్యమును, సహదేవుని రాజనీతివేత్తృతను అతఁడెంతో నిపుణతతో వర్ణించెను. సంజయుఁడు పాండవులకడ కేగి వచ్చినపిమ్మట ధృతరాష్ట్రునితో

అనయము వుట్టె జూదమున యప్పుడ యెంతయుఁ జిచ్చువెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు సధర్మము నీపయిఁ బెట్టుసంతకున్
వినఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే. ఉ. ౨-14

అనిచెప్పి ధర్మరాజును వశీకృతచిత్తుఁడుగను, మెత్తనిపులిగను జిత్రించెను. అర్జునుఁడు కంకుఁడు ధర్మసుతుఁ డని విరాటుని కెఱింగించుచు "నడదివియలు చేసె నగరికి మాణిక్యమకుటముల్ పూనిన మనుజపతుల" "ఈతఁ డజాత శత్రుఁడు" (విరా. ౫-320-321) అనుపద్యములలో ధర్మజునిమహత్త్వమును వివరించెను. ద్రౌపది భీమునితో ధర్మరాజుమహిమ నెఱింగించుచు "నయ్యుధిష్ఠిరు గాంభీర్య మతనిధైర్య మరయ నొండెడఁ గలుగునె యతఁడు కీర్తిధరుఁడు, గరుణోత్తరుఁడు, మహీసురసమృద్ధికరుఁడు, నిజవంశకరుఁ డుపకారపరుఁ" డని తెల్పియుండెను. సంజయుఁ డాతని

అల్పులకు మ్రింగఁ జేదైన హాలహలము
భంగిఁ బొంగెడుకోపంబు మ్రింగికొనఁగ
నీలగళు నెన్ని నిన్నెన్నఁబోలు నట్టి
నీవు సాలినఁ దాకేల నెగడుఁ బేరు

అని ప్రశంసించియుండెను. ధృతరాష్ట్రుఁడు గాంధారితో వనమున కరుగునపుడు ధర్మరాజు

తల్లియుఁ దండ్రియుం గురుఁడు దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ నీవు కాననని వాసముఁ గోరి చనంగ నెట్లు లే
నుల్లముపట్టి హస్తిపురి నుండఁగ నేర్తు యుయుత్సుఁ బెంపుతో
ఖిల్లఁగ రాజు చేయు నినుఁ బ్రీతి యెలర్పఁగఁ గొల్చివచ్చెదన్

అని పెదతండ్రియందలిభక్తిని బ్రకటించెను. తిక్కన యావిధముగనే భీమాదుల గుణశీలములు కూడ నెంతో నేర్పుతో వ్యక్తీకరించియుండెను. అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱింగించు సందర్భమున నొక్కొక్కరిని గూర్చి చెప్పిన పద్యములలో వారివారియందలి ప్రధానలక్షణములు చక్కఁగా ద్యోతితములగు చున్నవి. భీముఁ డవిషహ్యపరాక్రమదుర్దముఁడు. నకులుఁడు "శత్రునృపకాల కూటము, మిత్రామృతవృష్టి, బుధసమీహితసిద్ధిక్షేత్రము, సజ్జనసంస్తుతిపాత్రము." సహదేవుఁడు "సుకుమారమానసుఁడు, గొంతికిఁ బ్రాణము, చేతోగణ్యుం, డకుటిలుఁడు, రాజనీతిప్రకారసంపేది, వంశపావనుఁడు". కృష్ణుఁడు రాయబారమున కరుగునపుడు సహదేవుఁడు పల్కిన పల్కు లాతనిఖండితవాక్చతురత్వ మును రాజనీతివేత్తృతను బ్రకటించును. రాయబారమునకై వచ్చిన కృష్ణుఁడు కుంతిని దర్శించినప్పు డామె

దానదయాపరుం డయిన ధర్మతనూభవు సేమ మెట్లు, పం
చానన విక్రముం డగు బకారికి భద్రమె, యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖియా, వినయాభరణుల్ కవల్ సమా
ధానసమేతులే యకట ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్

అని పేరుపేర పాండవులయు ద్రౌపదియొక్కయు కుశలమును గూర్చి యడిగి వారియందలి ప్రముఖగుణములను వ్యక్తీకరించెను. ధర్మజుఁ డెవ్వరిని గొని కౌరవులమీఁద నెత్తిరాఁ గలఁ డని ధృతరాష్ట్రుఁ డడిగినప్పుడు సంజయుఁడు

అట మిన్నందినయట్టివాని పొడవెం తన్నట్లు ఫాలాక్షు నె
క్కటి కయ్యమ్మునఁ గన్నఫల్గును భుజాగర్వంబు లెక్కించుటం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తివ
చ్చుటకుం గొంకునె వీపు సక్కనయి నిల్చుంగాక మీసైన్యముల్

అని అర్జునునిపరాక్రమప్రమాణమును వర్ణించియుండెను. ఈవిధముగా తిక్కన భారతమునందలి సర్వపాత్రల గుణశీలస్వరూపములను నిపుణముగా వ్యక్తము చేసియుండెను. అతఁడు విరాటపర్వమున కీచకుని పశుకామప్రేరితుఁడైన

మోహాంధుఁడుగాఁ గాక యుదాత్తగుణములకును హార్దమైన యనురాగమునకును నిలయమైన విషాదనాయకుఁడుగాఁ జిత్రించెను. ఇన్నిగుణము లున్నప్పటికిని ధర్మబాహ్యమైన పరకాంతాపరాయణత యతని పతనమునకుఁ గారణమయ్యెను.

స్త్రీలలో గాంధారీకుంతీద్రౌపదీపాత్రల నాతఁడు చిత్రించినతీ రద్భుతమైనది. గాంధారి మహాపతివ్రత, అధర్మభీరువు. కుంతీద్రౌపదు లాభిజాత్య సంపన్నలైన క్షత్రియకాంతలు. ద్రౌపది కృష్ణునితోఁ దనభంగపాటు చెప్పుకొను సందర్భమునను, కుంతి

ఇదియెల్లను నొకతల యీ
పదుమూఁడేడులును నాకు బావకొడుకుచే
నదయమగు కూడు గుడుచుట
యది యొకతల యయ్యె నేమి యనఁగల దనఘా !

కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి
నట్టిపనికి నుచితమైన సమయ
మొదవెఁ దడయు టింక నొప్పదు జనములు
నట్లుగాని పురుషు లనరు మిమ్ము

అని క్షత్రియోచిత విధముగా వర్తింపవలె నని కృష్ణునిద్వారా సందేశము పంపుసందర్భమునను వారి సహజమనఃప్రవృత్తులు చక్కఁగా వ్యక్తీకరింపఁబడినవి. పాత్రపోషణమున తిక్కనకుఁ గలనేర్పు నాన్యతోదర్శనీయమైనది.

తిక్కన పాత్రలగుణశీలాదులనేకాక ఆయాసందర్భములందు వారిమనఃప్రవృత్తులను గూడఁ గడునిపుణతతోఁ బ్రకటించియుండెను. విరాటపర్వద్వితీయాశ్వాసమున నతఁడు కాముకుఁడైన కీచకునిమనఃప్రవృత్తిని వేయివిధముల వెల్లడించెను.

అని యని యుగ్గడించు ధృతి యల్లల నాడినఁ దల్లడించుఁ బై
కొను తలపోఁత నించు, మదికోర్కులు పేర్చిన నప్పళించు, నె
ట్టన తగ నగ్గలించు, నచటం జనులం బరికించు, బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవళించు, మనోజవికారమగ్నుఁడై.

వంటి పద్యము లిందుకు నిదర్శనములు. విరాటపర్వమున ధర్మరాజు తమ యాయుధములను శమీవృక్షముపైఁ బెట్టి, తదీయాధిదైవతములకు నమస్కరించి," నరునకు వాకుం దక్కఁగ నొరులకు మీరూపు సూపకుండునది",

భీముఁడు ధార్తరాష్ట్రకులభీషణరోషుఁడు చిత్త మెప్పు డె
ట్లై మదమెత్తునో యతని యాగ్రహవృత్తికి లోనుగాక మీ

రేమెయినైన వంచన వహించి తొలంగుట మత్సమీహితం
బేమఱకుండఁగావలయు నివ్విషమాబ్ధములోన నాతనిన్

అని ప్రార్థించి, చెట్టు దిగివచ్చి "భీమసేనుదెస మరలిచూచి సాంత్వనవచన సమేతంబుగా నతని గౌఁగిటంజేర్చి యనునయించెను. ధర్మజుఁ డిట్లు చేయుట యాతనిమనఃప్రవృత్తి నెన్నోవిధముల వ్యక్తముచేయుచున్నది. పాత్రమనః ప్రవృత్తిప్రదర్శకములైన యిట్టి రమ్యములైన ఘట్టములు తిక్కన రచనమున నెన్నో యున్నవి.

తిక్కనభావము లత్యుదాత్తములైనవి. భారతమందలి యేఘట్టమైనను అతనిభావౌన్నత్యమునకు తార్కాణమే. "ఎవ్వనివాకిట నిభమదపంకంబు రాజభూషణరజోరాజి నడఁగు, సారపుధర్మముం బరమసత్యము పాపముచేత బొంకుచే, విద్యుద్దండము నిల్చి పొల్చినగతిన్ విల్లందమై యుండ, వారలు శాంతశూరులు, ప్రైవడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు కన్నదియేమి" మున్నగు పద్యము లతనిభావనిర్భరతకుఁ దార్కాణములు. ఎంతక్లిష్టమైన భావమునైన నతఁడు విశదముగను శక్తిమంతముగను వ్యక్తీకరించి దానిని బఠితలచే ననుభవింపఁజేయును. అతనిశబ్దములు భావములకువలె భావములు శబ్దములకు విధేయములు కావు. అతఁడు ప్రతిభాశాలియైన మహాకవి; లోకజ్ఞుఁడు; రాజనీతివేత్త; శ్రోత్రియుఁడు. ఈగుణములన్నియు నాతనిరచనమున సర్వతోముఖముగా సాక్షాత్కరించును. ఉద్యోగపర్వమునందలి కృష్ణునిపల్కులలో నతనిరాజనీతివేత్తృతయు, శాంతిపర్వమునందలి భీష్మునిపల్కులలో నతనిసర్వధర్మపరిజ్ఞానమును, భగవద్గీతయందలి యాయువుపట్టుల నేరి యనువదించుటలో నతని యుపనిషద్విజ్ఞానమును, అశ్వమేధపర్వమున శ్రోత్రియత్వమును జక్కఁగా వెల్లడియగుచుండును. అతఁడు లోకమున మెలఁకువతోఁ బరిశీలించినపెక్కు విషయములను భారతమునఁ బొదిగి దానిని మఱొకప్రపంచముగా సృష్టించి తనకవిబ్రహ్మత్వమును సార్థకము కావించుకొనఁజాలెను.

తిక్కనప్రతిభ నాటకోచితమైనది. అతఁడు కథను దానుగాఁ జెప్పక నాటకమునవలెఁ బాత్రలసంవాదములరూపమున నడపించును. విరాటోద్యోగములందలి యేఘట్టమును దిలకించినను ఇది తేటతెల్లము కాఁగలదు. "అతఁ డిట్లనెను, ఇతఁ డిట్లనెను" అనుసూచనలను దొలఁగించినచో నతని సంభాషణములకును నాటకములందలి సంభాషణములకును భేదము కనిపింపదు. పాత్రల సంభాషణములను వ్యక్తీకరించునప్పు డాతఁడు వట్టిమాటలను మాత్రము చెప్పి

యూరకుండక వారి యాంగికచేష్టాభినయనములను గూడ పర్ణించుచుండును. ద్రౌపది తనభంగపాటు కృష్ణుని కెఱింగించునప్పుడు "బంధురమ్మయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్ తా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో నా విలసిల్లి క్రాలఁగ మనంబునఁ బొంగువిషాదరోషముల్ కావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ గద్గదఖిన్నకంఠియై" మాటాడెను. భీముఁడు వంటలవానివేషమున విరాటునికొలువున కరిగినప్పుడు విరాటుఁ డాసనయానాత పత్రాదులును, జనవరి కొల్వు నిచ్చెద నని పల్క నతఁడు మోఱకుచందంబున మో మడ్డము కదల్చి యేదో సమాధాన మొసంగెను. సహజమైనసంభాషణ శైలియు, నిట్టియభినయసూచనలును తిక్కనచేత శ్రవ్యకావ్యమును గూడ దృశ్యకావ్యముగా భాసింపఁజేసినవి. విరాటపర్వపంచమాశ్వాసమునందు పాండవులు విరాటునికిఁ ద మ్మెఱింగించుకొనుసందర్భమును, ఆశ్రమవాసపర్వమున వ్యాసుఁడు ధృతరాష్ట్రునికి మృతపుత్రులఁ జూపించినసందర్భమును శ్రవ్య కావ్యస్థము లయ్యును నాటకభాగములవలెనే గోచరించును.

తిక్కన వ్యంగ్యప్రియుఁడు. అతఁడు పెక్కుఘట్టములందు వ్యంగ్యార్థము స్ఫురించునట్లుగా రచన సాగించి పఠితల నానందపరవశులఁ గావించుచుండును. ద్రౌపది కావించిన సమయము ప్రకారము కీచకుఁడు నర్తనశాల కరుదెంచి ప్రణయవచనములు పల్కుచుండ భీముఁడు ద్రౌపది వినుచుండఁగా నతనితో "నాయొడలు సేర్చినప్పుడ నీయొడ లెట్లగునో, నను ముట్టి నీవు వెంబడియు వనితలసంగతికిఁ బోవువాఁడవె" అని పల్కెను. ఈపల్కులు పైకి ప్రణయ ద్యోతకములుగానే యున్నను నన్ను ముట్టఁగనే నీవు మరణింతు వను సుందరమైన ధ్వన్యర్థమును గూడ వెల్లడించుచున్నవి. ద్రౌపదిని వెంటనంటు కీచకునిఁ గాంచి భీముఁ డాగ్రహోదగ్రుఁడై యొకయున్నతవృక్షంబు వీక్షించి ధర్మతనయుఁ గన్గొనిన నతఁడు తననయనాకారంబున వారించి

వలలుం డెక్కడఁ జూచె నొండెడ ననేవ్యక్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై పరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గలయీభూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్ విరా. ౨-136

అని పల్కెను. ఇం దావృక్షము లాగి కీచకుని దాఁకవద్దను వ్యంగ్యార్థ మున్నది. తరువాత ధర్మరాజు ద్రౌపదిని జూచి "తెఱవ యింక మానక యీపలుమాట లాడఁగనేల చనుము నీవు సుదేష్ణసదనమునకు, నీపరాభవమునఁ

గోపింపనేరరే గంధర్వులకుఁ దఱి గాదు గాక" యని హెచ్చరించెను. అప్పటి కిని ద్రౌపది యచ్చటనుండి చనక యేదోపలుకఁ దొడంగ ధర్మరాజు

పలువోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపుచాడ్పున నిచటం
గులసతులగఱువచందము
తొలఁగఁగ ని ట్లునికి తగునె తోయజవదనా !

అని పలికెను. అప్పుడు ద్రౌపది

"నాదువల్లభుండు నటుఁ డింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారు
గానఁ బతులవిధమయే శైలూషిఁ
గానసంగరాదు కంకభట్ట

అట్లగుటంజేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతిశైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కడి" దని సమాధాన మొసంగెను. ఈపల్కు లన్నియు సాభిప్రాయములును వ్యంగ్యపూరితములునై యున్నని. సంజయుఁడు ధర్మజుని గాంచి "మీపెదతండ్రి అనుజులు నీవును ద్రోవదియును బుత్రచయమును క్షేమముగా నున్నసంగతి తెలిసికొని రా నన్నుఁ బంపె నని పలుక ధర్మరాజు

ఆరాజు మాదెసం గల
కారుణ్యము కతమునను సుఖంబున ని ట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన
గారవమున నాదుమది వికాసము పొందెన్ ఉ ౧-276

అని సమాధాన మిచ్చెను. ఈసమాధానము వ్యంగ్యార్థసంభరితమై యొకవంక తిక్కనయొక్కయు నింకొకవంక ధర్మజునియొక్కయు వాక్చాతుర్యమును జాటుచున్నది. సంజయుఁడు ధృతరాష్ట్రునితో ధర్మజుఁ డెవ్వరిం గొని యెత్తి వచ్చునో తెల్పుచు

బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిణుఁ గీ
చకనిర్మూలనకేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రు బ్రతివ్యూహదా
హకు భీముం గొనివచ్చు ధర్మజుఁడు బాహాటోపమున్ జూపఁగన్

అని చెప్పుటలో భీముఁడు దుర్యోధనునిగూడఁ జంపునను నభిప్రాయ మున్నది. బకహిడింబకీచకదుర్యోధను లొక్కరిచేతనే చత్తురను విషయమును బురస్కరించుకొని చూచిన నిందలి ధ్వని వ్యక్తమగును. ఈవిధముగా తిక్కన తన

రచనలోఁ గావ్యమున కాత్మయైన ధ్వనిని బలుచోట్లఁ బ్రయోగించి దాని కపార మైన సౌందర్యము నాపాదించియున్నాఁడు.

విరాటపర్వారంభమున తిక్కన "కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావలి మోదముం బొరయునట్లుగ" భారతము రచింతునని చెప్పియుండెను. ఆంధ్రావళి యనుపదమున విద్వాంసులనే కాక సామాన్యులైన తెలుఁగువారిని గూడ సూచించుచున్నది. అట్టివారుసైతము తనభారతమును జదివి యానందింపవలె నన్న నతఁడు నన్నయవలె సంస్కృతభూయిష్ఠమైన శైలిని గాక సర్వసుబోధములైన పదములతోఁ గూడిన దేశితెలుఁగును వాడ వలయును. అందుచేతనే యతఁడు సాధారణముగా జాతీయములును భావవ్యక్తీ కరణసమర్థములునైన యలఁతియలఁతితెలుఁగుపదములనే వాడుచుండును. క్లిష్టములు గూఢములు నైన ఆధ్యాత్మికవిషయములను గూడ స్పష్టముగా వ్యక్తముచేయుశక్తి తెలుఁగుపదములకుఁ గల దని తిక్కన భారతము గొంతెత్తి చాటుచున్నది. శైవకవులు దేశిరచన నభిమానించియుఁ దమకావ్యములలో సంస్కృతపదములను విరివిగా వాడియుండిరి. తిక్కనరచనలో మాత్రము రమ్యమైన దేశితనము సర్వతోముఖముగా గోచరించుచుండును. ఇట్లని యాతఁడు సంస్కృతసమాసముల నసలు వాడక యుండలేదు. అతనిశైలి రసోచితముగా నుండును. అతఁడు రౌద్రభయానకాదులను వర్ణించునప్పుడు తత్తద్రసానుకూలముగా దీర్ఘసమాసములను వాడును. "దుర్వారోద్యమబాహు విక్రమరసాస్తోకప్రతాపస్ఫురద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్; భీష్మద్రోణకృపాదిధన్వినికారాభీలంబు పక్షివ్యాకులమున్ బరేతనిలయోపాంతోత్థమున్" మున్నగుపద్యములు సమాసజటిలములును బరుషాక్షరఘటితములునై యచ్చటిరసములను జక్కగా వ్యక్తముచేయుచున్నవి. కీచకుఁడు ద్రౌపదిని వెంటనంటునప్పుడు భీముఁడు

కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల నంగముల్
కనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటధాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తియై

విజృంభించె ననుపద్యము రౌద్రమూర్తియై పండ్లు పటపట కొఱుకు భీముని పాఠకులకుఁ బ్రత్యక్షము చేయుచున్నది. శృంగారకరుణాదిరసములను వర్ణించు పట్ల నతనిరచన యలఁతియలఁతితెలుఁగుపదములతోఁ గూడి లలితమంజుల

ముగా నుండును. "లలితంబులగు మట్టియలచప్పు డింపార నంచకైవడి నడ నల్లవచ్చి - కడుఁబసిబిడ్డ పీఁడొకటి కా దవునా నెఱిఁగండు - ఇది కడు ముద్దరాలు పను లేమియుఁ జేయనేరదు" - మున్నగుపద్యము లిందుకుఁ దార్కాణములు. సంస్కృతాంధ్రములు రెండింటఁ గావ్యరచనాదక్షుఁడై యుండుటే కాక రసానుగుణముగా సంస్కృతాంధ్రపదములను, మార్గదేశీపద్ధతులను అవలంబించుట కూడ నతనియుభయకవిమిత్ర బిరుదము నన్వర్థ మొనరించుచున్నది. నిర్వచనోత్తరరామాయణారంభమున నతఁడు సంస్కృతశ్లోకమునే వ్రాసినను విరాటపర్వమును 'శ్రీయన గౌరినాఁ బరఁగు' పద్యముతోనే ఆరంభించెను.

తిక్కన శబ్దార్థాలంకారములకై యెచ్చటను యత్నించియుండలేదు. అతనిరచనలో నవి యెడనెడ నప్రయత్నసిద్ధములై యింపు నింపుచుండును. "సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండ- సింగం బున్న గుహానికేతమునకున్ శీఘ్రంబుగా వచ్చు మాతంగంబుం బురుడించుచున్ (విరా. ౨-380)-బెబ్బులియున్న పొదరు లేఁడిచందంబున-మున్నగునవి తిక్కనరమణీయసమాసఘటనమునకు నిదర్శనములు. ఇట్లే యతనిరచనలో నక్కడక్కడ రూపకోత్ప్రేక్షార్థాంతరన్యాసాదులును గోచరించుచుండును. సాభిప్రాయపదప్రయోగమున నతఁడు చాలనిపుణుఁడు. "సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుబోఁడి వెంటఁ గడువడిఁ దగిలిన" యనుచోట కీచకుని సింహబలుఁ డనియు ద్రౌపదిని జిగురుబోఁడి యనియుఁ జెప్పుట సాభిప్రాయమై యౌచిత్యశోభితముగా నున్నది. విరాటుఁడు దక్షిణగోగ్రహణసమయమున భీముఁడు ప్రదర్శించిన పరాక్రమమును ప్రశంసించుచు, "మంటయుఁ బోని శాత్రవసమాజము నించుకయేని శంకలే కంటఁగఁ దాఁకి వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి యీవంటలవాని చేసిన యపారపరాక్రమ మెండుచోటులం గంటిమె వింటిమే" (విరా. 3-229) అని చెప్పిన పద్యమున శత్రుసమాజమును మంటతోఁ బోల్చి భీముని వంటలవాఁ డనుట యాతఁ డాశత్రువుల నెంతయవలీలగాఁ దాఁకి పరిమార్చెనో స్పష్టముచేయుచున్నది. తిక్కన సాధారణముగా కథాకథనమునకును యుద్ధాదివర్ణనములకును సంభాషణములకును వచసమును వాడుచుండును అతని యుద్ధవర్ణనవచనము లుపమాలంకారములతోడను క్త్వార్థకక్రియలతోడను గూడి దృశ్యమును పఠితలకన్నులకుఁ గట్టుచుండును. వచనమునసైత మరుదుగా మాత్రమే యాతఁడు శ్లేషను అర్థాలంకారములను వాడియుండెను.

తిక్కనయొక్క స్త్రీపర్వమునఁ దప్ప మిగిలినపర్వములలో వృత్త

వైవిధ్యము నంతగాఁ బ్రదర్శించియుండలేదు. ఆద్యంతకరుణ రసభరితమైన స్త్రీపర్వమున మాత్ర మతఁడు తద్రసానుగుణముగా గీతికాప్రాయములైన పెక్కు వృత్తములను బ్రవేశపెట్టి యుండెను. సాధారణముగా నతఁడు చంపకోత్పల శార్దూలమత్తేభాది వృత్తములను, కందములను, ఉపజాతులను వాడుచుండును. అచ్చటచ్చట వీరరౌద్రములను స్ఫురింపఁజేయుటకై స్రగ్ధరామహాస్రగ్ధరలను వాడుటయుఁ గలదు. అతఁడు వర్ణనములకు సీసములను, వీరరౌద్రరససందర్భములందు శార్దూలమత్తేభములను, శృంగారకరుణరససందర్భములందు చంపకోత్పలమాలలను వాడుచుండును. నీతిధర్మబోధ కతఁడు ప్రాయికముగాఁ గందములను రచించును. అతనికందపద్యములు సాధారణముగా నెవ్వరిని మెచ్చని కవిచౌడప్ప ప్రశంసకుఁ బాత్రములైనవి. ఉద్యోగపర్వమున విదురుఁడు ధృతరాష్ట్రునకు నీతులు తెల్పునపుడు తిక్కన రచించిన కందములు సంక్షిప్తతకును శక్తిమత్తకును దావలములై సర్వాంధ్రజనులమన్నన లందుకొన్నవి.

తిక్కన హరిహరనాథుని కంకితముగాఁ బదునైదుపర్వములును జెప్పి "హరిహరనాథ సర్వభువనార్చిత న న్దయఁజూడు మెప్పుడున్" అను వేడికోలుతో ముగించెను. హరిహరనాథునిదయచే నతఁడు భారతము రచించుటయు నతని భారతరచనచే శివకేశవాద్వైతరూపమైన హరిహరనాథతత్త్వము లోకమున ప్రచారము పొంది ద్వేషవైషమ్యములను దొలఁగించి శాంతిని నెలకొల్పుటయు జరిగెనని జెప్పవచ్చును. తిక్కన హరిహరనాథునిగూర్చి ఆశ్వాసాద్యంతములందుఁ జెప్పినపద్యము లాతనిభక్తిని తత్త్వపారీణతను వ్యక్తముచేయుచున్నవి. ఆదేవునిపాదారవిందములసేవనభావనములచే నతఁడు పొందినయానందమునకు మేరలేదు. అందుచేతనే అతఁడు కొన్నియాశ్వాసములచివరిపద్యముల నానందపదలాంఛితములఁ గావించెను. 'విశ్వశ్రేయఃకావ్య' మ్మను జగద్ధితబుద్ధితో మహాభారతమును రచించి కృతకృత్యుఁడైన మహాకవి తిక్కన. అతనివిషయమున కవిత్వ మొకతపస్సు. ఆతపస్సుచే తన్నేకాక లోకమును గూడఁ బవిత్రము గావించి ధర్మచైతన్యమును బ్రసరింపఁజేసిన పుణ్యమూర్తి యామహనీయుఁడు. అతఁ డొకవిధముగాఁ దాను గావ్యమున వర్ణించిన భీష్మద్రోణులను బోలినవాఁడు. ఆదర్శమానవగుణము లాతనివ్యక్తియందును ఆదర్శకవితాగుణము లాతనికావ్యమునందును మూర్తీభవించియున్నవి. ఆగుణగణములనే కేతన దశకుమారచరితమున నిట్లు వర్ణించియుండెను_

సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన
    వీఁడను నాలుకకుఁ దొడవైనవాఁడు
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన
    వీఁడను శబ్దమున కర్థమైన వాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన
    వీఁడని చెప్పుటకుఁ బాత్ర మైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన
    వీఁడని చూపుటకు గురియైనవాఁడు
మనుమసిద్ధిమహీశసమస్తరాజ్య
భారధౌరేయుఁ డఖిలరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యకూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

# పాల్కురికి సోమనాథుడు

## —శ్రీ గడియారం రామకృష్ణ శర్మ

మ. వరసర్వజ్ఞశిఖామణిన్, బ్రథితసద్వారప్రమోదాకరున్,
నిరతోద్యచ్ఛివధర్మసంచరుఁ, గళానీకాంచితావాసు, భా
స్వరలింగాన్వితదేహు, సర్వవిబుధవ్రాతామృతాధారు, భా
సురపాదున్, గళితారిఁ, బాల్కురికివంశ్యున్ గొల్తు సోమాహ్వయున్.

(చెన్నబసవపురాణము - అత్తలూరి పాపయామాత్యుఁడు)

### ౧. ఉపక్రమణిక

తత్త్వవిద్యాకలాపకవితాసార, అన్యవాదకోలాహల, ప్రత్యక్షభృంగీశావతార, జైనమస్తకవిన్యస్తశాతశూల, కలితబిజ్జలతలగుండుగండ, సంగీతశాస్త్రపారగ, చతుర్వేదపారంగతాది బిరుదవిభ్రాజితు డగు మహాత్ముడు పాల్కురికి సోమనాథుడు. ఆమహాకవిమూర్ధన్యుని దివ్యచారిత్రసంస్మరణమే నేటిప్రసంగోద్దేశము.

ఆంధ్రసాహిత్యచరిత్రలో నొకయుగకర్తయై అప్రతిమప్రతిభాసముద్భాసియగు పాల్కురికి సోమనాథమహాకవిచరిత్రము తెలుగువారిదురదృష్టమువలన వివాదగ్రస్తమై యున్నది. ఆదికవి యగు నన్నయభట్టారకునిజీవితచరిత్రము గూడ అజ్ఞాతమై యున్నది. అంతకంటెను ఈకవిచరిత్ర అజ్ఞాతము. సోమనాథునికాల మేది ? ఆయన ఎచట జన్మించెను ? కులగోత్రము లెట్టివి ? మాతాపితరు లెవరు ? అను ముఖ్యాంశములనుగురించి పలువురువిద్వాంసులు చర్చించి బహువిధాభిప్రాయములను ప్రకటించినారు. ఆయనప్రతిభాపాండిత్యములు మాత్రము స్వీయరచనలవలన విశదమగుచున్నవి.

పాల్కురికి సోమనాథునిగూర్చి తెలిసికొనుటకు ఇంతవరకు లభించిన ముఖ్యాధారములు నాలుగు. (౧) సోమనాథునికృతులు, (౨) పిడుపర్తి సోమనాథుని పద్య "బసవపురాణము", (౩) కన్నడభాషలో తోంటద సిద్ధలింగకవి రచించిన "పాల్కురికి సోమేశ్వరపురాణ", (౪) ఏకామ్రనాథుని "ప్రతాప చరిత్రము" అనునవి. వీనిలో పద్యబసవపురాణకర్త పిడుపర్తి సోమనాథుడు పాల్కురికి సోమనాథునకు ప్రియశిష్యుడైన శివరాత్రి కొప్పయకు ఆరవతరము వాడు; సోమనాథునియందు అపారభక్తిభావము గలవాడు. ఇతడు సుమారు క్రీ. శ. 1520 ప్రాంతమువాడు. సోమనాథుని ద్విపదబసవపురాణమును తండ్రి ఆనతిచే పద్యరూపమున రచించి పాల్కురికి సోమనాథునకే సమర్పించెను. గ్రంథావతారికలో కృతిపతిప్రశంసలో అతడు చెప్పిన విషయములే చరిత్రకారు లందరికిని చర్చనీయాంశములైనవి.

కన్నడకవి తోంటద సిద్ధ లింగార్యుడు క్రీ. శ. 1560 ప్రాంతమువాడు. పిడుపర్తికవికి ఇంచుమించు సమకాలికుడు. అతడు చెప్పినవిషయములనే విశదీకరించెను. మూడవవాడగు ఏకామ్రనాథుడు 14వ శతాబ్దమువాడు. అతడు తన 'ప్రతాపచరిత్రము'లో కాకతీయచక్రవర్తుల చరిత్రను చెప్పుచు సోమనాథ కవినిగూర్చి గూడ కొన్నివిషయములను చెప్పి పిడుపర్తికవివాక్యములను బలపరిచెను. కొందరు ఆంధ్రకర్ణాటకవులు చేసిన సోమనాథునిప్రశంసలు గూడ కొంత ఉపకరింపగలవు.

పిడుపర్తి సోమనాథుడు చెప్పిన క్రిందివిషయములే ప్రామాణికములుగా గ్రహింపబడినవి.

"ఒకనాడు కొందరుశివభక్తులు ఓరుగంటిలోని స్వయంభూదేవుని మంటపములో బసవపురాణమును వినుచుండిరి. ఆసమయమున శివదర్శన మునకై ప్రతాపరుద్రమహారాజచటకు వచ్చెను. ఆజనులసంబర మేమి ? అని ప్రశ్నించెను. ఒకభక్తుడు లేచి ఇచట బసవపురాణశ్రవణము జరుగుచున్న దని చెప్పెను. ఇ దేమి పురాణ మని రాజు ప్రశ్నింపగా ఒకధూర్తవిప్రుడు లేచి పాల్కురికి సోమపతితుడు మన్యవశ్ను బెట్టి ద్విపదలో వ్రాసిన క్రొత్తపురాణ మిది అప్రమాణము, అనాద్యము అని చెప్పగా రాజు నగరికిపోయె నట. అంత శివభక్తు లాగ్రహించి పాల్కురికికి పోయి సోమనాథునకు సంగతులు నివేదించి ఆబ్రాహ్మణుని చంపుటకు ఆనతి నిమ్మనిరి. సోమనాథుడు పరిస్థితులు గ్రహించి ఇప్పు డూరకున్నచో శివభక్తులకు అవమానము జరుగు నని భావించి

భవితో వివాదము కూడని దైనను తనమహిమచేత ఒకసామాన్యునితో ఆ బ్రాహ్మణులను పరాభూతుల గావింప సంకల్పించెను. వెంటనే అంగముద్రలు గల ఎడ్లను పూన్చిన గుడారుబండిపై నెక్కి ఓరుగంటికి బయలుదేరెను. సోమనాథునిరాకను విని కొందరుబ్రాహ్మణులు ఊరిలోనిదుండగులను, మొండివారిని చేరబిలిచి వారికి ఉల్లిగడ్డలను లింగములుగా కట్టించి విభూతిరుద్రాక్షధారణ చేయించి ఎదురుపంపిరి. ఆవేషధారులు వినయము నటించుచు వచ్చి సోమనాథునకు నమస్కరించిరి. ఆయన మహిమవలన కృత్రిమచిహ్నములన్నియు సత్యములై వారు నైజశివభక్తులుగా మారిపోయిరి. వారందరితో గలిసి ఓరుగంటి గవనిదగ్గరకు రాగా ఎడ్లు ముందుకు పోక నిలిచిపోయినవి. సంగతేమని విచారింపగా గవనిమీద గజలక్ష్మివిగ్రహము చెక్కబడియున్నట్లు తెలిసెను. సోమనాథుడు దానిని తొలగిపొమ్మని చెప్పగా అది విరిగి క్రిందపడెనట. తరువాత ఎడ్లు లోనికిపోయినవి. ఈఅద్భుతవార్తలు తెలియగనే ప్రతాపరుద్ర మహారాజును, బ్రాహ్మణులును భయముచెంది ఎదురుగా వచ్చి సాగిలిమ్రొక్కిరట. ఆయన వారి ననుగ్రహించి పంపి శివభక్తులతో కొంతకాలము గడపెను. కాలత్రయవేదియైన సోమనాథుడు ఆగామికార్యకౌశల్యంబు నెరింగి పిడుపర్తి శివరాత్రికొప్పయ్య ఆదిగా గల తమశిష్యుల నందర బిలిచి "ఈ దేశం బింక తురుష్కులచే నాక్రాంతంబు కాగలదు. మాబోటి నియమవ్రతుల కిం దునికి పొందు పడదు" అని వారికి చెప్పి మీకీరాజ్యములో వసించుటకై ఒకగ్రామము నిప్పించెదను. అట నుండు డని పల్కి తనశిష్యుడును, ప్రతాపునిమంత్రియు నైన ఇందులూరి అన్నమంత్రిని పిలిపించికొని "నీవు మాకు ప్రియభక్తుడవు ; శివారాధనతత్పరుడవు. కావున మావ్రతస్థుల కొకగ్రామమును మీరాజుతో చెప్పి ఇప్పింపుము" అని ఆజ్ఞాపించగా అతడు మహాప్రసాద మని ప్రతాపరుద్రునిచే దోకపఱ్ఱును అగ్రహారముగా ఇప్పించెను. అరువదిముగ్గురుభక్తు లందు నిలిచిరి. సోమనాథుడు తనభక్తులతో గలిసి కన్నడదేశమునకు పోయి అచట కొన్నాళ్ళుండి ఇక తనకు కాల మాసన్న మైన దనియు, సమాధిస్థుడ నయ్యెద ననియు శిష్యులకు తెలిపి, శివగంగచెంగట గల 'కల్కె' మను గ్రామము చేరుకొనెను. అచట భూమిలో సమాధి కట్టించికొని అందు ప్రవేశించి యోగనిష్ఠతో నిర్వికల్ప సమాధి నుండెను. ఈశ్వరుడు సాక్షాత్కరించి ఆయన కోరినట్లు భక్తులకు కొన్నిమహిమలు జూపి సోమనాథుని కైలాసమునకు గొనిపోయెను. అన్నమంత్రి ఇప్పించిన దోకిపఱ్ఱు అగ్రహారమునకు శివరాత్రి కొప్పయ్య మనుమడగు

పెదసోమయ్య కాలమున బాధ ఏర్పడగా అతడు ప్రౌఢదేవరాయల సాయమున తిరుగ సంపాదించెను."

పిడుపర్తి సోమనాథుడు చెప్పిన ఈవిషయములే పాల్కురికి సోమనాథుని స్థలకాలములను కొన్నిజీవితవిశేషములను తెలిసికొనుటకు ముఖ్యాధారములు. వీనినే విద్వాంసులు పలువురు ప్రామాణికములుగా చర్చించి వివిధనిర్ణయములు చేసినారు. ఇతరుల గ్రంథములలోని బహిః ప్రమాణములను, స్వయముగ సోమనాథుడే రచించిన అనుభవసార, చతుర్వేదసార, బసవపురాణ, పండితారాధ్య చరిత్రాది గ్రంథములలోని అంతస్సాక్ష్యములను ముఖ్యాధారములుగా గ్రహించి ఈమహాకవి జీవితవిశేషములను, సాహిత్యవిశేషములను తెలిసికొందము.

## ౨. జీవితవిశేషములు

**కాలము :**

ఇతనికాలమునుగూర్చి పండితులు వివిధాభిప్రాయములు వెల్లడించిరి. రుద్రదేవునికాలమువాడని (12 వ శతాబ్దము) కొందరు, గణపతిదేవునికాలమువాడని కొందరు, ప్రతాపరుద్రదేవునికాలపువాడని పలువురును నిర్ణయించిరి. ఉపలభ్యములైన ఆధారములనుబట్టి సోమనాథుడు కాకతీయచక్రవర్తులలో చివరివాడైన ప్రతాపరుద్రునికాలమునందే ఉండెనని చెప్పవచ్చును. ఈకాలనిర్ణయమునకు పిడుపర్తి సోమన పద్యబసవపురాణములో చెప్పిన వృత్తాంతములే ముఖ్యాధారములు.

(1) ఒరుగంటిలో బసవపురాణశ్రవణసందర్భమున సోమనాథుడు స్వయముగ ప్రతాపరుద్రుని చూచుట.

(2) ఇందులూరి అన్నమంత్రి డోకిపఱ్ఱు అగ్రహారము నిప్పించుట.

(3) స్వల్పకాలమునకే ఓరుగంటిసీమను తురుష్కులాక్రమించుట.

(4) బాధితమైన అగ్రహారమును ప్రతిగ్రహీత మనుమడు ప్రౌఢదేవరాయల సాయమున మరల సాధించుట.

పాల్కురికి సోమనాథుడు ప్రతాపరుద్రునికాలపువాడైనప్పుడే తక్కినఘటనలు సరిపోగలవు. డోకిపఱ్ఱును ఇప్పించిన ఇందులూరి అన్నమంత్రి రుద్రమదేవి కుమార్తె రుయ్యాంబకు భర్త. ప్రతాపరుద్రుని పినతల్లికిమగడు. అతడు రుద్రమదేవికాలముననను, ప్రతాపరుద్రునికాలముననను మంత్రిగా దండనాథుడుగా ఉండెను. ఇతనిశాసనములు కొన్ని ప్రకటింపబడినవి.

(1) క్రీ. శ. 1291 లో 'త్రిపురాంతకము'నందు అఖండదీపారాధనకై ఇందులూరి అన్నమంత్రి 50 ఆవులను దానమిచ్చి వేయించినశాసన మున్నది.

(2) 1293 లో 'ద్రాక్షారామము'నందు ఈఅన్నయమంత్రి స్వామికి 50 నిష్కములను దానమిచ్చిన శాసనము కలదు.

(3) 1317 లో 'పలివెల'లో ప్రధాని అన్నయప్రెగడకు పుణ్యముగా ఒకసామంతుడు వేయించిన శాసన మున్నది.

ఒరుగంటిసీమను చివరిసారి దండయాత్రలో 1323 సంవత్సరమున తురుష్కులు ఆక్రమించిరి. కావున 1291-1323 సం॥ నడుమ ఓరుగంటిసామ్రాజ్యము నేలిన కడపటి కాకతీయచక్రవర్తి ప్రతాపరుద్రదేవునికాలమునందే పాల్కురికి సోమ నాథుడు ఉండెననియు 1320 ప్రాంతమున కన్నడదేశమునకు పోయెననియు నిర్ణయింపవచ్చును. డోకుపట్టును గ్రహించిన శివరాత్రి కొప్పయ మనుమడు పెద్దసోమయ్య చివరికాలమున ఆగ్రహారము అంకిలిపడగా దేవరాయల సాయము పొందినాడుగదా. ఈదేవరాయలు విజయనగరరాజులలో రెండవహరిహరరాయల అనంతరము 1404-1422 సం॥ నడుమ రాజ్యము చేసినవాడు. కావున ఇదికూడ పైనిర్ణయమును సమర్థించుచున్నది.

**సమకాలిక పరిస్థితులు :**

సోమనాథుడు కాకతీయసామ్రాజ్యావసానకాలమున నుండెను. అప్పటి పరిస్థితులను గమనింతము. కాకతిరాజులలో మొదటివారు జైనమతాభిమానులై యుండిరి. 12 శతాబ్దమున బసవన-పండితారాధ్యులకాలమునుండి కాకతిరాజులు శైవపక్షపాతులైరి. వీరికి పాశుపతశైవాచార్యులు గురువులుగా నుండిరి.

ఆకాలమున శ్రీశైలక్షేత్రప్రభ ఇనుమడించెను. అనేకశైవమఠములు వెలసినవి. అప్పటిమఠములలో ప్రసిద్ధిగాంచినది గోళకీమఠము. ఈమఠాధిపతి విశ్వేశ్వరశివాచార్యులు. రుద్రమదేవి 1261 లో ఈఆచార్యునకు గుంటూరు జిల్లాలోని 'మందడము'ను అగ్రహారముగా సమర్పించెను. అందు గోళకీ మఠము స్థాపించబడినది. ఈమఠమునకు త్రిపురాంతకమున, పుష్పగిరిలో మరికొన్నిస్థలములలో శాఖ లేర్పడినవి. ఈఅన్నిమఠములలో పనిచేయువా రందరును శివభక్తులు. ప్రతిమఠమునకును వేదశాస్త్రవిద్యాశాల, నిరతాన్నదాన సత్రము, ప్రసూత్యారోగ్యశాలలు అనుబంధములుగా నుండి జనసేవ చేయు

చుండెను. పరిచారకులు శివార్పణముగా తమజీవితముల నంకితము చేసిన వారు. వీరిని వీరభద్రు లనియు, మైలారువీరభటు లనియు పిలుచుచుండిరి. బసవేశ్వర-పండితారాధ్యాదులచే నూతనముగా ప్రచారము చేయబడుచుండిన వీరశైవము ప్రజాదరణము నందుచుండెను. ఈసందర్భములో ప్రాచీనపాశుపత శైవమును, నవీనవీరశైవమును గూర్చి కొంత తెలిసికొనవలెను.

పాశుపతశైవము మహాభారతకాలమునాటికే ప్రసిద్ధిగాంచి యుండెను. ఆప్రాచీనశైవమున వర్ణాశ్రమవ్యవస్థ యుండినది. స్త్రీశూద్రులకు పాశుపతదీక్ష నిషేధము ఉండెను. "మూత్రపురీషం నావేక్షేత్, స్త్రీ శూద్రం నాభిభాషేత్, యద్యవేక్షేత్, యద్యభిభాషేత్, ఉపస్పృశ్య, ప్రాణాయామం కృత్వా, రౌద్రీం గాయత్రీం, బహురూపీం వా జపేత్" (పాశుపతసూత్రములు 1—13-14) ముండక-అధర్వశిఖోపనిషత్తులలో ఈమతము శిరోవ్రతము, మహావ్రతము, అని పేర్కొనబడినది. షడ్దర్శనములలోని వైశేషిక-న్యాయదర్శనకారులగు కణాద-గౌతమమహర్షులు పాశుపతమాహేశ్వరులై యుండిరట. ఉజ్జయినీమహాకాళునిపూజకులై ఉండుటవలన వీరిని కాలాముఖులని వ్యవహరించిరి; లకులీశ్వరసంప్రదాయము నవలంబించుటవలన లాకులు రని పేర్కొనబడిరి. ఈమతమునకు ఆంధ్రకర్ణాటకదేశములలో శ్రీశైలము, కాళహస్తి, ఓరుగల్లు, నంది, బెల్గామ్, హూలి మొదలైనస్థలములు కేంద్రములుగా ఉండెను. ఎందరో కాలాముఖాచార్యులు రాజగురువులై యుండిరి. వీరినామములచివర 'దేవ-పండిత-రాసి-శక్తి-జీయ-శివ-గౌరవ-వ్రతి-ముని' మొదలైన ఉపనామము లుండెడివి. శాసనములలో వీరు "స్నానజపహోమనియమధ్యానానుష్ఠానశీల తత్పరులు, కౌపీనమౌంజీధరులు, రుద్రాక్షాలంకృతులు, జంగమలింగావతారులు, లాకులాగమసమయసముద్ధారకులు" అని వర్ణింపబడినారు. ఈ పాశుపతశైవము క్రమముగా మార్పుచెంది కర్మదూరము భక్తిప్రధానము అయిన వీరశైవముగా పరిణమించెను.

వీరశైవధర్మము ఎప్పు డారంభమయ్యెనో సరిగా చెప్పదగిన ఆధారములు లభింపలేదు. ఆసంప్రదాయ గ్రంథములు కొన్నిటిలో ఈధర్మము పంచాచార్యుల నుండి ఉద్భవించెననియు, మరికొన్నిటిలో బసవేశ్వరునినుండి వెలువడెననియు చెప్పబడినది. పంచాచార్యులలో రేవణసిద్ధ,పండితారాధ్య, మరుళసిద్ధ, ఏకోరామ, విశ్వారాధ్యు లున్నారు. వీరిలో రేవణసిద్ధ, పండితారాధ్య, ఏకోరామాదులు 11-12 శతాబ్దములం దుండిరి. బసవేశ్వరునికాముగూడ 12వ శతాబ్దమే. వీరందరును

ఈధర్మప్రసారణమునకు విశేషముగ కృషిచేసినారు. వీరికి 1 శతాబ్దముముందే శివశరణులు వీరశైవమతమునకు ప్రాతిపదిక వేసినట్లు ధర్మగ్రంథములు చెప్పు చున్నవి. జేడరదాసిమయ్య - శంకరదాసిమయ్య, సుగ్గలదేవి మొదలైనశివశర ణులు పశ్చిమచాళుక్యజయసింహుడు 11వ శతాబ్దమున పటంచెరువును పాలించు చున్నపుడు ప్రసిద్ధి గాంచియుండిరి. ఈశరణులందరికిని మకుటాయమానుడు అల్లమప్రభుడు. ద్రావిడదేశమునందు 7వ శతాబ్దమున శైవమతప్రచారము చేసిన అప్పర్ - తిరుజ్ఞానసంబంధనాయనార్ - సుందరమూర్తినాయనారు మొదలైన శివభక్తులప్రభావము కన్నడదేశమున నుదయించిన వీరశైవముపై పడినది. ఈనాయనారులు అరువదిముగ్గురు. వీరందరును అనేకస్తోత్రములను రచించి శైవమును జనసామాన్యమున ప్రచారముచేసినారు. వీరిచరిత్రమును 11వ శతాబ్దమునం దుండిన 'శేక్కిళారు' 'పెరియపురాణము' అనుపేర తమిళములో రచించెను. వీరినే పురాతనభక్తు లనెదరు. వీరు లింగధారులు కారు. మహా శివభక్తులు. పెరియపురాణమునందలి నాయనారులచరిత్రలను కన్నడకవులైన హరిహర-షడక్షరి మొదలైనవారు కావ్యములుగ రచించిరి. పాశుపతమునందలి వర్ణవ్యవస్థ, వైదికకర్మకాండ మొదలైనవానిని తొలగించి వీరమాహేశ్వరాచార వ్రతదీక్షతో శైవమును సంస్కరించినారు. కన్నడదేశమున శరణులు, బసవేశ్వరుడు, చెన్నబసవడు మొదలైనమహాపురుషులు,పంచాచార్యులు ఈవీరశైవమును ప్రచారము చేసిరి. బసవేశ్వరుడు బ్రాహ్మణుడయ్యును ఉపనయనసంస్కారమును తిరస్కరించి లింగధారణదీక్షను గ్రహించెను. ఆంధ్రదేశమున వీరశైవమును మల్లికార్జునపండితారాధ్య, శివలెంక మంచన, శ్రీపతి పండితులు ముగ్గురును ప్రచారముచేసిరి. వీరు వీరశైవధర్మము నామోదించిన ఆరాధ్యబ్రాహ్మణులు. వీరిసంప్రదాయమును ఆరాధ్యసంప్రదాయ మనెదరు. అందులో స్మార్తమార్గ మనియు, భక్తిమార్గ మనియు రెండుప్రధానవిధము లున్నవి. వీరు లింగమును, యజ్ఞోపవీతమును ధరింతురు. తీవ్రవాదులు యజ్ఞోపవీతమును తిరస్కరించి కేవలలింగధారణదీక్షనే పొందెదరు. శ్రీపతిపండితుడు తనశ్రీకరభాష్యమునందు వీరశైవతత్త్వముల నిట్లు చెప్పెను. "తాంత్రికశూలడమరుకశంఖచక్రాంక నిషేధపూర్వక, భస్మరుద్రాక్షధారణపూర్వక, నిగమాగమోభయవేదాంతప్రతి పాదిత భక్తిక్రియాజ్ఞానకాండత్రయవిహిత స్థూలసూక్ష్మచిదచిత్ప్రపంచప్రకాశ షట్స్థలపరశివసాక్షాత్కారకారణ, శరీరత్రయగతమలధ్వంసక, కారుణ్యా కల్యాణకైవల్యవిభూతిత్రయప్రదాయక, అష్టావరణ, పంచాచారసద్గురుకరుణా

కటాక్షలబ్ధ శక్తిపాతాద్యవచ్ఛిన్నపరశివేష్టలింగధారణాత్మకపాశుపతదీక్ష". ఈమత మును శక్తివిశిష్టాద్వైత మని పేర్కొన్నారు.

12 వ శతాబ్దమున బౌద్ధజైనములకృషిఫలితముగా వైదికకర్మకాండల ప్రభావము తగ్గియుండెను. బౌద్ధముగూడ రూపుమాసి యుండెను. జైనము నామమాత్రావశిష్టమైనది. శంకరాచార్యుల అద్వైతజ్ఞానము జనసామాన్యమునకు అందుబాటులో లేకుండెను. వర్ణవ్యవస్థ వెఱ్ఱితలలు వేసి దురహంకారపూరితమై యుండెను. శైవాచార్యులు లింగార్చనారూపమున శైవమును రక్షించుచున్నను తగినప్రోత్సాహము లేక నిస్తేజమై యుండెను. అప్పుడే తమిళదేశమున నాయనారులు శివభక్తిగీతముల నాలాపించుచుండిరి. ఆళ్వారులు, రామానుజులు ఉదయించి వైష్ణవభక్తిమతమును వ్యాపింపజూనిరి. జైనబౌద్ధములు కళాహీనములైనను వానిప్రభావమువలన ప్రజలలో కలిగినవైరాగ్యభావములు మాయలేదు. వైదికమతములు శుష్కాచారములలో పడిపోయెను. సంఘము ముక్కలు చెక్కలుగా నుండెను. కులమతభేదములు, నీచోచ్చభావములు, ప్రబలి ప్రజాహృదయములు సంక్షోభము నొందినవి. జాతి నిర్వీర్య మయ్యెను.

ఈపరిస్థితులలో నామమాత్రముగ నున్నఅవైదికజైనమతమును, కేవలాచారపరాయణులైన సనాతనవైదికులను ప్రతిఘటించుటకై బసవేశ్వరు డుదయించెను. అతడు ధార్మికక్షేత్రమున మహాక్రాంతికారకు డయ్యెను. ధార్మిక – సామాజికసంప్రదాయశృంఖలలనుండి ప్రజలను విముక్తుల నొనరించెను. అగ్రవర్ణములకే పరిమితమై యుండిన ముక్తిమార్గమును సకలజనులకును సంచారయోగ్యము చేసెను. దీనితో జనులందు నూత్నశక్తి సంచారిత మయ్యెను. కులాచార, మతాచారములు ధిక్కారము నందినవి. మద్యమాంసనిషేధము చేసి లింగధారణదీక్ష పొందిన జనులందరును తారతమ్యవిచక్షణారహితసహోదరులైరి. దేశమున వీరజీవన ముదయించెను. ఈమహావిప్లవమునకు ధార్మిక సామాజికస్వాతంత్ర్యమే ప్రధానలక్ష్యముగా నుండెను. ఈవిధముగా ప్రజాహృదయములన్నియు నుల్లోలకల్లోలములతో నిండి ఎటుగాంచిన ప్రతిఘటనము, నవసృష్టినిర్మాణము కనులబడజొచ్చెను. ఈమహోద్యమముచే ప్రభావితమైన పండితత్రయము ఆంధ్రదేశమున నూత్నధర్మప్రచార మొనర్చెను. బసవేశ్వరునకంటె పండితారాధ్యాదులు విద్వాంసులు, ప్రతివాదభయంకరులైనను జనసామాన్యము నుద్దీపింపజేయలేకపోయిరి. బసవేశ్వరునివలె మానవసంఘము నుత్తేజితులాగింపగల మహామహుడొకడు తెలుగుదేశమునకు అత్యవసరమై యుండెను.

**జన్మస్థలము :**

ఆ తరుణమున ఓరుగంటికి 12 మైళ్ళదూరమునందున్న జనగామ తాలూకాలోని నేటి పాలకుర్తి గ్రామమునందు సోమనాథుడు 13వ శతాబ్దాంతమున జన్మించెను. ఈ గ్రామముదగ్గరికొండపై సోమేశ్వరాలయ మున్నది. ఆస్వామిపేరునే సోమనాథునితలిదండ్రులు తమకుమారున కిడిరి. తోంటదార్యుడు తనసోమేశ్వరపురాణములో ఆంధ్రదేశమునందు శ్రీశైలక్షేత్రమునకు ఈశాన్యభాగమున పాల్కురికి ఉన్నదనియు అందు సోమనాథుడు పుట్టెననియు, ఆతని కాపేరు కొలనుపాకలోని సోమేశ్వరుని సేవవలన కలిగెననియు చెప్పినాడు.

సోమనాథుడు శిష్యులకు దాన మిప్పించిన 'దోకిపఱ్ఱు' సోమనాథుని గురువులలో నొకరైన పోతిదేవరనివాసస్థల మగు 'కట్టకూరు' గ్రామములు పాలకుర్తికి సమీపముననే యున్నవి. పిడుపర్తిసోమన చెప్పిన ఓరుగంటి గాథ కూడ పాల్కురికి ఓరుగల్లునకు సమీపమునందే ఉండవలె నని చెప్పుచున్నది. కన్నడకవిచరిత్రకారులు డి. యల్. నరసింహాచార్యులుగారును, రైస్‌దొరగారును పాలకురికి గోదావరిజిల్లాలో నున్నట్లు వ్రాసినారు. అది ప్రమాదపతితము కావచ్చును. మన ప్రసిద్ధ పరిశోధకపండితులందరును ఈ పాలకుర్తియే సోమనాథుని జన్మభూమి యని ఏకగ్రీవముగా ఆమోదించినారు. కాని కవితరంగిణికారులు చాగంటి శేషయ్యగారును, పండితారాధ్యచరిత్రపీఠికాకారులగు డా॥చిలుకూరు నారాయణరావుగారును ఈపాలకుర్తిని కాదని మైసూరు రాష్ట్రమునందలి తుమ్కూరుజిల్లాలోని "హాల్కురికె" గ్రామమునకు బలవంతముగా తీసికొనిపోయినారు. వారివాదములు దుర్బలములైనందున పరాస్తములైనవి. సోమనాథునిజన్మస్థలము మనపాలకుర్తి యనియే గ్రహింతము. తెలుగువారి ఆచారమునుబట్టి గ్రామనామము ఇంటిపేరు కాగా పాల్కురికి సోమనాథుడని ప్రసిద్ధిగాంచెను.

**కులగోత్రములు:**

సోమనాథుడు జన్మచే లింగధారి యగుఆరాధ్యబ్రాహ్మణుడై తరువాత వీరమహేశ్వరాచారవ్రతదీక్ష పొందెనని సాహిత్యచరిత్రకారులందరును నిర్ణయించిరి. కాని బండారు తమ్మయ్యగారు మాత్రము అతడు సహజవీరశైవులగు జంగములఇంట బుట్టె నని కొన్ని ఉపపత్తులను చూపినాడు. (చూ—పాలకురికి సోమనాథకవి).

సోమనాథునికులగోత్రములవలెనే ఆరాధ్యజంగమశబ్దములుగూడ వివాద గ్రస్తములైనవి. ఈరెండుశబ్దములును ప్రాచీనకాలమున కులవాచకములుగా వాడబడియుండలేదు. అరాధ్యశబ్దమునుగూర్చి

"ఆగమార్థానుసంధాతా, రాగమోహాదివర్జితః
ధ్యానజ్ఞానసమాయుక్తః, ఆరాధ్య ఇతి గీయతే"

అను నార్యోక్తి కానవచ్చుచున్నది. 'ఆగమార్థముల నెఱిగి ఆచరించువాడు, రాగమోహాదులు వదలినవాడు, ధ్యానజ్ఞానములతో గూడినవాడు ఆరాధ్యు డనబడు చున్నాడు' అని దీనిభావము. అట్లే జంగమశబ్దమునుగూర్చి

"జ్ఞానాత్యతిశయా ద్యోహి, శివం విశ్వప్రకాశకం,
స్వస్వరూపతయా సోహి జంగమః పరికీర్తితః"

'అతిశయమైనజ్ఞానమార్గమున వర్తించుచు విశ్వప్రకాశకుడైన శివుని స్వస్వరూపముతో దర్శించువాడు జంగము డనబడును.' వీరశైవధర్మగ్రంథమగు 'సిద్ధాంత శిఖామణి'

"భూతిరుద్రాక్షపాషాణలింగధారీ న జంగమః
లింగాంగసంగమజ్ఞానీ జంగమః పరికీర్తితః,"

'బాహ్యాడంబరములైన భూతిరుద్రాక్షలింగధారణములచేతనే జంగముడు కాడు. శివజీవైక్యజ్ఞానము గలవాడే జంగము డని పిలువబడును' అని చెప్పుచున్నది. మరియు వీరాగమమందు

"దేహజీవేశతత్త్వార్థబోధాయై ముక్తి మిచ్ఛతాం,
స్వస్వరూపోపదేశార్థం, జంగమోఽస్మి మహేశ్వరి"

అని చెప్పబడినది. " ఓ పార్వతీ ! ఎవరు దేహజీవేశ్వరతత్త్వార్థము నెరుగుటకై భవబంధములనుండి ముక్తిని గోరుచున్నారో వారికి స్వస్వరూపజ్ఞానము ఉపదేశించుటకై నేను జంగమరూపుడ నగుచున్నాను' అని భావము. దీనివలన సాక్షాత్శివుడే జంగము డని సిద్ధించును. ఆనాడు వీరశైవులలో క్వాచిత్కముగ ఆరాధ్యవ్యవహార ముండినట్లు కానవచ్చును. వీరశైవపంచాచార్యులలోని ఏకోరామారాధ్య, పండితారాధ్య, విశ్వారాధ్యపీఠములు మూడును ఆరాధ్యవ్యవహారముచేతనే ప్రసిద్ధిగాంచినవి. సాధారణముగా ఆరాధ్యపదము లింగయజ్ఞోపవీతములు రెండును ధరించినబ్రాహ్మణులకే వ్యవహారరూఢమై యున్నది. అట్లే శైవులైన బ్రాహ్మణులను జంగములని క్వాచిత్కముగ వ్యవహరించిరి. నన్నెచోడుని గురువు జంగమమల్లికార్జునుడు భూసురతిలకుడుగా కీర్తింపబడినాడు.

సాధారణముగా జంగమపదము సహజవీరశైవులగు మాహేశ్వరులకే రూఢమై యున్నది. క్రిందికారణములను పురస్కరించికొని సోమనాథుడు ఆరాధ్య బ్రాహ్మణుడుగా పుట్టి ఉపనయనసంస్కారమును తిరస్కరించి లింగధారణ దీక్ష గొన్నవాడని నిర్ణయింపవచ్చును.

(1) అతనిగ్రంథములైన పండితారాధ్యచరిత్ర, చతుర్వేదసార, సోమనాథభాష్యబసవపురాణాదులలో వేదోపనిషన్మంత్రముల నుదాహరించుట, బ్రాహ్మణేతరులకు సామాన్యముగ తెలియని వైదికశిష్టాచార వ్యవహారముల నెరిగియుండుట. తానే చతుర్వేదపారగుడనని తెలుపుకొనుట.

(2) ఆపస్తంబసూత్రుడు, హరితసగోత్రుడు, పండితారాధ్యచరిత్రశ్రోత అయిన సూరనామాత్యుడు ముద్దులమఱది, భావుకుడుగా సంబోధింపబడుట.

(3) వర్ణవ్యవస్థలేని వీరశైవమును స్వీకరించినను తనసోమనాథభాష్యమున శివప్రసాదమాహాత్మ్యము నుగ్గడించుచు "అశుద్ధాత్మాఽశుచిర్లోభా, న్మద్భుక్తం పావనంపరం, భక్షయ న్నాశ మాయాతి, శూద్రో హ్యధ్యయనాదివ॥" అని వ్రాసియుండుట. (వీరశైవదీక్ష పొందినచో అన్నివర్ణములవారును సమానులే కావున శూద్రుడు వేదాధ్యయనమునకు అనర్హుడు కాజాలడు).

(4) సోమనాథభాష్యమునందే గాయత్రీమంత్రము శివభక్తులకు దూష్యము కాదనియు గాయత్రీమంత్రాధిదేవత వైదికాచారపరు లను నట్లు సవితృడుగాక భర్గశబ్దవాచ్యుడైన పరమశివుడేఅనియు చెప్పియుండుట "ఇత్యాది శ్రుతిస్మృతిపురాణాగమేతిహాసవచన ప్రమాణాత్, సవితుర్వరేణ్యత్వాత్, ధియః ప్రేరకత్వాత్, శివవాచకత్వాత్, భర్గశబ్దవాచ్యః పరమేశ్వర ఏవ తథాదిత్యాదిదేవతాంతరం న భవతి, అత ఏత ద్గాయత్రీమంత్రాధిపతిః పరమేశ్వర ఏవ."

(5) బసవనిభక్తితన్మయత్వమున మునిగితేలుచున్న సోమనాథుడు బసవపురాణముతరువాత వైదికాచారములు పరిత్యజింపని ఆరాధ్యమహీసురుని ప్రస్తుతించుటకై పండితారాధ్యచరిత్రను రచించుట.

ఆయీకారణములవలన సోమనాథుడు ఆరాధ్యబ్రాహ్మణకుటుంబమున జన్మించియుండె నని చెప్పుటయే సమంజసము.

12వ శతాబ్దమున శైవము ప్రబలస్థితిలో నుండగా బ్రాహ్మణుడై జన్మించిన బసవేశ్వరుడు వైదికాచారపద్ధతిని పరిత్యజించి వీరమాహేశ్వరాచారవ్రతదీక్ష నొంది భక్త్యావేశముచే ఆమతమును సంపూర్ణచైతన్యవిలసిత మొనర్చెను. బసవనవలెనే ఎందరో బ్రాహ్మణులు ఆకాలమున బ్రాహ్మ్యమును వదలుకొని మాహేశ్వరు లైనారు. వారిసంతతివారు తరువాత జంగములుగా వ్యవహరింపబడిరి. బసవనకు సమకాలికుడైన పండితారాధ్యుని శివతత్త్వసారమును చదివి ప్రభావితుడై సోమనాథుడు భక్త్యావేశముచే గురులింగార్యుడగు మాహేశ్వరగురునిచే శివదీక్ష పొంది గురుగోత్రమగు భృంగిరిటి గోత్రమును స్వీకరించియుండును. కావుననే సోమనాథుడు బసవపురాణము రచించి భక్తిప్రధానమగు జంగమసంప్రదాయమును, పండితారాధ్యచరిత్ర రచించి వైదికమగు ఆరాధ్యసంప్రదాయమును ఆంధ్రదేశమున సమాన గౌరవముతో ప్రచారము చేసి చరితార్థుడయ్యెను.

**తలిదండ్రులు :**

సోమనాథుడు తనతలిదండ్రులనుగూర్చి పలువిధములుగ చెప్పికొన్నాడు. ఆయనకృతులలో మొదటిదిగా బహుజనాంగీకృతి బడసిన అనుభవసారమందు

> ''భృంగిరిటిగోత్రుడ(ను గురు
> లింగార్యతనూజుండ శివకులీను(డ దుర్వాశ
> సంగవివర్జితచరితు(డ
> జంగమలింగప్రసాదసత్పాత్రుండన్''

అని చెప్పినాడు. తరువాత బసవపురాణమున

> ''ధర నుమా మాతా పితా రుద్రు యనెడు
> వరపురాణోక్తి నీశ్వరకులజుండ
> భక్తకారుణ్యాభిషిక్తుండ(బాల
> ముక్తుండ గేవలభక్తిగోత్రుండ
> బ్రాజిష్ణు(గు విష్ణురామిదేవుండు
> దేజిష్ణు వగు శ్రియాదేవి యమ్మయును
> గారవింప(గ నొప్పు గాదిలిసుతు(డ
> వీరమాహేశ్వరాచార వ్రతుండ''

అని వ్రాసికొనెను. ఆపిదప బసవనభక్తివిశేషమై పూర్వకులగోత్రములు ఉచ్చరింపరా దన్నట్లే తలిదండ్రులపేర్లు చెప్పక పండితారాధ్యచరితమునందు

"ధర నుమా మాతా పితా రుద్ర యనఁగ
వరపురాణోక్తి నీశ్వరకులజుండ
బేరెక్కఁదగిన శ్రీబెలిదేవవేమ
నారాధ్యు లను పరమారాధ్యదేవు
మనుమనిశిష్యుఁడ మద్గురులింగ
ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ
మును బసవపురాణమున నెన్నఁదగిన
పెనుపారుజనులకు పెంపుడుగొడుక"

అని వ్రాసికొన్నాడు. అనుభవసారమును రచించునాటికి సోమనాథుడు వీర మాహేశ్వరాచారదీక్షను పొంది యున్నందున తలిదండ్రులను స్మరింపక గురువును, క్రొత్తగోత్రమును స్మరించెను. బసవపురాణరచనమునాటికి వీరశైవము పూర్తిగా ఒంటబట్టినది. శివభక్త్యావేశము హెచ్చినది. అయినను అప్పటికి తలిదండ్రులు బ్రతికియుండిరేమో! వారిపై గల భక్తిగౌరవములచే జననీజనకు లగు శ్రియాదేవీవిష్ణురామిదేవులను స్మరించి తనకృతజ్ఞతను చాటుకొనెను. ఆతరువాత వయఃపరిపాకముతో వీరమాహేశ్వరాచారవ్రతము ముదిరి దీక్షాపూర్వ సంబంధములకు పూర్తిగా దూరుడై తలిదండ్రులను గూడ స్మరింపలేదు. వీర శైవధర్మగ్రంథములలో

"యస్యైవ శాంభవీదీక్షా జాతా గురుకృపావశాత్
పూర్వజాత్యాదికం తస్య న స్మరేత్ ప్రాకృతం హి తత్"

'ఎవడు శాంభవీదీక్షను పొందునో వాడు తనపూర్వకులగోత్రాదులను స్మరింప రాదు' అని శాసింపబడినది. అందుకే సోమనాథుడు తనకులమును మాతాపిత రులను స్మరింప లేదు. అతడు సహజవీరశైవుడై యుండిన మాతాపితరులను స్మరించియే యుండెడివాడు.

అతడు పాలకుర్తిలో శ్రియాదేవివిష్ణురామిదేవు లను ఆరాధ్యబ్రాహ్మణ దంపతులకు జన్మించి శాంభవీదీక్షను పొంది వీరమాహేశ్వరాచారవ్రతు డయ్యెను. ఇచట ఒకవిషయము గమనింపదగియున్నది.

సోమనాథుడు అనుభవసారములో బసవనను స్మరింపలేదు. మల్లికార్జున పండితారాధ్యునిమాత్రము స్మరించినాడు. ఆయనశివతత్త్వసారమునందలి భావముల ననువదించెను. అనగా అప్పటికి బసవేశ్వరుని విషయముగాని, ఆయన ఉపదేశములనుగాని బొత్తిగా ఎరుగడన్నమాట. ఆ గ్రంథమునందే తాను అప్పటికే శాంభవీదీక్ష పొందినట్లు "గురులింగార్య తనూజుడ

భృంగిరిటిగోత్రుడ" అని వ్రాసికొన్నాడు. ఆంధ్రదేశమునందు 'భక్తిమీది వలపు - బ్రాహ్మ్యంబుతో పొత్తు' బాయలేనిపండితత్రయమువారి ప్రభావము శైవులపై నుండినది. సోమనాథుడుగూడ మల్లికార్జునపండితారాధ్యునియందు విశేషభక్తిభావభరితుడు. అట్టియెడ ఏ మహత్తరసంఘటనము సోమనాథుని వైదికాచారదూరుని చేసి వీరమాహేశ్వరాచారవ్రతునిగ మార్చివైచెనో దానిని పరిశోధకులు తేల్చవలసియున్నది.

**గురువులు :**

సోమనాథునకు నలుగురు గురువు లున్నట్లు అతనిగ్రంథములవలన తెలియుచున్నది.

"శరణగణాశ్రియసకలస్వరూప
గురులింగవరకరోదరజనితుండ
ఖ్యాతసద్భక్తి మైఁగల కట్టకూరి
పోతిదేవరపదాంబుజషట్పదుండ
సకృపాత్ముడఁగు కరస్థలి విశ్వనాథు
ప్రకటవరప్రసాదకవిత్వయుతుఁడ." —బసవపురాణము

"పేరెక్కఁ దగిన శ్రీబెలిదేవివేమ
నారాధ్యు లను పరమారాధ్యదేవు
మనుమనిశిష్యుండ మద్గురులింగ
ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ" —పండితారాధ్యచరిత్ర.

వీరశైవధర్మములో ప్రధానములైన అష్టావరణములందు మొదటిఆవరణము గురువు. ఆధ్యాత్మికాచరణములకు ఆవరణములని పేరు. ఈఅష్టావరణానుష్ఠానమే ముముక్షువున కత్యావశ్యకమైనది. గురువులలో దీక్షాగురువు, శిక్షాగురువు, జ్ఞానగురువు అను మూడువిధములవా రుందురు. ఆత్రివిధగురువు లను సోమనాథుడు పేర్కొనెను. దీక్షాగురుడు గురులింగార్యుడు. ఆయనచే వీరమహేశ్వరాచారవ్రతదీక్షను పొందెను. అనుభవసారకృతిపతి యగు గోడగి త్రిపురారికిని ఈయనయే గురుడు. ఇతనిని గురించి విశేషములు తెలియవు. ఆసమయమున పాలకుర్తిలోనో ఆపరిసరములందో ఉండియుండును. శిక్షాగురుడు కట్టకూరి పోతిదేవర. ఆయనచే వీరశైవధర్మరహస్యములను, శివతత్త్వసారాదిగ్రంథములలోని విశేషములను గ్రహించెను. జ్ఞానగురుడగు బెలిదేవి వేమనారాధ్యుల పరంపరలోని ఒకమనుమనికడ వేదవేదాంగములను, వైదికా

చారమర్మములను, శివాద్వైతజ్ఞానమును బడసెను. ఈపేమనారాధ్యుడు మల్లికార్జునపండితునికాలపువాడు; మహాభక్తుడు, విద్వాంసుడు. అయనవంశీయుడగుమనుమని శిష్యుడ నని మాత్రమే చెప్పెను. కాని ఆయనపేరు తెలుపక పోవుట విచిత్రము. నాల్గవగురుడు కరస్థలి విశ్వనాథయ్య. ఆయనదగ్గర సాహిత్య మర్యాదలను, కావ్యలక్షణములను ఆకళించికొనెను. ఈగురుచతుష్టయము వలన ఉద్దండపండితుడు, వీరశైవధర్మతత్త్వజ్ఞుడు, ప్రతివాదభయంకరుడు నయ్యెను.

**వ్యక్తిత్వ - వైదుష్యములు :**

సోమనాథునివ్యక్తిత్వము విశిష్టమైనది. వీరశైవమును బసవేశ్వరుడుద్ధరింపగా పండితారాధ్యుడు ప్రతివాదభయంకరుడై తెలుగునేలలో బౌద్ధాది వేదవిరుద్ధమతములను ఖండించి శైవమతప్రచారము గావించినాడు. ఆతరువాత పండితపామరలోకములను సమానముగా అలరింపజేయగల ప్రామాణిక మతగ్రంథములను రచించి వీరశైవమును పునరుజ్జీవింప చేయుటకై సోమనాథు డవతరించెను. ఇతనిని తరువాతివీరశైవప్రపంచము సాక్షాత్భృంగీశ్వరుని అవతారముగా ఆరాధించినది. బసవన - పండితారాధ్యులతోబాటు సోమనాథుడుగూడ వీరశైవులకు గురుపీఠమైనాడు. శైవులకు మాన్యులైన బసవన పండితారాధ్యులను మొట్టమొదట తెలుగుభాషలో వెలయించినకీర్తి సోమనాథునకు దక్కినది. తరువాత అవి కర్ణాట - సంస్కృతభాషలలో పరివర్తనము చెంది ఆంధ్రభాషకు అపారయశమును ఘటింపజేసినవి.

ఏమతమునకైనను తనసిద్ధాంతమును ప్రామాణికముగ నిరూపించి అన్యమతదోషములను ఖండించువాఙ్మయము ఉండితీరవలెను. నూత్నముగ ప్రాచుర్యమునకు వచ్చుచుండిన వీరశైవమునకు పురాణ_ఇతిహాస_స్తోత్ర_ సిద్ధాంతప్రతిపాదకగ్రంథముల నతడు రచించి తనమతమును సుసంపన్నము చేసినాడు. సోమనాథుడే జన్మింపనిచో వీరశైవవాఙ్మయమే లేదు. ఈమహామహునివ్యక్తిత్వమును గూర్చి ప్రసిద్ధవిమర్శకులు శ్రీశిష్టా రామకృష్ణశాస్త్రిగారిట్లు వ్రాసినారు.

"ఇతడు వీరశైవలోకమున కుపదేష్ట_గొప్పప్రతిభావంతుడు. వీరశైవ వాఙ్మయమంతయు నితనిరచనలపై నాధారపడియున్నది.

గ్రుడ్డెద్దు చేన బడినట్లుకాక ఆంధ్రవాఙ్మయము, భాష, భావము, రూపము

మొదలైన ప్రతివిషయమునందును నూతనపథంబును ద్రొక్కి తనప్రతిభను చాటినాడు. వీరశైవము మొట్టమొదట అనాదిసిద్ధమైన బ్రాహ్మణమతము నెదుర్కొనవలసియుండుటచే నామతవాఙ్మయమునం దున్నట్లుగా నీమతమున గూడ శ్రుతి, స్మృతి, పురాణేతిహాస, కావ్యస్తుత్యాదుల నెలకొల్పవలయునని యెంచి 'చతుర్వేదసార, అనుభవసార, రుద్రభాష్య, బసవపురాణ, పండితారాధ్య చరిత్ర, వృషాధిపశతక, బసవరగడ, బసవోదాహరణాదుల క్రమముగా ప్రతి జాతికి నొకదానిని ప్రతినిధిగా వేదసార, భాష్యపురాణ, చరిత్ర—శతక—ఉదాహ రణాది నామముల నన్వర్థముగా నొనర్చి యామత్వాఙ్మయమునకు ప్రతిష్ఠాగౌరవ ములు గూర్చినాడు. మరియు జైనబౌద్ధులు తమగ్రంథములను సామాన్యజను లలో విశేషప్రచార మొందించుటకై దేశభాషలలో రచించినందున శీఘ్రప్రచా రమునందుట గ్రహించి తనకావ్యములను దేశిపద్ధతి నవలంబించి దేశీయచ్ఛంద మగు ద్విపదలో జానుతెనుగుభాషయందు సులభగ్రాహ్య మగునట్లు చేసెను.

ఆమతమూలపురుషులైన బసవ—పండితారాధ్యులనే మహానాయకుల జేసి వారికి దైవత్వ మారోపించి యవతారపురుషుల నొనర్చి వారిచరిత్రములకు పురాణపావనత్వమును గూర్చినాడు. సృష్టికి ప్రతిసృష్టి సేయగల ప్రతిభాశాలి సోమనాథుడు కార్యశూరుడు, సంస్కారప్రియుడు, నిరంకుశుడు. బ్రాహ్మణ మతమునకు వేదవ్యాసు డెట్టివాడో వీరశైవమతమునకు పాల్కురికి సోమనాథు డట్టివా డని చెప్పవచ్చును." (చూ-ఆంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వము).

ఇతనిపాండిత్య మపారము, అపూర్వము, అసమానము, సర్వతోముఖము నైన దని విద్వాంసులు కీర్తించినారు. సోమనాథునకు, చతుర్వేదములు, ఉపని షత్తులు, వానిభాష్యములు, అష్టవింశత్యాగములు, అష్టాదశమహాపురాణ—ఉప పురాణములు, ఇతిహాసములు, గృహ్యసూత్ర—ధర్మశాస్త్రములు, దర్శనములు, కావ్యనాటకాలంకారశాస్త్రములు, కళలు, వివిధమతసిద్ధాంతములు, అనేకభాషలు కరతలామలకములై యుండె ననుట అతిశయోక్తి కాదు. అతనివైదుష్యమంతయు ఆయనగ్రంథములలో ప్రదర్శింపబడి యున్నది. ఇవికాక "సంగీతశాస్త్రపారగు" డని గూడ కీర్తింపబడినాడు.

సోమనాథుడు శ్రీశైలమున చిరకాలము వసించి అచటికి వచ్చి పోవు నానాదేశజనుల సాహచర్యమువలన అనేకదేశభాషలలో పరిచయమునేకాక పాండిత్యమునుగూడ సంపాదించెను.

**గుణశీలములు :**

సోమనాథుడు "అఘోరవీరమాహేశ్వరాచారధౌరేయుడు"; భవులయెడ తీవ్రవైముఖ్యము గలవాడ నని తానే చెప్పెను. 'వీరశైవసిద్ధాంత శిరోమణి'లో భవినిగూర్చి ఇట్లు చెప్పబడినది.

> ''మద్యపానీ మాంసభక్షీ చాన్యదేవస్యపూజకః
> అలింగీ చ దురాచారీ-పరిచైతే భవినః స్మృతాః ''

మద్యపానము చేయువాడు, మాంసమును తినువాడు, శివేతరదైవములను పూజించువాడు, లింగము ధరింపనివాడు శాస్త్రవిరుద్ధాచారములు గలవాడు ఈ అయిదుగురును భవు లనబడుదురు.

> ''శివజ్ఞాన శివధ్యాన శివపూజా తపఃఫలం।
> నిష్ఫలం యాంతి దేవేశి భవిసంసర్గకారణాత్ ''

'శివభక్తుడు భవిజనులసంసర్గమువలన తనజ్ఞానధ్యానపూజాతపములను నిష్ఫలము కావించుకొనును' అని భావము. సోమనాథుడు ఇట్టికఠోరనియమములను అక్షరశః పాటించెను. ఆవిషయమునే బసవపురాణమున

> ''వీరమాహేశ్వరాచారవ్రతుండ...
> సంభావితుఁడ భవిజనసమాదరణ
> సంభాషణాదిసంసర్గదూరగుఁడ ''

అని వ్రాసెను. పండితారాధ్యచరిత్రరచననాటికి అది ముదురుపాకమున బడినది. అందు తన్నుగూర్చి యిట్లుచెప్పెను :

> ''భవికృతారంభసంభవధాన్యనిచయ
> భవినిరీక్షణరసపాకవితాన
> భవిహస్తగతఫలపత్రిశాకాది
> భవిగృహక్షేత్రాంఘ్రిపథవర్జితుండ,
> భవిజనదర్శనస్పర్శనాలాప
> వివిధదానాదానవిషయదూరగుఁడ,
> శుద్ధభక్తిస్థలశ్రుతిమతాచార
> సిద్ధవీరవ్రతశీలాన్వితుండ,
> ''భువి నేన ధన్యుండఁ బుణ్యుండ నాదు...
> వీరభక్తిస్థలవిశ్రుతాచార
> సారవ్రతాదులు సఫలత నొందె
> ''శివభక్తతతియాజ్ఞ, శిరమునఁ దాల్చి
> శివకవుల్ హర్షింపఁ జెప్పెదుఁ గవిత.''

సోమనాథుడు శైవులు కాని భవుల దర్శనాలాపములే చేయరా దను కఠోరనియమము గలవాడై యుండెను. జీవితాంతమువరకు ఈవీరవ్రతాచారనియమముల ననుష్ఠించి చివరికాలమున స్వదేశము తురుష్కాక్రాంతమై నియమపాలనమునకు విఘాతములు కలుగవచ్చు ననుశంకతో అతడు పాలకుర్తిని ఓరుగంటిని వదలి కన్నడదేశమునకు పోయి అచటను కాలప్రభావమును గుర్తించి సమాధిగతు డయ్యెను.

## 3. సాహిత్యకృషి - కృతులు

సోమనాథుడు మతప్రచారము నుద్దేశించియే వాఙ్మయమును సృష్టించి నను మహాకవి కావున అందు సాహిత్యమర్యాదలకు, కావ్యగౌరవమునకు లోపములేకుండునట్లు రచించి రమణీయకళాఖండములను లోకమునకు సమర్పించినాడు. ఆయనపై వీరశైవమతప్రభావము, కన్నడసాహిత్యప్రభావము విశేషముగా ఉన్నది. ఆనాటి కన్నడసాహిత్యస్వరూపస్వభావమును సమీక్షించినచో ఈవిషయము ద్యోతకముకా గలదు.

**కన్నడ సాహిత్యము :**

12వ శతాబ్దము కన్నడసాహిత్యమునకు స్వాతంత్ర్యయుగము. బసవేశ్వరు డవతరించి అవైదికమైన జైనమతమును, కర్మపరమైన సనాతనమతమును సమముగా ప్రతిఘటించి కులభేదశృంఖలములను ఛేదించి హైందవసమాజమును బంధవిముక్తము చేయ ప్రయత్నించెను. ఆధ్యాత్మికతత్త్వాన్వేషకు లందరును ఒకటే అనియు, వారికి కులభేదములు, స్త్రీపురుషభేదములు లేవనియు, చాటి సమాజమునే అతలకుతలము చేసి వైచెను. సామాజిక - ధార్మిక నిర్బంధములచే అణగియుండిన ముముక్షువుల తృష్ణ నిరాఘాటముగ విజృంభించెను. అందరిలో ఆధ్యాత్మికజ్ఞానపిపాస, ఆత్మశక్తి పెరుగ నారంభించెను. ఎటు చూచినను తత్త్వాన్వేషకుల, విరక్తులగుంపులే కానరాదొడగెను.

బసవేశ్వరుడు తనఉపదేశములను, అనుభవములను సామాన్యజనుల వాడుకభాషలో సులభముగ సుందరముగ చెప్పదొడగెను. జనసామాన్యమునకు తెలియవలెనను దృష్టియే కన్నడసాహిత్యమున క్రాంతిని కలిగించెను. ఈ ఉద్యమమువలన దేశీయులలో నూత్నచైతన్యము ప్రసారితమయ్యెను.

విభిన్నములైన దృక్పథములు, ధర్మములో సమాజములో వచ్చిన

మార్పులు, సంఘర్షణలు, సామరస్యములు మొదలైనవి ఈయుగమందలి సాహిత్యమునకు వైలక్షణ్యమును, వర్చస్సును గూర్చినవి. పండితులతోబాటు ఎందరో అనుభావులు, ఆత్మదర్శనులు రచనలు చేసిరి.

పంపాది మహాకవులు ప్రారంభించి కొనసాగించిన "మార్గపద్ధతి"నుండి కన్నడసాహిత్యము "దేశిపద్ధతి"కి మారజొచ్చెను. విషయములో, భాషలో, ఛందస్సులో దేశిప్రాధాన్యము ఎక్కువైనందున దీనికి స్వతంత్రయుగ మను పేరు సార్థకమైనది. ఈ యుగమున "వచనము" అను సాహిత్యప్రక్రియ ఉదయించెను. ఆ తరువాత రగళె - త్రిపది, షట్పది అను అచ్చగన్నడ ఛందస్సులో గ్రంథములు వెలసినవి. శివలీలలు, శివశరణులచరిత్రలు, కావ్యవస్తువు లయ్యెను. ఈవచనములభాష సరళము. ఇందు క్లిష్టమైన సంస్కృత పదాడంబర ముండదు. వీనిని పాటలుగ పాడుకొనవచ్చును. వీనిలో కొన్నిటికి గణము లున్నవి. కొన్ని 'వృత్తగంధులు'గా ఉన్నవి. కన్నడమున కివి అపూర్వమైనవి. తెలుగులోని సింహగిరివచనములు, వేంకటేశ్వరవచనములు ఈకోవకు చెందినట్టివే.

శివశరణులకును, బసవేశ్వరునకును తలమానిక మనదగిన మహామహుండు అల్లమప్రభుడు. ఆయన వచనములద్వారా వీరశైవమత ప్రచారమును చేసెను. ఆయన మహాజ్ఞాని. సర్వతంత్రస్వతంత్రుడు. ఆయన ఏకట్టుబాట్లకును లొంగక, ఎచట ఉత్తమగుణమున్నను పొగడి, ఎచట అవగుణమున్నను తెగడినాడు. అతనితీవ్రవిమర్శలకు ఇతరసంప్రదాయములతోబాటు వీరశైవముగూడ గుఱియైనది. ఈ ప్రభుదేవర మహాజ్ఞాని అయినట్లే బసవేశ్వరుడు మహాభక్తుడు. ఆయన వినయభక్తివైరాగ్యపూర్ణుడై తన్ను పరమశివున కర్పించికొని శరణలోకచూడామణి అయ్యెను. జనులకు షట్స్థలసిద్ధాంతము నుపదేశించి లింగైక్యము నందగల్గు దివ్యమార్గమును చూపెను. బసవన హృదయంగమమైనభాషలో విశ్వజనీనములు, సార్వకాలికములు అయిన నీతులను తనవచనములలో నింపి లోకమునకు ప్రసాదించినాడు. సంఘములోని అత్యాచారములు కారుణ్యమూర్తియగు బసవనిహృదయమును కలతపెట్టినపుడు ఉగ్రరూపము ధరించినాడు. అతని విమర్శలు కటువైనవి. ఎవరిమీదను ద్వేషము లేదు. అన్యాయముతో అసూయతో నిండిన అప్పటిసాంఘికవ్యవస్థమీదనే అతడు ఖడ్గము నెత్తెను. ఆయనతోబాటు ఎందరో విరక్తులు వచనములు వ్రాసిరి.

బసవనకు సమకాలికులైన పండితత్రయమువారు కన్నడములో వచనములను వ్రాసినారు. వచనసాహిత్య మొకమహావాహినివలె ప్రవహించి కొంత వడి తగ్గినతరువాత దానిచే స్ఫూర్తి నొంది మరికొందరు సాహిత్యనిర్మాణము చేసిరి. వారిలో హరిహర - పద్మరస - రాఘవాంకులు ప్రథమగణ్యులు. హరిహరుడు "రఘటా"ఛందములో (రగళలో) కావ్యరచనలు చేసి ఇతరులకు మార్గదర్శకు డయ్యెను. అతని "శివశరణులరగళలు" కన్నడసాహిత్యసరస్వతికి నూతనాలంకారములైనవి. హరిహరుని మేనల్లుడు రాఘవాంకుడు ఉద్దండ పండితుడు. అతడును మార్గపద్ధతిని తిరస్కరించి దేశిపద్ధతిలో "షట్పది"ని స్వీకరించి మహాకావ్యనిర్మాణము చేసినాడు.

ఈవచనములను, రగళలను, షట్పదులను జీర్ణించికొన్న సోమనాథుడు ఆంధ్రసాహిత్యమున విప్లవకారుడయ్యెను. అతడు గ్రహించినభాష, వస్తువు, ఛందస్సు నూతనములైనవి. సర్వతోముఖప్రజ్ఞాధురీణుడు, బహుభాషాకోవిదుడు, అయిన సోమన కన్నడసాహిత్యమునేకాక తమిళవాఙ్మయమునుగూడ మథించి అందలి పెరియపురాణమును గూడ ఆకళించికొనెను. తనకు పూర్వులైన నన్నయ-నన్నెచోడ తిక్కనాదుల రచనలు చదివియుండవచ్చును. మల్లికార్జున పండితుని శివతత్త్వసారమును, అన్నమయ్య సర్వేశ్వరశతకమును మననము చేసికొన్నాడు. వీరశైవమతావేశము ఎంత ముదిరి ఉన్నను, 'దేశి' పై ఎంతఆదరము పెంచికొన్నను సంస్కృతసాహిత్యరీతులను, మార్గపద్ధతులను నిరసింపలేదు. అదే సోమనాథుని వైశిష్ట్యము.

**భాష :** — అతడు తనరచనలలోనిభాషనుగూర్చి ఇట్లు చెప్పెను—

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె,
సరసమై బరగిన జానుతెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట
గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
తెలుగుమాట లనంగవలదు వేదముల
కొలదియగాఁ జూడు డిల నెట్టు లనిన" (బసవపురాణము)

"ఆరూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుతెనుగు విశేషము ప్రసన్నతకు...
తిన్ననినూక్తుల ద్విపద రచింతు" (పండితారాధ్యచరిత్ర)

"జానుతెనుగునుగూర్చి పండితులు చాల చర్చించినారు. చివరకు 'లోకవ్యవహారములోని సర్వజనసుబోధమైన తెనుగు' అని తేల్చినారు. దీనిని కర్ణాట లాక్షణికులు "సమసంస్కృతోక్తి" అన్నారు. అనగా నైఘంటికసంస్కృత పదములుగాక, మారుమూలలలోని అచ్చతెలుగుమాటలుగాక నిత్యవ్యహారములో సుపరిచితములైన సంస్కృతాంధ్రపదములు గల భాష అని పిండితార్థము. అట్టి సరళభాషయే జానుతెను గనబడినది. ఆభాషలో కృతులు రచింతు నన్నాడు. అతనికిముందు నన్నెచోడకవియును తనకుమారసంభవకావ్యమును జాను తెనుగులో రచింతునన్నాడు.

''సరళము గాగ భావములు జానుఁదెనుంగున నింపు పెంపుతో
బిరిగొన, వర్ణనల్ ఫణితి పేర్కొన, నర్థము లొత్తిగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబున గందళింప న
క్షరములు సూత్తు లార్యులకుఁ గర్ణరసాయనలీల గ్రాఁలగన్॥

(కుమారసంభవము)

కాని అతడు తనకుమారసంభవకావ్యమును 'దేశిపద్ధతి' లో గాక శుద్ధ 'మార్గపద్ధతి'లోనే రచించెను. సోమనాథుడు తనప్రతిజ్ఞ ననుసరించి బసవపురాణ పండితారాధ్యచరిత్రలను నిర్వహించియున్నాడు. 'నిరంకుశాః కవయః' అన్న సూక్తి సోమనాథునిపట్ల సార్థక్యము నందినది. అతడు బహుభాషాకోవిదుడు అయినను సంపూర్ణస్వాతంత్ర్యము గలవాడు. తనకవితాప్రవాహమునకు అవరోధము లనిపించినపుడు భాషాసంప్రదాయములను గాని వ్యాకరణనిబంధనలను గాని లెక్కపెట్టక నిరాఘాటముగ వాని నుల్లంఘించుస్వభావము గలవాడు. దుష్టసంధులు, మిశ్రసమాసములు, లింగవ్యత్యాసములు మొదలైనవానిని యథేచ్ఛగా ప్రయోగించి తననిరంకుశత్వమును చాటెను. అతనిప్రయోగము లను దిఙ్మాత్రముగ ఉదాహరించెదను.

ఉదా॥ అజ్లోపము - కర్వన్ - కస్వు - తర్గు.

అంత్యఉకారలోపము - అనియెదర్, అన్రవము - ముత్తవప్నాకు.

దుష్టసంధులు - దుర్వాసముఖ్యులు.... (దుర్వాసోముఖ్యులు కాదు) కర్తానుసారి (కర్త్రనుసారి) చీరెల్ల - కోకమ్మి - ఏలిచ్చు మొ॥

మిశ్రసమాసములు - భక్తబండారి, చౌదశాబ్జము, ముల్లోకవంద్య, శివమరులు, ఆదికుమ్మరి.

తెలుగుభాషలో దుష్టములగు ఈప్రయోగములుకన్నడవ్యాకరణము ననుసరించి

దుష్టములు కావు. సోమనాథుడు నిరంకుశత్వమునగాని, కర్ణాటకశబ్దశాస్త్ర పరిచయమువలనగాని ఇట్టిప్రయోగములను ధారాళముగ చేసినాడు.

**ఛందస్సు :**

అత డనుసరించిన ఛందస్సుగూడ నూతనమైనది. మార్గపద్ధతి ననుసరించి వృత్తములలో కొన్నిరచనలు చేసియున్నప్పటికిని జాతులు ఉపజాతుల లోచే విశేషముగ రచనలు చేసి తనకు దేశిమార్గముమీద గల అభిమానతను చాటుకొన్నాడు. సంస్కృతమున 'అనుష్టుప్' ఛందము ఏవిధముగ సులభము సుగ్రాహ్యము అయినదో అదేవిధముగా తెలుగున ద్విపదగూడ అంతసులభమై పాడుకొనుటకు యోగ్యముగా ఉన్నది. జానపదవాఙ్మయమున నిది ప్రాచుర్యము వహించినను పండితు లెవరును ద్విపదను స్వీకరించి ఆదరింపలేదు. సోమనాథుడు ద్విపదకు పావనత్వము నాపాదించినాడు.

"అదియును గాకైహికాముష్మికద్వి
పదహేతు వగుట ద్విపద నాగ బరగు
ద్విపదాంబురుహముల ధృతి బసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁ బూంతు
సన్నుతి సేయుచు సత్కవు లలరఁ
దిన్నని సూక్తుల ద్విపద రచింతు"

కన్నడులకు త్రిపది–షట్పది ఛ్ఛందము లెట్టివో తెలుగువారికి ద్విపద అట్టిజన ప్రియ మైనది.

ఈద్విపద ఉపజాతులలోని 'తరువోజ'నుండి పుట్టినది. మొట్టమొదటి సారి మనకు 9వ శతాబ్దమునందలి శాసనములలో నిది కానవచ్చినది. తరువాత 2 శతాబ్దములకు నన్నయభట్టారకుడు తనఆంధ్రభారతమున ఈదేశిచ్ఛందమును వాడినాడు. తరువోజలోని ఒకచరణమును రెండుగా విరిచినచో ద్విపద కాగలదు.

తరువోజ = 'గోపికావల్లభా గోవింద నిన్ను_గోపాల మాధవా గురుదేవ
కొలుతు'

ద్విపద = 'గోపికావల్లభా గోవింద నిన్ను
గోపాల మాధవా గురుదేవ కొలుతు...'

మొట్టమొదటిసారి ద్విపదను ప్రాచుర్యమునకు తెచ్చి దానికి పండితపామరజనాదరణార్హతను గూర్చిన గౌరవము పాల్కురికి సోమనాథునకు దక్కినది. సోమనాధున కాదర్శప్రాయులు, అనుసరణీయులు అయిన కన్నడకవులు

హరిహర - రాఘవాంకులు - దేశిపద్ధతిలో రగళకావ్యములను, షట్పదిమహాకావ్యములను రచియించియుండిరి. అట్లే ఇతడును ద్విపదను స్వీకరించి రెండు మహాగ్రంథములను వ్రాసి తరువాతివారికి మార్గదర్శకు డయ్యెను. ద్విపదచ్ఛందమునగూడ తనస్వాతంత్ర్యమును చాటెను. ఆకాలమున సాధారణముగ ప్రాస యతి గర్హింపబడుచుండెను. దానిని సోమనాథుడు సమర్థనపూర్వకముగా వాడెను. మరియు ద్విపదలో ఏచరణమున కాచరణము ముగిసి విడిగా ఉండవలెను. కాని అతడు దాని నతిక్రమించి పాదాంతపదమును మధ్యలో విరిచి ద్వితీయపాదములో గ్రహించెను. సాధారణముగా ద్విపదలో

''శ్రీశైవసమయదేశికచక్రవర్తి
పాశమోచనకళాపారీణమూర్తి
శాంభవదీక్షాఖిజాతానువర్తి
శుంభద్దిగంత విశ్రుతశివకీర్తి''

అని ఏపాదమున కాపాదము ముగిసిపోవును. దీని నతిక్రమించి

''యధికశాపానుగ్రహసమగ్రబలస
మధిగతదివ్యపంచాక్షరీవేత్త,
వావదూకానీకవాగ్బంధనక్రి
యావిశారదుఁడు లోకారాధ్యమూర్తి''

అని పాదాంతపదములను విరిచి రచించును. ఇట్లు చేసినను అనర్గళధారాపూర్ణమైన ఆరచన ఎట్టివిరుపులను గమనింపనీక సాగిపోవుచుండును. ఈద్విపదచ్ఛందము అచ్చముగా తెలుగువారిదే. సోమనాథుడు కన్నడకవులదేశిపద్ధతినుండి ప్రభావితుడైనను తనతెలుగుతనమునకు లోపములేకుండ అచ్చతెలుగుమాత్రాఛందమునే స్వీకరించి తనవ్యక్తిత్వమును నిలుపుకొన్నాడు. విపరీత - విచిత్ర ప్రాసప్రయోగములలో కర్ణాటకసంప్రదాయము నవలంబించినాడు.

**సోమన కవిత్వ లక్షణములు :**

సోమనాథు డెంత నిరంకుశుడైనను స్వాతంత్ర్యప్రియుడైనను ప్రాచీనాలంకారికులు చెప్పిన కావ్యలక్షణముల నిరాకరింపక వానిని పాటించెను. వానితో పాటు మరికొన్నిక్రొత్తలక్షణములు చెప్పి తనప్రతిభను చాటుకొనెను.

''సత్కృతి యన నూత్నసంగతి దనర
తొమ్మిదిరసములు తొలుకాడు దాని
యిమ్మడివర్ణన లెసగంగ ద్విగుణ

మగు నలంకారంబు లసరారుదాని
ద్విగుణార్థభావముల్ దీటుకొనంగ
తేటతెనుంగున ద్విపద రచింతు.

*            *            *

జాతులు రచనాప్రణీతులు గావ్య
నీతులు రీతులు నేతు లట్టంగ
వరకవులు గొనియాడ వర్ణన కెక్క
ధర చెప్పఁ గృతియు నుద్యత్కృతి గాక

*            *            *

ఆటుగాన అభివినుతానందితోక్తి
బటుగద్యపద్యప్రబంధసామ్యముగఁ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతు ద్విపద
కావ్యంబు భవ్యంబు గాన...

అతడు తనకావ్యములో తొమ్మిదిరసములు తులుకాడవలెనని చెప్పినట్లే తులుకాడించినాడు. ఒక్కొక్కరసమునకు బసవపురాణ, పండితారాధ్యచరిత్రముల నుండి ఎన్నిఉదాహరణము లైన నొసగవచ్చును.

రసములకు ఇమ్మడివర్ణన లుండవలెనట. అనగా పదునెనిమిదివర్ణములు. మహాకావ్యములలో అష్టాదశవర్ణన లుండవలె నని చెప్పిన మొట్టమొదటి ఆలంకారికుడు దండి. సంస్కృతసాహిత్య మర్యాదల ననుసరించిన కన్నడకవులుగాని నన్నయమొదలైన తెలుగుకవులుగాని అష్టాదశవర్ణనాత్మకకావ్యములు రచింతుమని చెప్పలేదు. ఈమాట మొట్టమొదటిసారి చెప్పినతెలుగుకవి నన్నెచోడకవిరాజు. ఆతరువాత ఈవిషయమును సంస్కృతలాక్షణికుడైన విద్యానాథుడును, దేశికవితాసనాథుడగు సోమనాథుడును స్పష్టముగా చెప్పినారు. వీ రుభయులుకు సమకాలికులు. సోమనాథుడు మాటవరుసకు అష్టాదశవర్ణనలు చేసెద నని చెప్పెనుగాని అతడు అంతకుమించి ఎన్నోవర్ణనలు చేసి తనచాతుర్యమును ప్రదర్శించినాడు. ఆయనవర్ణనానైపుణ్యమే ఒకగ్రంథము కాగలదు.

తరువాత వర్ణనలకు ద్విగుణమైన అలంకారములను ప్రయోగింతు నన్నాడు. అనగా 36 అలంకారములు. ఇప్పుడు అలంకారములసంఖ్య 118 వరకు పెరిగియున్నను ప్రాచీనుడగు దండి శబ్దాలంకారములు గాక 35 అర్థాలంకారములను చెప్పెను. సోమనాథుడు ప్రాచీనమతమునకు చెందినవా డని చెప్ప వచ్చును.

అలంకారములకు ద్విగుణములైన అర్థభావము లుండవలెనట. అనగా 72 భావములు. సోమనాథుని ఉద్దేశములో అర్థభావము లనగా స్థాయీభావ - విభావ, అనుభావ, సాత్వికభావసంచారీభావములు కావచ్చును. రసోదయమున కివి ముఖ్యములైనవి. "విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః" విభావములు, అనుభావముల, సంచారి(వ్యభిచారి) భావముల సంయోగమువలన రసనిష్పతి యగును అని నాట్యశాస్త్రకారుడు చెప్పెను. ఈవిధముగా సోమనాథుడు లాక్షణికమతానుసారముగ కావ్యత్వసిద్ధికి తనఅభిప్రాయములను చెప్పెను. అంతటితో వదలక ముఖ్యములైనకావ్యగుణదోషములను గూడ పేర్కొన్నాడు.

"సరళత - ప్రసన్నత - చెన్ను - పరిణతి-గణపదపద్ధతి-శబ్దశుద్ధి-ప్రయోగప్రసిద్ధి - కళాసమృద్ధి - నానుడి - వడి - మితి - రతి - అర్థపుష్టి - నైజము - రసపుష్టి - వినూత్నసృష్టి, విశేష్యవిశేషణశ్లేషసొంపు - కుమారత - పెంపు - మాధుర్యము - మృదుత్వంబు - ఓజ - ఋజువు - యమకంబు, గమకంబు యతి - గతి - కారకము - పూరకము - క్రియ - కాంతి - విశ్రాంతి - రంగు-బెడంగు - మెఱుంగు - సమానసంగతి - అక్షరశయ్య - సంఘటన - నిపుణత - రసికత - సమాధానము - ఉపమానము - అవధానము - ఉత్ప్రేక్ష - లక్ష్యలక్షణ వ్యక్తి - అలంకారయుక్తి - దక్షత - సుమతి - విచక్షత -" అను 49 కావ్య గుణములను సోమనాథుడు చెప్పెను. "కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః" గుణములు శబ్దార్థనిష్ఠము లనియు, వీనివలననే కావ్యసౌందర్యము పెరుగుననియు వామనాదులు చెప్పిరి. శౌర్యాదిగుణములు మనుష్యునిలో ఏవిధముగా ఆత్మనిష్ఠములో అట్లే మాధుర్యాదిగుణములు కావ్యమునందు రసనిష్ఠము లని వారిఅభిప్రాయము. భారతాదిప్రాచీనాలంకారికులు శ్లేష - ప్రసాదము - సమత - మాధుర్యము - సౌకుమార్యము - అర్థవ్యక్తి - ఉదారత్వము - ఓజస్సు - కాంతి - సమాధి అను పదిగుణములను చెప్పిరి. అగ్నిపురాణమున 7 శబ్దగుణములు - 6 అర్థగుణములు,6 ఉభయగుణములు చెప్పబడినవి. భోజుడు 24 శబ్దగుణములను, అదేపేరుగల 24 అర్థగుణములను పేర్కొనెను. సోమనాథుడు 49 టిని చెప్పెను.

గుణములతోబాటు కావ్యదోషములును చెప్పబడినవి. "జల్లి - పూరకము - అపశబ్దము - అక్రమము - పొల్లు - విక్రియ - జడ్డు - పోడవు - అసంఘటన - కాకువు - వ్యర్థము - అసంగతి - విరసము - వైకల్యము -

అత్యుక్తి – వైరిపదము – తలవిరుపు – అసమగ్రత – శిథిలబంధము – ఒలుపు – అబంధము – గ్రామ్యోక్తి – కంటకము – ద్రాప – ఛందోవిరుద్ధము" అను 25దోషములను చెప్పినాడు. కావ్యసౌందర్యమునకు హాని కలిగించునట్టివి దోషములు. రసానుభవమువలన కలుగు ఆనందమే కావ్యముఖ్యప్రయోజన మగుటవలన రసమునకు ప్రత్యక్షముగ గాని, పరోక్షముగగాని ఆతంకమగు టయే దోష మని మమ్మటాదులమతము. ప్రాచీనులగు భరత, భామహ దండిప్రభృతులు పదిదోషములను పేర్కొనిరి. తరువాతివాడైన వామనుడు ఈదోషములను పద – వాక్య – అర్థదోషములుగ విభాగము చేసెను. నవీను డైన మమ్మటుడు ఈవిభాగమును ఆమోదించుచు వానికి రసదోషములనుగూడ చేర్చెను. మమ్మటునిమతములో దోషములు దాదాపు 70 వరకు ఉన్నవి. సోమ నాథుడు మధ్యేమార్గము ననుసరించి 25 దోషములను పేర్కొని తనప్రత్యేక తను చాటెను. కావ్యశోభాహేతువులైన గుణములను రసభంజకములైన దోష ములను పేర్కొనుపట్ల నతడు స్వాతంత్ర్యమును ప్రకటించినను తనకావ్య ములు నిర్దుష్టములై కావ్యకళాప్రౌఢిచే నెసలారవలె నని ఆశించెను. అవిధము గానే సమర్థవంతముగ నిర్వహించి కృతార్థుడయ్యెను. సోమనాథుడు బసవన భక్తితన్మయత్వము నందిన కవితావేశము గలవాడు, విద్వద్వరేణ్యుడు, సాహిత్య మర్మజ్ఞుడు; పట్టినదాని నెల్ల బంగారము చేయగల రససిద్ధుడు. ఏరసమును పోషించినను, ఏవర్ణనము నొనరించినను అన్నియు సహజములై, ఔచిత్య పూర్ణములై ఉండును. ఏవస్తువును వర్ణించినను, భావమును వ్యక్తీకరించినను కన్నులకు కట్టినట్లు చిత్రింపగల నిర్మాణకౌశల్యము అతనికి వెన్నతోఁబెట్టినవిద్య. ఆయనశక్తిని దర్శింతము.

**వర్ణనానైపుణ్యము :**

ఆయనప్రకృతివర్ణనలు స్వభావోక్తి రమణీయములు. వేకువజామున కూయుచున్నకోడిని వర్ణించిన విధము చూడుడు.

> "తొలికోడి కనువిచ్చి నిలిచి మై వెంచి
> జలజల రెక్కలు సడలించి నీల్గి
> గ్రక్కున గాలార్చి కంఠంబు విచ్చి
> ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
> నిక్కించి మెడసాచి నిక్కి మిన్సూచి
> కొక్కొరో కుఱ్ఱని కూయకమున్న"

సహజసుందరమైన ఈవర్ణనము సహృదయ హృదయాహ్లాదమును కలిగించును.

**ప్రభాతవర్ణనము :**

"సుప్రభాతమున నుత్సుకత మేల్గాంచి
మసలి చుక్కలు కాంతి మాయకమున్న
అసమశంఖధ్వను లలరకమున్న
అభవాలయంబుల సలరుదీపములు
ప్రభ సెడి వెలువెల్ల బాఱకమున్న
పరుగువెన్నెల వరపర గాకమున్న
సరసిజంబులు మొగి విరయక మున్న
జిగిసెడి కలువలు మొగుడక మున్న
మొగి చకోరములు నోర్మూయకమున్న
చొక్కి యొక్కొకయెడ సుఖియింపఁదలచి
జక్కవల్ గవగూడఁ జన కటమున్న" (పండితారాధ్యచరిత్ర)

**సూర్యాస్తమయము :**

"బసవనిభక్తిప్రభాపటలంబు
దెసల వసుంధర దివి దీటుకొనగ
దినకరుఁ డాత్మీయతేజంబు దరుగు
డును మది లజ్జించి చని యపరాబ్ధి
బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకెఁ
జెడి మిత్రుఁ డరుగ రాజీవముల్ మొగిచె
భేరులు శంఖముల్ ఘోరనఁజెలగె
మారసంహారు నాగారంతరముల
ఘనధూపధూమసంజనిత మేఘములు
సెనసి కప్పినమాడ్కి జీకటుల్ పర్వె
వరముక్తిసతి బసవనికి నారతులు
పరువడి నెత్తు దీపంబులో యనఁగ
నక్షత్రచయ మంతరిక్షంబునుండి
అక్షీణతరకాంతి యసలార వెలిఁగె" (బసవపురాణము)

**చంద్రోదయము :**

"మలసంహరుఁడు జటామకుటంబు మీద
నిలిపియు నాకందు నెరిఁ బుచ్చలేఁడు

భక్తులపాదసంస్పర్శనంబునను
వ్యక్తిగా నిర్మలత్వంబు బొందెదను
అని యాత్మఁ దలపోసి యరుదెంచుమాడ్కి
వనజారి ప్రాఙ్ముఖంబున నుదయించె,
బసవనిసితకీర్తి బర్వెనా శివుని
భసితాంగరాగప్రభలు పర్వెనాగ
నారుద్రునట్టహాసాంశులు దనరె
నారజతాచలచారుదీధితులు
విలసిల్లెనా నభోవీథి నెల్లెడల
నెలకొని అచ్చవెన్నెల వెల్లివిరియ"  (బ.పు.)

సోమనాథుని ప్రకృతివర్ణనలు విషయానుగుణ్యములై సందర్భోచితములై అలరించుచున్నవి. బసవని గర్భమున దాల్చిన మాదమాంబవర్ణనము రసోదంచితము.

"మగువ కంతట నెల మసలెఁ దోడ్తోన
తగ గర్భచిహ్నముల్ దా నంకురించె;
అమృతాంశు డగుపుత్రు డతివగర్భమున
అమరియుండుట నొక్కొ; ఆకలి గాదు;
జలజాక్షికడుపున సద్భక్తిరుచికు
డలరుచునో రుచు లరుచులై తోచె;
పాండురంగనిమూర్తి పడతిగర్భమున
నుండుటనో, వెలరొందెమైఁదీగ;
పడతిశీలపుజూలు భవిపాతములకు
నొడబడకునికినో యోకిళ్ళు పుట్టె
గ్రాలుచు సుతునిరాకకు నోరు దెఱచు
లీలనో సతిక్రావులింతలు పుట్టె
శివమూర్తి తనకు లోనవుటనో తవిలె
శివయోగనిద్ర నా జెలువకు నిద్ర;
బెనుపుగ శివమూర్తి వనితగర్భమున
దనరనో నడుము పేదఱిమి వోనాడె;
యోగీంద్రహంసుఁ డయ్యువిదగర్భమున
రాగిల్లుటనో: నడవేగంబు వదలె;
ననఁగ మానినిగర్భ మంతకంతకును
నినుపారి తనుపారి పెనుపారి పొదలి"  (బసవపురాణము)

తనకు ముఖ్యప్రతిద్వంది యగు సనాతనబ్రాహ్మణునినింద యధేచ్ఛగ చేయబడినది. వర్ణవ్యవస్థపై సోమనాథుడు బాహాటముగ "ధ్వజమెత్తినాడు."

''చెరలుచు గోహత్య చేసిన యూర
మాలలు యీాత్రాటిమాలలఁ పచ్చి
మాలలమాటలు పోలునే వినఁగ
జను వేదచోదితజాతుల రెండు
వినుము బ్రవర్తకంబును నివర్తకము
భవకర్మసంస్కారి భువిప్రవర్తకుఁడు
శివకర్మసంస్కారి భువినివర్తకుఁడు
సన్నుతవేదార్థచరితంబు లుండ
నిన్న బుట్టినకులమ్ముల మాటలేల ?
కరివైరితోడ గుక్కలు వోల్పసరియె
కరితోడ గ్రామసూకరములు సరియె
జడధితో నిల చౌటిపడియలు సరియె
వడిగంగతో వెడ్రవంతలు సరియె
శివనాగుమయ్య చెనటి ఈద్విజులు
అవనిశ సరియుగా రది ఎట్లులనిన'' (బ. పు.)

* * *

గాన విప్రులు భక్తగణములఇండ్ల
శ్వానంబులకు నెట్లు సరియగువారు ?

* * *

భర్గుని గాదని పల్కుత్రోవ వేగు
దుర్గుణులగు శివద్రోహులతోడ
నడరగ వేదభరాక్రాంతు లనఁగఁ
బడిన బ్రాహ్మణగార్దభంబులతోడ
ప్రతి సేసి యాడిన పాపంబు వచ్చు'' (బ.పు.)

ఆయానసందర్భములలో జెప్పదలచిన విషయము పఠితల హృదయములలో హత్తుకొనుటకై సమానార్థకములైన పర్యాయపదములను పుంఖాను పుంఖములుగ ప్రయోగించుట, ఒకేఅలంకారమునకు అనేకవిషయములను జోడించి ఆలంకారికమాలికలను గుప్పించుట సోమనాథునకు ప్రియమైనట్టివి. ఇందువలన భావము చదువరులమదులలో అచ్చుపడి వారి నుత్తేజితుల నొనర్చును.

నందికేశ్వరుఁ డవినాభావలీల
కందర్పహరుఁ జూచు క్రమమునఁ జూచు
దగిలించు దాపించు దండడిగొల్పు
నిగుడించు నిష్ఠించు నేమించు నాచు
సంధించు సారించు జనజొన్పు నునుపు
బంధించు బిగియించు బై కొల్పు జలుపు
నెక్కొల్పు బెసకొల్పు నెలకొల్పు నిల్పు
జక్కొల్పు బురికొల్పు సమకొల్పుగల్పు
జిక్కించు నాటించు చెందించు చేర్చు
జొక్కించు సోలించు నెక్కించు గూర్చు
బొరయించుఁ బోరించుఁ బొందుగావించు
దొరయించు గీలించు మరిగించు నించు

**ఉపమాలంకారమాలిక :**

"నెరి నంకురించు క్రమానికి నీరు మాని
నెర వట్టికొరటికి నీరెత్తినట్లు
గుతిలుడై ( జాతినాగులఁ జంపుచుండి
ప్రతిమనాగులకును బాల్వోయునట్లు
వడిగొని భుజియించు వదన ముండంగ
పెడతల గడిసేసి గడుచుచందమున
నొనర ముందటిశిరం బుండ మోకాలి
కిని సేసపెట్టంగ క్రియగొనినట్టు. (పం. చ.)

సోమనాథు డీఅలంకారమాలికావిధానమును కాళిదాసునుంచి గ్రహించి యుండవచ్చును.

**సోమనాథుని కృతులు :**

సోమనాథు డనేకవిధములైన రచనలు చేసినాడు. ఆయనకృతులనుగూర్చి పిడుపర్తి సోమనాథుడు ఈవిధముగ చెప్పెను.

సీ॥ బసవపురాణంబు, పండితారాధ్యుల
చరితంబు, ననుభవసారమును; జ
తుర్వేదసారసూక్తులు, సోమనాథ భా
ష్యంబును, రుద్రభాష్యంబు, బసవ
రగడ, గంగోత్పత్తిరగడ, శ్రీబసవాఢ్య
రగడయు, సద్గురురగడ, చెన్న

మలు సీసములు, నమస్కారగద్య, వృ
షాధిపశతకంబు, నక్షరాంక
గద్యపద్యముల్, పంచప్రకారగద్య,
అష్టకము, పంచకము, నుదాహరణయుగము,
నాదియగు కృతుల్ భక్తహితార్థబుద్ధి
జెప్పె నవి భక్తసభలలోఁ జెల్లుచుండు."

(పద్యబసవపురాణపీఠిక)

అతడు చెప్పిన 21 రచనలుగాక మఱికొన్నిటిని గూడ సోమనాథుడు రచించెను. ఆయన కృతులనుగూర్చి సంగ్రహముగ తెలిసికొందము.

1. అనుభవసారము :

కం. "అనుభవసారం బనఁగా
మనసిజహరు శుద్ధభక్తిమార్గము వేదో
క్తనిరూఢిఁ, బురాణరహ
స్యనియుక్తిని, విస్తరింతు నది యెట్లనినన్॥

(అనుభవసారము)

రచనాశైలి ననుసరించి, ఇందలివిషయము ననుబట్టి ఈగ్రంథమే సోమనాథుని ప్రథమకృతి యని విద్వాంసులు తేల్చినారు. ఇందు 245 పద్యము లున్నవి. ఈతొలిరచనలో తాను మల్లికార్జునపండితారాధ్యుని 'శివతత్త్వసారము'నుండి గ్రహించిన శివానుభవమును, కరస్థలివిశ్వనాథునికడ సాధించిన కవితాశక్తిని ప్రదర్శించెను. తన కన్నివిధముల ప్రేరకుడైన పండితారాధ్యు నిట్లు 3 పద్యములలో స్తుతించెను.

ఆ.వె. "ఎట్టు లనుచు సంశయింపక శివతత్త్వ
సారగద్యపద్యసమితి, శివుని
మహిమ దెల్పినట్టి మల్లికార్జునపండి
తయ్యగారి దలతు ననుదినంబు" (అ.సా.)

ఇందు కథావిషయ మేదియును లేదు. గురుభక్తిమహిమ, భక్తిస్వరూపము, భక్తలక్షణము, శివపూజాపద్ధతి, ఇష్టలింగార్చనవిధి, జంగమసేవ, షట్స్థలవివరణము మొదలైన వీరశైవధర్మములు ప్రతిపాదింపబడినవి. దీనిలో నెచ్చటను బసవని స్మరింపనందున అప్పటివరకు అతని నెరుగడనిచెప్ప వచ్చును. కన్నడరచనలనేగాక తనకుపూర్వులైన నన్నయనన్నెచోడుల

తెలుగుగ్రంథమును క్షుణ్ణముగా చదివి పద్యరచనలోని మేల్మిని గ్రహించినాడు. ఈతొలిరచనలోనే తనపద్యనిర్మాణశక్తిని చాటుకొన్నాడు. అనుభవసారమునకు తనసహాధ్యాయి యగు గోడగి త్రిపురారిని శ్రోతగా ఉంచెను. ఇందు సంస్కృత వృత్తములు, కందములు, సీసములు చక్కగా వ్రాయబడినవి. 'త్రిభంగి'అను అపూర్వఛందస్సును వాడెను. ద్విపదకు మూలమైన తరవోజలుగూడ వ్రాసినాడు. శైలి తెలియుట కీపద్యము చూడుడు.

శా. వ్రాలున్ వ్రాలు శివార్చనాపరవశవ్యాప్తిన్ ప్రమోదంబునన్
గ్రాలున్ గ్రాలు నహర్నిశంబు శివలింగధ్యానసంపన్నుఁడై
సోలున్ సోలు నపారసారవివిధస్తోత్రప్రలాపంబులన్
దేలున్ దేలు మహానుభావసుఖవార్ధిన్ భక్తుఁ డుద్యద్గుణా.

## 2. బసవపురాణము :

అనుభవసారము తరువాత సోమన ప్రసిద్ధశైవక్షేత్రమగు శ్రీశైలమును దర్శించి అందు కొంతకాలము వసించియుండును. అప్పుడు నానాదేశసమాగతులైన భక్తగణములవలన బసవేశ్వరుని దివ్యచారిత్రమును, మహిమలను సమగ్రముగా తెలిసికొనియుండును. పండితారాధ్యుని జ్ఞానమార్గముకంటె బసవనిభక్తిమార్గము సోమనాథుని విశేషముగ ఆకర్షించినది. బసవన భక్తిపరవశుడై తన్మయత్వముచే ఆయనను వివిధప్రక్రియలద్వారా తనివితీర స్తుతించి చరితార్థుడైనాడు. సంస్కృతభూయిష్ఠము లైన అక్షరాంకగద్య, బసవాష్టక, బసవోదాహరణ, బసవరగడ మొదలైన లఘుకృతు లెన్నిటినో రచించెను. కాని అవి సామాన్యభక్తజనమునకు అందుబాటులో లేకుండుట గమనించి సర్వజనసులభమైన ద్విపదలో నిత్యవ్యవహారరూఢమైన తెలుగు బాసలో మహిమాన్వితుడగు బసవేశ్వరునిచారిత్రమునే రచించి దానికిపురాణపావనత్వమును గూర్చినాడు.

బసవపురాణ మొకవిశిష్టపద్ధతికి చెందినపురాణకావ్యము. కన్నడ సాహిత్యమున మొదట మార్గపద్ధతికి చెందిన జైనపురాణము వెలువడగా తెలుగు సాహిత్యమున శుద్ధమైనదేశిపద్ధతిలో తొలిసారి స్వతంత్రమైన వీరశైవపురాణ ముదయించినది.

శంకరవిజయాదిమతాచార్యచరిత్రలలో చెప్పబడినవిధముగనే వీరశైవ ధర్మోద్ధారకుడైన బసవేశ్వరుడును నందికేశ్వరావతారముగ వర్ణింపబడినాడు. మహాపురుషులను దైవావతారములుగా భావించి వారిచరిత్రలను దేశభాషలలో

పురాణములుగ వ్రాయుపద్ధతికి కన్నడిగులు, తమిళులు శ్రీకారము చుట్టి రచన వచ్చును. 11వ శతాబ్దమున 'సేక్కిళారు' అనుతమిళకవి 'అరువదిముగ్గురు' శివ భక్తులగు నాయనారులచరిత్రలను గ్రహించి 'పెరియపురాణము'ను వ్రాసెను. కన్నడరత్నత్రయమని ప్రసిద్ధిపొందిన పంప-పొన్న-రన్నకవులు 10వ శతాబ్దమున జైనతీర్థంకరులచరిత్రములను గొని ఆదిపురాణ, శాంతిపురాణ, అజిత పురాణములు రచించిరి. తరువాత 12వ శతాబ్దమున అల్లమప్రభుదేవర, బసవేశ్వరుల అనన్యప్రచారమువలన వీరశైవకవులును మహాభక్తులచరిత్రములను గ్రహించి పురాణములను వ్రాసిరి. కన్నడసాహిత్యమున "ఓదుగబ్బ" "హాడుగబ్బ" అనుకావ్యభేదములు జనించినవి. "ఓదుగబ్బ" (చదువుకావ్యము) పండితరంజకమై మార్గపద్ధతికి చెందినచంపూకావ్యము. "హాడుగబ్బ" (పాడుకొనుకావ్యము) జనాదరణయోగ్యమై దేశిపద్ధతికి చెందినగేయకావ్యము. క్రీ. శ. 1200 ప్రాంతమున నుండిన హరిహరుడు 'రగళ' అను దేశిచ్ఛందమును స్వీకరించి కథనకావ్యములను వ్రాసెను. తనఅద్భుతవర్ణనాచాతుర్యముచే శివలీలావిలాసములు, శైవధర్మములు, శివభక్తుల కథలు వస్తువులుగా గ్రహించి 'రగళ' లలో గలసామర్థ్యమును నిరూపించినాడు. అతని నొక సంస్కృత గ్రంథకర్త

''యః పురాతనచారిత్ర్యం కృతవాన్ దేశభాషయా
పంపా హరీశ్వరం నౌమి సంపాదిత శివాస్పదం''

అని కీర్తించెను. అతని "శివగణదరగళెగళు" అనువానిలో భక్తిరసము మహాప్రవాహరూపమున పారినట్లున్నది. అతని మేనల్లుడు,శిష్యుడు అయిన రాఘవాంకుడు "హాడుగబ్బ" కు గల ప్రాధాన్యమును గుర్తించి 'షట్పది'లో మహాకావ్యరచన చేసి ఆఛందస్సును కన్నడ సాహిత్యసామ్రాజ్యసింహాసన మెక్కించెను. ఈషట్పదిఛంధములో ఎన్నోపురాణములు వెలువడినవి. వానిలో మొట్టమొదటిది "సిద్ధరామపురాణ". ఇది తరువాతిశైవపురాణములకు మార్గదర్శకమైనది. ఈ పురాణము లన్నిటిలో శివభక్తులకథలు, వీరశైవధర్మములు వర్ణింపబడినవి. ఆకాలపు జ్ఞానులైన శివభక్తులు పురాణకథావస్తువు లైనారు.

'సిద్ధరామపురాణము' 9 సంధుల మహాకావ్యము. ఇది సొన్నలిగి సిద్ధరామశివయోగి చారిత్రము. అతడు 'జగదగురు' 'కారణరుద్ర' 'శివజ్ఞాని' అని కీర్తింపబడెను. ఆయన జనన-బాల్యములు, సిద్ధి-కార్యములు లోకవిలక్షణములైనవి. విశ్వకుటుంబియై పాతకులను, నారకులను అనుగ్రహించుచు జీవించిన

మహిమాన్వితుడు. ఆయన మాహాత్మ్యములు, వానికి సంబంధించిన ఉపకథలు చేరి ఇదొక పుణ్యకావ్యమైనది. దీనిని "ఉన్నతకావ్యము—ఆదర్శపురాణము" అని సాహిత్యవేత్తలు ప్రశంసించిరి. ఈపురాణమున వైదికపురాణలక్షణములు లేవు. అనేక గాథలు, చరిత్రలు, తత్త్వములు, సంప్రదాయములకు పురాణములలో అవకాశముండును. ఒక కథాసూత్రమున ననుసంధించిన అనేకోపాఖ్యానములు, ధార్మికవిషయములు కూడి సుసంబద్ధమై సారస్యపూర్ణమై యున్నందున సిద్ధరామపురాణము ఉదాత్తపురాణకావ్య మైనది.

సోమనాథునిబసవపురాణరచనకు స్ఫూర్తినిచ్చినది ఈసిద్ధరామపురాణమే అని తలచుచున్నాను. బసవపురాణముపై జైనులపురాణప్రభావ మున్న దని మిత్రులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యముగా రన్నారు. ఈవిషయ మింకను ఆలోచింపవలసిన దని విన్నవించుకొనుచున్నాను. జైనశైవసంప్రదాయములకు సాధర్మ్యము లేకపోగా వైధర్మ్యములే హెచ్చు ఉన్నవి. జైన పురాణలక్షణము లిట్లుండును.

జీవుడు తమకర్మలఫలముగా 'తిర్యక్, మనుష్య, నారక, దేవ' గతులను పొందుచు జినధర్మము నవలంబించి రత్నత్రయపరిష్కృతుడై సత్కర్మలవలన ఉత్తమజన్మలెత్తుచు జన్మావసానమున అహమింద్రుడై దేవలోకమునుండి మనుష్యలోకమునకు వచ్చి చరమదేహధారి యై తపస్సుచే కర్మక్షయము సాధించి తీర్థంకరుడై జైనధర్మమును బోధించి నిర్వాణమును బొందును. ఈక్రమమే జైనపురాణములలో పాటింపబడును. ఆపురాణములలో భవావళి, పంచకల్యాణములు, వైరాగ్యము, తపస్సు, ఇంద్రపూజ, ఆనందనృత్యములు విధిగా వర్ణింపబడవలెను.

ఇక వీరశైవసంప్రదాయము ననుసరించి ఆపురాణము ఇట్లుండును. "జీవునకు లింగైక్య శివైక్యములే లక్ష్యములు. శివుడే లింగము. జీవుడే అంగము. లింగాంగసామరస్యము కలుగుటకు 'గురులింగజంగమార్చనలు, పాదోకము, ప్రసాదగ్రహణము, భూతి-రుద్రాక్షధారణ, షడక్షరిమంత్రజపము అనుఅష్టావరణములు, శివదీక్ష, షట్స్థలజ్ఞానము, పంచాచారములు, ఇష్టలింగపూజ, సర్వార్పణము సాధకున కవసరము. వీనివలన శివజీవైక్యసిద్ధి కలుగును. శైవపురాణములలో ఈవిషయములు ప్రతిపాదింపబడినవి.

ఈదృష్టితో జూచినపుడు, బసవపురాణముమీద హరిహరుని బసవరాజ "దేవరరగళె,' రాఘవాంకుని 'సిద్ధరామపురాణ'ములముద్ర విశేషముగా కలదని

చెప్పవచ్చును. ఈ విషయమునే సోమనాథుడు బసవపురాణావతారికలో చెప్పినాడు.

"అలరుచు బసవని తలచుతలంపు
బలుపునగాఁ జేసి భావమ్ము మెరసి
అకలంకలింగరహస్యసిద్ధాంత
సకలవేదపురాణసమ్మతం బైన
ఆతతబసవ-పురాతనభక్త
గీతార్థసమితియె మాతృక గాగ
పూరకంబై యొప్పు పూసలలోన
దారంబుక్రియ పురాతనభక్తవితతి
చరితలు లోపల సంధిల బసవ
చరిత మే వర్ణింతు సత్కృతి యనఁగ"

ఇందు నందికేశ్వరావతారమూర్తియగు బసవేశ్వరుడు కథానాయకుడు. బిజ్జలుడు ప్రతినాయకు డని చెప్పవచ్చును. బసవనపూర్వావతారములు, జననము, వ్యవహారదక్షత, మాహాత్మ్యములు, వీరశైవధర్మరక్షాప్రచారములు, జంగమ సేవ, లింగైక్యము మొదలైన పుణ్యచారిత్రముతోబాటు ప్రాసంగికముగా సుమారు 75గురుభక్తులకథలు అనుసంధింపబడినవి. ఈభక్తులలో అనేకవిధములైనవా రున్నారు. ముగ్ధభక్తులు, మిండజంగములు, మొండివారు, మహాయోగులు, సిద్ధ పురుషులు ఉన్నారు. కన్నడసిద్ధరామపురాణము కేవలవీరశైవసంప్రదాయాను గుణ్యమై యుండగా, తెలుగుబసవపురాణము సకలవేదార్థసమ్మతమై విశిష్టమై యున్నది. సోమనాథుని కథాకథననైపుణ్యము ప్రశంసనీయము. ఇందలి కథలలో ముగ్ధసంగయ్యకథ, బెజ్జమహాదేవికథ, గొడగూచికథ, ఉడుమూరి కన్నప్పకథ, సకలేశ మాదిరాజయ్యకథ, మడివేల మాచయ్యకథలు మనోజ్ఞకళా ఖండములు రసనిర్భరము లనదగినవి.

సోమనాథుడు తనస్వతంత్రకావ్యమగు బసవపురాణమునందు పూజ్యు డైన పండితారాధ్యుని 'శివతత్త్వసారము' నుండి అనేకవిషయములను స్వీక రించెను. మచ్చునకు—

"శ్వపచుం డైనను శివభ
క్తిపరుం డగునేని నతఁడ ద్విజవర్యుం డా
శ్వపచునకు గీడు శివభ
క్తిపరాఙ్ముఖుఁడైనయట్టి ద్విజుఁడు మహేశా"

(శివతత్త్వసారము)

"శ్వపచుఁడైనను అంగసహితుఁడై యున్న
నుపమింప సద్బ్రాహ్మణోత్తమోత్తముఁడు
త్రిపురారి గొల్వని ద్విజముఖ్యుఁడైన
శ్వపచాధములకంటె చాలంగ గీడు. (బసవపురాణము)

మనస్తత్వచిత్రణమున సోమనాథుడు సిద్ధహస్తుడు. ముగ్ధభక్తురాలగు బెజ్జమహాదేవి 'మాతృహృదయము'నకు రమణీయముగ వర్ణించినాడు.

"ఎల్లనియోగంబు లెల్లబాంధవులు
నెల్లవారలు గల్గ నిట్లు భర్గునకు
తల్లి లేకుండుట దా విచిత్రంబు
తల్లి లే కదియెట్లు తా నుదయించె
తల్లి సచ్చెనొ కాక త్రైలోక్యపతికి
చెల్లబో యి ట్లేమి సేయంగవచ్చు
తల్లి సచ్చినగాదె తాను దస్సితిని
ఎల్లవారికి దుఃఖ మిట్టిది కాదె
తల్లి గల్గిన ఏల తపసి కానిచ్చు
తల్లి గల్గిన ఏల తలజడ ల్గట్టు
తల్లి యున్న విషంబు ద్రావ నేలిచ్చు
తల్లి యుండిన తోళ్లు దాల్పనేలిచ్చు
తల్లి పాముల నేల ధరియింప నిచ్చు
తల్లి బూడిద యేల దా బూయ నిచ్చు
తల్లి బుచ్చునె భువి తనయుని దిరియ
తల్లి బుచ్చునె భువి వల్లకాటికిని
జన్నిచ్చి పలుమారు వెన్నయుఁ బెట్టి
పన్నుగా నిన్నియుఁ బాలును బోసి
ఆకొనగా గడు పరసి పాలిచ్చి
సాకించి పెనుపదే జనని గల్గినను
తగినపోడిమి సేయు తల్లి లేకున్న
వగవరే మరి యెట్టి మగబిడ్డలైన
ఊరక కుపేక్షించి యుండంగఁ దగునె." (బసవపురాణము)

సోమనాథుని రచనావిధానము, భావములు తరువాతి తెలుగుకవుల కనుసరణీయము లైనవి. కవిసార్వభౌము డగు శ్రీనాథుని శృంగారనైషధములోని

"నలినసంభవుని వాహనపువారువములు
కులముసాములు మాకుఁ గువలయాక్షి"

అను పద్యమునకును, అల్లసాని పెద్దన మనుచరిత్రలోని

"చిన్నివెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు"

అను పద్యమునకును మాతృక అనదగినది బసవపురాణమందలి ముగ్ధసంగయ్య కథలోని

"జగములన్నియు దనశక్తిఁ బాలించు
జగదేకసుందరి సంతతి మేము
శివరహస్యాదిప్రసిద్ధశాస్త్రములు
శివునిచేఁ బడసిన చెలువశిష్యలము"

అను ద్విపదలే. సోమనాథుని అంత్యానుప్రాసాదుల ప్రభావము బమ్మెర పోతనపై చాల గలదు. పోతన పద్యములకు మూలము లనదగిన భావములు గూడ నిండు గలవు. ఆంధ్రభాగవతమునందలి ప్రసిద్ధమైన

"మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు పోవునే మదనములకు"

అనుపద్యమునకు బసవపురాణమునందలి

"క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస
గోరునే పడియల నీరు త్రావంగఁ?
జూతఫలంబులఁ జుంబించు చిలుక
ఖాతి బూరుగుమ్రానిపండ్లు గన్గొనునె?
రాకామలజ్యోత్స్న త్రావు చకోర
మాకాంక్ష సేయునే చీఁకటి త్రావ?
విరిదమ్మివాసన విహరించు తేటి
పరిగొని సుడియదే బబ్బిలివిరుల
నెఱుగునే యల దిగ్గజేంద్రంబు కొదమ
యెఱపంది చనుసీక నెరుగవు గాక
అరుదగు లింగసద్భక్తుల యిండ్ల
సరవుడ నా కొక సరకె యర్థంబు"

అనుపంక్తులు మాతృక లనదగియున్నవి. సోమనాథుని బసవపురాణమునకు తెలుగులోనే ఎన్నో ప్రతికృతు లుదయించినవి. పిడుపర్తి సోమనాథుడు పద్యరూపమున బసవపురాణమును వ్రాసి సోమనాథునకే సమర్పించెను. తరువాత మహాదేవారాధ్యుడు మరొకపద్యానువాదమును చేసెను. తుమ్మలపల్లి నాగభూషణ

కవి 'బసవవిజయము'ను ప్రబంధముగ రచించెను. ఏలూరులోని ఆరాధ్య పండితు లెవరో ఈ బసవపురాణమును 'స్కందాగస్త్యసంవాద' రూపమున సంస్కృతీకరించిరి.

సోమనాథునిపై కర్ణాటకులకు విశేషభక్తి గలదు. సోమనాథునకు సమీపకాలమునం దుండిన భీమకవి భామినీషట్పదిలో బసవపురాణమును కన్నడీకరించెను. అతడు కన్నడబసవపురాణావతారికలో 'తాను శివయోగనిద్రలో నుండగా పాల్కురికి సోముడు, అనఘదేవార్యుడు స్వప్నమున వచ్చి "మేము బసవపురాణము చెప్పెదము వ్రాసికొమ్మని చెప్పిరి' అని వ్రాసికొన్నాడు. అతని అనువాదము యథామాతృకమై సమర్థవంతముగ నిర్వహింపబడినది. అతడు తనఅనువాదవిధానము నిట్లు చెప్పికొనెను.

''సరసమృదుతరయమకగమక వి
సరసమాసప్రాసదేశీ
సరణి శబ్దార్థోపమాచాతుర్యమాధుర్య॥
సరళపదశయ్యాదృఢవ్యా
కరణయుతలాలిత్యనియమా
ఘరసలక్షణ భావ మాగిరె రచిసువెంకృతియ'' (క-బ-పు)

చెప్పినట్లే తనశైలీధ్యేయమును నిర్వహించినాడు. భీమకవి సోమనాథునేకాక ఆయనకు స్ఫూర్తి గలిగించిన హరిహర రాఘవాంకుల రచనలనుగూడ జీర్ణించి కొని తనఅనువాదమును సర్వాంగసుందర మొనరించికొనెను. అవతారికలో స్వయముగ ఈవిషయమును చెప్పెను.

''సరసమృదుమధురోపమెగళం
కురిసె వస్తుకవర్ణకంగళ
నెరపిహరనంహరగణంగళనై దెకీర్తిసిద
ధరగుభయకవిశరభభేరుం
డర సుకవిహరిబుధవరన త
ద్వరసుతన రాఘవన కృపెయిం రచిసువెం కృతియ''

'సరసమృదుమధురశబ్దార్థాలంకారపూర్ణములుగా శివుని, శివగణములను వస్తుక-వర్ణక భేదకావ్యములతో కీర్తించి ఉభయకవిశరభభేరుండులైన హరిహర-రాఘవాంకులకృపతో ఈ అనువాదము రచించెదను' అని స్పష్టముగా చెప్పెను. కన్నడకవులు 'వస్తుక' 'వర్ణకము'లను కావ్యభేదములను చెప్పిరి. వస్తుకమనగా సంస్కృతచంపూలక్షణము ననుసరించి వ్రాయబడిన గద్యపద్యాత్మకకావ్యము.

వర్ణక మనగా ఏకావ్యలక్షణమునుగాని, సంస్కృతకావ్యమర్యాదనుగాని అను సరింపక వ్రాయబడిన పద్యకావ్యము.

భీమకవిగాక సింగరాజు (1500) 'మహాబసవరాజచరిత్ర' మనుపేర వార్ధకిషట్పదిలో ననువదించెను. షడక్షరకవి (1650) 'వృషభేంద్రవిజయ' మనుపేర చంపూకావ్యమును రచించెను. శంకరాచార్యులను కవి 'బసవేశ విజయ' మనుపేర సంస్కృతానువాదము చేసినట్లు తెలియుచున్నది. ఇట్లిందరిచే ఆరాధింపబడిన బసవపురాణ మెట్టిప్రాశస్త్యమును గాంచెనో ప్రత్యేకముగ చెప్ప నక్కరలేదు. సోమనాథునిపై భక్తిచే 16వ శతాబ్దమువాడైన తోంటద సిద్ధలింగ కవి 'పాల్కురికి సోమేశ్వరపురాణము'నే వ్రాసెను. కన్నడకవుల కతనిపై గల భక్తివిశేషము గూడ గణింపదగినది.

### 3. లఘుకృతులు :

సోమనాథుడు బసవేశ్వరభక్తితన్మయత్వమున స్తుతిపరములైన కొన్ని లఘుకృతులను రచించెను. వానిలో 4 గద్యలు, 1 రగడ, 2 ఉదాహరణ ములు, 1 పంచకము, 2 అష్టకములు, 1 స్తవము లభించినవి.

గద్యలు : ఇంతవరకు గద్యలలో పంచప్రకారగద్య, అక్షరాంకగద్య, నమస్కారగద్య, అష్టోత్తరశతనామగద్య లభించినవి.ఆంధ్రచ్ఛందోలక్షణకారులు చెప్పిన గద్యలక్షణములకంటె ఇవి విలక్షణమైనవి. అన్నియు సంస్కృతపద భూయిష్ఠములు.

1. పంచప్రకారగద్య : ఇందు అయిదువిధములైన బసవస్తోత్రపూర్వకగద్య లున్నవి.
2. నమస్కారగద్య : ఇందు పాదములకు 16 మాత్రలు చొప్పున 118 పాదము లున్నవి. ప్రాసయతి పాటింపబడినది.
3. అక్షరాంకగద్య : అ – నుండి క్ష – వరకు ఒక్కొక్కపాదము ప్రథమాక్షర ముగ ఉంచి రచించిన స్తోత్రము. ఈనియమముతో "అక్షరాంకగద్య– అక్షరాంకపద్యములు" అనురెండువిధములుగ రచింపబడినవి.

### 4. అష్టోత్తరశతనామగద్య :

రగడలు : ఇందు 108 చరణము లున్నవి. పిడుపర్తి సోమన గ్రంథ ములో సోమనాథుడు బసవరగడ, బసవాఢ్యరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురు

రగడ రచించినట్లు చెప్పెను. కాని బసవరగడ ఒకటిమాత్రమే లభించినది. ఇదొక ప్రక్రియ.

ఉదాహరణములు : ఇదొక సాహిత్యప్రక్రియ. 8 విభక్తులతో 8 పద్యములు, 8 కళికలు 8 ఉత్కళికలు, చివర సార్వవిభక్తికపద్యముగూర్చి రచింపబడినస్తోత్రము. ఇంతవరకు తెలుగు - సంస్కృతములలో రెండుబసవోదాహరణములు లభించినవి.

పంచకము : 5 మాలినీవృత్తములతో రచించిన బసవనస్తోత్రము.

అష్టకములు : 8 పద్యముల స్తోత్రమును అష్టక మందురు. సంస్కృతమున 8 వసంతతిలకవృత్తములతో వృషభాష్టకమును, తెలుగుభాషలో 8 మాలినీవృత్తపద్యములతో బసవాష్టకమును రచించెను.

స్తవము : 'సోమనాథ స్తవము' అను పేరిట ద్విపదలఘుకృతిని రచించెను.

## 4. వృషాధిప శతకము

ఇది బసవేశ్వరుని శివస్వరూపునిగా భావించి, ఆయనపై 108 చంపకోత్పలములతో రచింపబడిన శతకము. తెలుగుశతకములకెల్ల నిది మకుటాయమానము. ఇందు సోమనాథుడు యమకానుప్రాసాదిశబ్దాలంకారవైచిత్రిని, అష్టభాషాప్రావీణ్యమును ప్రదర్శించినాడు.

ఉదా: నాదకళావినోద ! అభినందితవేద ! హృతాపరాధ ! సం
పాదితభక్తివాద ! బుధవందితపాద ! చిరప్రమోద ! ఆ
స్వాదితసుప్రసాద ! అవిషాద ! శిలాదసుతావిభేద ! దే
వా ! దయ జూడు మయ్యు ! బసవా ! బసవా ! బసవా ! వృషాధిపా॥

## 5, చతుర్వేదసారము :

ఇందు 'బసవలింగ' మకుటముగల 357 సీసపద్యము లున్నవి. వీరశైవము శ్రుతిస్మృతిసమ్మత మని నిరూపించుటకును, తనచతుర్వేద పారంగతత్వమును చాటుటకును రచింపబడినగ్రంథము. శైవమునకు సంబంధించిన ముఖ్యవిషయములు వివరింపబడినవి. నన్నయ్యభట్టారకుడు భారతమునుగూర్చి "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని, అధ్యాత్మవిధులు వేదాంతమనియు" రచించిన పద్యము ననుకరించి సోమనాథుడు చతుర్వేదసారములో

"వైదికు లిది శుద్ధవైదికం బని యన
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్ర మనఁగ
తార్కికు లిది మహాతర్కం బనంగఁ బౌ
రాణికు లిదియె పురాణ మనఁగ
ఆగమవిదులు దివ్యాగమం బిది యనఁ
దంత్రజ్ఞు లిది వీరతంత్ర మనఁగ
భక్తవారం బిది భక్తి మార్గం బన
ముక్త్యర్థు లిది మహాముక్తి యనఁగ
ఆ. వె. కవులు భువిని నిదియె కావ్యం బనంగ, స
జ్జనుల కెల్ల మిగుల సంతసమున
నిర్వికల్పరతి చతుర్వేదసారమన్
పద్యముల్ రచింతు బసవలింగ"

అను పద్యమును వ్రాసెను.

**6. చెన్నమల్లుసీసములు :**

ఇది 32 సీసపద్యముల చిన్నికృతి.

కం. "చెనమల్లేశ్వరు పేరిట
సునిశితముగఁ బాలకురికి సోమేశుఁడు, దా
ఘనభక్తి వెలయఁ జెప్పెను
జెనమలుసీసంబు లనఁగ జెలఁగ ధరిత్రిన్."

**7. రుద్రభాష్యము :**

వేదమునందలి రుద్రాధ్యాయమునకు భాష్యము కావచ్చును - లభ్యము కాలేదు.

**8. సోమనాథభాష్యము :**

ఇది 25 ప్రకరణముల సంస్కృతగ్రంథము. దీనిని "బసవరాజీయము" వీరమాహేశ్వరాచారసారోద్ధారము, అనియు నందురు. వీరశైవమునకు సంబంధించిన 25 విషయములను గ్రహించి శ్రుతిస్మృతిపురాణేతిహాసాగమాది ప్రమాణములచే సమర్థించినాడు. దీనితరువాత రచింపబడిన పండితారాధ్య చరిత్రలో నుద్ధరింపబడిన ప్రమాణములన్నియు ఇందలివే. వీరశైవము తాంత్రికము గాదనియు, శుద్ధవైదిక మనియు నిరూపించుచే ధ్యేయముగ నిది

రచింపబడినది. నీలకంఠశివాచార్యులశిష్యుడగు హరదత్తాచార్యుని చతుర్వేద తాత్పర్య'సంగ్రహము' నుండి చాలప్రమాణములు గ్రహింపబడినవి. దీనికి 'మనోహరుడు' 10వ ప్రకరణమువరకు సరళమైనతెలుగులో టీకను రచించెను.

ఇవి కాక 'అన్యవాదకోలాహలము', 'మల్లమదేవీపురాణము'లనుగూడ రచించెనని చెప్పెదరు. కన్నడబాషలో 'శీలసంపాదనె' అనువచనగ్రంథమును "శివగణసహస్రనామమాల" ను రచించినట్లు కన్నడకవి చరిత్రకారు డనెను. సోమనాథునికన్నడకవితారచన కొకమచ్చు.

''ఇతిభావన్నక్షరిసం
స్తుతి సంకలితాక్షరాంకితస్తోత్ర ఉమా
పతి నిమగర్విసిదెం స
త్కృతియిం పాల్కురికి సోమకృతి బసవేశా''

## 9. పండితారాధ్యచరిత్రము :

ఇది సోమనాథుని చివరికృతి. వయఃపరిపాకమున ద్విపదలో రచింపబడిన ప్రౌఢపురాణకావ్యము. శ్రీశైలభక్తకూటమువారి ఆజ్ఞమేరకు తా నీ మహాగ్రంథమును రచించినట్లు అవతారికలో వ్రాసికొనెను.

''బసవన్నమహిమ శుంభద్భక్తియుక్తి
ప్రసరించితివి గద్యపద్యాదికృతుల
అర్థవావృతధాత్రియం దొప్పబసవ
వర్ణనల్ సేసితి - వరుసను వీను
లారంగ గురుమల్లికార్జునపండి
తారాధ్యులచరిత్ర మర్థి వర్ణింపు
పరిశిష్టపరిమితప్రాక్తనభక్త
చరితంబు లితిహాసనంగతి నొలయ
సంధింపు పండితచరితంబునందు
శివభక్తతతియాజ్ఞ శిరమునఁ దాల్చి
శివకవుల్ హర్షింప జెప్పుదుఁ గవిత''

ఇందు దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతప్రకరణము లయిదు గలవు. దీనికి శ్రోత పాల్కురికి సూరామాత్యుడు. ఆపస్తంబసూత్రుడు, హరితస గోత్రుడు, సోమనాథునకు నెచ్చెలికాడు, ముద్దులమరది, భావుకుడు. ఈ గ్రంథమున తనకు ముఖ్యారాధ్యదేవుడగు మల్లికార్జునపండితారాధ్యునిపుణ్యచారి

త్రము జననమాదిగా, దుర్మతవాదఖండన, వీరశైవదీక్షాబోధ, మహిమాప్రద ర్శన, లింగైక్యములవరకు వర్ణించి ప్రాసంగికముగా ఎందరో బసవన మొద లైన శివభక్తులచరిత్రలను సంధించినాడు. దాదావు 12వేలద్విపదలలో రచింప బడిన ఈమహాగ్రంథమున సోమనాథునికావ్యకళాప్రౌఢిమయే కాక, బహుభాషా వేతృత్వము, ద్యూత, సంగీత, నాట్య, రసవాద, వైద్యాదిశాస్త్రపరిజ్ఞానము, లోకానుభవము ప్రదర్శింపబడినవి. అనేకవిషయములను ప్రతిపాదించిన ఈగ్రంథము "తెలుగుజాతి తొలివిజ్ఞానసర్వస్వము"గా కీర్తింపబడినది. భక్త్యా వేశము, మతోద్రేకము పరవళ్ళు త్రొక్కుచు సంగమించిన ఫలితముగా వెలు వడిన ఈఉద్గ్రంథము రసైకదృక్కులగు విమర్శకులకు సంతృప్తికలిగింపలేక పోవుటలో ఆశ్చర్యము లేదు. ఇందలి శైలీవిన్యాసములకు మచ్చుతునకలు-శ్రీశైలవర్ణనసందర్భములో

> "కడలేనినిర్మలగాధమహత్వ
> జడతావిహారవిస్తారోదకముల
> సంగీకృతాయతోత్తుంగశృంగౌఘ
> మంగళరంగ త్తరంగసంఘముల
> బటుశైలచూడావిభాసినీహార
> పటలప్రకారవిస్ఫారఫేనముల
> శైలాగ్రవిహరణాసక్తప్రమథవి
> శాలదివ్యవిమానచయవహిత్రముల"

గంభీరశైలిని గూర్చినాడు. మహిమప్రకరణమునందు అగ్నిపై బడిన సందర్భములో

> "దందడి అగ్నిహోత్రముమీద బడుడు
> బందిరి గుబ్బునఁ బడి మంట లెగయ
> దిగ్గన లేచి నల్దెసలను గాల
> నగ్గిలోనన బడి అరిగెడువారు
> ఇండులపై నెక్కి ఇటు నేగువారు
> గండుల దూరి వేగమ పాఱువారు
> జప్పరంబులు దూకి సనియెడువారు
> నెప్పాట జనలేక నీల్గెడువారు
> గోడలు వడద్రొక్కుకొని పాఱువారు
> గూడముట్టిన యగ్గి కొని కూలువారు"

సరళశైలిలో వ్రాసెను. విషయానుగుణ్యమగుశైలి నితడు వాడి ఔచిత్యమును

చాటెను. పండితారాధ్యచరిత్రము తరువాతి తెలుగుకవు లెందరికో అనుసరణీయమైనది. దీనిని శ్రీనాథకవిసార్వభౌముడు పద్యరూపమున రచించెను. అది ఉపలబ్ధము కాలేదు. ఇందలి పర్వతప్రకరణమును గ్రహించి నాగలూరి శేషారాధ్యుడు పర్వతపురాణమును వ్రాసినాడు. గురురాజకవి పండితరాధ్యచరిత్రమును సంస్కృతీకరించెను.

## ఉపసంహారము

పాల్కురికి సోమనాథునిగూర్చి అతనికవిత్వమునుగురించి పండితులలో భిన్నాభిప్రాయము లున్నవి. ఇతని బసవపురాణ - పండితారాధ్యచరిత్రములను గూర్చి సుప్రసిద్ధపండితులు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగా రిట్లు వ్రాసినారు.

"ఈరెండుగ్రంథములు నెక్కడ జూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవునట్టి రసోదంచితములుగ ద్విపదలలో గూర్పబడినవి. హిమవద్భూధరగుహాగ్రములనుండి యనర్గళముగా దుమికివచ్చెడు గంగాప్రవాహంబుంబోలె నీమహామహుని కవిత్వము పాఠకులమనంబుల నానందపూరంబుల నోలలాడించుచుండును. పోతనభక్తిపారవశ్యపుకవిత్వమునకును, శ్రీనాథమహాకవి నుడికారములగడుసుందనంపుజిన్నెలకును, కృష్ణరాయమహారాజుల యద్భుత వర్ణనాపటిష్ఠములగుసందర్భములకును దీనికి దానికని యేల ఇంతదనుక మన యాంధ్రసారస్వతమున గల హృద్యములు, రసవద్వర్ణనోదంచితములునగు కావ్యపుమెరుంగులన్నిటికిని ఈరెండుద్విపదకావ్యములే మార్గదర్శకము లనుటలో నేమియు సందియములేదు.

ప్రసిద్ధసాహిత్యవిమర్శకు లగు శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సోమనాథునిగూర్చి "అతనిది అణపరాని ఉద్రేకము. భావబలమే లేని వట్టి శుష్కకల్పనలతో నిండిన మనప్రబంధములవంటివి చదివి చప్పిడిపడిన కొందరిని ఇతనిగ్రంథములు మొదలు మొదలు ఆవకాయవలె ఆకర్షించును. ఇక శివ - శైవభక్తి గలవారిమాట చెప్పబడిలేదు. ఈయుద్రేకపుటూకదంపులకు తోడుగ దిక్కు దశ - తలతోక లేని పవాడముల పునరుక్తులతో సోమనాథుని గ్రంథములు నిండినవి. ఇతడు ఉత్తమోత్తమకవి యని మన మింకను అనుకొనుట కర్థ మేమనగా, మనకావ్యరసానుభవసంస్కారము ఎక్కవలసిన మెట్లింకను గొన్ని కల వనుటయే" అని మొగమోటము లేకుండ చెప్పినారు.

ఎవ రేమన్నప్పటికిని పాల్కురికి సోమనాథునిగూర్చి కృషిచేసినవారిలో నొకరైన డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు తెలిపిన అభిప్రాయములు అందరికిని ఆమోదయోగ్యములు కాగలవు.

"వీరశైవవాఙ్మయము శ్లాఘనీయమయ్యును పరమతదూషణ మాకృతులలోఁ గొన్నియెడల నవధిమీరి యుండుటచే నామతస్థుల కది మోదావహమయ్యు సర్వజనామోదదాయకము మాత్రము కాజాలకపోయినది. అందువలననే సోమనాథుని కావ్యగుణములు మెచ్చుకొని తమరచనలలో నచ్చుపడునట్లు వానిని బాటించిన పలువు రాంధ్రకవులు అతనిని బాహాటముగా స్తుతించుటకు మాత్రము ముందుకు రాలేదు. నవ్యులగు విమర్శకు లాతని మతదృష్టిపైగాక సాహిత్యదృష్టిపైనను భాషాశాస్త్రదృష్టిపైనను తమపరిశోధనలను కేంద్రీకరించిరి. దేశిమార్గాచార్యుడైన సోమనాథుఁడు ఒకసాహిత్యసంప్రదాయస్రవంతికి భగీరథకల్పుఁడై పండితుల భక్తిపూజల నందుకొనుచున్నాడు."

ఈఅభిప్రాయములతో నేకీభవించుచు ప్రసంగము నింతటితో ముగించుచున్నాను. నా కీఅవకాశమును కల్పించిన మిత్రులకు ధన్యవాదములు పలుకుచున్నాను.

# శ్రీకృష్ణదేవరాయలు

## —శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

[యువభారతి యెన్నుకొనిన మూఁడవచైతన్యమూర్తి శ్రీకృష్ణదేవ రాయలు. తెలుగువారి రాజకీయసాహిత్యచరిత్రలలో సువర్ణయుగాలను సృష్టించి జాతిజీవితమున కొక నూతనచైతన్యమును ప్రసాదించిన తెలుఁగుతేడు రాయలు. పదునాఱవశతాబ్ది ప్రథమపాదమున విజయనగర సింహాసన మెక్కి-దక్షిణాపథమున దుర్నిరీక్ష్యతేజముతో ప్రజ్వరిల్లి తెలుగుతేజమును దిగంత విశ్రాంత మొనర్చిన పరాక్రమశాలి రాయలు. తెలుగుకత్తి కెదురు లేని రాయలకాలము రాజకీయముగా తెలుగువారికి గర్వకారణమై చరిత్రలో నిలిచి పోయినది.

రాయలు రాజ్యవిస్తరణమునకే కాక సాహిత్యసామ్రాజ్యవిస్తరణమున కును బూనుకొనిన సాహిత్యసమరాంగణచక్రవర్తి. అతఁడు స్వయముగ మహాకవి. తెలుగుతేని నని నోరార చెప్పుకొని, 'దేశభాషలందు తెలుఁగు లెస్స' యని చాటిన భాషాభిమాని. రాయలకు పూర్వము రాజు లుండిరి గాని సాహిత్యరచనాపోషణము లింత చక్కఁగా రంగరించుకొనిన రసజ్ఞ మూర్తులు కారైరి. విద్యానగరమున తెలుఁగువాణికి వెలుఁగుగద్దె వేయించి, ప్రతివర్షవసంతోత్సవములలోఁ గవుల కావ్యములను సన్మానించి, సాహిత్య గోష్ఠులలో కవితను నిగ్గు తేల్చి, అనువాద కావ్యపద్ధతిని వీడి ప్రబంధపద్ధతికి మార్గము వేసి, ఒక చక్కని సాహిత్యసంప్రదాయ చైతన్యమును చరిత్రలో సృష్టించిన మనీషి రాయలు. ఆసంప్రదాయము ఆపైన రెండుమూడు శతాబ్దులు తెలుగునేలపై తేనెసోనల సీనినది.

రాయలు వైష్ణవమతాభిమాని. కాని, మతసహన మతనికి వెన్నతో వచ్చిన విద్య. ప్రాచీనాంధ్రసాహిత్యచరిత్రలో మతమునకు సాహిత్యమునకు అవినాభావసంబంధము కలదు. తిక్కన తనరచనలలో కళకు ప్రాధాన్యము నిచ్చి మతమునకు గౌణమైన గౌరవము నిచ్చినాఁడు. పాల్కురికి సోమ నాథుఁడు మతమున కిచ్చినంత ప్రాముఖ్యమును కవితాకళ కీయలేదు. రాయలు తనకావ్యమున మతమునకును, కావ్యకవితాకళకును సమప్రాధాన్య మిచ్చి తనవిశిష్టవ్యక్తిత్వమును ప్రతిపాదించుకొనెను.

రాయలు 'మదాలసచరి'త్రాది సంస్కృతకావ్యములు రచించియు "ఆముక్తమాల్యద" యను నాంధ్రప్రబంధమును రచించి ఉభయభాషాకవితాభి శోభితుఁ డయ్యెను. ఆయన కావ్యములు వ్రాయుటయే కాదు. కవులను ప్రోత్స హించి కావ్యములను వ్రాయించెను. కావ్యగోష్ఠుల సంప్రదాయము కల్పించి జాతిలో సాహిత్యచైతన్యమును ప్రసరింపఁజేసెను. కవి యెదురైనచో మద కరీంద్రము డిగ్గి కేలూత యిచ్చి యెక్కించుకొనిన సౌజన్యమూర్తి రాయలు. భారతికి భూపతి భక్తుఁ డనుటకు తనజీవితమునే యొక తార్కాణముగా తీర్చి దిద్దుకొనిన సాహిత్యసంస్కారి రాయలు. ఆయన కృతి కర్తయే కాదు. కృతి భర్తయు. మనుచరిత్రయు, పారిజాతాపహరణమును అతని సాహిత్యాభిమాన రసి కత్వముల కెత్తినకావ్యధ్వజములు. రాయల కావ్యశైలి కడుప్రౌఢమైనది; అనన్యసాధ్యమైనది. ఆయనవ్యుత్పత్తి అపారమైనది. తెలుగున నాతనివలె నూహచేయఁగల భావుకుఁడైన కవి మఱొకఁడులేఁడు. అతఁడు తనకావ్యమును వర్ణనామయము చేసెను. వర్ణనలలో నతఁడు చూపిన సమన్వయము నాన్యతో దర్శనీయము. ఉపాఖ్యానశిల్ప మతని కుగ్గుతో వచ్చిన విద్దె. మధురభక్తి యతని మనసులోపండిన మాన్యపుపంట. అతనివాక్కులలో ప్రతిపదలాస్యము చేయునది వైష్ణవ సంప్రదాయసంస్కారము. ఇవి యన్నియుకలిసి యొకమహా కావ్య మైనవి. అది ఆముక్తమాల్యద. —సంపాదకుడు.]

# ఆముక్తమాల్యద :

విష్ణుచిత్తుఁడు పురశ్శిఖుఁడు. అతఁడు శ్రీవిల్లిపుత్తూరునం దుండెను. దానికి 'ధన్వపుర' మని సంస్కృతీకరణము. 'శ్రీవిల్లిపుత్తూరు' పాండ్యరాజ్యములో నొక ప్రధాననగరము. విష్ణుచిత్తుఁడు గరుడాంశమున జన్మించె నని వైష్ణవుల

విశ్వాసము. అతఁడు పుట్టినది కలియుగాదియందు. ఇతనికిముందు నలువు రాళ్వార్లుండిరి. మొదటివాఁడు 'పొయ్గైయాళ్వార్;' కాసారయోగి, ఇతఁడు పాంచజన్యాంశ. రెండవవాఁడు "పూదత్తాళ్వార్"; భూతయోగి, గదాంశము. "పేయాళ్వార్" తృతీయుఁడు; మహాయోగి, నందకాంశ. వీరందరును ద్వాపర యుగమువారు, సమకాలికులును. "తిరుమలిశైయాళ్వార్" చక్రాంశజుడు; భక్తి సారయోగి. ద్వాపరయుగముకడపటివత్సరమున జన్మము. మొదటి మూవ్వురును దివ్యప్రబంధములో నూరేసి పాటలు పాడిరి. భక్తిసారయోగివి రెండు వందలకు పైగా నున్నవి. విష్ణుచిత్తునిబిడ్డ గోదాదేవి. ఆమె నిజనామము "కోతై". ఈపదమునకును[1] సుమారు పదియర్థములు గలవు. 'స్త్రీ' యని యొకటి. "పూమాల" అని మరియొకటి. మాలికాకరణ మొనర్చు విష్ణుచిత్తున కీశబ్దము రుచించియుండవచ్చును. "గోదా"శబ్దము "కోతై"యనుదాని సంస్కృతమే. ఆళ్వారులు పాడినపాటలకు "దివ్యప్రబంధ" మని పేరు. ఇవి "నాలాయిరమ్" అనఁగా నాలుగువేలు. వీనిలో "తిరుమంగైయాళ్వార్" రచించినవే యెక్కువ. రెండవస్థానము "నమ్మాళ్వార్ల"ది. స్వామియే వీరిని "నమ్మాళ్వార్" మాభక్తుడని పిలిచెను. అతనిది మధురభక్తి. వీరితరువాత పాశురము లెక్కువ పాడినవారు విష్ణుచిత్తులే. వీరివి నాలుగువందలకు పైగా నున్నవి. విష్ణుచిత్తునిది ప్రధానముగా వాత్సల్యభక్తి. ఆళ్వార్లలో నేకైకమహిళ గోదాదేవి. ఆమెపాశురములు నూటదెబ్బదిమూడు. వానిలో "తిరుప్పావై" మొదటిది. కృష్ణుని నాథునిగా గోపికలు వ్రతము పట్టిరిగదా! అట్టినోమే గోదాదేవియు చేపట్టినది. ఆమెరెండవరచన "నాచ్చియార్" 'తిరుమొషి'. "తిరుమొషి" యనఁగా పవిత్రమైనవాక్కన్నమాట. ఇది ముఖ్యముగా రంగనిగూర్చి యామె పడిన విరహవేదన. "తిరుప్పావై" పరిమాణములో చిన్నదైనను గుణములో దొడ్డరచన. తమిళమున దీనిపై ననేకవ్యాఖ్యలు గలవు. ఆమెరచనలో ప్రతిపదమునను స్త్రీసహజమైన లాలిత్యము గనిపించుచుండును. ద్రావిడప్రబంధరచనయే యట్టిది. ఆగానము మేధస్సునకు గాక హృదయమునకు సంబధించినది. ఒకటే ప్రేమోద్గారము. అందునను గోదాదేవిరచన అపురూపమైనది. విష్ణుచిత్తుని రాయలిట్లు వర్ణించెను.

---

1. "పైంగమలత్తణ్ తెరియల్, పట్టర్పిరాన్ కోతై శొన్న శంగత్తమిళ్ మాలై, ముప్పదుం" [తిరుప్పావై]

శా. "అం దుండున్, ద్వయసద్మపద్మవదనుం డద్వంద్వుఁ డశ్రాంతయో
గాందూబద్ధ మధుద్విషద్వరదుఁ డన్వర్థాభిధానుం డురు
చ్ఛందోబృందతదంతవాగ్విపఠనాసంజాతతజ్జన్యని
ష్పందద్వైతసుసంవిదాలయుఁడు, నిష్ఠన్ విష్ణుచిత్తుం డనన్."

వైష్ణవులకు ప్రధానములైనవి మూడుమంత్రములు. 'విష్ణుషడక్షరి' మొదటిది. 'వాసుదేవద్వాదశాక్షరి' రెండవది. మూడవది 'అష్టాక్షరి'. అనఁగా నారాయణమంత్రము. వీనిలో మొదటిరెండును వ్యాప్యములు. నారాయణము వ్యాపకము. మొదటిరెండింటిలో మూడవ దున్నదన్నమాట; మూడవదానిలో మొదటిరెండును లేవు. కనుకనే దానికి "మూలమంత్ర" మని పేరు. మోక్షము నాశించువారు ప్రధానముగా ననుష్ఠించునది మూలమంత్రజపమే. దీనిని ఎల్లప్పుడును జపించుటకు వీలులేదు. నియమితసమయములలో మాత్రమే సాధింప వలెను. దీనికి అంగమయినదే ద్వయము. ద్వయమును సర్వకాలసర్వావస్థల యందును స్త్రీ పురుషులందరును మనన చేయవచ్చును. విష్ణుచిత్తుఁ డాద్వయమును నిరంతరమును జప మొనర్చుచుండెడివాఁడట! ఇచ్చట అద్వంద్వుఁ డనఁగా— అద్వైతి యని అర్థము కాదు. ఉచ్చనీచభావములు లేక అందరిని సమముగా గౌరవించువాఁడనియే తాత్పర్యము. అష్టాంగయోగము లాతఁ డభ్యసించెను. కేవలము అభ్యాసమేగాదు "యోగీశ్వరుఁడు" గూడ. ఆయోగాభ్యాస శృంఖలచేతఁ గట్టువడి 'మన్నారుస్వామి' యను మదద్విరద మాతని హృదయమందే యుండునట! దానిచేత నాతనికి 'విష్ణుచిత్తుఁ' డను పేరు సార్థకమయ్యెను. విష్ణుచిత్తుఁడు ఛందోబృందములు పఠింపలేదు. ఇక తదంతము లేమి చూచును? కాని తజ్జన్య మగు ననుభూతి మాత్రము నిష్పందముగా నున్నది. ఈ విషయమును 'నాథమును' లిట్లు సాయించిరి—

"గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
వరపతి పరిక్లుప్తం, శుల్క మాదాతు కామః
శ్వశుర మమర వంద్యం, రంగనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకమ్ తమ్ విష్ణుచిత్తమ్ నమామి."

అఁతడు పాండ్యరాజుసభలో చేసిన వాదవిషయముగూడ పైశ్లోకమందే యున్నదిగదా! ఈసందర్భమున రాయలు రెండుగొప్పపద్యము లాతనినోటఁ బలికించెను. ఆపద్యము లంద రెఱిఁగినవే. అయినను మరియొకసారి చెప్పికొందమనిపించును.

శా. స్వామీ! నన్ను, నితఃపురాపతితశాస్త్రగంథజాత్యంధు, నా
రామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు, న్నృపద్భవనదాసు, న్వాదిగాఁ బంపుచో
భూమీభృత్సభ నోట మైన నయశంబు ల్మీకుఁ గాకుండునే!

మ. గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా
వహనంబో, వనమాలికాకరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ! వాదములేల, లేరె! యితరు ల్నీలీలకున్ బాత్రముల్?

రాయలరచన చాల ప్రౌఢమైనది. ఆప్రౌఢబంధము వెనుక నున్న లలిత భావము మనహృదయములను ద్రవింపఁజేయును. "అయ్యో! పాప మనిపించును. విష్ణుచిత్తుఁడు భార్యతో లౌకికసంబంధ ముంచికొనలేదు. వైష్ణవాళ్వములలో "తదారాధన" కంటెను తదీయారాధన గొప్పది. "తిరుమంగైయాళ్వారు" జీవితములో నీనిష్ఠ మఱియు స్పష్టముగఁ గానవచ్చును. యామునాచార్యులు దివ్యవిభూతి కేగుచుండిరి. శిష్యుఁడు "తిరువరంగనంబి" యిట్లు ప్రశ్నించెను. "స్వామీ! శ్రీమన్నారాయణుఁడు వాఙ్మనసాతిభూమి. మరి యాతని నుపాసించు టెట్లు"? యామునాచార్యుఁ డొసఁగిన యుత్తర మిది: "భాగవతార్చనమే భగవంతునిసేవ. దైవభక్తునికి జాతిమతములు లేవు. అతఁడు సాకారుఁడైన భగవంతుడు. మీరు హరిజనుఁడైన "తిరుప్పాణాళ్వారు" నుపాసించినచో నారాయణునకు భక్తి చెల్లించినట్లే. భక్తుఁ డెప్పుడును శ్రీమన్నారాయణమూర్తి యైన యర్చావతారములను - భాగవతులను - తదేకభక్తితో నుపాసించును. నాయనా! తిరుప్పాణాళ్వారు భగవంతునకుఁ జెల్లించినసేవ గమనింపుఁడు. "కాంచీపూర్ణుల" వరదరాజస్వామికైంకర్యము అనితరసాధ్యము. వారిపాదముద్రలలో నడచుటయే మీరు తరించుటకు మార్గము." ఈమాట లనుచునే యామునుఁడు "మునివాహనయోగిఁ" దలఁచి సాష్టాంగపడెను. తిరుప్పాణాళ్వారునకు "మునివాహనుఁడు" మారుపేరు. ఇది యొకగాథ. ఇతఁడు పంచముఁడు; "లోకసారంగముని" యీయాళ్వారు నవమానించెను. దానికి శిక్షగా నతఁడు "తిరుప్పాణి"ని భుజములపై నుంచికొని మోసినాఁడు. ఈశిక్ష వేసినది శ్రీరంగనాథుఁడే; విష్ణుచిత్తుఁడు వైష్ణవధర్మము ననుసరించి భాగవతసేవతో కాలము గడుపుచుండెను. శ్రీవిల్లిపుత్తూరు వైష్ణవులతో కిటకిటలాడుచుండెడిది. వారి నాకర్షించినది "రథచరణపాణి" మాత్రమే

కాదు; విష్ణుచిత్తుని భాగవతసేవకూడ. శనివారములైనచో మఱియు విశేషము. ఆనాఁడు భాగవతులు తలంటు లాడుదురు. శనివారమునాఁడు అభ్యంగన మొనర్చికొనుటలో వైష్ణవసంప్రదాయ మున్నది. ఆయందమును రాయ లిట్లు చెప్పినాడు :

చ. కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్పపిండి పైఁ
గుదురుగ నిల్పి, యోపుగతి గూనల నూనియ నుంచి, త్రాట ము
న్నుదికిన శాటి వ్రేల, నది నొక్కఁట గ్రుంకిడి వత్తు రెందరే
వదలక యాతనింట శనివారమునన్ పరదేశివైష్ణవుల్. (1-83)

అఱచేతులలో నరటిదొప్పలలోఁ బట్టికొన్న యిప్పపిండి, గూనియలలో నించి కొన్న నూవులనూనె, మైలయగునని త్రాటితోఁ గూడ గొనిపోవుచున్న మడి బట్టలు ! ఓహో ! దాక్షిణాత్యవైష్ణవాచార మెంత చక్కఁగా నదికినది ! నారికేళ కటాసనములును, "నునుపోకపొత్తిఁ గుట్టిన దొప్పగము"లును, దక్షిణదేశపు టాచారమే. విష్ణుచిత్తుని యాతిథ్య మాయాఋతువులకుఁ దగిన ట్లుండెడిది. గగనము నీటిబుగ్గలుగా జడివట్టును. అప్పుడు వేడివేడి కలమాన్నము, బల్చన ప్రప్పు, నాలుగేసి పొగసినకూరలు, వడియములు, వరుగులు, పెరుగులు, పైపెచ్చు ఘృతప్లుతి. ఈవంటలన్నియు నాయింటియిల్లాలు "నాడికెడపుంబొఱి యలు" దగిలించి వండెడిది. వడ్డించుట యగపలతోనే. వేసవి వచ్చును. వంట మారును. తెలిసులివెచ్చయోగిరము, బెల్ల మెక్కుఁవ వేసిన తియ్యని చారులు, తిమ్మనములు, పలుచనియంబళులు, చెఱకుపాలు, ఎడనీళ్లు, రసదాడి పండ్లు, ఫలావళులు, సుగంధిశీతజలములు, వడపిందెలు, నీరుజల్లు, ఘుమఘుమ లాడు చందనచర్చ. సీతు వేతెంచును. పునుగుందావినవోదనము, మిరియపుఁ బొడులు. "చట్టి చుయ్యను నా దారని కూరగుంపు", "ముకు మందై యేర్చు నావ" తోఁ జిగుర్కొను పచ్చడులు, పాయసాన్నములు, ఊరుగాయలు (ఆవ కాయ గాదు), చే సురుక్కనునేయి, చిఱుపాలవెల్లువ. రాయలకు తమిళములో ప్రవేశ ముండెను. అతఁడు చిన్ననాఁడు తుండీరము — దేవకీపురమం దుండెను. "తుళువనరస" డచ్చోట కొంతకాల ముండినాఁడు. తర్వాత చంద్రగిరిలో నుండెను.

పాపము ! ఇంత కష్టపడి భర్తకు సహకరించిన యావిష్ణుచిత్తుని యిల్లాలిపేరేమో రాయలు తెల్పియున్న బాగుండెడిది ! ఆసందర్భములో నీపద్య మున్నది—

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించినన్ ద్రోయు నెం
తే నాగేంద్రశయానుపుణ్యకథలున్ దివ్యప్రబంధానుసం
ధానధ్వానము 'నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవం చ కృపయా భోక్తవ్య' మన్మాటలున్.''

అర్ధరాత్రియం దాలించినను విష్ణుచిత్తునింటిలో 'నాగేంద్రశయానుపుణ్య కథలే' వినవచ్చెడివి. దివ్యప్రబంధానుసంధానధ్వానమే దిక్కుల ఘూర్ణిత మొనర్చెడిది. అతిథులకుఁ జక్కఁగా వడ్డించి, యాతఁ డాడు ప్రశ్రయ సుందరవాక్యములే కర్ణరసాయనము లగుచుండెను. వైష్ణవుఁడు నిత్యశరణాగతుఁడు; వినయసర్వస్వుఁడు. వైష్ణవుఁ డితరవైష్ణవుని జూచినచో వయో జ్ఞానములతో నిమిత్తము లేకయే దండము సమర్పింపవలెను. ఇది యాచారము. ఒకప్పుడు తెనాలి రామకృష్ణునిదగ్గర నీపద్యచర్చ వచ్చెనట! "కూరలు లేవు, నారలు లేవు; ఇఁక నతిథి యేమి తినును? వాని పిండ' మని రామకృష్ణుఁడు నన్వెనట! ఏదో ఆపాతన్యాయ మైన కొంటెచేష్ట. రామకృష్ణుఁ డిట్లనియుండ డని నావిశ్వాసము. అతఁడు పరిహాసప్రియుఁ డైనను బొత్తిగా వస్తువులపై గౌరవము లేనివాఁడు కాడు. ఎవఁడో దీని నల్లి వానితల కెత్తియుండును. భగవద్రామానుజులు "దివ్యప్రబంధములకు గొప్పగౌరవ మిచ్చెను. వేద మంతయు దానిలో గతార్థ మన్నాఁడు. "తెంగల" "వడహల" సంప్రదాయము లకుఁ గల భేదములలో నిదియు నొకటి. "వడహల"వారు వేదమునకుఁ దొలుత ప్రామాణ్య మిత్తురు. ప్రబంధములకు రెండవతాంబూలము. తెంగల వారిదృష్టిలో వేదములకన్నను ప్రబంధమే గొప్పది."వడహల" సంప్రదాయము నెక్కువ ప్రచారమునకుఁ దెచ్చినది "సర్వతంత్రస్వతంత్రు" లైన దేశికులు. వైష్ణవఉత్సవములలో నీభేదమును మనము గమనింపవచ్చును. వేదపారాయణము ముం దుండును, ప్రబంధము వెనుక నడచును. 'కంచి' మాత్ర మిప్పటికిని దీని కపవాదమే. అచ్చట ప్రబంధమే ముందు పోవును. తమిళములో "పుకళేందుప్పులవర్" అను నొక మహాకవి గలఁడు. అతఁడు "వెణ్బా" వృత్తములో "నలచరిత్ర"ను రచించెను. అందులో నీచరణములు వచ్చును.

'' అతి త్తని క్కోల మానాన్
వేత త్తిన్ మున్నిన్రాన్ ''

ద్రావిడపండితులు దీనిని వ్యాఖ్యానించుచు "వేదములకంటెను ప్రబంధములు గొప్ప వని ధ్వనిమార్గమున నిందు సూచించుచున్నాఁ" డందురు. కంచి నుదాహ

రణము చూపుదురు. కృష్ణదేవరాయలు 'నాగేంద్రశయానుపుణ్యకథలు' తొలుత నుట్టంకించెను. ఆపై దివ్యప్రబంధములఁ దడవెను. ఇతనిది "వడహల" సంప్రదాయ మనుట కిది యొక చిన్నగుర్తు. రాయ లహోబిలమఠశిష్యుఁడు. పంచమతభంజన తాతాచార్యుఁ డాతని యింటిగురువు. ఆతఁడు నూటయెనిమిది దివ్యదేశములపై శ్రీకార్యకర్త. కృష్ణరాయలకు సమకాలికు లగు షష్ఠపరాంకుశులకు పూర్వాశ్రమమున భాగినేయుఁడు. విష్ణుచిత్తునికి లోకసామాన్యగృహస్థధర్మ మెంత తెలియదో అతఁడు రంగధామునకు విన్నవించుకొన్న వచనమును (5. 157) జూచినఁ దెలియును. మందరధరుఁడు తచ్ఛాందసమునకు మందస్మితము సేసెనట! నిజమునకు నవ్వినది రాయలేనేమో! విష్ణుచిత్తుఁ "దబుద్ధేశుధనుఃపత్రి". మాలికాకరణకైంకర్యమే యెఱింగినవాఁడు. అతఁడు గోదాదేవి "కాకఁ బొరలాడుచుండఁగా" తప స్సనుకొనక మఱి యేమిగా భావించును? ఆశిశు వాతనికి తులసీవనమునఁ జిక్కినది. ఆమె భూదేవియవతారము 1. రాయ లామెను "సత్యభామ"గాఁ జెప్పెను (5_74). ఈమార్పు తెలియక చేసినది కాదు2. సత్యభామ యైనచో శృంగారము మరికొంత పసందుగా నుండు ననుకొనెనేమో! సత్యాదేవి పురాణవాఙ్మయములో భూదేవియవతారమే. ఇంతలో గోదాదేవికి అనన్యాదృశముగా బాల్యము జాఱినది. జాఱక యేమి సేయును? నానాటికి తనబ్రదుకు చవుక యైనది. వాతెఱ తొంటికై వడి మాటాడుట లేదు. కుంతలములు కుటిలవృత్తులైనవి. అక్షులు సంపద్గర్వముతో నఱగంటఁ జూచినవి. ఆస్యము బొమ లాడించినది. వక్ష ముపేక్షతోఁ గడకొత్తినది. పాణిపాదము లెఱ్ఱవాఱఁ దొడఁగినవి. మాటలాడించినది తడవు మధ్యము దారిద్ర్యములఁ జెప్పినది. మేను లా చ్ఛోర్వక లోఁగఁజొచ్చినది. నాభి వట్టి గాంభీర్య మొక్కటిని బెట్టికొన్నది. పురుషాభిగమక్షమ మైన వయస్సు; ప్రాగ్జన్మమైత్రితో నాగకన్యక లాయూరనే యిరుగుపొరుగులఁ బుట్టినారు. పుత్రికావివాహములలో పద్మాలయాపరిణయామేయగేయములు విన్నది; అనంతుకల్యాణగుణము లాకట్టినవి. "వినుకలి" వల పారంభ మైనది. తెలిసితెలియని వయస్సు.

---

1. "సాక్షా త్క్షమాం. కరుణయా కమలా మవాణ్యాం ;
గోదా మనన్య శరణ శ్శరణం ప్రపద్యే । (వేదాంతదేశిక, గోదాస్తుతి !)
వల్మీకత శ్శ్రవణతో వసుధాత్మ న స్తే
జాతో బభూవ స మునిః కవిసార్వభౌమః. (గోదాస్తుతి. 7.)

2. 5.37 ; 7.26.

తండ్రి స్వామిసేవకై కట్టెడు "కమ్మచెంగల్వవిరులతోమాలలు" కంఠమునకు "బార్హనిబద్ధఖేటక"మైన కొప్పునఁ బెట్టికొన్నది. "నీలవృషకకుద్రేఖ"తో నెడమ కొక్కొంత యొఱఁగ నిడిన ధమ్మిల్లవలయము, ఘుమఘుమ లాడు చెంగల్వవిరులు "రత్నం సమాగచ్ఛతు కాంచనేన" గా నున్నవి. కూపవారిలో నీడఁ జూచుట, తండ్రికిఁ దెలియకుండ మఱల నట్లే యుంచుట!

దినము లిట్లే గడుచుచున్నవి. ఇంతలో "జితహేమంతము" వసంతము వచ్చినది. ఆమె నెగులునకుఁ బారము లేదు. తండ్రి కాబాధ యర్థముగాదు. అతనికి దిక్కెవ్వరు? స్వామితోఁ జెప్పికొన్నాఁడు. స్వామి యామెను రంగనాథునకు సమర్పించికొమ్మనెను. భక్తుఁడు దేవరయానతినిఁ బాలించినాఁడు. రంగపతి కాతఁడు మామ యయ్యెను. స్వామికే మంగళాశాసన మొనర్చు గౌరవము దక్కినది. అతఁడు పెరియాళ్వా రయ్యెను. ఆమంగళాశాసనమే 'తిరుప్పలాండు'. వైష్ణవుల కీపాశురములు శిరోధార్యములు. రంగనాథుని వరించిన గోదాదేవి "చూడిక్కుడుత్త నాచ్చియా"[1] రైనది. ఆమెయే సంస్కృతమున "ఆముక్తమాల్యద", "ఆండా"ళనియు నందురు. రాయలరచనలోని ప్రధానకథ యిదియే. ఇది చారిత్రకము. తక్కినవి నడుమ వచ్చినవి. యామునాచార్యవృత్తాంతమును చారిత్రకమే. మాలదాసరికథ, ఖాండిక్యకేశిధ్వజ సంవాదము పౌరాణికములు.

యామునాచార్యుఁడు "నాథమునుల" మనుమఁడు. నాథముని యీశ్వరముని కుమారుడు. నాథముని యెంతటి పండితుఁడో అంతటి భక్తుఁడు. "న్యాయతత్త్వము", "యోగతత్త్వము" అను గ్రంథములు వ్రాసెను. "గానటబీసట"గా నుండిన ప్రబంధములను సంకలన మొనర్చి "నాలాయిర" స్వరూప మిచ్చిన దాతఁడే. అతనిని రాయ లిట్లు వర్ణించెను.

సీ. వృషశైలఘురవారిఁ ద్రిషవణస్నానంబు
    నిష్ఠఁ గావించి, యాహ్నికము దీర్చి
యేకాంతగుహ, తత్తటీకుశాసనమున
    నుండి, లక్ష్మీశాంఘ్రిపుండరీక
మంకురత్పులకహర్షాశ్రువై దహరపు
    ష్కరమునఁ భావించి సవిత దిరుగ

1. "చూడిక్కొడుత్త శుడర్కొడియే; తొల్పావై
పాడియరుళవల్ల పల్వళైయాయ్!"

యజ్ఞోపవీత పద్మాక్షమాలికలతో
యోగపట్టికఁ గూడి యురము మెఱయ,
తే. శౌరిఁ దద్ధరణీధ్రవాస్తవ్యుఁ గొలిచి
సతియు నాలర్క-శాక మంచితము వండ,
నిల్కుముందున కర్పించి, వేల్మి దీర్చి,
యిట్లు తనుయాత్ర నడపు ము న్నితనితాత. (4-190)

నాథమునుల కుమారుఁ "ఈశ్వరభట్టాళ్వార్". అతని గర్భశుక్తిముక్తా ఫలమే యామునాచార్యుఁడు. ఇతనితండ్రి చిన్నతనముననే గతించెను. అప్పుడు యామునునకు పదేండ్లవయస్సు. నాథముని పుత్రవియోగముతో సన్న్యాసమును స్వీకరించినాఁడు. రాయల పైపద్యమ స్థితిలోనిదే. కొడుకు బ్రదికియుండగా నొకసారి నాథముని సకుటుంబముగా నుత్తరదేశయాత్ర వెళ్లెనట!

యమునయొడ్డున కోడలు నొప్పులుపడి ప్రసవించినది. అందుకే తాత యామునాచార్యుఁడను పేరు వెట్టెను. ఒకకథ. "వీరనారాయణపురము"ననే పుట్టె నని పక్షాంతరము. తండ్రి గతించెను. తాత సన్న్యాసి యైనాడు. మనుమని పోషణభార మవ్వపైఁ బడినది. విధవయైన తల్లి. పితామహి వివేకముతో సంసారము సాగుచున్నది. యామునుఁడు విష్ణుమూర్తిసింహాసనాంశము; వ్రేలు చూపిన హస్తము మ్రింగెడివాఁడు; పైగా నట్టివారి చదువులు "ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః". యామునుల విద్యాగురువు "మహాభాష్యభట్టరు". ఇంతలో నొక కథ జరిగెను. పాండ్యరాజునభలో నొకపండితుఁ డున్నాఁడు. వానిపేరు "విద్వజ్జన కోలాహలుఁడు; ఇది బిరుదమేమో! అతఁడు వాగ్మి; పండితుఁడు; సమయస్ఫూర్తిగలవాఁడు. ఆపండితుఁ డన్న రాజున కెనలేనిగారవము. దానిని పురస్కరించుకొని వా దేటేట విద్వాంసులనుండి శుల్కమును వసూలు చేయ మొదలు పెట్టెను. ప్రభువుల యభిమానము చిత్రచిత్రముగా నుండును. "కోలాహలు"ని దురాగతములు తెలిసియు రాజు మిన్నకున్నాఁడు.'రాజు తలఁచిన దెబ్బలకు కొదువేమున్నది? రాజ్యమందలి పండితులందరును "కోలాహలు" నికి కప్పములు చెల్లించెడివారు. ఇవ్వకున్నచో వానితో వివాదమునకుఁ దలపడవలెను. "మహాభాష్యభట్టరు" గొప్పవిద్వాంసుఁడు. కాని, పరమసాత్త్వికుఁడు. "ఎందుకు వచ్చినబెడద" యని యతఁడుగూడ కోలాహలునకు శుల్క మిచ్చెడువాఁడు. ఒకసారి వారికడ ధనము లేకపోయినది. రెండేండ్లు బాకీ పడెను. ఆధనము వసూలు చేసికొని రావలసిన దని కోలాహలుఁడు "వంజి" అను నొక నక్షత్రకు

నంపినాఁడు. వాని ప్రవేశమే అవహేళనతో, బూతులతో నుండెను. "వంజి" వచ్చినాఁడు. "భాష్యాచార్య" లూర లేరు. "యామునవటు వేదో పనిచేసికొను చుండెను. గురుధిక్కార మాతనిచెవులలోఁ బడినది. అతఁడు "వంజి" నద లించెను. ఈవామనుఁడు వానికంటె కాగునా! వీఁడు త్రివిక్రముఁ డని వాఁ డెఱుఁగఁడు. అవహేళనములు రెండంత లైనవి. మీగురువును వాదమున కంపవలసిన దని వాఁడు గద్దించినాఁడు. యామునుఁడు గర్జించెను. ఆగర్జ ధార్మిక మైనది. యామునాచార్యుఁ డన్నాడు: "ఓయీ! మాగురువులసత్త్వ గుణము నవకాశముగఁ దీసికొని మీగురువు కోలాహల మొనర్చుచున్నాఁడు. కాని, మాది హయవదనహేషాహలహలము. మీగురువును జయించుటకు మాయాచార్యులు శ్రమతీసికొన నక్కరలేదు. ఈయప్రసిద్ధశిష్యుఁడు చాలును. ఈవిషయము మీగురువుగారితో చెప్పుము". "వంజి" కోల వ్రేసిన క్రోల్పులి యయ్యెను. నడునెత్తిపై తేలుకుట్టినట్లు గంతులు వేయుచు, మధురకుఁ బఱఁ బాఱినాఁడు. ఉన్నవి లేనివి కల్పించి గురువులకు మనవి చేసెను. పాండ్య రాజునకు విన్నవించెను. ప్రభువులకోపము విచిత్రమైనది. ఇంతలో నాబ్రహ్మ చారివయశ్చర్చ వచ్చినది. వాఁ డొక'శింగణా'! వానిమాటల కేమి లెక్క? "భాష్యభట్టరు" వచ్చినతరువాత విచారింత మని కొందరుపండితు లన్నారు. "కాదుకూడదు" వాదము జరుగవలె నని కొందఱిపట్టు. వారి కేవో "భాష్య భట్టరు" పై నసూయలు. రాజు వారిపక్షమునే త్రొక్కెను. యామునవటువు కొఱకు రాజసభనుండి పల్లకి వెళ్ళినది. వెంట నూర్వురుపాదచారులు. పితామ హియు, తల్లియు యామును నదలించినారు. అతఁడు వినలేదు. పల్లకి వచ్చి నదే ప్రయాణ మయ్యెను. అవ్వయు, తల్లియు నేమి సేయుదురు? చేతులు ముడిచికొని కూర్చున్నారు. "భాష్యభట్టరు" తిరిగి వచ్చెను. శిష్యునివిజృంభ ణము తెలిసినది. తా నేమి చేయఁగలఁడు? పాండ్యసభకు తాను బోవుట కిష్టము లేదు. సప్తప్రాకారగతుఁ డై సరసిజముకుళోద్భాసమానవిమానమున నున్న నిద్రాముద్రాభిరాముఁ డైన రంగనాథుఁడే దిక్కనుకొన్నాఁడు. సంపూర్ణశరణా గతుఁ డైనాడు. పాండ్యరాజుసభలోనికి వటువు మాయావటువువలెనే ప్రవేశిం చెను. ప్రసక్తానుప్రసక్తిగ యామునాచార్యుఁ డిట్లు హుంకరించెను.

"న వయం కవయస్తు కేవలం
న వయం కేవల తంత్రపారగాః

అపి తు ప్రతివాదివారణ
ప్రకటాటోపవిపాటనక్షమాః ''

'' ఆశైలాదద్రికన్యాచరణకిసలయన్యాసధన్యోపకణ్ఠా
దారక్షోనీత సీతాముఖకమలసముచ్ఛ్వాసహేతోశ్చ సేతోః
ఆచ ప్రాచ్యప్రతీచ్యక్షితిధరయుగళాదర్కసోమావతంసాత్
మీమాంసాశాస్త్రయుగ్మశ్రమమృదిత మనా మృగ్యతాం మాదృశోఽన్యః ''

ఈబ్రహ్మచారివాలకము మహారాణి కేదో దివ్యవిభూతిగాఁ దోఁచినది. విద్వజ్జనకోలాహలుని కోలాహలము ఆమెకును కంటగింపుగా నుండెను. చాల దినములనుండి వీనిపొగ రణచుటకే యామె గాచికొన్నది. యామునునిగర్జన యామెకు గ్రీష్మసమయనిరుత్సాహకేకిరమణికి నవఘనధ్వని యైనది. బ్రహ్మచారి రాజుకంటి కాగుటయే లేదు. "వీఁడు కోలాహలునకు పిల్లి కెలుక వలెఁ జిక్కినాఁడే" యని నవ్వెను. అగ్నికణము తూలరాశిని గాల్చునటు లీవటువు కోలాహలునిగర్వము నాశ మొనర్చు నని రాణి యన్నది. మాటకు మాట పెరిగెను. బ్రహ్మచారి యోడిపోయినచో తాను దాసీవృత్తి స్వీకరింతు నని యామె యనెను. వీఁడు గెలిచినచో తా నర్ధరాజ్య మిత్తు నని రాజు పణము కట్టెను. కోలాహలునకు వీరిమాటలు సవసవగా వినిపించినవి. అతనికి రాణిపై "తన్నభిమానింప" దను గూఢకోపము కద్దు; వాఁ డామెవైపు తిరిగి వెకిలిగా "ఆళవందారా"! యన్నాఁడు. అనఁగా మిమ్ము రక్షింప వచ్చినాఁడా! యని యర్థము. రాణి యావేశముతో 'ఆళవందార్' అనెను. నాఁటినుండి యామునాచార్యునకు "ఆళవందార్" అనునది మాఱుపే రైనది. కోలాహలున కీబ్రహ్మచారితో వాదము వేడ్కగా నున్నది. వ్యాకరణపుచిట్కాలు ప్రయోగించెను. ఆత్రివిక్రమున కివి లెక్కయా? అలవోకగనే సమాధానము నిచ్చినాఁడు. అష్టావక్రుఁడు జనకునిసభలో వందిని జయించినట్లు నిన్ను నిర్జింతు నని మఱల గర్జించినాఁడు. కోలాహలుఁడు నవ్వెను. క్రమక్రమముగా శాస్త్రవాదము పెరిగినది. తనముందు వీఁ డెందుకు పనికిరానివాఁ డని యనిపింపవలె నని కోలాహలునియాశయము. అతఁ డన్నాఁడు - "ఇఁక శాస్త్రవాదము చాలునులే! నీయిష్టము వచ్చినవాక్యము చెప్పుము. దానిని నేను ఖండింతును." యామునాచార్యులకు పట్టరానంత నవ్వు వచ్చినది. సరే కానీలె మ్మన్నాఁడు. అతఁడు మొదటిప్రశ్న నిట్లు వేసెను.

"మీయమ్మ గొడ్రాలు కాదు. దీనిని ఖండింపుము." కోలాహలుఁ డేమి

బదులు చెప్పును ? తనతల్లి గొల్లడా లైనచో తా నెట్లు పుట్టును ? సమాధానమున కు దిక్కు తోచక మౌనముగా నున్నాఁడు. ఇంతలో రెండవప్రశ్న వచ్చెను. "పాండ్యరాజు ధర్మాత్ముఁడు. దీనిని గా దనుము." ఇది మొదటిదానికంటెను చిక్కుగా నున్నది. కోలాహలుఁడు గ్రుడ్లు తేలవేయుచున్నాఁడు. మూఁడవ ప్రశ్న ఫణము విప్పినది. "ఓయీ కోలాహలా ! మనయెదుట కూర్చున్న మహారాణి సావిత్రివంటి పతివ్రత. దీనిని వివదింపుము."

కోలాహలుని నెత్తిపై కిది పిడుగుపా టయ్యెను. వాఁడు జీవచ్ఛవమైనాఁడు. నాఁటిమర్యాద యేమనఁగా నెదుటివాఁడు ప్రశ్నల కుత్తర మీయలేనప్పుడు వేసినవాఁడే వానిని సమర్థింపవలెను. ఆభారము యామునాచార్యులపైఁ బడినది. నీప్రశ్నలు నీవే వివదింప వలె నని సభవా రన్నారు. యామునుఁ డి ట్లారంభించెను. "ఆర్యులారా ! మీ రందరు పెద్దలు. మీకు నమస్కారము. శ్రోతవ్యమానసూయునా". అతఁడు మనుసంహితవ్యాఖ్యలోని వాక్య మి ట్లందుకొనెను. "ఏకపుత్రో హ్యపుత్ర ఇతి లోకవాదాత్" (ix.61 మేధాతిథిభాష్యము). ఇంకే మున్నది ! సభ నిరుత్తర యైనది. రెండవప్రశ్నవాక్యము నాతఁ డిట్లు వివదించెను. "నాయనలారా ! ఇది కలియుగము. ధర్మ మేకపాదమున నడచును.[1] తక్కినమూఁడుపాదము లధర్మమునకే. మనుస్మృతిలో ప్రజలను న్యాయముగాఁ బాలించురాజునకు వారిపుణ్యమున నాఱవపాలు సంక్రమించు నని యున్నది. అట్లే పాపముగూడ. కలియుగమున రా జెంతనీతివర్తనుఁ డైనను ప్రజలు పాప మొనర్చి తీరెదరు. ఆభారమును రాజు మోసితీరవలెను. ఇఁక నాతఁ డెట్లు ధర్మాత్ముఁ డగును ?

మూఁడవవాక్యమునకు వత్తము[2] రాజు – ప్రభావములో నగ్ని;వాయువు; చంద్రసూర్యులు; ధర్మరాజు; కుబేరవరుణులు; ఇంద్రుఁడు; అందుచే రాజుభార్య యొక్కనికే రాణి గాదు; ఎనిమిదిమందికి. మఱి యామె పతివ్రత యెట్లగును ?

ఇం కేమున్నది. సభనోటికి గడియలు వడినవి. రాణి "ఆళవందార్ ఆళవందా" రని గట్టిగా నఱచినది. విద్వజ్జనకోలాహలుని నో రాగిపోయినది. మాటప్రకారము రాజు వటువున కర్ధరాజ్య మిచ్చెను. యామునాచార్యులు కోలా

1. " సర్వతో ధర్మషడ్భాగో, రాజ్ఞో భవతి రక్షతః
అధర్మాదపి షడ్భాగో, భవత్యస్యహ్యరక్షతః". (మను. 8.304)

2. " సోఽగ్నిర్భవతి వాయుశ్చ, సోఽర్కః సోమ స్స ధర్మరాట్
స కుబేర స్స వరుణః, స మహేంద్రః ప్రభావతః " (మను. 7.7)

హాలుని క్షమించి వదలిపెట్టినాఁడు. "ఆళవందార్" రాజై రాజ్యము సుభిక్షముగా నేలఁజొచ్చెను. ఆధ్యాత్మికచింతన మసక వట్టినది. వైభవములలో మునిఁగితేలుచున్నాఁడు. వృషశైలమున నున్న నాథమునుల కీవృత్తాంతము తెలియవచ్చెను. వారు మనుమనిరాజ్యప్రాప్తికి సంతోషపడలేదు. కీర్తికి తృప్తిపడలేదు. దైవమునకు దూర మయ్యె నని దుఃఖించిరి. ఈచింత వారిని పట్టి పొలార్చుచుండెను. భారతీయులజీవధర్మము విచిత్రమైనది! ఇంతలో వారికి మరణకాలము సమీపించినది. నాథమునులశిష్యుఁడు రామమిశ్రుఁడు. అతనికి "మనక్కాల్‌నంబి" యని పేరు. అతనితో నాథమును లిట్లనిరి :—"నాయనా! సమయమును జూచి నీవు యామునుని గలిసికొమ్ము. వానికిఁ బరతత్త్వ ముపదేశించి, విషయవైముఖ్యమును గలిగింపుము. ఇది నీభారము. "ఈమాట లనుచునే వారు నిత్యవిభూతికి వేంచేసిరి. కొంతకాలము గడచినది. యామునాచార్యుఁడు శత్రువులను గొట్టి కోలాహలము చేయుచున్నాఁడు. అతని కప్పుడు ముప్పదియైదేండ్లు. రామమిశ్రునకు చిత్తశాంతి లేదు. గురుకార్య మేమైనట్లు? ఎన్నియోసారు లాతఁడు మహారాజును గలిసికొన యత్నించెను. సాధ్య పడలేదు. రాజభవనముచుట్టును నిరంతరము విచ్చుకత్తులపారా; మదద్విరదముల ఘీంకారములు; ఆరట్టఘోట్టాణములసకిలింపులు; రాజున కొక్కగడె తీరిక లేదు. తానా బీదబ్రాహ్మణుఁడు. తనకు రాజదర్శన మెట్లగును? అతఁడు వంటవానితో నేస్తము కట్టెను. దినదినమును రాజున కాతఁడు "తుడువలై"— అలర్కశాకమును సరఫరాఁ జేయుచున్నాఁడు అది సత్త్వగుణమును వృద్ధి పఱచును. ఒకనాఁడు రామమిశ్రుఁ డాశాకమును దేలేదు. అకూర వండలేదే మని మహారా జడిగినాఁడు. వంటవాఁడు జరిగినవృత్తాంతమును దెలిపెను. రేపాతని నాదర్శనమునకుఁ "దీసికొనిర" మ్మనిమహారా జన్నాఁడు. ఏకాంతమున దర్శన మైనది.

రామమిశ్రుఁ డనెను : "మహారాజా! తమతోఁ గొంత యొంటిగా విన్నవింపవలెను. సెల విప్పింపుడు." అనుచరు లావలఁ దొలఁగిరి. "మనక్కాల్‌నంబి" యారంభించెను. "స్వామీ! తమతాత నాథమునులు దివ్యవిభూతికి వేంచేసిరి. వారిని దమరు మఱవలే దనుకొందును. ఈసేవకుఁడు వారిదాసుఁడు. ప్రాణోత్క్రమణకాలమందు వారు 'నామనుమనికై యొకనిధిని దాచితిని. దానిని వాని కొప్పగింపవలె' నన్నారు. మహారాజా! ఆనిధి చిత్రమైనది.

సీ. స్ఫుటలమణు ల్గార్లిల శాంతమై శ్వేతమై
నట్టి త్రా చౌక్కటి చుట్టియుండు ;
రక్షోగృహీత మ న్వథ తొల్లి గల దది
పొలయ దం దేడాఱునెలలు గాని ;
యేపాటిబలి యైనఁ జేపడుఁ బ్రాణ హిం
సాది పూజనముల కాసపడదు ;
తనవెలుం గొగి నిరంజనదృష్టికినె లక్ష్య
మై యుండు, నయ్యు నింతంత గాదు;
తే రత్న మొక్కటి పై ననర్ఘంబు మెఱయుఁ;
గలదు పద్మంబు శంఖంబు ; పలుకులేటి
కక్షయ మనంత, మాద్య మేకాంతమందు
భూప, నీ కొక్కనికె కాక చూపరాదు.'' (4.200)

రాజున కప్పుడు ధనముతో నక్కఱ యున్నది. అతఁ డొక శత్రువుపై నెత్తి పోవుచుండెను; నిధిని సంపాదించుటకు రామమిశ్రునివెంట సేనాసమేతుఁడై కదిలినాఁడు. త్రోవలో "నంబి" భగవద్గీతను పఠింపమొదలు పెట్టెను. ఆ గ్రంథముల నెన్నడో యామునుఁడు మఱచినాఁడు. కాని, సంస్కారము దాగి యున్నది. ఆగీతాకావ్యము లాతని చెవులలో నమృతము నింపినవి. తనకు గీత నుపదేశింపు మని యామునుఁడు ప్రార్థించెను. రామమిశ్రుఁడు "రాచ కార్యము లున్నవిగదా!" యని నవ్వుచు నన్నాఁడు. "అవి యుండని మ్మని మహారాజుప్రత్యుత్తరము; గీతాప్రవచన మారంభమయ్యెను. చరమశ్లోకార్థము వినునప్పటికి యామునాచార్యులమనస్సు పూర్తిగా మారిపోయినది. వారు శ్రీరంగమును జొచ్చి కావేరీచంద్రపుష్కరిణులఁ దీర్థమాడిరి; ఆలయమున ప్రవేశించినారు. ఇం కేమున్నది!

క. '' మీ పెద్దలు గూర్చిన ని
క్షేప మ్మిది గొ మ్మటంచు శ్రీరంగపతి
శ్రీపదయుగ్మముఁ జూపిన
నాపృథ్వీపతియు హతనిరస్తభ్రముఁ డై.

రామమిశ్రుఁడు యామునకు పంచసంస్కారము లొనర్చినాఁడు. ద్వయ పూర్వకముగా నష్టాక్షరి నుపదేశించెను. యామానాచార్యుఁడు వెంటనే సన్య సించినాఁడు. అతని గ్రంథములు నాలు గున్నవి. "స్తోత్రరత్న" మొకటి. ఇది నిజముగా రత్నమే. "సిద్ధిత్రయము"— ఇది ఆత్మసిద్ధి, ఈశ్వరసిద్ధి,

సంవిత్సిద్ధి యని మూఁడుభాగములు. "గీతార్థసంగ్రహ" మొకటి. "ఆగమ ప్రామాణ్యము" "చతుశ్శ్లోకి" రెండవస్తోత్రరత్నము. ఈగ్రంథములలో నతఁడు విశిష్టాద్వైతసంప్రదాయమునకుఁ జక్కని రాచబాట వేసినాఁడు. రామానుజుల కాలమున నాతఁ డుండెను. అప్పటి కాతఁడు శతవృద్ధు. రామానుజుల కాలమున యాదవప్రకాశుఁడు దిగ్గజమువంటి పండితుఁడు. అతనికడ భగవద్రామానుజులు బ్రహ్మసూత్రము లభ్యసించుచుండిరి. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనువాక్యముపై వారి కభిప్రాయభేద మేర్పడెను. రామానుజులు దానిపై నొక క్రోడపత్రమును వ్రాసిరి. అది వైష్ణవులచెవులలో ధ్వనించుచున్నది. యామునాచార్యులుగూడ దానిని వినియుండిరి. వా రొకనాఁడు యాదవప్రకాశులతోఁ బాటు పోవుచున్న రామానుజులను జూచినారు. లక్ష్మణాంశజుఁ డగు రామానుజుఁడు వైష్ణవసిద్ధాంతమునకు మూలస్తంభ మగు నని వారు నిర్ధరించుకొనిరి. యామునులు మఱల వారిని జూడలేదు, కాని, వారియాశలుమాత్రము రామానుజులను జుట్టుచునే యున్నవి. యామునాచార్యుల మరణకాలము సమీపించుచున్నది. వారు భగవద్రామానుజులను తమవద్దకు తీసికొనిర మ్మని మహాపూర్ణుల నంపిరి. అతఁడు వారిని దర్శించి "స్తోత్రరత్నము"ను వినిపించినాఁడు. అది రామానుజులహృదయమును గదలించి వేసెను. వారిరువురును శ్రీరంగమునకు వచ్చిరి. అప్పటికే యామునులు దివ్యవిభూతి నందిరి. వారికుడిచేతి యందలి మూఁడువ్రేళ్లు ముడిచికొని యున్నవి. ఎవ రెంత ప్రయత్నించినను సరిగ రాలేదు. దానికిఁ గారణము రామానుజులమనస్సులో భాసించెను. వారిట్లనిరి :

'అహం విష్ణుమతే స్థిత్వా జనా నజ్ఞాన మోహితాన్<br>
పంచసంస్కార సంపన్నాన్, ద్రావిడామ్నాయపారగాన్<br>
ప్రపత్తి ధర్మనిరతాన్, కృత్వా రక్షామి సర్వదా".

ఒకవ్రేలు తెఱచికొన్నది. రామానుజులు మఱల ని ట్లన్నారు :—

' సంగృహ్య నిఖిలా నర్థాన్ తత్త్వజ్ఞాన పరం శుభం<br>
శ్రీభాష్యం చ కరిష్యామి, జనరక్షణహేతునా '

రెండవవ్రేలు గుదిరికొన్నది తదుపరి రామానుజు లన్నారు.

'జీవేశ్వరాదీన్ లోకేభ్యః కృపయా యః పరాశరః<br>
సందర్శయన్ తత్స్వభావాన్ తదుపాయగతీ స్తథా<br>
పురాణరత్నం సంచక్రే మునివర్యః కృపానిధిః

తస్య నామ్నా మహాప్రాజ్ఞః వైష్ణవస్య చ కస్యచిత్
అభిధానం కరిష్యామి, నిష్క్రియార్థం మునే రహమ్ "

పైవాక్యములతో మూఁడవప్రేలు గుదిరికొన్నది. తాను దర్శింపకముందే యామునులు నిత్యవిభూతి నంది రని భగవద్రామానుజులమనస్సు కలగుండు వడినది. ఆచింతతో వారు రంగధాముని దర్శింపనే లేదు. వెంటనే కంచికి తిరిగి వచ్చిరి. ఇది యామానాచార్యులజీవితము.

కృష్ణరాయలు యామునాచార్యచరిత్రను మెలకువతో వ్రాసెను. తొలుతనే "అతివః కలం దొకఁడు మత్పదాశ్రితుఁ డాడిన్" అని చాలభద్రమైన పునాది వేసికొన్నాఁడు. దీనిలో యామునుని పుట్టుపూర్వోత్తములు వివరించి చెప్పఁగొడవ లేకపోయినది. నాథమునులవైభవము రాయలకుఁ దెలియును. యామునాచార్యుల సంపూర్ణగాథ నతఁడు గుర్తెరుఁగును. కాని, తనకు వలయు నంతమాత్రమే పూర్వచరిత్రను దీసికొన్నాఁడు. ఇందులో నాతనివివేక మున్నది. అనవసరవిషయములను బెంచి పెద్దఁజేసి చూపించు ప్రమాదము తప్పినది. "విద్వజ్జనకోలాహలు"నిగాథను రాయలు తడవనే లేదు. మఱి పాండ్యరాజు సభలో వివాదమునకుఁ గారణము ? దీనిని చాల చాకచక్యముగ నాతఁడు నిరూపించినాఁడు.

[1]"కలియుగంబున ద్రవిడమండలంబునఁ గృతమాలాతామ్రపర్ణీతటంబుల మధ్భక్తులు తఱచగుటను, దద్దేశంబున కొడయం డతం డగుటను రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ, దద్రక్షేచ్ఛ యస్మదాభిముఖ్యంబునంగాని పుట్టమియు నే విచారించి, తదాభిముఖ్యకరణార్థంబుగ నాస్థానం బెక్కి వాదివిజయంబు సేయవలయు ననుతలం పవ్విప్రకుమారునకుం బుట్టింప" (4_53) భగవత్ప్రేరణచేతనే యామునాచార్యుఁడు రాజసభలో వాదింప నేగినాఁడు. రాజు శైవుఁడు. దీనిని వివరించునపుడు రాయల మనస్సులో కర్ణాటకములోని వీరశైవమే భాసించియుండు నని నానమ్మకము. పాండ్యరాజుశైవనిష్ఠ నాతఁ డిట్లు వర్ణించెను.

---

1. " కలౌ ఖలు భవిష్యంతి, నారాయణ పరాయణాః
క్వచి త్క్వచి న్మహాభాగా, ద్రావిడేషు చ భూరిశః
తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ
కావేరీ చ మహాభాగా ప్రతీచీ చ మహానదీ " (రహస్యత్రయసారము)

తే. "జంగమే ముత్తరశైవంబుఁ జెంది త్రెంచుఁ;
బతితు లారాధ్య దేవళ్లె ప్రాప్యు లనుచు
నుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు,
వెండి, యే జంగ మెత్తిన వెరఁగుపడును." (4-48)

ఇందులోని జంగాలు శంకరదాసమయ్యలు- ఆరాధ్యులు మొదలైనవారు- కర్ణాటాంధ్రప్రాంతములలోఁ దిరిగెడువారే. "వీరభద్రపళ్లెరము" వారి యాచారమే. యామునుఁడు సభలోఁ బ్రవేశించినపుడు రాజువేష మి ట్లున్నది.

సీ. "పసిఁడిగ చ్చుమర సోపానముల్ మూఁటఁ దుం
గితవిశాలితయుఁ జిత్రితయు నైన
సభ మహోకుముఖపై శార్దూలచర్మఖం
డావృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టురా, హారసంధి రు
ద్రాక్షయుతముఁ దాల్చి యళికభూతి
సురఁటిగాడ్పుల రాల నరుణాయతాక్షుఁ డై
కుఱుగద్దె బిల్లఁ బ్రకోష్ఠ మునిచి,
నందిముద్రితపాణియందుఁ జెకూడి యా
గమములు వినుచు, హేమము పొదివిన
తే. యలతిరుద్రాక్షగమి కుట్టులందు మెఱయ,
వెలితపారంబు మించ దువ్వలువ గప్పి
యడపమును వాఁడివా లొక్కయతివ దాల్ప
భార్య వింజామ రిడ నొప్పు పెండ్యుఁ గనియె.

పైపద్యములో రాజవైభవమును తీసివేసితిమేని, మిగిలినవి "గదగు" ధార్వాడ ప్రాంతములలోని లింగాయతులపోలికలే. విజయనగరసామ్రాజ్యములో నొక్కొక్కసారి యొక్కొక్కమతము పుంజుకొన్నది; అధికారము చెలాయించినది. సామ్రాజ్యప్రారంభమున నద్వైతులు. తరువాత వారు వీరశైవులతో పోటీపడిరి. ప్రౌఢదేవరాయలు వీరశైవుఁడో అద్వైతియో నిర్ణయింప సాధ్యము గాదు; కాని అతనిచుట్టు నున్న దంతయు వీరశైవులబలగమే. లక్కన్న దండేశుఁడు, మారన, మద్దన్న, అక్కమహాదేవి, వీరంద రప్పటివారే. వైష్ణవము విద్యానగరప్రారంభకాలమునుండి యున్నను, అది "యీక, రెక్క" వేసినది సాళ్వతుళువంశకాలమందే. ఆరవీటివారు వీరవైష్ణవులే యైరి. కృష్ణరాయఁడు విశిష్టాద్వైతమును గొప్పగా జీర్ణించికొన్నవాఁడు. అందుచే నాతఁడు

తనకాలములోని లింగాయతులచేష్టలను ధ్వనిమార్గమున వెక్కిరించుచున్నాఁడా యనిపించును. రాజమహిషికి వైష్ణవమునందు తాత్పర్యము. ఆమెను రాయలిట్లు వర్ణించెను :

సీ. ''వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు బెట్టుఁ దాన
దశమినాఁ డేకభుక్తము సేసి యవలినాఁ
డోర్చి జాగరముతో నుండు నిట్రు
బారసి పోనీదు పైనిద్రఁ బాయుట
క్కాలువాఁడు మతుప్పుణ్యకథలఁ ద్రోయు
నేమంపుమూనాళ్లు కామింప దధినాథు
మఱునాఁడు కన్నును మనసు దనియ
తే. నారజపువన్నెఁ బతిసెజ్జ కరుగుఁ గూర్మి
నరుగుచో నాభిఁ దుడిచి కప్పురపునాభి
బెట్టు నిట్టులు మద్భక్తి పుట్టియును ని
జేశునెడ భక్తి చెడదు మదిష్ట మగుట.'' (4-50)

వీరశైవులు వేదముల నధిక్షేపించిరి. వానిపై పండితత్రయమున కున్న ఆదరము వీరికి లేదయ్యెను. అందుచే నావీరశైవము రాయలపాలికి 'వెట్టిశైవము'గానుండె నని నాయూహ. పరిపాలకులకు దేనియం దెక్కువయభినివేశ మున్నను అది వెట్టితలలు వేయును. ఎవఁడో రాయలవంటివాఁడు తప్ప తక్కినవా రందరును తదన్యములకు బాధకు లగుదురు. పాండ్యరాజు వీరశైవ మట్లే పర్యవసించెను. అతఁడు శివధారణ మొనర్చినవాఁ డేపాపము చేసినను దాని నొఁగాదనఁడు. ఆసిద్ధాంతమును మంచిదన్నవారికే యగ్రహారములు, మడులు, మాన్యములు. పాండరాజ్యమందే "తామ్రపర్ణి" పాఱునది. దానిలోని "యలపుట్టరాని ముత్యాలు" వీరమాహేశ్వరుల కంథలకే తీరిపోయినవి. శీలముబట్టియును వీరశైవులు గంజాహాల ఉపాంశున భుజించుచుండిరి. వారి స్ఖాలిత్యములను బైటపెట్టడు. విప్రులదోషములను మాత్రము సభలోఁ బ్రకటించి కనుగిఱుపును. రాజునకు బదులాడువా రెవరు? ఇతర'సమయము'లకుఁ జెందినపండితులక్కడికి రానేరారు. వచ్చినను వారి నెవ్వరును బలుకరింపరు. రాజులలో నున్న యట్టిదోషములన్నియు రాయ లెఱుఁగును. అందుచే నాతఁడు తనయందా దోసగులు రానీయక జాగ్రత్తగా మసలుకొనెనేమో !

'విద్వజ్జనకోలాహలు'ని వివాదవిషయమున యామునాచార్యునిలోఁ

గొంత యౌద్ధత్యము కనపడును. ఆఘట్టము నీతఁడు వినయసుందరముగాఁ దీర్చెను. 'ఆళవందార్' మధుర చేరినాఁడు. రాజదర్శన మెట్లు? తనవిషయమును రాజుచెవి నెవరు వేతురు? సామాన్యులకు ధైర్యము చాలదు. ఒకవేళ చెప్పు వాఁడు గొప్పయధికారి యైనను పాండ్యరాజుపేక్షింపవచ్చును. అందుచే రాజునకు తనవిషయము విన్నవించువారు గొప్పవారు గావలెను. వారిమాట రాజు దృష్టి కాగవలెను. పట్టమహిషి విష్ణుభక్తిపరాయణ యని యామునాచార్యుఁ డెఱిఁగెను. ఆమె పతిహితాచారయును. రాజమహిషిదర్శనము కావలెను. పడమటి ద్వారమును జేరినాఁడు. అచ్చట నానాజనులు గార్పణ్యంబ విద్యగా నామెను యాచించుచుందురు. రాణులు గుప్తాగుప్తప్రకారములతో ద్రవ్యమును బంపుదురు. ముదుసళ్ళగు వర్ణధరులమూలమున నవి వారి కందును. ఏకదండి, త్రిదండి, బ్రహ్మచారుల యున్నమితదండములు 'చేసాచిన' సందిటితోరణములై యుండెడి వట! కాషాయకద్రువ స్త్రీకాపీనములు – ఇవన్నియు విజయనగరమునాఁటి మర్యాదలే. యామునాచార్యుఁడు ఆశీర్వచనాక్షతలు దౌవారికముఖమున దేవి కంపెను. ఇట్లు విన్నవించుకొన్నాఁడు.

"వైదేశికుండ, వైష్ణవవటుండ, వాది గలగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలిచెద. వసుధావరుండు విష్ణుభక్తివిముఖుండు గావున వైష్ణవునిమనవి విన్నవింప నెవ్వారు వెఱతురు. నీవు విష్ణుభక్తిపరాయణవు. పతిహితాచారవుం గావున నీకు విన్నవించి పంపితి. నీవిభుఁడు నీకు విధేయుఁడు. విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి నీదు భర్తకు భగవద్భక్తిఁ బుట్టించి కృతార్థుం గావించెద" (4.53). ఆమె కిం కేమి కావలెను? ఈనాఁటితో తన దుర్వారవ్యథ తీరు ననుకొన్నది. ఆరాజమహిషి "యేకతమ నర్మగోష్ఠి ప్రాణేశుతోడ నతనివిధ మెఱిఁగించినది." ఆచెప్పుటయే రాజును కొరడాతో నదలించిన ట్లయ్యెను. ఇతరులైన యేమి చేసియుండెడి వాఁడో! మహారాణిని గా దనుటకు వీలులేదు. గూఢముగా ని ట్లన్నాఁడు.

క. "భూవల్లభుఁ డెట్లటూ!
తా వాదము సేసి శివమతంబు జయింపఁ
గా వచ్చెనో? చూతముగా
రావింపు మటన్న నాఁటిరాత్రి చనంగన్."

మరుదినము తెల్లవారెను. పరిమితజనమైన యాస్థానములో రాజు కొలువున్నాఁడు. మహారాణిగూడ నక్కడనే యుండెను. ఆమె ధరపాలునకు విన్న

పంచి ప్రతీహారిచేత బ్రహ్మచారిని బిలిపించినది. యామునాచార్యుఁడు వినీతుఁడై చేరనరిగెను. రాజదర్శన మూరక చేయరాదుగదా! మఱి యే మిచ్చును? తనదగ్గర నేమున్నది గనుక! యజ్ఞోపవీతమును గాను కిచ్చి కూర్చున్నాఁడట! ఇట్టిచిన్న విషయములలోఁ గూడ జాగరూకుఁడు రాయలు! పటువురాక రాజున కిష్టము లేదు. కూర్చున్నవాని నాదరింపలేదు. దురుసుగా నిట్లు గర్జించి నాఁడు.

తే. "సంగతియె యోయి! యినుమంత లింగణావు
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు?
నోడితేనియుఁ బట్టి మొత్తో యనంగ
లింగమును గట్ట కుడుగ, మెఱింగి నోడువు"

అతనిని ప్రవేశపెట్టిన రాణిపైనిగూడ నాతనికిఁ గోపము కద్దు. కాని యేమి చేయును? లేనినవ్వుఁ దెచ్చికొని యామెపైపు కఠినముగఁ జూచుచు ని ట్లన్నాఁడు.

క. "అస్మన్మతస్థుఁ డోడిన
భస్మము రుద్రాక్షములును బాసి యితనిచే
విస్మయముగ సాప్తము మురఁ
ఘస్మరచక్రాంకితుండఁ గాఁగలవాఁడన్."

"ఉవిద! యీనీదువిద్వాంసుఁ డోడెనేని, నీకు నితనికి నన్నపూనికయ" అన్నాఁడు. అందు కామె సిద్ధముగనే యున్నది. "ఒప్పితిమి; దేవరానతి దప్పకున్నఁ జాలు" నని ధైర్యముగా నన్నది. వారిరువురిప్రతిజ్ఞలతో పటువునకు భయము గల్గలేదు. గెల్పు తన దని యతఁ డెఱుఁగును. కాని, లోక మర్యాదఁ బాటింపవలె; అతఁడు మాటాడ దొరకొన్నాఁడు. అతని యావాల కము రాయ లెంతో సహజముగ, మనోహరముగ వర్ణించెను.

తే. "అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగఁ, బసుపు
గోచి కట్టిన మోదుగుగోల నెగయఁ
బ్రాంజలి వినీతుఁడై విన్నపం బటంచు
నర్ధముక్తాసనత నిట్టు లనియెఁ బతికి" (4-66)

యామునాచార్యుఁ డాడిన మాట లివి;

క. "దేవా! యిట్లని యానతి
యీవల, దేఁ గడుపుగూటి కిట రా, నాశ
బ్బేవారిఁ బ్రోవ! ధిక్షా
జీవిక పర్ణికిని విధి సృజించెనె గాదే?" (4-67)

తే. "ఎవ్వఁడే సర్వభూతస్థుఁ డిత్తెఱంగు
నకును బ్రేరేచె, నతని యానతియె తెచ్చె,
నెఱిఁగినవి నాల్గు నొడువ నేసుయిన లెస్స;
యతఁడ బొంకిన నేమి సేయంగవచ్చు ?" (4-68)

తే. "పంత మైనను గానిమ్ము పార్థివేంద్ర!
యుక్తులను నిగ్రహస్థాన మొదవె నేని
యమ్మ దెచ్చిన విద్వాంసుఁ డనఁగ వలవ,
దెట్లు గావింపవలయు నట్లట్ల చేయు". (4-69)

వాద మారంభ మైనది. వటువు వాదమును గెలిచి యారాజునకు విష్ణుతత్త్వ ముపదేశించెను. యామునాచార్యులపాత్రచిత్రణ మెంతో సుందరముగా నున్నది. నడుమనడుమ సమకాలికసామాజికమర్యాదలు, రాజమర్యాదలు చొప్పించుచుఁ బోయినాఁడు. ఆనాఁడు సభలో శాస్త్రిచర్చ లిట్లు సాగెడివి :

సీ. "అందులో నొక మేటి కళిముఖుండై యాతఁ
డనిన వన్నియును మున్ననువదించి,
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభ యొదఁబడఁగఁ బల్కి;
ప్రక్కమాటల నెన్న నొక్కొకమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి
క్రందుగా రేఁగినఁ గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలివానికినె మగిడి

తే. మఱి శ్రుతిస్మృతిసూత్రసమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగ మెఱుంగగ రాద్ధాంతముగ నొనర్చి
విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టి." (4-71)

క. నీ వేమంటివి రమ్మం
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి, యొకఁ డొకఁడు రా
నా విప్రుఁడు వాదసరణి నందఱ గెలిచెన్. (4-72)

ఓడిపోయిన పండితుల ప్రవృత్తి నెంతసహజముగఁ జెప్పినాఁడో ! చూడుడు :

సీ. "సెలవులు నాకుచు వెలియ రంగులు సూడ
కరిగి పాదూవాహు నరయువారు;

తమ్మ మోల నుండు నందలముఁ గానక దాటి
పేరెలుంగిడి బెత్తఁ జీరువారు;
నగపు వెల్వడు దాఁకఁ దెగిపోయి మఱి నిల్చి
తోడివిద్వాంసులఁ గూడువారు;
నెదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ
డనునవి తప్ప నూఁకొనెడివారు;
తే. 'వాద మే మాయె?' నన్న 'భూవరుని పత
పాత మాదాసరికిఁ గల్గి బ్రతికె' ననెడు
వారు; 'నౌలెం, డిటు విమర్శదూర మైన
వాకిట వసించు నెవ్వఁ?' డన్వారు నగుచు'' (4-7)

ఓడిపోయిన పండితులందరును కొంతసేపు శృంగాటకములో నిలుతురట! అప్పుడప్పుడు రాజసౌధములవైపుఁ జూచుచు నేవో మంతనము లాడుదురు. రాయల కివియన్నియును బరిచితములే. "ప్రతివర్షమును వసంతోత్సవములు" జరిగెడివి గదా! ఆనాటివిప్రుల వెకలితనమును గూడ రాయ లెఱుగుఁను. పాండ్యరాజు శైవుఁ డగుట బ్రాహ్మణులకు బాధ యైనది. కాని యేమి చేతురు? "జననీ జన్మభూమి శ్చ స్వర్గాదపి గరీయసీ". అలికభూతి గడ్డముల నానునట్లు ధరించినారు. "రుద్రాక్ష లిడ్డ సందియలయందు" సూతసంహిత లిరికించు కొని తిరుగ నారంభించిరట! మఱియొకచోట వీరిప్రస్తావన వచ్చెను. పాండ్య రాజు విప్రుల నిట్లు తెగడినాఁడు.

తే. ''వాదుల మఠంచుఁ జెప్పించి వత్తు; రోట
మైన దయనీరె యేమైన నని విలజ్జ
జూటుఁదనమున సభ లెక్కు చౌరవకాంద్రు
పాఱువారలనుద్ది సెప్పంగనేల?'' (4-61)

వీరశైవులకు స్వయముగా గొంత బ్రాహ్మణద్వేషమేమో! రాయల విజ్ఞత యెందున్న దనఁగా నీమాటలను పాండ్యరాజునోటఁ బలికించుటలో నున్నది. యామునాచార్యులు వాదములో గెలిచినతరువాత పాండ్యరాజు తన రాజ్యమునకు "భాగినేయుండ పట్టార్హుండు గావున పాత్రం బని" బ్రహ్మచారి యగు నతనికి తనగడగొట్టు చెలియలి నిచ్చి పరిణయము చేసెనఁట! చేరమున నీసంప్రదాయ ముండెను. పాండ్యులుగూడ నింతేనేమో! రాయలకుఁ దెలి యనిది మనకుఁ దెలియునా యేమి! క్షత్రియకాంతతో యామునునకుఁ బుత్ర సంతాన మేర్పడినది. ఆకుమారుని పేరేమో! యామునతనూజుఁడు "శొట్ట

నంబి" యని వైష్ణవు లందురు. అతనికి మఱికొందరు కుమారు లుండిరేమో తెలియదు. యామునుఁడు బోధించిన రాజనీతియంతయు రాయలదే! అతని రాజ్యము సర్వరీతుల సుఖంకరముగ నుండెను. రాయల కిచటఁ గాదంబరి దోచినది. ఆశైలిలో వచనము వ్రాసెను. దానిలో నొక వాక్య మిది; "అట్లట్లు వడ మెడఁబట్టి త్రోయుట వెడవెడంబోవు పల్లవులం బండువ తలంటులకు నింటికిం దెచ్చు పణ్యాంగనాభ్రాతల పరిహాసచేష్టలయంద;" (4.187)

గంభీరగ్రంథమునందుఁగూడ నీవిషయమును రాయలు మఱువలేదు. ఆసమాజమున పణ్యాంగనలకుఁ గల గౌరవాగౌరవములు సాధారణములు. శ్రీవిల్లిపుత్తూరులో వా రున్నారు; మధురలో నున్నారు. వారిస్వభావములు భిన్నములు. విష్ణుచిత్తు నెదుర్కొనుటకు వచ్చిన స్థానికులుగూడ "నాగవాసము"ల మఱువలేదు. ఈవిషయములఁ జర్చించుటకు నాకు వేఱొకవ్యాసమే కావలెను. సమకాలికము లైన యంతఃపురమర్యాదలు గూడ కథలో నక్కడక్కడ వచ్చును. నాటి రాణివాసములలో మతస్వాతంత్ర్య ముండెడిది. ప్రౌఢదేవ రాయల యొకభార్య "జెనిమాదేవి". ఆమె జైనమతస్థురాలు. వారిదాంపత్యము వారిమతవిశ్వాసముల కడ్డు రాలేదు. రాణివాసము లొనర్చు గుప్తాగు ప్తదానములును రాయలనాటివే. వర్షధరులకథలును ప్రసిద్ధములే. రాయలచుట్టును వర్షధరు లుండెడివా రని పోర్చుగీసులవ్రాతలే యున్నవి. పడమటిద్వారమున జరుగుసందిటితోరణములు మున్నగు నలంకారములు నాటిస్వభావోక్తులే. రాజులు ప్రభాతముననే శాస్త్రవాదములు బెట్టించెడివారేమో! రాత్రులయందు చారులు మొదలైనవారితో నేకాంతచర్చ లుండెడివి. ఇట్లు యామునాచార్యచరిత్రలో నాతఁడు సముచితము లైన మార్పులు చేసెను. సమకాలికమర్యాదలను స్థానోచితముగ నుంచెను. యామునునిచరిత్రమును తనకౌశలమను స్పర్శవేదితో కనకముగ మార్చినాఁడు.

వైష్ణవుల కార్యక్షేత్రములు ముఖ్యముగ మూఁడు - కంచి, శ్రీరంగము, తిరుపతి. కంచిలోని వరదరాజులు అష్టాక్షరీస్వరూపులు; దివ్యవైకుంఠ మగు శ్రీరంగములోని రంగేశుఁడు సాక్షాన్నారాయణమూర్తి; శేషాచలవాసుఁడు చరమశ్లోకార్థము. విశిష్టాద్వైతమునకు శ్రీసంప్రదాయ మని పేరు. నారాయణుఁడు తొలుత నీసమయమును లక్ష్మి కుపదేశించెను. ఆమె విష్వక్సేనుల కిచ్చినది. భగవద్రామానుజులకు వైష్ణవక్షేత్రము లన్నింటియందును ప్రతిపత్తి

యున్నను, వారిమనస్సు వృషాద్రిపతి యందే లగ్నమైన ట్లున్నది. వారి "శ్రీభాష్య" మందలి ప్రార్థనాశ్లోక మిది.

"అఖిలభువనజన్మస్థేమ భంగాది లీలే
వినత వివిధ భూతవ్రాత రక్షైకదీక్షే
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
మమ భవతు పరస్మిన్ శేముషీ భక్తిరూపా"

ఆళ్వార్లు సాయించిన దివ్యప్రబంధములలో చాలవానిలో ప్రతీకము వెంకటేశ్వరుఁడే. అందుచే రాయలకును శేషాచలప్రభువే యిష్టదైవ మైనాఁడు. అతని ప్రార్థనాపద్య మిది :

"శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానునుఁ గౌస్తుభంబునం
దాకమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం
దాకలితంబు లైన తమ యాకృతు లచ్చుతఁ బైకిఁ దోఁచి, య
స్తోకత నందుఁ దోచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్". (1-1)

ఇందులో ద్వయమును ధ్వనిమార్గమున సూచించినాఁ డని నాయూహ. విశిష్టాద్వైతమున లక్ష్మికి గొప్పస్థాన మున్నది. ఆమె పురుషకారస్వరూపిణి. నిగ్రహ మెఱుఁగనిది. "తెంగలవారిలో నామెస్థానము మఱికొంత యెక్కువ గూడ నేమో! యామునులు 'చతుశ్శ్లోకి'లో ని ట్లన్నారు.

"యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వ ద్వల్లభోపి ప్రభు
ర్నాలం మాతుమి య త్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః"

పైశ్లోకముచేత సమప్రాధాన్యము నిరూపింపఁబడుచునే యున్నది. వారి కవిత్వములు రెండు. "చతుశ్శ్లోకి" "స్తోత్రరత్నము". కృష్ణరాయఁ డీరెంటిని నరనరమునను జీర్ణించుకొనియుండెను. ఇంతేకాదు. వైష్ణవు లొనర్చిన స్తోత్రము లన్నియు నాతని కవగతములు. భగవద్రామానుజులు శరణాగతిగద్యలో తొట్టతొలుత లక్ష్మీదేవికే "శరణాగతు" లైనారు.[1] సాధారణముగ కావ్యములలో మంగళవాచకముగా కవులు "శ్రీ"శబ్దమును వాడుదురు. ఇచ్చట రాయలు శ్రీశబ్దమును వాడుటలో ప్రత్యేకత యున్న దని నాకుఁ దోచును. కారణ

1. 'భగవన్నారాయణాభిమతానురూప రూపగుణ విభవైశ్వర్యశీలాద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణాం, పద్మవనాలయాం, భగవతీం, శ్రియందేవీం, నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవదివ్యమహిషీం, అఖిలజగన్మాతర మస్మ న్మాతర మనన్యశరణశ్శరణ మహం ప్రపద్యే" (శరణాగతిగద్య)

మేమనఁగా చతుశ్శ్లోకిలో యామునులు "శ్రీ రిత్యే వచనామతే" అని శ్రీశబ్దమున కొకవైశిష్ట్యమును జూపినారు. వైష్ణవవ్యాఖ్యాతలు లక్ష్మీదేవిని "శ్రీ" యనుటలో నిన్ని ప్రయోజనములు సాధించిరి.

''శ్రయతీం శ్రీయమాణాం చ, శృణ్వతీం, శృణతీ మపి
శ్రుణాతి నిఖిలం దోషం, శ్రీణాతి చ గుణై ర్జగత్
శ్రీయతే చాఖిలై ర్నిత్యం, శ్రయతే చ పరంపరమ్''.

"రహస్యత్రయసారము"లో నీశ్లోకమును గొప్పగా వ్యాఖ్యానించినారు. కావ్యాదిని "శ్రీ"శబ్దమును వాడుటలో రాయ లీప్రయోజనము లన్నింటిని మనసున నుంచుకొని యుండవచ్చును. "చతుశ్శ్లోకి"లోని నాల్గవశ్లోకమును వ్యాఖ్యానించుచు "సర్వతంత్రస్వతంత్రులు" - "అత్ర లక్ష్మ్యా అపి సత్తా భగవదధీనా, భగవత స్తు వైభవం, రత్నప్రభా పుష్పపరిమళన్యాయేన లక్ష్మ్యాయత్తమ్" అన్నారు. అట్లే మొదటిశ్లోకవ్యాఖ్యానములో "శ్రీమత యేవ సర్వవిభూతిశేషిత్వం" అనియు వ్యాఖ్యానించిరి. ఈవ్రాతలన్నియు రాయలకు నిత్యపరిచితములు. మొదటిపద్యము తరువాత ఆదిశేషులస్తుతి వచ్చును. ఆపద్య మిది.

మ. ''సిరి నొక్కప్పుడు కన్మొఱంగి, హరి ద న్జేర నృగ్రిహర్షించు ను
ర్వరకు న్వంచనఁ గూడఁగాఁ గలుగు భాస్వచ్చంద్రశాలాపరం
పర లయ్యె న్బుఱపైన యెవ్వని ఫణాపంక్తు ల్భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీతబ్రహ్మకల్పాంతునిన్''.

తొలుత ఫణిపతినే యెందుకు స్తుతింపవలసి వచ్చెను? రామానుజులు_వైకుంఠగద్యలో "శేషశేషాసనాది సర్వం పరిజనం" అని దివ్యభోగినే స్తుతించిరి. యామునాచార్యులును "ఫణిపతిశ్శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరః" అని ఫణిపతికే ప్రథమస్థాన మిచ్చిరి. అతఁడు నిత్యశేషుఁడు. సంకర్షణస్వరూపుఁడు. "స్తోత్రరత్నము"లో నీక్రిందిక్రమ మున్నది.

''తయా సహాసీన మనంతభోగిని
ప్రకృష్టవిజ్ఞాన బలైకధామని
ఫణామణివ్రాతమయూఖమండల
ప్రకాశమానోదరదివ్యధామని''. 39.

''నివాసశయ్యాసనపాదుకాంశుకో
పధాన వర్షాతపవారణాదిభిః
శరీరభేదైః స్తవశేషతాం గతైః
యథోచితం, శేషయితే వితేజనైః॥'' 40.

''దాన స్సఖా వాహన మాసనం ధ్వజో
యు స్తే వితానం వ్యజనం త్రయీమయః
ఉపస్థితం తేన, పురోగరుత్మతా
త్వదంఘ్రిసమ్మర్దకిణాంకశోభినా''. 41.

''త్వదీయభుక్తోజ్ఝిత శేషభోజినా
త్వయా నిసృష్టాత్మభరేణ యద్యథా
ప్రియేణ సేనాపతి నాన్యవేదిత
త్తథానుజానంత ముదారవీక్షణైః. 42.

తొలుత శేషుఁడు. పిదప గరుడుఁడు. ఆపైని విష్వక్సేనుఁడు. రాయలు గూడ నీక్రమమునే యనుసరించెను. శేషస్తుతిలో నాతని భాస్వచ్చంద్ర శాలాపరంపర లకు మూలము "యామును"ని దివ్యధామములేమో!

"ఫణిపతి" ప్రస్తావనలో రాయ "లనంత" శబ్దమును వాడెను. అదియును "చతుశ్శ్లోకి"లోనిదే. ఆపదస్వారస్యమును దేశికు లిట్లు నిరూపించినారు.

''గంధర్వాప్సరసస్సిద్ధాః స కిన్నరమహోరగాః
నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయ ముచ్యతే''.

"దాంత" శబ్దమొక్క టున్నది. ఇదియు యామునులు వాడినదే. "దాంతే దయాం తే విదన్". దీనిని వ్యాఖ్యానించుచు దేశికులు "ప్రశ్రితమాత్ర పరో వాఽత్ర దాంతశబ్దః" అన్నారు. ఆవ్యాఖ్యగూడ నిచ్చట ననుసంధేయము. రాయలు "గరుడాళ్వార్ల" నిట్లు స్తుతించెను.

సీ. ఖనటత్పయోబ్ధివీక్ష్యరసాతలానోన్య
పిండీకృతాంగభీతాండజములు;
ధృకుతలాయార్ధఖండితసమిల్లవరూప
చరణాంతికభ్రమత్తరువరములు;
ఘనగుహాఘటిత ఝూంకరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరు మందరములు;
పటుల ఝంపాతరస్స్వనగరీ విపరీత
పాతితాశాకోణ పరివృఢములు;
తే. ప్రబలతర బాడబీకృతేరమ్మదములు
భాస్వరేరమ్మదీకృత బాడబములు
పతగసమ్రాట్పతత్ర ప్రభంజనములు
వ్యజనతూలౌఘములఁ దూల విసరుఁగాత!'',

పైవర్ణనలో వేదాంతదేశికులు రచించిన "గరుడదండక" "గరుడపంచాశత్తు"ల ప్రభావ మున్న దని నాయభిప్రాయము. "గరుడపంచాశతి"లో నీక్రిందిశ్లోకము లున్నవి :

"క్షుణ్ణక్షోణీధరాణి, క్షుభితచతురకూపారరమ్య ద్గమంతి
త్రుటత్తారావరాణి, స్ఫుటితవిబుధస్థానకాని క్షిపేయుః ।
పాతాళబ్రహ్మసౌధావధివిహితముధావర్తనాన్యస్మదార్తిం
బ్రహ్మాండస్యాన్తరాళే, బృహతి, ఖగపతే రర్భక క్రీడితాని ।
విక్షేపైః పక్షతీనా, మనిభృతిగతిభి ర్వాదిత వ్యోమతూర్యో
వాచాలామ్భోధివీచీపలయవిరచితాలోకశబ్దానుబంధః ॥
దిక్కన్యాకీర్యమాణ క్షరదుడునికరవ్యాజ లాజాభిషేకో
నాకోన్మాథాయ గచ్ఛ, న్నరక మపి సమే నాగహన్తా నిహన్తు ।
బ్రుక్షాక్షేపదక్షో మిహిరహిమకరోత్తాలతాలాభిఘాతీ
వేలావాఃకేళిలోలో, వివిధఘనఘటాకన్తుకాఘాతశీలః ।
పాయాన్నః పాతకేభ్యః, పతగకులపతేః పక్షవిక్షేపజాతో
వాతః పాతాళహేలా పటహపటురవారమ్భసంరమ్భధీరః ॥"

రాయలవర్ణనమును పైవానిని దృష్టిలో నుంచుకొని మీరె మనన చేసికొం దని ప్రార్థింతును.

విష్వక్సేనులతరువాత రాయలు పాంచజన్యమును స్తుతించినాఁడు. ఆ పద్య మిది :

మ. "హరి పూరింపఁ దదాస్యమారుతసుగంధాకృష్టి మై నాభిపం
కరుహక్రోడ మిళిందబృంద మెదు రెక్కన్, దుష్క్రియాపంకసం
కరదైత్యానుపరంపరం గముచు రేఖం బొల్చు రాకానిశా
కరణాద్యుతి పాంచజన్య మొసఁగుం గల్యాణసాకల్యమున్".

అ ల్లెందు కొనర్చెను. భగవద్రామానుజులు శరణాగతిగద్యలో ని ట్లన్నారు.

"అచింత్యశక్తి శంఖచక్ర గదాసి శార్ఙ్గాద్య
సంఖ్యేయ నిత్యనిరవద్య నిరతిశయకల్యాణ దివ్యాయుధ!"

పైసందర్భమును వ్యాఖ్యానించుచు దేశికులు "చక్రస్య హేతిరాజత్వేఽపి శంఖస్య పూర్వోక్తిః సర్వశక్తే ర్భగవతః మోక్షప్రదానశక్తి సూచకతయా అభ్యర్హితత్వాఽభిప్రాయా" అన్నాఁడు. ఈవ్యాఖ్య రాయలమనసులో మెదలి యుండును. మహావిష్ణువునకు అసంఖ్యాయుధము లున్నవి గదా ; అయిదింటిని మాత్రమే యెందుకు స్తుతింపవలెను ? దీనికిని దేశికులే సమాధాన మిచ్చిరి. "అత్ర పంచానాం కంఠోక్తిః ప్రాధాన్యాత్"

వాదమునందు గెలిచిన విష్ణుచిత్తుఁడు 'దశావతారస్తుతి' గావించెను. వీనిలోఁ గూడ వైష్ణవస్తోత్రప్రభావ మున్నది. విష్ణుచిత్తీయములోని నరసింహస్తుతి యిది.

మ. "అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిరవ్యాప్త స్వకచ్ఛాంకుఁ గాంచి, సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్ఛేషన్ దదుద్దామదీ
ర్ఘసటాఝాటముఁ బెల్లగించుగతి, నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
జు సితక్రూరభవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా!"

దీనికి మూల మీశ్లోకము.

"నఖక్రకచ కప్రథి క్రథిత దైత్య వక్షస్థలీ
సముత్థరుధిరచ్ఛటాచ్ఛురితబింబితం స్వవపుః
విలోక్య రుషితః పునః ప్రతి మృగేన్ద్ర శంకావశా
ద్య ఏష నరకేసరీ స ఇహ దృశ్యతే సుందరః"

(సుందరబాహుస్తవ. 97)

మత్స్యకూర్మముల వర్ణనకును ఈక్రిందిశ్లోకములు స్ఫోరకము లని నాకు తోఁచును.

"పుచ్ఛోత్పుచ్ఛన మూర్ఛనోద్ధతి ధుతవ్యావర్తితావర్తవ
త్సంవర్తార్ణవ నీరపూరవిలుఠత్పాఠీన దివ్యాకృతేః॥
సింహాద్రీశ, న వైభవం తవ కథం స్యాలక్ష మాలక్ష్యతే
పద్మాక్షస్య జుఘుక్షతోఽపి విభవం, లక్ష్మీధరాధోక్షజ! (90)

"ప్రళయజనీరపూరపరిపూరిత స్వనిలయావసన్నవదన
భ్రమదశరణ్యభూత! శరణార్థి నాకి శరణం భవన్ స్వకృపయా
చలదుదధీరితాంబుకలుషీ క్రియాధ్వగమనస్వపృష్ఠవిధృతా
చలకుల! ఏషమీనతను రత్ర సుందరభుజో, వనాద్రినిలయః" (92)

"స్వపృష్ఠే పృష్ఠాద్రిభ్రమణకరణైః కించ ఫణినో
వికృష్టి వ్యాకృష్టి వ్యతి విధుత దుగ్ధాబ్ధిచలితైః
అవిస్పందో నంద న్వికసదరవిందేక్షణరుచిః
పురా భూ స్సింహాద్రేః ప్రియతమహరే! కచ్ఛపవపుః"

(సుందరబాహుస్తవ - 93)

"చకర్థ శ్రీరంగి న్నిఖిలజగదాధారకమఠో
భవన్ ధర్మా న్కూర్మః పున రమృతమన్థాచలధరః
జగన్థ శ్రేయ స్త్వం, మరతకశిలాపీఠలలితో
జవా దుద్య ల్లక్ష్మీ పదకిసలయన్యాస సులభమ్".

(శ్రీరంగరాజస్తవ. 62)

వైష్ణవగురుపరంపరయం దాతని కెంతో గౌరవము కలదు. వారికి సంబంధించిన యెన్నిగాథలో రాయ లెఱుఁగును. లక్షణాఖ్యయోగీంద్రుఁడు భగవద్రామానుజులు; అతఁడు రంగనాథుని గోపుర మెక్కి అష్టాక్షరి నందరకు నుపదేశించెను గదా! దానిపేరు 'దామోదరగోపుర'మట! మహాపూర్ణులకే 'పెరియనంబి' యని పేరు. ఇతఁడు రామానుజులకు మూలమంత్ర ముపదేశించెను. అతనిని రాయలు దడవినాఁడు. సుందరజామాత వరవరముని; వారికథ యిందులో నున్నది. శఠకోపులవృత్తాంతము వచ్చినది. వేదాంత దేశికుల నాతఁడు దలఁచి నమస్కరించినాఁడు. ఇంకను రాయలు దన గ్రంథమున శ్రీసంప్రదాయరహస్యముల నెన్నిటినో చూపెను. పెద్దనాదులు విశిష్టాద్వైతమును బ్రదుకున కాశ్రయించిరి. రాయలు 'విశ్వాసము'నకుఁ జేపట్టెను. ఇప్పటి కింతే; మరికొంత విపులచర్చ కాలమునుబట్టి, తీరికనుబట్టి.

# వేమన

## — శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

**తొలిమాట :**

ఆంధ్రావళి మోదమున్ బొరయ సంస్కృతభాషయం దున్న వేదాంతమును తెనుగుదనముతో తెనుగుపదాలతో శాంతిపర్వంలో వెల్లువబెట్టించిన తిక్కనమనీషి తర్వాత; ప్రజల అందుబాటులోనికి ద్విపదకవిత్వరూపంలో వేదాంతమును దింపుకొనివచ్చిన శివకవులపిదప; కర్కశతర్కవాదం పొంత బోక, గ్రంథార్థమథనాదుల పనిపట్టించక, అర్థవాదాదులతో విసికింపక, పాండిత్యప్రకర్షను జూపక, జానుతెనుగులో దార్శనికవిషయాలను తెనుగునాటి సామాన్యప్రజావళిచేతిలో ఒలిచిపెట్టినది-కారణజన్ముడు వేమనయోగిపుంగవుడే: తిక్కనసోమయాజి హరిహరనాథఉపాసనాప్రకారమును ఆంధ్రావనిలో నెలకొల్పి, మతస్పర్థలను మాయింపజేసి, సామరస్యమును నెలకొల్పినసిద్ధుడు కాగా, వేమన మంత్రముతోబాటు బ్రాహ్మణాధీనమై యుండిన భాషను గూడ ప్రజల కందించుటకు దార్శనికుడై జాతీయకవియై గురువులమతాధిపత్యమును సడలింపజేయను తిరుగుబాటుకొడి ఎగగట్టిన మతవిప్లవవాది అయినాడు. ఎగతాళితో యూఢాచారాలను విమర్శించి, లోకోక్తులతో దృష్టాంతాలతో సత్యమును బట్టబయలుచేసి, సామాన్యసంసారులలో - అనగా, కొంత చదువుకొనిన బ్రాహ్మణేతరులలో వివేకమును రేగగొట్టగలిగిన పసరుకట్టువిద్యయందు వేమన చాలినవాడు - బాగా చేయితిరిగినవాడు.

యోగవిద్య నభ్యసించి, తత్త్వ మెరిగి మూగనోముతో మూలకూర్చుండక, తాను సాధించినవిద్యను అనుభవించిన ఆధ్యాత్మికరసానుభూతిని లోకు

లకు సమపంక్తిలో వడ్డించిన మర్మయోగి - యీపల్లెటూరికాపు. ఈనూతన ప్రవక్తకు గ్రామీణజీవనమే పాడి. ఆంధ్రవాఙ్మయమున యీతనిస్థానము - తమిళమున వైష్ణవఆళ్వారులు, శైవనాయనమారులస్థానమువంటిదే! వారిలో హాస్యము తక్కువ, వేమనలో ఎక్కువ - ఇంతే వార! తిరుకురళ్ వ్రాసిన తిరువళ్లువరు యీయనసరిఉద్ది.

ఈమాత్రపు మతసంఘసంస్కారమునైనను ఆనాడు ఆంధ్రబ్రాహ్మణ్యము చేయ సాహసింపలేకపోయినది; మతాధిపతులప్రాభవప్రాబల్యాలను వారు ఎదిరించి, నిలువలేకపోయినారు. ఈవిప్లవకార్యము శూద్రవేమనకొరకు ఎదురుచూస్తూ, వైదొలగి ఒకమూల నక్కొనిఉండినది.

**దేశాంతరకీర్తి :**

తెనుగుసీమపొలిమేరలు దాటి వ్యాపించినకీర్తి గలిగిన తెనుగుకవులు ఒకరిద్దరిలో వేమనగూడ ఒకడన్నమాటకు తిరుగుండబోదు. కవిబ్రహ్మ తిక్కన కవితాశిల్పమునకు ఆనందించగలిగినది ఒక్క తెనుగుజాతే అయినది; పోతనభక్తిరసపీయూషమునకు మత్తులు కాగలిగినది ఆంధ్రప్రజే అయినది; రామరాజభూషణుని వసుచరిత్రమాత్రం తమిళ - సంస్కృతములలోనికి కావ్యరూపమున ప్రవేశించగా, కాపలి వెంకట రామస్వామి ఆసక్తివలన ఇంగ్లీషు వచనమున కెక్కినది. పోతనభక్తిమార్గము మహారాష్ట్రులకు ఒకకొంత ఉపాసనాపద్ధతులను గరపినది - అంతే! ఇక వేమనపద్యాలు చాలమందియూరోపీయనులను ఆకర్షించినవి. ఫ్రెంచి, ఇంగ్లీషు, ల్యాటిన్ మొదలగు పాశ్చాత్యరంగముల కెక్కినవి - వేమనఆటవెలదులు! కొన్నిదక్షిణాదిభాషలుగూడ కొన్నిపద్యాలను అనువదించుకొనినవి. సంస్కృతహిందీభాషలు వేమనవేదాంత ప్రవచనవిధానమును చవిజూచి, ఆయనభాషారీతులను జుఱ్ఱుకొనినవి. ఆంధ్ర కవులలో ఒకవిశిష్టకవితాగుణముతో, ఒకప్రత్యేకఆదర్శముతో ప్రపంచపరివ్యాప్తంగా అనువదించదగినకవి వేమనే అని నేడు విమర్శకులు గట్టిగా చెప్పే మాట. ఇది చెల్లదగినమాటగానే ఉన్నది. దీనికి కారణం - వేదాంతం పాతదైనా చెప్పినతీరులో కొత్తదనము జీవము, భాషలో చేవ బిగువు సూటిదనము కలిగిఉండుటే!

ఇట్టి వేమనకీర్తికి హారతులెత్తే చైతన్యలహరికార్యకర్తలు కొనియాడదగినవారు.

ప్రకాశనము :

మూఢాచారునిది మొండిబ్రతుకు. ఒకలాగున చావదు; దానిఅధికార శాసనంక్రింద వేమన మూలబడిపోయినాడు. అప్పుడప్పుడు నిక్కిచూచినాడే గాని, సగర్వంగా సగౌరవంగా తల బయట బెట్టలేకపోయినాడు. కట్టమంచి రామలింగారెడ్డి తమ కవిత్వతత్త్వవిచారంలో ఇట్లా మేలుకొలుపు పాడినారు :

"జన్మముచేతన కవి గావలయును గాని, పఠనము, అభ్యాసము-నివి యుండినమాత్రమున చాలదు. తోడంబుట్టినచాతుర్య ముండినచో నివి సహాయభూతములై వృద్ధిని వికాసమును కల్పింపవచ్చును. స్వాధీనం బగు మనోగాంభీర్య మలవడదేని, కృషిచేయుట విత్తు నాటక ఎరువు పఱచినట్లు; కొన్నిపురుగులుమాత్రము సృష్టికి వచ్చునేమో ।

ఈతత్త్వమునకు ప్రమాణమైనవాడు వేమన. ఇతనికి పుస్తకజ్ఞానము ఇంచుమించు సున్న. వ్యాకరణము, ఛందస్సు, అలంకారశాస్త్రము మొదలగువానిలో నీతనికి సక్తి ఎంత తక్కువో భక్తియు నంత తక్కువ. అట్లుండినను వేమనను మహాకవులలో చేరినవాడని చెప్పుటకై, సామాన్యముగ శుష్కపండితులు దప్ప నింకెవరును సందియంబడరు. కుటిల కులాచారములు, మూఢభక్తి, వేషధారితనము మొదలగువాటిని దూలనాడుట యం దీతం డద్వితీయుడు; గొప్పరహస్యములను బోధించిన వాడైనను, తనకుంగల నైజబుద్ధినేకాని, పలుదెఱంగుల విపరీతవాఖ్యానములకు పాలగు శాస్త్రముల నాశ్రయింపలేదు. అనేకులు, సిద్ధాంతముల కాధారము ప్రాచీనసూత్రము లని నమ్మి, వాటిని వల్లించుటకై జ్ఞాపకశక్తిని వృద్ధిచేయుచు మనశ్శక్తిని గోల్పోయెదరు. ఇక వేమనయన్ననో కారణవిమర్శకశక్తికి బట్టాభిషేకము జేసిన మహాత్ముడు. ఇతనిపద్యములన్నియు లోకోక్తులు. అనగా - బలికినవా డీతండయ్యు, బలుకబడిన మాటలు లోకమువారి హృదయములలో బూర్వమే యుండినట్టివియో, లేక ఇతనిచే నచలముగ నాటబడినట్టివియో యైన వనుట. ఇతనిపద్యములలో పరిహాసము దట్టము. మరుగుమర్యాదలు లేని మోటువిధమున దిట్టడు. నొప్పి జెందువాడు సైతము ఇతరులతో గలసి నవ్వునట్లు చేయగలిగిన సమర్థుడు.

నిదర్శనముల జూపుటలో నిత డద్వితీయుడు. మఱి అవి యెవ్వియు గూఢములు గావు; స్పష్టములు. వైశద్య మనుగుణము ఇతనియందు

ప్రబలము. మనము ప్రతిదినమందును జూచుచు "నింతేకదా!" యని యాదరము నవధానము నుంచకపోవువిషయములనే ఈతడు గ్రహించి, భావనాశక్తిచే కాంతి, రూపము, ప్రాణము నావహింపజేసి మనయెదుట నిలుపగా, నపుడు గుర్తు తెలియక పూర్వము మనచే గర్హింపబడిన వయ్యును నివి యేవో అమానుషవిగ్రహము లని విస్మయము జెంది గారవింతుము. ఈగారడివిద్యలో తెనుగున నితడు ప్రథముడు! సామాన్య వస్తువుల కేదే నొక కామరూపము నిచ్చి వెలయించుట ఈతనిమాహాత్మ్యములలో మొదలింటిది. ప్రకృతి యనగ, మనవారిలో అనేకులకు నిఘంటువులలో నుండు ప్రకృతియే గాని, మూలింటికి బయట నున్న ప్రకృతి ఎట్టిదో తమ సొంతకనులతో చూచినపాపమున బోరు. అట్టివారికి వేమన అనుసరణీయమగు త్రోవ జూపినా డనుటలో నించుకయు గుణాధిక్యస్తుతి లేదు."

ఇది కట్టమంచివారి సూత్రప్రాయమైన సత్యము; ఇక దీనితర్వాత వెలువడిన వ్రాత లన్ని దీనికి భాష్యములే!

**పాశ్చాత్యులు :**

దీనికి ముందే, పడమటిదొరలు వేమనపట్ల ముగ్ధులై ఇట్లు చాటినారు :

రామకృష్ణపరమహంస పూర్వకవిరూపమే వేమన-వేమన ఉపదేశకుడు, ప్రవక్త-ప్రజాకవులలో వేమన ఒక్కడే మహాకవి. వేమన తనయుగపురోగామి-వేమన ఒకతిరుగుబాటుకవి – వేమన తెనుగుకవులందరిలోను ఎక్కువ ప్రజాభిమానమును పొందిన లోకకవి! – అనిరి.

ఇక లాయనల్ డేవిడ్ బార్నెట్ ఇంపున కరగిపోయి, ఇట్లనుచున్నాడు : రక్తమాంసములు మానవశరీరరూపమును దాల్చి, వేమన అనే పేరుతో ఈభూతలమున అడుగిడి, నిజంగా దానిని పవిత్రంచేసియుండునా? మానవహృదయాంతరాళపరీక్షకు డొకడు లోకప్రవక్తల ఉపదేశములను విలువలు గట్టను తూచినఎడల, ఎందరో ఉన్నతులు, ఎన్నియో మహిమోపేతాత్మలు ఈతెలంగాణావినీతవినమ్రకృషికునికంటె ఎంతో తక్కువగా తూగినట్లు తెలిసికోగలడు-అని వైతాళికుడై కీర్తిశంఖమును పూరించినాడు.

ఇవి ఆంగ్లములో నుండుటచే ఆంధ్రులకంట అంతగా పడలేదు. వీటి తెలుగుసేత పూర్వపుణ్యఫలితముగా నాకు దక్కినది. ఈ ఆంగ్లవ్యాససంకలనము మిత్రుడు-నార్ల వెంకటేశ్వరరావుగారు గావించి ప్రచురించినారు.

## 1. జన్మాదికములు : అద్వైతానుభవము

కాని, ఇట్టికవి — యోగి జన్మాదికములు పుక్కిటిపురాణముల ఒడిలో నిద్రించుచుండుట, ఆంధ్రుల సంస్కృతికి అలముకొనిన విషాదములలో ఒకటి. అయినా ఇంతవరకు తేలిన అంశాలపిండితార్థాన్ని మీఎదుట బెట్టు చున్నాను.

**కులము - నివాసము :**

కులములే వద్దనిన వేమనకులం చెప్పవలసివస్తే — ఆయన పంటరెడ్డి. రెడ్లపేర్లు వడ్లపేర్లు లెక్కబెట్టలేరట ! 'కలియుగమున కాపుకులానికి వేమన తనకీర్తి విక్రయించె' అని చెప్పుకొని యీకులముపై కొంత అభిమానమును చూపినాడు. కొండవీటిరెడ్డిరాజులకు చుట్టమనేది అతివ్యాప్తి జెందిన జనశ్రుతి మాత్రమే. ఈకథలన్నీ చరిత్రకు చాల దూరము. గండికోట దుర్గాధిపతిగా నుండిన ఒకరెడ్డి, వేమనకు అన్న అని ఒకవృత్తాంతము వాడుకలో నున్నది ; ఇది నిజం కావచ్చును. ఈగండికోట, కడపజిల్లాలో పెన్నఒడ్డున ఒకపెద్ద కోనలో ఇప్పుడు ఒకచిన్నపల్లెగా నున్నది. ఆనాడు ఇది పెద్దకోట; "గండి కోటలో గడియ వేసినారు" అన్న సామెత ఏర్పడి ఉండినది. అనగా — ఆపెద్ద గడియ వేసిన చాలాదూరం వినబడేది అనుట. "కడగి గండికోటపురంబు కదల ద్రవ్వె" అని కృష్ణదేవరాయలకు ఒక మగటిమిబిరుదము. ఇట్లా ఈయన అభిజనాదులను చిత్తూరు తిరువేంగడం (వేంకటాచలం) మొదలు, కర్నూలు తుంగభద్రాతీరమువరకు వ్యాపింపజేసి ఉన్నారు. దీనిని కాదనేవారే లేరు. అంటే - రాళ్ళసీమ - రాయలసీమవాసి వేమన !

ఆయన వాడినపదాలు అప్పటంగా రాయలసీమవే. వీటిలో చాలవరకు నెల్లూరుప్రాంతంలోగూడ వాడుకలో గలవు. దేశదిమ్మరి కాబట్టి మరికొన్ని ప్రాంతపదాలు గూడ దూరినవి. బిత్తలి (దిసమొల) బసివి (వ్యభిచారి). అనంతపురం ప్రాంతంలో మొదటిఆడకాన్పును దేవునిపేర పెండ్లిపేరంటము లేక వదలివేయుదురు. ఇది దేవదాసిపద్ధతి వంటిది. బసివికి కులమర్యాద లున్నా రానురాను దేవదాసి ఆటవెలది అయినట్లు పరువు పోగొట్టుకొనినది. ఈ పడుచుకు తండ్రిఆస్తిలో భాగంగూడ ఉండేది. బయిసి (గౌరవము, క్షాత్రము) సొడ్డు (సాకు) ఆకువక్క (తాంబూలము) ఒకప్రొద్దు (ఉపవాసము) కుళ్లబోతు, పుట్టి (ఏరుదాటుటకు ఉపయోగించు గుండ్రనిగిన్నెవంటి చిన్నపడవ. వెదురు

పేళ్ళతో అల్లిన దీనిని బయట తోలుతో కప్పుదురు) మొప్పి, ఊటచెలమ, ఒడ్డుపొడుగు, గురి, దాలిగుంట (నీళ్లుకాచుకొనేదానికి త్రవ్వినగుంట; దీనిలో, నీళ్ళకుండ బెట్టి చుట్టూ చెత్తచెదారం తొక్కి నిప్పుబెట్టుదురు) తరువుకాడు (అప్పులుదండు నక్షత్రకుడు).

**కొండవీడు :**

**ఊరు కొండవీడు, యునికి పశ్చిమవీధి**
**మూగసేత కెల్ల మొదటియిల్లు**
**యరసి చూడ జూడ నది మార్గము...**

**వీడు కొండవీడు, వీధి పశ్చిమవీధి**
**మూగచింత కెల్ల మొదటిత్రోవ**
**త్రోవ దెలిసినవారికి దొరకునయా లాభంబు... (?)**

**ఊరు కొండవీడు, ఉనికి పశ్చిమవీధి**
**మూగచింతపల్లె మొదటియిల్లు**
***ఎడ్డె రెడ్డికుల మదే మని దెల్పుదు...**

అన్న భిన్నపాఠాలపద్యాలనుబట్టి వేమన కొండవీటివా డని మొదట భావించే వారు. ఈపద్యాలకు వేదాంతపరంగా, మనవారితోబాటు, మేజర్ ఎం. ఆర్. మ్యాక్‌డొనాల్డు గూడ అర్థం చెప్పి, కొండవీటి ఉనికివాదాన్ని నెట్టివేస్తున్నారు.

**మూగచింతపల్లె :**

చిత్తూరుజిల్లా చంద్రగిరిదగ్గర, మూగచింతపల్లె అనేగ్రామం ఉన్నది. ఈ పేరుగల పల్లెటూరు ఇంకెక్కడా లేదు. అందుచేత వేమన యీఊర పుట్టి పెరిగినా డని, ఇప్పుడు సహేతుకంగానే నిర్ణయించి ఉన్నారు.

ఈలోకకవి తండ్రి – రెడ్డన్న. ముప్పూట తిని త్రాగి, సద్ది మిగిల్చి, ఒకరి కింత పెట్టగలిగిన సంపన్నకుటుంబం వీరిది. కాబట్టే_"నేయి లేని తిండి నీయాన కసు వది, కూరలేని తిండి కుక్కతిండి" అని అనగలిగినాడు. "ఉప్పు చింతపండు ఊరిలో నుండగా కర వదేల వచ్చె కాపులార" అని ఆనందించే సుఖజీవులు ఆపల్లెటూరువారు. వేమన ఆఊరి వీధిబడిలోనే చదువుకొన్నాడు. కాలక్రమేణా కొండవీడు చేరి, చుట్టాలయింట పెరిగి పెద్ద అయినా డని

* 'రెడ్డిమడ్డి' అని మాజిల్లాలో ఛలోక్తి.

కొందరిమతము. అప్పటిగురువు సోమశేఖరం. చదువుతో బాటు సేద్యపు పనులుగూడ నేర్చుకొన్నాడు. చాటుపద్యాలు భట్రాజుపదాలు విని కవితారీతులు చిన్నప్పుడే ఒంటబట్టినవి. తల్లిదండ్రు లనిన మంచిభక్తిప్రపత్తులు కలిగి యుండినాడు.

కటారుపల్లె, కందిమల్లయపల్లెలలో వేమన తిరిగినాడు. ఈయనను మావాడు అన్నగ్రామాలు–కడపచిట్టివేలు, గుంటూరు ఇనుకొండ (వినుకొండ,) కర్నూలుక్రిష్టిపాడు.

**వెలయాలు - ఇల్లాలు :**

ఆనాటి పల్లెటూళ్ళపరిస్థితుల ననుసరించి, సంపన్నకుటుంబాల ఎదిగిన బిడ్డలకు అలవడే అలవాట్లన్నిటికి వేమన మరిగినాడు. అందులో రెడ్డిరికం బాగా సాగించుకొన్నట్లున్నది. బుజిగారంవల్ల నడతలో కొరత ఏర్పడినది. కోడెప్రాయపు పోకిరితనము, మాటసాగిన రెడ్డితనము స్త్రీలోలునిగా జేసినవి. లంజిరకానికి, వెలియాలిప్రేమకు అగ్గమైపోయినాడు. చివరకు, ఎక్కువతీపు దినినవానికి మొగం మొత్తినట్లు వెగటుతో –

**ఇంటియాలి విడిచి యిల జారకాంతల**
**వెంట దిరుగువాడు వెట్టివాడు;**
**పంటచేను విడిచి పరిగ లేరినయట్లు...**

అని, కామశాస్త్రవైరాగ్యంతో ఓనమాలు ప్రారంభించి, క్రమేణా–'లంజ, లంజ కాని లావెల్ల గొనియాడు, లంజతల్లి వానిలజ్జ కడుగు'–అని తేల్చుకొని, 'సానె దానిపొందు సౌభాగ్యభాగ్యంబు' - అనిన తనసొంతపాతసూత్రాన్ని త్రిప్పివ్రాసి, పెండ్లి చేసుకొన్నాడు.

**ఇంటిఆలు విడిచి ఎట్లుండవచ్చురా ?-**

**సుగుణవంతురాలు సుదతియై యుండిన**
**బుద్ధిమంతు లగుచు బుత్రు లొప్పు;**
**స్వర్గ మేటి కయ్య సంసారి కింకను-**

భవసాగరము ఆనందసాగర మని, ఆలు పూలతెప్ప అని మురిసిపోయినాడు. ఆవల ఆలు గయ్యాళి అయినదో మాట వినలేదో గాని, "ఇంటిలోనిపోరు ఇంతింత అనలేము " అని కొద్దికొద్దిగా మసకగ్రమ్ముచున్న సంసారదర్పణాన్ని బయటకు దీస్తున్నాడు.

కలిమినాడు మగని కామిని జూచును,
లేమి జిక్కునాడు లేవకుండు;
మనిన మగనినైన మడియంగ జూచును...

అని తనివిటీరక, ఇంకొకపద్యంలో

కలిమిగలిగెనేని కాముగా జూతురు
లేమిచేత జిక్కి లేవలేని
మదనువంటివాని మాలగా జూతురు...

అని లోపల ఉన్న పొంగునంతా మనసుకు నచ్చని ఇల్లాలిపై వెడలగ్రక్కినాడు. ఊరివారంతా తనమాట బొదల దాల్చాలనే రెడ్డి, తన పెండ్లాము పెడకట్టె తనాన్ని దిగద్రాగగలడా?

[ఈ పద్యాలను సుమతిశతకంపద్యంతో పోల్చిచూడండి:

గడన గల మగని జూచిన
అడుగడుగున మడుగు లిడుదు రతివలు దమలో
గడనుడుగు మగని జూచిన
నడపీనుగ వచ్చె ననుచు నగుదురు సుమతీ.]

రానురాను స్త్రీజనద్వేషి అయినాడు.

"అన్యపురుషవాంఛ ఆడుదానికి నుండు", "ఆడుదానిబొంకు గోడబెట్టి నయట్లు" అని సంసారులను హెచ్చరించుచు, ఈనినపులివలె స్త్రీలపై బడి విమర్శించినాడు. చివరకు "బ్రహ్మ ఆలితాడు బండిరేవున దెంచ" అంటూ దేవుని పైన చేరెడుమన్ను బోసినాడు. క్రమేణా తనబుద్ధిని అంతర్ముఖము చేసికొని, ఆధ్యాత్మికపథంలో పయనం సాగించినాడు. ఈపరస్పరభిన్నధోరణులను సమన్వయించలేక, పైపైవిమర్శకులు ఈ పద్యాలు వేమనవి కావేమో అని సంశయించినారు. కాని, ఇవి ఆయన మానసిక ఆధ్యాత్మికభావపరిణామాన్ని సూచించే జీవచిహ్నాలు - ఆపరమపథంలో సోపానా లని గుర్తించవలసియున్నది. ఆయనయోచనాసరణి గొంతెత్తి పద్యాలలో ప్రతిధ్వనించినది. He was thinking aloud అని అనవచ్చును. ఇవి వేమనసాధనక్రమమునకు సంక్షిప్తలేఖనములవంటివి (Notes).

**వీదరికం :**

రెడ్డిరా జనిపించుకోను గామాల, పిడికిళ్లతో దానం చేసినాడు. ఉద్యోగంలో ఉండి, భద్రాచలరామదాసుకు దారి చూపనో అన్నట్లు రాచబొక్కసా

లకు తూట్లుగొట్టినాడు. దారిదోపిళ్ళతో బీదలను పోషించిన తిరుమంగఆళ్వారుకు ముక్తి రాగా, అది తనకు అందకపోతుందా అని, మనసును నమ్మబలుకు కొన్నట్లున్నది.

దీనితో దినవెచ్చానికే కరువు ఏర్పడింది. ఇక దానా లెక్కడ? హేమ కారకవిద్యావ్యామోహంతో బైరాగుల వెంటబడినాడు. బంగారం చేయగలిగి నాడో లేదో గాని, అందరు వాదభ్రష్ఠులవలెనే వైద్యశ్రేష్ఠుడైనాడు— ఈవేమన దొర! పరుసవేదివిద్యనుగూర్చి వేమన చాలాపద్యములు చెప్పిఉన్నాడు.

**ఇహమున సుఖియింప హేమకారకవిద్య**
**పరమున సుఖియింప బ్రహ్మవిద్య,**
**కడమవిద్య లెల్ల కల్ల ...**

అని దీనిని ఎత్తిపెట్టుచున్నాడు. నేటిఅణుశాస్త్రజ్ఞులు పాదరసమును బంగారుగా మార్చుట సాధ్యమనుచున్నారుగదా!

**కటారుపల్లెవాసము :**

కటారుపల్లెప్రాంతంలో ఈక్రింది ఉదంతం ప్రచారంలో ఉన్నట్లు విలియం హోవర్డు క్యాంబెల్ వ్రాస్తున్నాడు (1859 - 1910). వేమన భూజీ వనం ఆధారంగా గలిగిన ఒకసంపన్నకాపుకుటుంబంలో పుట్టి పెరిగినాడు. కాపులంటే - రాయలసీమ నెల్లూరుమండలాలలో రెడ్లే! పంటకాపు, పాకనాటి కాపు, దేసూరుకాపు అని వ్రాసుకొందురు - చెప్పుకొందురు. సేద్యపుపనులలో మునిగితేలుచు, సందు దొరికినప్పుడే ఏభట్రాజో (వీళ్లను కనివాళ్లు అని గూడ అంటారు) ఏబ్రాహ్మణుడో, సంపన్నకుటుంబాలపంచన నడిపించే పల్లెకూటంలో చదువుకొన్నాడు. తోడిపిల్లకాయలతో విచ్చలవిడిగా ఆరుబయట పొలాలలో ఆడుకొన్నాడు. ఒకనాడు ఒకకొండకోనలో, ఒకయోగి వేమనను పిలిపించు కొని, మంత్రోపదేశం చేసి, కవిగా శాశ్వతకీర్తి పొందుతా వని దీవించినాడు.

మిసమిస లాడే పొంగుప్రాయంలో, బలిసి, కారెలుదీరిన రెండెద్దులు పోరాడుకొనుచుండగా, కండలు దిరిగిన అంగసౌష్టవం కలిగిన వేమన, వాటిని కొమ్మలను బట్టుకొని నెట్టివేసి కోడెలతగవు దీర్చినాడట. అప్పుడు ఊడిన మొలపంచను మరల కట్టక యోగి యైనాడట.

**తల్లిగర్భమందు తా బుట్టినప్పుడు**
**మొదలు బట్ట లేదు తుదను లేదు,**
**నడుమ బట్ట గట్ట నగుబాటు గాదొకో**

అని నాడుగదా! ఈకథకు ఆధారాలు లేవు.

**గురువు - యోగవిద్య :**

బైరాగులలో తిరుగాడేటప్పుడు లంబికాశివయోగిశుశ్రూష లభించినది. "గురుడు చిల్లగింజ" అని తెలిసికొన్నాడు. ఇతడు హఠయోగి. వేమన పంచాక్షరీజపంతో ప్రాణాయామాదులను సాధన జేసి, కొన్నిమహిమ లార్జించినాడు. షట్చక్రభేదనమునకు మూలమైన కుండలినీయోగమును సాధించి, హఠప్రయోగం తర్వాత వేధదీక్ష - అంటే, గురువుచేత శారీరకబాధకు లోనై రాజయోగి అయినాడు. ఇదంతా ఆయనపద్యాలను పరికించిచూచిన తెలియగలదు. కడపటిమెట్టుగా రాజయోగపరమావధి అయిన అద్వైతానుభవమును పొందినాడు. జ్యోతిషవిద్యావాసనలుగూడ వేమనవ్రాతలందు పొడకట్టుచున్నవి.

> **బయలున సర్వము బుట్టును**
> **బయలందే లీనమగును, బ్రహ్మం బనగా**
> **బయ లని మదిలో దెలిసిన**
> **బయలందే ముక్తి బట్టబయ లగు వేమా...**

అని లోకానికి చాటినాడు - యీ అనుభవయోగి! ఈక్రమపరిణామము యీయనభావసరణిలో యీయనపద్యాలలో బాగా కనబడుచున్నది. ఈసిద్ధి హఠాత్తుగా గారడివాని మామిడిమొక్కవలె మోమెత్తినది గాదు. కాబట్టే ఆపాతంగా (పైపైన) చూచేవారికి వేమనసిద్ధాంతాలలో వైరుధ్యం కనిపించుచుండును. వేశ్యలను పొగడి తెగడుట, సంసారమును ఆగ్గించుట క్రిందుచేయుట, బాహ్యాచారాలను ఖండించుట, కపటయోగులను గర్హించుట మొదలగు వాటిని యీపరిణామదృష్టితో సరిపెట్టుకోవలసి ఉన్నది. ఆయనబుద్ధిపరిపాకము ఆధ్యాత్మికపురోగమనపథంలో యీభిన్నాంశాలు మార్గదర్శకచిహ్నాలే గాని భిన్నాలుగావు. స్వానుభవంతో గుణాతీతుడై జీవన్ముక్తుడై అతీతమానవుడైనాడు వేమన! (Super - man). చివరకు అవధూతస్థితిని గూడ అందుకొనినాడు.

ఈపరిణామం ప్రతిసాధకునిలోను కనుపించేదే! ఏసు, క్రీస్తు (అభిషిక్తుడు) అగుటకుముందు, మొదట మరియమ్మ పుత్రుడని, ఆవల పరిశుద్ధాత్మపుత్రు డని, చివరకు తానే సర్వానికి మూలమని - గీతలో శ్రీకృష్ణుడు చెప్పుకొనినట్లు చెప్పుకొనినాడు. ఇది సామాన్యక్రైస్తవునికి అర్థంగాని మత విభ్రమస్థితి. పంచకోశాలను ఛేదించగలిగిన మనవేదాంతులే అర్థం చేసుకోగలిగిన బ్రహ్మానుభవం ఇది!

**వేమనకాలము :**

చరిత్రను పురాణాలతో మేళవించి, భారతజాతిచరిత్ర హీనమైనది; కాని అదృష్టవశాత్తు, హీనచరిత్రులముమాత్రం కాలేదు. ఇప్పుడిప్పుడే చరిత్రకంటె భూగోళశాస్త్రము ముదుసలి యని గుర్తించి, దానిద్వారా విస్మృతిగర్భంలో నిద్రించియున్న ప్రాచీనచరిత్రాంశాలను బయటికి తీస్తున్నారు. వేమననుగూర్చి ఆనాడు దొరలవలె, యీశతాబ్దంలో మనవారు పరిశోధనలు విమర్శనలు గావించి, గుర్తించి కాలాదులను నిర్ణయించినారు. కాని, ఒకదాని కొకటి పొత్తు కుదురలేదు. 1412 మొదలు 1725 వరకు, కొండగుర్తుగా వేమన జన్మాదికముల జూపుచున్నారేగాని, సూటిగా ఇదీ అని నిర్ణయించలేకున్నారు. క్రింది విధాన వేమనకాలాన్ని నిర్ణయించుకో గలుగుచున్నాము. చూడండి :—

విజయనగరపతనానంతరం, మహమ్మదీయులు గోల్కొండ ఆర్కాటు నబాబులుగా ఏలుబడిసాగించుచుండినా, రాయలసీమలో తురకలకు రాచరికపు బెట్టు బిగువు బాగా సడలి పోయి ఉన్నకాలం వేమనది. సామాన్యప్రజలుగా వారు పరిగణింపబడుచుండినారు. ఈగ్రామీణకవి ముసల్మానులను తనకవిత్వంలో తిట్టను జంకలేదు.

**తిరుమలకు బోవ తురక దాసరిగాడు;**

**పసరపుమాంసము బట్టియు**
**మసకల సులతాను మునలిమానుల జేసెన్;**

**లింగమతములోన దొంగలుగా బుట్టి**
**యొకరి నొకరు నింద నొనర జేసి**
**తురకజాతిచేత ధూళియై పోదురు:**

అని ముస్లిములమతావేశమును, పరమతఅసహనమును బాగా చెప్పుచున్నాడు. ఇంకా మహమ్మదీయులు రాచరికం పోగొట్టుకొని రైతులై సర్వసామాన్యులై పోయినారు; వారిశాఖలన్నిటినిగూడ వేమన ఎరిగియున్నాడు.

**షేకు సైదు మొగలు చెలగు పఠానులు,**
**తురకల దొరతనము తొలుతజేసి**
**రాగరాగ విడిచి రైతులై కొలచిరి-**

అని వారు చాకిరి చేసుకొని బ్రతికేస్థితికి వచ్చినదానినిగూడ వేమన పేర్కొనుచున్నాడు :

—'మక్కకు జననేల ?' మగుడ రానేల ? అని ఎత్తిపొడిచి, మనకాశీ

యాత్రాదులను వలెనే ఇస్లాము హజ్ (మక్కా-యాత్ర) ని గూడ చులకన చేసినాడు. ఇదంతా జరుగను 1600 సంవత్సరప్రాంతం కావలసి ఉంటుంది.

రెండవది_వైష్ణవం దిగజారిపోగా దాని పంథా పట్టించినాడు. రాధా మాధవమతానికి నల్ల నంజుడు కల్లుకంపు పట్టినది 17వ శతాబ్దంలోనే.

**ఎంబెరుమతమందు నెనగ మాంసము దిని**
**మారుపేరు బెట్టి మధువు ద్రావి**
**వావి వరుస దప్పి వలికిపాలౌదురు...**

ఎంబెరుమాన్ _ నాపెరుమాళ్ళు అని రామానుజాచార్యులకు పేరు; ఈయనను భాష్యకారు లని యతిరాజని గూడ అంటారు. (వలికి - వల్లకాడు; శ్మశానం)

**రంగధామమునకు హంగుగా తా నేగి**
**కల్లు కంపు సొంపు కలిగియుండు—**

అని చెప్పదగినస్థితికి వేమనకాలానికి యీమతం దిగజారి వచ్చిఉన్నది. తాంత్రికులు వామాచారులు శాక్తేయులు ప్రబలిపోయి వేమనచేత చివాట్లు తిన్నారు. ఇంకా_

" గ్రద్దవంటివాడు గజపతిగాడొకో " అంటాడు వేమన. 1650 ప్రాంతానికి గజపతులప్రాభవం వెలవెలబోయింది.

తెనుగుకు ఇప్పటికే కొంచెంకొంచెంగా పారసీకపుతెగులు చుట్టుకొంటున్నది. పరదేశి గులాము మొదలైన పదాలు వేమనకనిత్యంలో దూరినవి. ఇది శ్రీనాథుడు పెట్టినభిక్ష: కృషి, రాయబారి వగైరాపదాలను ప్రవేశపెట్టినాడు. కాగితం శ్రీనాథుని తెనుగుసేతేమో!

ఛత్రపతిశివాజీ, సవతితల్లికొడుకు-ఏకోజి, తంజావూరులో నాయకరాజుల తర్వాత మహారాష్ట్రపాలనను ప్రారంభించుట (1676-1685) వేమనకు అంత బాగా తెలిసినట్లు లేదు.

ఇక మిరప అంటే వేమనకాలానికి మిరియాలే!

**మిరపగింజ చూడ మీద నల్లగ నుండు**
**కొరికి చూడ లోన చురుకు మనును...**

అంటాడు. 1498 లో పోర్చిగీసు వాస్కో-డిగామా, మలబారులో దిగినతర్వాత, దక్షిణఅమెరికా - చిల్లీదేశంనుండి తెచ్చి మనదేశంలో దింపిన చిల్లి అనే నేటి మిర్చి - మిరప - వేమనకాలానికి యింకా దేశంలో బాగా ప్రాకినట్లు లేదు. ఆవలనేగదా దీనిని విశ్వామిత్రసృష్టి అని ఆంధ్రులు ఆరాధించుచున్నది! ఈగామాయే మనదేశానికి ముంతమామిడిని (జీడి) గూడ దించినాడు.

ఇవన్నీ వేమనకాలాన్ని 1600 తర్వాతకే నెట్టుచున్నవి. దీనిని, వేమన పద్య మని మ్యాక్‌డొనాల్డు పేర్కొనుచున్నాడు.

**నందనసంవత్సరమున**
**బొందుగ నాశ్వీజ శుద్ధ పున్నమనాడా**
**బృందారకాద్రిసీతువు**
**సందున నొక వీరవరుని జననము వేమా!**

సందున అన్నమాటవల్లనే యీపద్యం వేమనది అనవచ్చును; ఇది రాయలసీమ, నెల్లూరులో వాడుకఉన్నపదం. ఇక ఈనందన 1652 అగును. 1952 లో నందనే తగిలినది. ఇది మొదలు, 20 ఏండ్లు అటు ఇటుగా వేమనజననకాలం నిర్ణయించుకొంటే తృప్తికరమైన పరిష్కారంగా ఉంటుంది. భారతప్రభుత్వం వేమన త్రిశతాబ్ద జయంతిని 1972 అక్టోబరులోనే నిర్ణయించి ఉన్నది. ఆశ్వయుజం అక్టోబరులోనేగదా వచ్చేది.

విజ్ఞానజ్యోతిని ఎగబెట్టి, వేమన చివరకు, కడపమండలంలో పామూరు కొండలలో ఒకగుహలో ప్రవేశించి సిద్ధిని పొందినాడు.

**కటారుపల్లి వేమన:**

కడపజిల్లాలో, కదిరికి తూర్పున, కటారుపల్లెను వేమన జీవితగాథలో కీలకస్థానంగా పరిగణిస్తున్నారు. కాని, ఈయోగివేమనకు ఆకటారుపల్లె వేమనకు, పీర్ల పండుగకు గోకులాష్టమికి ఉన్నంతసంబంధంలోనే ఉన్నవి. ఇచటి వేమనయోగి ఒకదేవాలయంలో నిలువుపట్టెనామాలతో ఏటేటా దున్నపోతులగావు తింటూ దారుప్రతిమగా వెలసి ఉన్నాడు. దానిపూజారులదగ్గర ఒకశిథిలగ్రంథ మున్నది. ఇది ఆతర్వాత ఎప్పుడో వ్రాయబడిన కట్టుకతల పురాణంగా, 'కతకు కాళ్ళులేవు - ముంతకు చేవులూ లేవు' అన్నట్లుగా ఉన్నది; ఇది చరిత్రగాదు. దీనిప్రకారం యీవేమన పెడిపాటి కొణిద(కొడిద)కాపు. మొదటిపేరు పుల్లారెడ్డి. అన్నతో కలహించి నల్లచెరువు చేరినాడు. ఒకనాడు పొలంలో సేద్యం చేసుకొనుచుండగా, ఒకపిడుగు నెత్తినబడి నిర్జీవంగా పడిపోయినాడు. ఎనిమిదోనాడు తనకు తానే లేచి కూర్చున్నాడు. చుట్టూ మూగినప్రజలు "సంగతేమి పుల్లారెడ్డి?" అంటే, "నాపేరు పుల్లారెడ్డి కాదోయ్, వేమన" అన్నాడు. వెంటనే వారంతా గుక్కురి మిక్కురి అనకుండా విశ్వసించి భక్తులైనారు. క్రమేణా ఆయన పరమయోగి అయినాడు. దేశసంచారం చేసి,

భక్తబృంద సేవితుడై కటారుపల్లె చేరి సిద్ధిని పొందినాడు. అంతే! మన వేమన ఆపుల్లారెడ్డి వేమన కాడు. ఇతనికి తుంగవేమన అని పేరు. ఇతడు 1780 లో జన్మించి, 90 ఏండ్లు బ్రతికిన ట్లున్నది. పౌండ్రకవాసుదేవుడు అసలు యాదవకృష్ణునికి నకిలీకృష్ణు డైనట్లు, తుంగవేమన యోగివేమనవలెనే నటించినాడు - నడచుకొన్నాడు, గురువైనాడు. ఆటవెలదులలో కవిత్వం చెప్పినాడు. కాని, "బాలచక్ర వేమ భవ్యనామ" అన్నది యితనిపద్యాల మకుటం. పఠనరామ - బౌద్ధరామ అని పాఠాంతరాలు. దీనిభావం ఆతిరుమలేశునికే తెలిసినట్లు లేదు.

ఈవంశంవారికి వేమనశబ్దం బ్రతుకుదెరువుమంత్ర మైనది. యామాలయ్య (వేములయ్య) పేరుతో, తాకితే పదిచోట్ల బడే బక్కగుఱ్ఱంమీద, పసుపు గుడ్డలతో తప్పెట్లదరువుతో, నెల్లూరుతూర్పునాటికి ఏటేటా వచ్చి, మేరలు దండుకొని పోతూఉంటారు. ఈవేములయ్యమఠాలు చాలా ఉన్నట్లున్నది; ఎందుకంటే _ ఒకసారి వచ్చినయోగి మరల కావ్పించుట లేదు. వేమనపేరు అదికించుకోకపోతే యీసాములకు దారిబత్తెము గిట్టదు.

**పేరు - మకుటము :**

వేమన అనే పేరుకు ఇప్పుడు సరిగా అర్థంచేప్పేవాళ్ళు కనబడటం లేదు. అర్థం లేని పేరు పెట్టి ఉండరు గదా! పిచ్చిపుల్లయకు గూడ ఒక అర్థం ఉన్నది గదా! ఇది తెనుగుపదమే అయిఉండాల. సంస్కృతంలో వేమ అంటే నేతమగ్గపుపలక _ అదేమి మొఱ్ఱో! అన్నిపాతపేర్లవలెనే ఇది ఇప్పుడు మోజును పోగొట్టుకొన్నది. తిక్కతిక్కనలు దప్ప కవితిక్కనలు ఏరీ నేడు? బెంగాలీతొడుగు తొడుక్కుంటున్నవిగదా ఇప్పుడు ఆంధ్రులపేర్లు! వేమారెడ్డి అనే ఇంటిపేర్లు అక్కడక్కడా పౌరుషనామధేయంగా మాజిల్లాలో చెవికి తగులుచున్నవి. వేమయ్యలు గూడా ఉన్నారు.

ఇక మకుటం సంగతి : వేమన ఉపాసించిన అపరబ్రహ్మంవలెనే అవాఙ్మానసగోచరంగా నిర్గుణంగా నిరాకారంగానే ఉన్నది__యీమకుటంగూడ; ఒక్కొక్కరి మేధాతరంగాన్నిబట్టి (Brain Wave) అర్థాలు బయలుదేరి ఉన్నవి. విశ్వదాభిరామ - విశ్వథాభిరామ _ విశ్వతోభిరామ - అన్నవి పాఠాంతరాలు. నూటికి తొంబై పాళ్ళు 'విశ్వదాభిరామ వినుర వేమ' అన్నదే అంగీకరింపబడిఉన్నది.

ఇక అర్థాలు వినండి : అభిరామయ్య వేమయ్యకు బంగారంచేయడం నేర్పించిన కంసాలిబత్తుడట ; ఆయనకు నెనరు చూపను ఆయనపేరు పద్యాలలో బిగించినాడట.

విశ్వమును, ద - ఇచ్చువాడు, ఆయనకు అభిరాముడు - ఒప్పినవాడు, అని ఇంకొకదొర. విశ్వము - సమస్తమును ఇచ్చుటచే ఒప్పినవాడు అని ఒక వ్యాఖ్యాతృచక్రవర్తి. మరికొందరుమహానుభావులు వేమనముండను రచ్చకీడ్చి, ఆమెపేరు విశ్వద అని నిర్ణయంచేసి, యీకవిత్వం ఆపెకు అభిరామమైనదని - "నిజంతలలో కల్లమేకు గొట్టినట్లు" చెప్పినారు. విశ్వమును, ద - గుద్దలించువాడు, శివుడు; ఆయనకు నచ్చినవాడు అని, భూధరమునకు భూదరము (పంది) నకు భేదం తెలిసినట్లు ప్రకటించుకొనే ఇంకొకపండితుని వ్యాఖ్యానం. విశ్వదుడు-సర్వము నిచ్చువాడు, అని మఱియొకభాష్యకారుడు.

ఇట్లా పుర్రె కొకతీరుగా, వ్యాఖ్యానాలు వెలిగించినారు. పాటకు ఊతపదంవలె ఇది ఉండవచ్చు నని అర్థంచెప్పక మనలను అవస్థపెట్టక వదలివేసినవారే ఇందు పెద్దమనుషులు. ఏపేరున బిలిచినా, ఎట్లా వండినా వంకాయకూర కమ్మగానే ఉంటుంది.

## 2. వేమనకీర్తిచంద్రునికి గ్రహణగ్రస్త-విమోచనాలు

తమిళకురళ్‌నందలి భక్తిపారవశ్యము - సమతాభావములను వేమన తన పద్యాలలో ప్రవహింపజేసి, ఆనాటి ఆంధ్రసాహిత్యమును విప్లవసీమాపరిసరములకు కొనిపోయినాడు. తత్త్వజ్ఞానవిషయమున వేమనస్థానము కబీరు (15.వశ.) వంగచైతన్యస్వామి (16. వ. శ.) మొదలగువారికంటె పైన కాకపోయినా, సమపంక్తిలో మాత్రం తప్పదు - అని ఉపజ్ఞాశోభితుడు వినయకుమారసర్కారు ఉగ్గడింపు.

___'వేమన అగాధభావపూర్ణుడు, ఆయనకవిత్వము స్వచ్ఛమైనది; దానిభాష భావము - శయ్య స్వయంసంభవములు. ప్రపంచమున వేమనను మించిన చతురవచోనిధి ఇంకొక డుండలేదు. ఆయన ప్రకృతిప్రియు డైన సహజకవి. ఆచారమూఢవిశ్వాసములను ఛిన్నము చేసి, పాతగురువులకు దాసులైన ఇంటనున్న ముసలమ్మలఅధికారమును తొలగద్రోయు మని ఆయనరచనలు ప్రబోధశంఖారావములు గావించినవి' - అని డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఆకాశవాణిలో గావించిన మేల్కొలుపు.

—'మానవతకు సంబంధించినదానిని దేనినిగాని వేమన నిర్లక్ష్యము చేయలే'దని బార్నెట్ జ్ఞప్తిచేయుచున్నాడు.
—'వేమన నేటితెనుగుకవులందరిలో ఎక్కువ ప్రజాభిమానమును పొందినవాడు. ఇప్పుడు వాడుకలో నున్న ఏచాటువకుగాని, సామెతకుగాని, అర్థపూర్ణమైన నీతిసూక్తికిగాని వేమనకర్తృత్వం అంటగట్టబడనిది లే' దని, బహుభాషాకోవిదుడు సర్ జార్జి అబ్రహాం గ్రీర్సన్ తనబృహద్గ్రంథమున చాటుచున్నాడు.
—'వేమన వెలువరించినసత్యములు మతావరణములలో బుట్టినవి గావు-శ్రామిక ప్రజల ప్రేమపూర్ణహృదయకుహరములనుండి వెలికుబికిన శాశ్వతసత్యము'లని లాయనల్ బార్నెట్ ఉప్పొంగిపోవుచున్నాడు.

గ్రీసుసోక్రటీసు, ప్లేటో, డెమోక్రటిస్, లూషియన్; జర్మన్ లూథర్; ఇంగ్లీషు విక్లిఫ్; మహర్షి (సెంట్) పాల్; పరాసురచయిత వాల్తేర్ - ర్యాబెలె; తమిళ తిరువళ్లువర్; కన్నడ సర్వజ్ఞుడు; తెనుగు పోతులూరు వీరబ్రహ్మం, ఏగంటివారు, ఆనందవరదరాజయోగి, ముత్యాల నారసింహదాసు, ఎడ్ల రామదాసు మొదలగువారిని, విమర్శకులు వేమనయోగితో సరితూచి విలువలు నెలకొల్పినారు.

కాబట్టే, ఆంధ్రసాహిత్యవన పునర్వికసన వసంతుడు - ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను "వేమనను నేను కనుగొంటిని" అని శివమెత్తి చిందు లేసినాడు.

**అణచివేత :**

అయితే ఏమి? వేమనపేరు, పద్యాలు కొంతవరకు అణచిపెట్టబడినవని అనవలసివస్తున్నది. 19వ శతాబ్దంలో పాశ్చాత్యులు, 20 లో కొందరు ఆంధ్రులు ఆయనను అజ్ఞాతవాసమునుండి బయటకు లాగి బూజు విదలగొట్టి, ఆంధ్రసాహిత్యవియత్తలమున ఆయనకీర్తి చంద్రికలను ప్రకాశింపజేసినారు.

ఇట్టి వేమనకీర్తిభానుడు అపవాదరాహుగ్రస్తమయ్యేదానికి కారణములు ఏమి? కేవలం శూద్రుడైనందుననే అగ్రవర్ణములవారు వెలివేసి అణగద్రొక్కినారనుట అంతగా పొసగదు.

**ఇంక శూద్రుడౌట ఎరుగరా వేముని**
**మనసు అతనితోడ మరులుకొనియె**
**కొలిచిరి ద్విజులును కోటాన కోటులై ...**

అని తనసర్వజనసమ్మోహనశక్తిని, తనకు లభించిన లోకాదరణమును తానే ప్రకటించుకొనుచున్నాడు. తమిళు లంత గాకపోయినా, సంగీతసాహిత్య రంగములందు ఆంధ్రులుగూడ గుణపక్షపాతులే! కృష్ణదేవరాయలు, రామరాజభూషణుడు, గోన బుద్ధారెడ్డి, ఆయనపుత్రుడు విఠలుడు, విజయరాఘవుడు, చేమకూర, గంగాదేవి, మొల్ల, ముద్దుపళని మొదలగువారికి అగ్రస్థాన మిచ్చి ఆదరిస్తున్నారుగదా! ఒక్క అప్పకవి "అంఘ్రిభవునికావ్యంబు గ్రాహ్యంబు గాదు" అని అరచినా ఆంధ్రులు చెవినిబెట్టలేదు. ఇక వేమనకే ఈ తాకు తాకనేల?

వేమన పామరకవి, గ్రామ్యంలో వ్రాసినందున వెలివేసినారంటే తిక్కన వ్రాసినది గూడ ఆనాటి జీవంగల వాడుకభాషనే. అందువల్లనే ఆంధ్రావళి మోదము బొందినది. "కూరాకు గోసి తిని బ్రతుకుదు" ననిపించినాడు. ధర్మరాజుచేత (ద్రోణపర్వంమొదట), నేటి డి. ఎం. కె. వారి వలెనే, ఆనాడు తిక్కన, తర్వాత వేమన తెనుగుజనానికి తెలియును. సంస్కృతపదాలన్నిటికి అప్పటమైన జానుతెనుగుమాటను-ఉన్నవాటిని వాడి, లేనివాటికి కల్పించినారు. కాబట్టి ఇదే వేమనను బహిష్కరించేదానికి వంక కానేరదు. ఈభాషను వినవే ప్రజలు ఎగబడి మూగినారు.

వేమనరచనలో వ్యాకరణదోషా లున్నవని కొందరు. ఏవ్యాకరణమో! ఎదిగే భాషను పాతవ్యాకరణసూత్రా లనే ఇనుపచట్టంలో మహాకవి ఎవరుగాని బంధించలేదు. ఇదీ యానిరాదరణకు సంపూర్ణకారణం కాజాలదు. ఇది సంప్రదాయవాదుల నిరాశాక్రోశం కావచ్చును.

ఇంతే గాకుండా, వేమనకాలంనాటికి, ఆంధ్రభారతి కృత్రిమాలంకారముల బరువుక్రింద క్రుంగి కుబ్జ అయినది. తన సహజసుందరగంభీరయానాన్ని మరచిపోయినది. వక్రరీతులలో సాముగరిడీలు నేర్చి కల్లపసిడికి కాంతు లబ్బజేసినది. ఇక వేమన దేశికవిత్వము - సరళభాష - విమర్శకగంభీరభావములు పూర్వాచారపరాయణుల మనసుకు గిట్టలేదు; అందుచేతనే నోటికి పట్టనేలేదు.

**మఠాధిపతుల గుత్తాధికారము:**

అగ్రజాతులు పీఠాధిపతులు మతరహస్యాల మరుగుపరచి తమహస్తగతం చేసుకొని, పారలౌకికాధికారాన్ని దుర్వినియోగం చేస్తుండగా, ప్రజలభాషలో

అసత్యాలను బయటబెట్టి, అనిరంకుశాధికారాన్ని సడలింప జేసిన వేమన యీ గుత్తాధికారులకు ప్రబలశత్రు వైనాడు. తమ ఆచారాలను, తమ మతాన్ని పరిహసించిన వేమన పద్యాలనే, బ్రాహ్మణఉపాధ్యాయులు విద్యార్థులకు గరపను ఇచ్ఛగింపకపోవుట మానవస్వభావంకాబట్టి మన్నింపదగినదే ! వేదగూఢార్థము బట్టబయ లగుట అనిన, వైదికమతమువారి కాణాచి దోపుడుపోయినట్లేగదా !

పాల్కుర్తి సోమనాథునిబోటి శివకవులు దేశికవితలో జానుతెనుగులో ద్విపద కావ్యాలు చెప్పితే మాన్యపరచలేకపోయిరిగదా - యీశ్రోవవారు అంతతో బోక "ద్విపదకావ్యంబు ముదిలంజ దిడ్డికంత" అనిన రసికావతం సులుగూడ వీరేగదా ! ఇట్లే ఇప్పటి విప్లవకవు లనుకొనేవారు, అందరినీ బూతులు తిట్టుటలేదా ? ఇదంతా కాలధర్మం. విలువలు మారుచు పోవుచుండును.

ఇట్లే తెనుగులో మంత్రాలు చెప్పే జంగందేవర్లనుగూడ ఈపూర్వాచార పరాయణులు వదలరైరి. ఇది నేడు తమిళనాడులో జరిగే అలజడికి ఎంతో పురోగామి.

ఈఆంక్షకుముందు, పల్లెలలో వేమన నీతిపద్యాలు బడులలో ఆటవిడుపు పద్యాలుగా గరపబడుచునే ఉండేవి. వీటిలో ఒకటోరెండో నోటికి రాని వారు లేకుండిరి. కాని, బ్రిటీషుపాలకులు, తమమతతాటస్థ్యవిధానంలో వేమన పద్యాలను ప్రభుత్వపాఠశాలల ఆవరణంలోనికే ప్రవేశింపనీయరైరి. ఇదంతా నిప్పును కొంగున దాచిన ట్లయినది. వేమనకీర్తి దావానలంవలె ప్రజ్వలించినది.

ఈ కారణంవల్లనే, బ్రౌనుపాఠ్యగ్రంథంగా అచ్చువేయించిన పద్యాల సంపుటిప్రతులు అదృశ్యమై పోయినవి. కొన్నేండ్లతర్వాత చెత్తకాగితాల గదిలో ఒకకుప్పలో ఇవి దాగుకొనియుండినట్లు తెలియవచ్చినది.

**మనవారు చేయనిపని :**

మొట్టమొదటిసారిగా 1828 లో కావలి వెంకటరామస్వామి దక్కను కవుల చరిత్రను ఇంగ్లీషులో వ్రాస్తూ పేర్కొన్న 47 తెనుగుకవులలో వేమన పేరు దిగవేసినాడు. కులమువలన ఈకాపుకవి అంటరాని వాడైనా డనువాదము యీకావలిసోదరునిపట్ల అతుకదు. ఎందుకంటే రామస్వామి రామరాజభూషణుని వసుచరిత్రను ఆంగ్లవచనంలో వ్రాసినారు. 1850 ప్రాంతాన వెలువడిన గురజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవుల చరిత్రలో వేమనపేరు వేమువలె చేదైనట్లు వర్జించినాడు. 1899 లో కందుకూరు వీరేశలింగం ఆంధ్రకవులకు

జాతకచక్రములు బిగించినట్లు వ్రాసిన కవులచరిత్రలో వేమన లేడు. అంతటి ఉదారాశయములు గలిగిన పంతులుగారికి వేమన ఎందుకు కనుతగుల లేదో తెలియలేదు. 1917 లో పెంచి ప్రచురించిన ద్వితీయముద్రణంలోగూడ వేమనపేరును – మైలగుడ్డను కట్టెపుల్లతో తాకినట్లుగూడ తాకరైరి. ఇది కుట్ర కాకపోయినా కూరిమి లేకపోవుట కావాల.

**పాశ్చాత్యపండితులసేవ :**

ఇట్టిపరిస్థితులలో ఎంతోముందు, కొందరు ప్రాశ్చాత్య (ముఖ్యంగా ఆంగ్లేయ) పండితులు తెనుగు నేర్చుకొని, వేమన కవితారీతులకు సొక్కి సోలి, వేమనతత్త్వము–భాష–సంఘసంస్కారదీక్ష– ఆయుగపురోగాములైన ఉదారాశయములను వివరిస్తూ విమర్శకవ్యాసములను ఇంగ్లీషులో వ్రాసినారు. వారిలో కొందరిని ఉదాహరించుకొందాం :–

వేమనచే ఆకర్షింపబడిన మొట్టమొదటి పాశ్చాత్యుడు – ఫ్రెంచి మత గురువు (అబె) జె.ఎ. దూబాయ్ (Dubois). హిందువుల ఆచారములనుగురించి వ్రాస్తూ (1816) అందలి ఉదారవేదాంతవిషయములను గుర్తించి, మూఢమతాచారములను విమర్శించిన కొద్దిమంది విశ్రుతులలో వేమన ఒకడని, ఈయన రచనలు చిత్తాకర్షకముగ, స్వతంత్రభావోపేతంగా, విప్లవభావాత్మకంగా ఉన్నవని ఉగ్గడించినాడు. తర్వాత యీ ఫ్రెంచిపుస్తకం ఆంగ్లంలోనికి అనువదింపబడినది.

ఆవల, "హెన్‌రీ బ్యూఛాంప్" 1897లో దూబాయ్ ఫ్రెంచిమూలమునకు ఇంకొక ఇంగ్లీషుఅనువాదం చేస్తూ, – 'బాగా చదువుకొని, మంచిసంస్కారం గలిగినబ్రాహ్మణులు చాలమంది వేమన పద్యాలను చాల ఆసక్తితో చదువుచున్నారు.'– అనిబ్రాహ్మణులపై మోపబడిన ఒక అపోహను తొలగించి పుణ్యం కట్టుకొనినాడు.

**ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ :**

1817లో మదరాసు సివిల్‌సర్వీసులో ప్రవేశించినదిమొదలు తెలుగు వాఙ్మయంపై బడి, కృష్ణరాయలతర్వాత జీర్ణోన్ముఖమైన ఆంధ్రగ్రంథాలను ఉద్ధరించినాడు. వేమనను "నాకవి" అని సొంతడబ్బుతో దేశంనాలుగుచెరగుల నుండి వేమనపద్యాలను సేకరించి ప్రతులు వ్రాయించి 2000 పద్యాలను అచ్చు

వేయించినాడు (1824). ఇది కొన్నివేల పద్యాలనుండి వేమనవిగా గుర్తించి ఏరబడినవి. ఇంగ్లీషుతాత్పర్యములను వ్రాసి ఇంకొకముద్రణము వెలువరించి నాడు. బ్రౌనుదొరే కొన్ని వేమనపద్యాలను ల్యాటినులోనికి అనువదించినాడు. వేమన నైతికసూత్రాలు గ్రీకువేదాంతులు _ సోక్రటీస్, డెమోక్రటిస్ సూత్రాల వంటి వని, సాహిత్యము లూషియన్‌సాహిత్యమువంటి దని బ్రౌనుదొర మదింపు. వేమనపద్యాలు అచ్చుపడను ఇదేమొదలు కావచ్చును.

**విలియమ్ హోవర్డు క్యాంబెల్ : (1859 - 1910)**

స్కాట్‌లాండుదేశమతగురువు. వీరు తెనుగు సంస్కృతం నేర్చి, గుత్తి - జమ్మలమడుగుప్రాంతాలలో మిషనరీగా పనిచేసినారు. ఈయనకు కీటకశాస్త్రంమీద ఎక్కుడు అభిమానము. కందుకూరు వీరేశలింగంతో గలసి, బ్రౌన్ తెనుగు ఇంగ్లీషు డిక్షనరీని సవరించినాడు. ఆప్రాంతాన కాలార దిరిగి, వేమనసంగతులను సొంతంగా అడిగి తెలుసుకొన్నాడు. వాటిని సానుభూతితో సమన్వయపరచుకొనినాడు. స్వచ్ఛమైన ఆధ్యాత్మిక జీవనం, ఇంకను హిందూదేశంలో పల్లెలలో పాదుకొనియున్న దని గ్రహించి, ఆనందించినాడు. "అప్పుడప్పుడు ఒకఉపజ్ఞాశోభితులు ఉద్భవించి, దైవ దత్తవిస్పష్టఫణితిలో లోకవృత్తమును ప్రజాభిమతమును వెల్లడించుచుంద రని, అట్టివారిలో వేమన సుప్రసిద్ధు డని, ఆయనే నిక్కమైన ప్రజాకవి అని, సంఘసంస్కర్త అని, పల్లెప్రజలకే కవిత్వం వ్రాసినాడని, ఆయనకు కలిగిన లోకప్రియత ఆయనకవితాశక్తి దానిగుణోత్కర్ష లవల్లనే కలిగిన దని, ప్రబంధరీతులను శాస్త్రీయకవిసమయములను తృణీకరించి వాడుకభాషలో వ్రాయుటయందే వేమనగొప్పతనము ఇమిడియున్న దని"—చాటుచున్నాడు. ఆయనప్రజానురంజకత్వమునకు అవహేళనమే ప్రబలకారణ మని గూడ అంటున్నాడు క్యాంబెల్. ప్రపంచచరిత్రయందు కవివేమనస్థానం, ఇంగ్లండ్ విక్లిఫ్ పంచననే అని అంటున్నాడు—విలువలుగట్టిన యీతెల్లదొర. ఇవి 1898 నాటి వ్రాతలు.

**మేజర్. ఎం. ఆర్, మ్యాక్‌డొనాల్డ్ :**

సైనికోద్యోగిగా పనిచేసి 1889 లో మద్రాసు విద్యాశాఖాధికారి అయి నాడు. బ్రౌను ప్రచురించిన వేమనపద్యగ్రంథఅనుశీలనంగా ఒకవ్యాసం వ్రాసి,

ఒకముద్రాసుపత్రికలో ప్రకటించినాడు. ఇందు తాను స్వయంగా పరిశోధించి చేసినవిషయా లున్నవి.

డాక్టర్ జి. యు. పోప్ :

ఒకక్రైస్తవమిషనరి. తమిళమున మహాపండితుడు. ఆబెదూబాయ్ వ్రాసిన వేమనగ్రంథమును ప్రకటిస్తూ, మున్నుడిగా అన్నమాట లివి: "వేమన పద్యాలలో గల సొంపైన నడక, భాషలోనితియ్యదనము, ఏఇతరవ్రాతగానికి గాని అబ్బలేదు. ఈపద్యములు అత్యంతలోకప్రియతను పొందియున్నవి."

లాయనెల్ డేవిడ్ బార్నెట్ : (1871 - 1960)

తొంభైఏండ్లు పండుముసలిగా బ్రతికిన యీ మేధా సంపన్నుడు సంఖ్యాకభాషాపండితుడు. భారతీయభాషలు ఎచ్చుతక్కువలన్నీ నాలుక పై చిందులాడినవి. అరబ్బీ,పారసి,సింహాలి,బర్మాభాషలలో లోతైనపాండిత్యం గూడ సంపాదించుకొనినాడు. భారతీయ శాస్త్రపరిశోధనలకు ఒకభాండాగారమై, గురువై మాన్యత బొందినాడు. వేమన భువిపై అవతరించుటే ఒక అపూర్వపుణ్యమని తన్మయుడైనాడు. ఈయనకు వేమన ఒకఅధునాతనప్రవక్త.

విమర్శనల అంతరార్థము :

ఈయన వేమన విమర్శనల అంతారార్థమును అర్థం చేసుకొని, హిందూ మతమూఢాచారములను విగ్రహారాధనయజ్ఞయాగాది క్రతువులను గురించి వేమన చేసిన వ్యంగ్యఅవహేళనలను చేజిక్కించుకొని మన విమర్శకమన్యులు చేసే నిందలకు బార్నెట్ చక్కటిసమాధానం చెప్పుచున్నాడు. వినండి యీ దొరవాదం ఎంత హాయిగా నున్నదో : "వేమన చేసినవిమర్శనలను, కురిపించిన నిందలను వాటికి పాల్పరచినవారిగుణావగుణము ననుసరించి మనము యీనిందలను గ్రహించాలి. హిందూగురువులను ఆచార్యులను అర్చకులను సన్యాసులను రెండువర్గములుగా విభజించవలెను. వీరిలో ధూర్తులు, వంచకులు, నీతిబాహ్యులు కొందరు లేకపోలేదు. మరికొందరు ఆధ్యాత్మికమహితులు సజ్జనులును గలరు. గృహస్థాశ్రమధర్మమును సత్యశీలంతో పాలించువారును గలరు. ఇక వేమన తూర్పారబట్టినది ఇందలిధూర్తులనే గాని సత్పురుషగణమును కాదని యీయన ఎలుగెత్తి చాటుచున్నాడు. మనవారు దయ్యం ధర్మపన్నాలు

వల్లెవేసినట్లు (Devil quotes scriptures for its purpose) వేమన చేసిన విమర్శనలను చేబట్టి పలుకుచుందురు. వేమనస్థాయికి వచ్చినవారికి ఇవేవీ అవసరం లేదు గాని, సామాన్యమనుజశరీరులు భూతలకీటకాలు యివి లేకుండా మనుగడ నడుపలే రని విజ్ఞులఅభిప్రాయము.

**వేమన - కొన్నిపాశ్చాత్యభావములు :**

"నీకుడిచేయి చేసినదానిని ఎడమచేతికి తెలియనీయకు" అనినది మత్తయి సువార్త ముల్లెయేకా దని, అన్నిజాతులలో అన్నిదేశములలో మతిమంతుల మస్తిష్కంలో పుట్టేసత్య మని "పెట్టి చెప్పరాదు పేదకైన" అన్న వేమన బంతిని ఉదాహరించి అపోహను తొలగించుచున్నాడు - బార్‌నెట్ !

ఇట్లే, బైబిల్‌నూతననిబంధనలో "శత్రువులతలపై నిప్పుకణముల బెట్టరాదు" అనినఉదాత్తభావం -

చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు చేయరాదు,
పొసగ మేలు చేసి పొమ్మనుటె చాలు...

అనిన వేమన నుడిలో - కీడుకుమారు మేలుచేయ మనుటచే ఎక్కుడుమహిమను జెందిన దని, ఆంధ్రులకంటె ఎక్కువగా మురిసిపోతున్నాడు - యీవెజ్ఞదొర !

గ్రీసుమహామతి - సోక్రటిస్, సర్వమూ ఎరిగి, తన కేమీ తెలియ దని వినమ్రుడైనాడు. ఇంతవాడే వేమన అని బార్‌నెట్ -

నేర నన్నవాడు నెఱజాణ మహిలోన
నేర్తు నన్నవాడు వార్తకాడు;
యూరకున్నవాడె ఉత్తమోత్తముడు...

అనేపద్యాన్ని ఎత్తిచూపి, వేమన సోక్రటీసుకు తీసిపోలేదని చాటుచున్నాడు. ఈ దొరకు వేమన ఒకదేవకల్పుడు - ఒకమహాప్రవక్త - ఉపదేశకుడు ! ఇవన్నీ బార్‌నెట్ వ్రాసిన "భారతదేశహృదయం" అనేపుస్తకంలో ఉన్నవి.

**ఛార్లెస్ ఇ. గోవర్ :**

ఇంగ్లండువాసి. జానపదవాఙ్మయప్రియుడు. 1864 లో మదరాసులో, సైనికబాలల అనాథశరణాలయపాలకుడుగా ఉండినాడు. 1872 లో మదరాసులో దివంగతుడైనాడు. ఈయన తెనుగుభాషామాధుర్యానికి మురిసిపోయినాడు. దీని

అక్షరసౌభాగ్యంవల్ల ప్రపంచభాషలన్నిటిని ఇందు వ్రాయవచ్చునని, మన లిపిని ప్రశంసించినాడు. తెనుగుజాతి ప్రాచీననాగరికత పడమటి ఫినీషియనుల సంస్కృతితో సరితూగ గలదనుచున్నాడు. ప్రజాబాహుళ్యభావములను ఆదర్శములను వ్యాప్తికి దెచ్చుటలో వేమన చాలసహాయకారి అయినా డని, ఆయన పద్యములు ప్రజలనానుడులై పోయినవని నుడువుచు, వేమనకు లోకకవి పట్టము గట్టినాడు.

సుప్రసిద్ధచరిత్రకారుడు - విన్‌సెంట్‌స్మిత్ 1910 ప్రాంతాన, శాస్త్రయుక్తంగా హిందూదేశచరిత్రను వ్రాస్తూ-వర్ణవ్యవస్థదోషములను ఎత్తిచూపుచు, వేమనపద్యములు నాల్గింటిని ఉదాహరించినాడు. ఇది గోవర్ అనువాదములు.

హెన్‌రీబవర్సు:

1874 ప్రాంతాన తెనుగునాట, పాఠశాలల పర్యవేక్షణాధికారిగా పనిచేసినాడు. వేమనపద్యాలు పాఠశాలలో గరపవచ్చునా ? కూడదా ? అనేవివాదంలో కూడదనుచునే (పాలకులదృష్ట్యా) వేమన తనకాలముకంటె ఎంతో ముందు నడచిన ఉదారుడని, విశ్వాసానురక్తి, సహనశీలము, ఉత్సాహము, సంఘసంస్కారప్రియత ఆయనను తన యుగపురోగామిగా చేసినవని పొగడినాడు.

ఇట్టిది ! వేమనకీర్తిని ఉద్ధరించిన పాశ్చాత్యపండితుల అకళంక అన్యభాషాసేవోదంతము !

ఇతరభాషలు - వేమన :

జనప్రియములైన వేమనపద్యాలు - సూక్తులు తమిళమళయాళ కన్నడములలోనికి అనువదింపబడి అందరికి ఆనందమును గొల్పుచున్నవి. డి. ఎం. కె. నాయకమణి అణ్ణాదురై చాలపద్యాలకు తమిళానువాదమును ప్రకటించియున్నాడు. వీరికి తెలుగన్న ప్రీతి. వీరితల్లి బంగారమ్మ తెనుగు ఆడపడుచు. కంచిలో వరదరాజస్వామికోవెలలో (తేవప్పెరుమాళ్ళు) దేవదాసిగా ఆదిలో నుండినది.

ఒకముస్లిం సరళస్వభావునిగూడ వేమన ఆకర్షించినాడు. హైదరాబాదు వాసి - జనాబ్ మీర్ మహమ్మద్‌ఖాను, "ఒకమర్మయోగి అంతర్గతభావశబలత" (Musings of a Mystic) పేర అంగ్లములోనికి వ్రాసినాడు.

వేమనపద్యాలు సంస్కృతములోనికి చాలమంది మార్చిఉన్నారు.

ఇన్నిభాషలలోనికి ఎక్కినతెనుగుకవికాపు వేమనయోగి దప్ప ఇంకొకరు లేరనుట ప్రజాకవితకు మంచివిలువ గలుగుచున్నది.

మనవారికృషి :

ఇక మన ఆంధ్రులలో, వేమనపద్యములను 4000 పైన సంకలనము గావించి - బ్రౌనుతర్వాత - "వేమనసూక్తి రత్నాకరము" పేర, 1913 లో అచ్చువేసి, యీకవిపేరు బాగా బయటకు దెచ్చిన భాషాభిమాని - ఆర్. పూర్ణాచార్యులు. బందరులో పోలీసు ఆఫీసులో గుమస్తాపని చేస్తూ, తనడబ్బుతోనే యీ పని అంతా చేసినాడు. ఈయన కంసాలి కాబట్టి వీరబ్రహ్మం పద్యాలను గూడ ఇందు చేర్చినాడు.

వేమన విషయములను సవిమర్శక నికషోపలమున ఒరపు వేసినది - ఆంధ్రపరిశోధక పితామహుడు, విజ్ఞానగ్రంథ ప్రకాశకుడు - కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు. (1877 - 1923). తర్వాత, డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు 1914 లో, కవితారీతుల విమర్శనమున ఆంధ్రులకు ప్రథమ భిక్ష అయిన "కవిత్వ తత్త్వ విచారము" అను బాంబును ప్రయోగించి, వేమన విషయకమైన సంకుచిత సాంప్రదాయక దుర్గభిత్తికలను పగులగొట్టినాడు. దాని అస్తిభారం మీదనే వేమనకీర్తి సౌధము కట్టబడినది.

దీనితర్వాత వేమనపట్ల శ్రద్ధచూపి, చరిత్రను పద్యములను సేకరించి భాషాసేవ జేసిన వారిలో లెక్కబడినవారు. వంగూరు సుబ్బరావు, శేషాద్రి రమణకవులు, వేటూరు ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, చాగంటి శేషయ్య, నేదునూరు గంగాధరం, వేదం వెంకటకృష్ణశర్మ, డాక్టర్ జి. వి. కృష్ణరావు, ఆరుద్ర ప్రభృతులు. వీరిప్రయత్నం వేమన విషయికమైన చీకటిని పారద్రోలినది. వెంటనే మరల వేమన నిజకీర్తి సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడై ప్రపంచ వాఙ్మయస్థానమునకు యోగ్యతాపత్రమును పొందియున్నాడు.

వీటన్నిటిలో రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి వేమన ఉపన్యాసములు - విమర్శక గుణమున, సమగ్ర విషయసేకరణమున, మధురమనోజ్ఞ జీవభాషా విషయమున, ఉన్నతోన్నత సాహిత్యశిఖరమున, రాచరికాలను ఇంకను జరుపుచున్నవి. అప్పటి బ్రౌను, ఇప్పటి రాళ్ళపల్లివారే వేమన కవితాసౌభాగ్యమండపానికి కళాపూర్ణస్తంభాలు. 1928 లో, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రాంగణంలో, కట్టమంచివారు పెండ్లిపెద్దగా జరిపించిన సరస్వతీ కల్యాణోత్సవంలో ఇది ఒక

నాటిచేదురు. ఇచటనే ఆంధ్రసాహిత్యమందిరమున వేమన కీర్తిధ్వజమును ఎగగట్టినారు.

**వ్యాఖ్యానములు :**

వేమనపద్యాలకు కొందరు వ్యాఖ్యానములనుగూడ వ్రాసినారుగాని, అవి "బ్రహ్మకైనను బుట్టు రిమ్మతెగులు" అన్నట్లుగా, ఎవరిపిచ్చిలో వారు ఆనందించినట్లుగా ఉన్నవి. ఈవ్యాఖ్యాతలు - బరంపురం, పూడిపెద్ది సాంబశివరావు; జ్ఞానానందయోగి ; కరూరు బంగారయ్య మొదలగువారు.

**వేమనచరిత్ర :** వేమన జీవితచరిత్రను, కేంద్రసాహిత్యఅకాడమీ, శ్రీనార్లచే ఇంగ్లీషున వ్రాయించి భారతీయభాషలన్నిటిలోనికి అనువదింపజేయుచున్నది.

## 3. వేమననాటి పరిస్థితులు-వేమనపై వాటి ప్రభావము

మతం - ఇతరప్రాపంచిక విషయాలవలెనే మంచిగా బుట్టి చెడ్డగా తేలుచుండును. ప్రతిదేశంలో, ప్రతినాగరికతకు మధ్య మధ్య ఒకధ్వాంత యుగం మొలుపుజూపి, పెరిగి విరుగుచుండును. ఇట్టి గ్లాని పుట్టినప్పుడే ధర్మ సంస్థాపనార్థం యుగయుగంలో ఒకామహాపురుషుడు పుట్టి దేశాన్ని దుస్థితినుండి ఉద్ధరించుచుండును. ఇట్టివారిని ఆస్తికులు అవతారమంటే, హేతువాదులు లౌకికులు ప్రవక్త అని సంఘసంస్కర్త అని అంటుంటారు.

గుప్తసార్వభౌములు, 5-6 శతాబ్దాలలో ప్రవర్తింపజేసిన స్వర్ణయుగం రానురాను తామ్రయుగమై నానాటికి తీసికట్టయి, చివరకు అయోయుగమైనది. మతం దైవాంశాన్ని కోల్పోయి, అసురాంశ అనదగిన బాహ్యాడంబరాలతో నిండిపోయింది. యాగాదికర్మకాండ విగ్రహారాధనాదిపూజాక్రమాలు వికృత హీనాకారములను పొందినవి. గురుస్థానాలు మఠాలు స్వప్రయోజనాలకు దుర్గములైనవి. ప్రజాబాహుళ్యము చదువు లేక, పైశాచిక మతాధిపతులకు బానిసలై ఎరుక లేక చీకటిలో తడుముకొనుచుండినది. శాక్తేయం, వామాచారం తలక్రిందులుగా తపస్సు చేయసాగి, మౌఢ్యాన్ని పెంచినవి. ముక్తిమార్గం చూపవలసిన వైష్ణవభక్తి చెడి అవినీతికి స్థావరమైనది. ఆదిశంకరులు ప్రతిపాదించిన వివిధ

దేవతల ఏకత్వం ఆయన ప్రతిష్ఠించిన - ఆదిత్య అంబిక గణేశ విష్ణు పరమ శివుల సామరస్యం — పంచాయతనం నుండి నిర్వాసం పోయినది. తిక్కన సోమయాజి ఆంధ్రావనిలో ప్రవచనం చేసిన హరిహరనాథోపాసనావిధానం ఆసామరస్యమతం నిర్వీర్యమై, శివవైష్ణవములు స్పర్థలు పెంచుకొని దేశాన్ని యుద్ధభూమి చేసి, నెత్తురుబురదను కల్పించినవి.

వైదికమతరక్షకుల మని చెప్పుకొనే బ్రాహ్మణులు భాషను మంత్రమును తమకోశములందే బంధించి వాటి తాళపుచెవులను తమమొలలందే వ్రేలాడ గట్టుకొనినారు. ధర్మం చెప్పినా పురాణం చెప్పినా సంస్కృతంలో చదివి, తెనుగులో అర్థం చెప్పి స్థానికభాషావికాసము ప్రోదిజెందకుండా, విజ్ఞానం తలఎత్తకుండా చేయుచుండినారు - స్వాములు, "నేనే బ్రహ్మం-నీసంచితప్రారబ్ధ ఆగామికర్మఫలితాలను నీవు అనుభవించకతీరదు" అనిన ఉపనిషత్తులపరమ సత్యం, నైతిక భీరువులైన సామాన్యప్రజలను భయపెట్టి కాతరులను జేసినవి, భూలోకంలోని యమలోకయాతనల చవిచూచేటట్లు చేసినవి యీ విస్ఫుర సత్యాలు. ఈ స్థితిలో విదేశమతాలు తమప్రవక్తను ఆశ్రయించువే తరుణో పాయమని పాపభారమును భీతిని తేలికచేసినవి. ఇట్లే మనపురాణాలు వేదాంత మతానికి కొత్తరూపం కల్పించినవి. ప్రాయశ్చిత్తాలు, తీర్థసేవలు ప్రబలి మూల సత్యాన్ని మరుగుజేసి, మూఢాచారాలను గద్దెపై నిలిపినవి. పురాణాలు, ఆచారాలు పరస్పరభిన్నాలై వేదమతసనాతనధర్మాన్ని, పరమసత్యాన్ని తారుమారు జేసి, వాణిజ్యసంస్థల రూపాంతరా లైన మతాలకు అప్పగించినవి.

దీనితో దేశంలో ధార్మిక నైతికధర్మములకు మహామారి సోకింది. ప్రతిదేశంలో ప్రతిమతానికి చుట్టుకొనిన యిట్టితెగులును అపనయింపను కొందరు కారణజన్ములు అవతరించి, దురాచారగ్రస్తమైన అప్పటిమతంపై తిరుగుబాటును లేవదీసేవారు. బుద్ధుడు ఇట్టి విప్లవవీరుడే!

**క్రైస్తవమతము :**

ఇట్టిదుస్థితే, 14వ శతాబ్దంలో, యూరపు క్రైస్తవంలో గూడ పేరుకొని పోయినది. పోపు మతాధికారం లౌకికసామ్రాజ్యాధికారమువలె ముదిరి స్వార్థ నిరంకుశంతో ప్రజలను వైజ్ఞానికదాస్యంలోనికి దింపివేసినది. క్రిందిమతాధి కారులు బిషప్పులు ఈ అధర్మయుద్ధంలో వీరయోధు లైనారు. హీబ్రూబైబిల్‌లో ఏమున్నదో ప్రజలకు తెలియరాలేదు; ఏసుక్రీస్తు స్వభాష అయిన అరేబియాలో

ఏమిచెప్పినాడో బిషప్పులకు గూడ తెలియకుండినది. పాదరీలు చెప్పినదే మంత్రతంత్రశాసనం. వారు అవినీతిలో బడి ప్రజలను అజ్ఞానకూపంలో ద్రోసి ప్రమగ్గింపజేయుచుండినారు. చేసినపాపానికి సిమొని (Simony) అనేప్రాయశ్చిత్త పాపపరిహారధనమును బిషప్పులు, పోపుపేర గుంజి ప్రజలకు స్వర్గంలో మంచిసీటును అడ్వాన్సుబుకింగు చేయుచుండినారు. ఇది మోక్షం కొనను మనవారు చేసేదానధర్మాల వికృతరూపంగా ఉండినది. పోపుపాపక్షమాపణ పత్రాలను (Indulgences) అమ్మించి, కొన్నవారికి స్వర్గద్వారాలు తెరుపబడునని చెప్పి, అమాయకప్రజలను నమ్మించను, బంగారుతో వెండితో రెండు తాళపు బుఱ్ఱలను చేయించి పోపు ఆవాసంలో (వటకన్) వాటిని వ్రేలాడగట్టించి, రెండుతాళాలను తనమొలలో వ్రేలాడగట్టుకొని, పోపు అనే స్వర్గద్వారకుంచికలని ప్రజలను మోసగించి డబ్బు లాగుచుండినాడు. దాన మిచ్చిన గోవుతోకను బట్టుకొనే, యాతనాప్రాణి వైతరణి దాటే దని మనవారికి కలిగిన అంధ విశ్వాసంవంటిదే గదాఇది!

ఈ పంచకస్థితిని సహించలేక, ఇంగ్లండులో జాన్‌విక్లిప్ అనేబిషప్పు (1325_1384) బైబిలును ఇంగ్లీషులోనికి అనువదించి, మతమును బట్టబయలు చేసి, ప్రొటెస్టెంటు మతానికి పునాదులు వేసినాడు.

ఈజ్ఞానశుక్రోదయంలోనే, జర్మనీలో మార్టిన్ లూథర్ (1483_1546) పుట్టి పోపుల అధికారాన్ని ధిక్కరించి మూఢాచారతిమిరానికి జ్ఞానభాస్కరుడైనాడు. ఈ తిరుగుబాటు-విజ్ఞానసాధనపురోగమనాన్ని నిషేధించిన ఇస్లాములో దప్ప- ప్రపంచమతాలన్నిటిలోను తలఎత్తినది. ఇది ఒక సహజ పరిణామం.

## వైదికమతదుస్థితి - వేమనతిరుగుబాటు :

ఇదేస్థితి, ఇదేచీడ మనదేశంలో మనమతానికి చుట్టుకొన్నది. ఆంధ్ర దేశంలో ఇంకా దట్టమైనది. చదువుకొన్న అగ్రవర్ణాలు - చిల్లరజనం బాగా వేరైనారు. వారికి పీఠాధిపతులు, వీరికి గణాచార్యులు గురువులైనారు. పైవారి ముక్కోటి దేవతలకు, క్రిందికులాలవారు గ్రామదేవతలను, పోలేరమ్మ పోతురాజులను కలపి దేవగణాన్ని పెంచినారు. స్వచ్ఛమైన వేదమతం పోయి వేషధారిమతం దేవాలయాలలో పీఠంబెట్టింది. నన్నయ తిక్కనాదుల తెనుగుభారతం సామాన్య ప్రజల మానసాలలో వేరులుబెట్టలేదు. మతము భాషలపై పితూరి లేవదీసిన శివకవుల ద్విపదకావ్యాలు వైదిక పురాణమహాస్రవంతిలో కొట్టుకొనిపోయినవి.

దీనికితోడు, రాళ్ళపల్లివారు అన్నట్లు—తెనుగుతల్లిబిడ్డలైన ప్రవక్తలు తెనుగున జెప్పక సంస్కృతాన్ని చేబట్టి అఖండభారతాన్ని పట్టుకొని వ్రేలాడినారు. కుమారిలభట్టు, శంకరునికిముందే బౌద్ధమును ప్రతిఘటించినా, తెనుగువారికి ఆసంగతి అంతబాగా తెలియదు. కోనసీమ వల్లభాచార్యులు గుజరాతుకు ఇలవేల్పు అయినాడు. రాయలసీమ నింబాల్కార్ మహారాష్ట్రానికి దత్తుపోయి నాడు. విద్యారణ్యులు, వారిసోదరులు సాయణభోగనాథులకు తెనుగువాసనలే లేకుండపోయినవి. వీరందరిప్రతిభ ఆంధ్రదేశానికిమాత్రం గిట్టుబాటు కాలేదు.

ఇట్టిపరిస్థితులలో తెనుగునాటికి, వేమన తెనుగుపద్యాలు సులభతారక మంత్రాలైనవి. 'బోద్ధలగువారు మత్సరపూర్ణమతు'లని, సుభాషితాన్ని తన భావమున జీర్ణం చేసుకొనక వేమన మతంపేర నెరపబడే ప్రతిమూఢాచారాన్ని ప్రతిఅన్యాయాన్ని విమర్శించి, తిట్టి, గేలిచేసి, చులకనచేసి, ప్రజలను ధర్మ మార్గావలంబకులుగా జేయను, తెనుగుకవితతో రాచబాటలు సరాళము చేసినాడు.

పురాణాలమలినగాథలు, యాగాదికర్మలలోని నికృష్ట ఆచారాలు, శివ వైష్ణవవివాదాలు, వామాచారుల అసహ్యవర్తనలు, మఠాధిపతుల అవినీతులు, వేషధారుల స్వార్థప్రవచనాలు మొదలైనవి—సాంఘిక తరువుకు బట్టిన వేరు పురుగు లని ప్రకటించినాడు - వేమన. బ్రాహ్మణ అబ్రాహ్మణ—మాలమాదిగల ద్వేషానలం కార్చిచ్చువలె అలముకొనుచుండగా, సామరస్యసత్యదృష్టితో వేమన దానిని ఆర్పను ప్రయత్నించినాడు. కాబట్టే గుత్తాధికారులు యీ తెనుగు గురువుపై శాస్త్రవాద మనే కత్తులు దూసి పైబడినారు. దీనికితోడు, ఎద్దుముడ్డి పొడుచుకొని బ్రతికే ఒకరెడ్డి, అందరికీ తెలిసే తెనుగులో తమ దేవతలను, తమగురువులను, తాము మాన్యపరచే ఆచారాలను తమఆధిక్యతను తిట్టి వెల్లడిచేయడం ఆ వర్గంవారు సహించకపోవడం సహజమే!

కాని, వేమన దూషించినది దొంగస్వాములను ధూర్తహీనాచారములనే అని మనం గమనముంచుకొంటే, వేమనను బాగా అర్థం చేసుకోవడం సులభం. దీనితో, కొందరు మహామహులైన బ్రాహ్మణులవలెనే మనముగూడ మూలతత్త్వమును తెలుసుకొని ఆనందించగలము. ఆయన చేసిన విమర్శన లను కొన్నిటిని పరికిస్తాం : ఇందు సూటిగా చెప్పడంలో కొంత మొరటుదన మున్నా మనవాడు చేసిన విమర్శకాబట్టి ఆమోదించవలసినదే.

**యాగాదులు :**

యాగాదులు కామ్యకర్మ లని, కైవల్యాన్ని సమకూర్చ జాల వని చాటిన భారతభాగవతాదులమాటలను పాటించనివారిని వేమన ఇట్లా దూసిపోసినాడు: వీటిస్వార్థపరమూర్ఖజలాలు మూఢబాహ్యాచారసికతాతలాలలో ఇట్టింకిపోవడం, సనాతన మైన హిందూధర్మ రక్షణపరాయణమైన వేమనయోగిబుద్ధికి వెగటుగా దోచినది. మొదలే కట్టుబాట్లకు లోబడని తెగిపోయినగాలిపటం వేమన. దీనికితోడు ఆయనమానసం పొంగేది; ఇక ఎఱ్ఱగుడ్డను చూచిన కనుపిరికి ఆబోతెద్దువలె పలుపులు తెంచుకొని అంకెవేసి కలుషితసమాజంపై బడినాడు. వేమనబోటి జీవన్ముక్తునికి ఇందు కొన్ని అవసరం కాకపోయినా, సామాన్యులకు అవసరమని గుర్తించినా, వాటిహీనస్థితి వేమనను ఉద్రేకపరచినది. మానవాభ్యుదయకాంక్షి యైనవారు ఇట్టివాటిని సహించలేక, తిరుగబడినారు: అట్టిపనినే వేమనగూడ చేసినాడు.

సభ్యతకు ఔచిత్యానికి వెలియై, వికారంగా నున్న కొన్ని ఆచారాలను వేమన ఇట్లా విమర్శించినాడు. వీటిని పరాయివారు విన్నా చూచినా మన నాగరకతకు ఏవగించుకొనరా !

**ఆలిఱంకు దెలుప నఖిలయజ్ఞంబులు**
**తల్లిఱంకు దెలుప తద్దినములు**
**కాని తెరువె కర్మ !...**

సత్యం ఎప్పుడూ అప్రియమేగాని, మనగుట్టు మనమే బయట వేసుకొన్నందున కలుగబొయ్యే ఒప్పుకంటే కలిగినముప్పే ఎక్కువ. యజ్ఞంలో యజమానపత్ని సోమిదేవి కాబొయ్యేముందు, తన మిండమగలసంఖ్యను వ్రేళ్ళతో జూపగా, ఋత్విక్కులు వరుణపాశమంత్రంతో ఆడపతులకు జలోదరవ్యాధిని తెప్పించి చంపివేసి, సోమిదేవి పాతివ్రత్యమును మున్ముందు రక్షించుచుంటారు. ఇట్టిసందర్భములో తలను గొరుగుటనుగూర్చి—"మంత్రజలముకంటె మంగలిజల మెచ్చు" అనుభవలోక్తిని మెఱపుతీగవలె విసరుచున్నాడు. చివరకు యజ్ఞకలాపాన్నే పారబట్టి—

**లంజకొరకు మేకనంజుడు దినసాగి**
**యజ్ఞ మెల్ల కామయజ్ఞమాయె;**
**మొదట సోమయాజి తుద కామయాజిరా...**

అని ధర్మబాహ్యపద్ధతులను, ముసలిపాఱులరంభాసంభోగేచ్ఛను నోటితీట తీరతాకనాడినాడు.

తద్దినంలో పితరులకు పిండం పెట్టునప్పుడు —"నేను అన్యబీజమునకు పుట్టియున్నా నాతల్లి భర్తగా నున్న వ్యక్తికే యీపిండము చెందవలెను" అని మంత్రం చెప్పుట, ఇంటిగుట్టును వీదిచావడిదగ్గర కడిగికొనుటే గదా; దీనికంటే ఇందు ఎక్కువలాభం కలిగినా వర్జింపదగినదేమో? కాబట్టే "పియ్యి దినెడికాకి పితరు డెట్లాయరా" అని ఎత్తిపొడుస్తున్నాడు. ఇందు నాణెము తగ్గినా నిజమున్నది.

శృంగారనైషధంలో - కలి నిషధపురంలో జరిగిన ఒకరాజసూయయాగాన్ని చూచి మొగం త్రిప్పి నవ్వుకొని, వేదవిదులను తిట్టినాడట. వేదవిదులు కలిని కుత్సితు డని తిరిగితిట్టి తృప్తిపడినారు. కారణం కలికి క్రింది తీరున వర్ణించిన రాజసూయాధ్వరప్రక్రియ నచ్చలేదు. అసహ్యంగా అశ్లీలంగా ఉన్నా కాస్తవినండి.

యజమానప్రమదావికస్వరభగన్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండం బగు నశ్వమేధమఖతంత్రంబు న్నిరీక్షించి, య
క్కుజనుం డొత్తిలి నవ్వె వేదవిదులం గుత్సించి...

కవి ఎంతతప్పు - ఎంత తప్పుచేసినాడు! సౌందరీకయజ్ఞం పచ్చిబూతు; రాజసూయము ఒకక్షుద్రనరపాలుని నిలువున నరకుటే!

ఈబూతులు నేటినాగరికతలో బయటకు వచ్చిన దినమొలలు బూతులను మించినవి కావనుట రసికులకు కొంత ఊరట కావచ్చునేమో!

ఇది సంస్కృతపుతిట్టు; ఇక వేమన తెనుగులో తిట్టను ఏమి అధికారమున్నదని కాబోలు, వీరు కండ్లెఱ్ఱజేయడం. ఈకోపం గురితప్పి సంస్కృత శాస్త్రులను తప్పించి తెనుగువ్యాఖ్యానాలమీద పడినది. ఒకకత వినేఉంటారు. వెనుకటికి ఒకసాహెబు శివాలయంలో, ఒకరాత్రి దూరి లింగంమీద కాళ్లుబెట్టి నిద్రపోయినాడట. రుద్రుడికి మహాకోపం వచ్చింది. లేచి చక్కా అర్చకుని యింటికి పోయి, నిద్రబోయ్యే వానిని చింతమెల్లెలతో కొట్టి లేపి, "తలుపులు వేయకుండా, ఆతురకను నా ఆలయంలోకి ఎందుకు ప్రవేశింప నిచ్చినావు" అని బెదరగొట్టినాడట. ఇట్లే ఉన్నది వేమనపై కోపపడుట.

**పురాణాలు : అవతారాలు :**

పురాణాలంటే వేమనకు బొత్తిగా గిట్టవు. ఇవి వేదమతాన్నే రూపు చెడగొట్టి పాడుచేసినవనే హిందూధర్మపరాయణులుగూడ ఉన్నారు. సాయుజ్యం

పొందను ఎంతో కష్టపడి తపసించి, ప్రారబ్ధమును భుక్తిచేతనే శాంతి నొందించవలెననే ఉపనిషత్తులసత్యానికి, ఒకసారి నామస్మరణచేతనే పాము సాలెపురుగు ఏనుగు మొదలగుతిర్యగ్జంతువులకు మోక్ష మబ్బినది. భక్తులను కాచుటకు భగవంతుడే అవతరిస్తాడు అనే పామరజనమనోరంజనమైనగాథలు యథార్థవేదాంతమతం కాజాలదు అనే భక్తులు సిద్ధులు ఉన్నారుగదా. ఇక దేవతలు - వంచనకులై వ్యామోహితులై యుద్ధాలతో మానవులకంటె హీనంగా ప్రవర్తించే యీకథలు ఆఖ్యానాలు మూఢజనానికి ముక్తిని గూర్చగలవో లేవో గాని, జాతిగౌరవటీపాన్నిమాత్రం కొడిగట్టిస్తున్నవి. గ్రీకుపురాణాలు మన వాటిని కుడిఎడమగా నున్నవనేమాట ఒకడూరట కానేరదు. గ్రీసువేదాంతి, మహామతి సోక్రటీస్, పురాణములను అంగీకరించక - ఒకనికృష్టమానవునికే అవమానమును కల్గించగలిగిన ఆవాచ్యపుచేష్టలను దేవత లెట్లు చేయగలరు? అని ప్రశ్నించి, ఈకథలు అనృతప్రియులైన కవులు కల్పించినవే నని వాదించినాడు. ఇదే ధోరణి వేమనదిగూడ.

ఇట్టి విపర్యాసములతో నిండియున్నందుననే వివేకానందస్వాములవారు, పురాణములను వాటికవితాసౌభాగ్యమునకు మాత్రమే చదివి ఆనందించదగిన వని నుడివినారు.

వేమనస్థాయికి వచ్చినవారికి అవతారములుగూడ హాస్యాస్పదముగానే గాన్పించును. దుర్నిరీక్షణమైన వేదాంతజ్యోతిని కన్నెత్తి చూడజాలని సామాన్యమానవునితెలివికి అందుబాటులో ఉందనే కల్పింపబడినవి యీఅవతారము లని, చాలమందిపెద్దలఅభిప్రాయం. లోకమాన్యతిలకువంటి హిందూ ధర్మపరాయణుడుగూడ, క్షత్రియులైన రామాదులు గొప్పవారై మహాపురుషులై చివరకు అవతారపురుషులుగ గుర్తింపబడుటకు చాలకాలము పట్టియుండు నని ఊహిస్తున్నారు. అవతారములపూజ బౌద్ధముయొక్క ప్రాబల్యమని గూడ అనేవా రున్నారు. పురాణయుగంలో రూపొందిన పదిఅవతారములేగాక రానురాను 30కి దాటినవి యీఅవతారములు. కథలలో చాలవ్యత్యాసముగూడ కాన్పించుచున్నది. మచ్చుకు ఒకవిషయం — వామనావతారవిషయంలో శతపథబ్రహ్మణానికి భాగవతానికి ఎంతో భేదమున్నది. చూడండి: దేవాసురులకు ఒకయజ్ఞవాటికస్థలమునుగూర్చి వివాదం రేకెత్తినది. ఒకమరుగుగుజ్జు పండు కొంచే పరిపొయ్యేటంతనేలను యిచ్చేదానికి రాక్షసులు ఒప్పుకొన్నారు. వామనుడు (విష్ణువు) పండుకొని విక్రమించి పెరిగిపెరిగి భూలోకాన్నంతా ఆక్ర

మించుకొన్నాడు. ఇట్లా ఇక్కడ అసురులకు తావులేకుండా పోయినది. చివరకు వేదమతానికి అగర్భశత్రువు బుద్ధుడే ఒకఅవతారమైనాడు. ఈఅసంగతాలను సిద్ధుడైన వేమనయోగి కోడిగం పట్టించుట ఒకవిశేషం కాకపోయినా, సామాన్యులకు ధర్మవిపర్యయంగానే, భూతద్దంలో వలె కనబడుచున్నది.

కనకమృగము భువిని కలదు లేదనకయె
తరుణి విడిచి పోయె దాశరథియు,
తెలివిలేనివాడు దేవు డెట్లాయెరా...

అని ప్రశ్నించినాడు. ఇదీ వేమనతీరు. తరుణి అనుటలో ఒకవిశేషమున్నది గదా!

**లగ్నాలు:**

శకునాలను లగ్నాలనుగూడ ఎగతాళిచేసినాడు. పుట్టిననాటిగ్రహస్థితిని బట్టి జీవి తనప్రారబ్ధాన్ని అనుభవించు నని, కర్మకు అనుభవమే శాంతి అని, నొసటివ్రాత చెరిపివేయరా దని ఒకనోట చెప్పుచు ఇంకొకనోట శాంతులు సుముహూర్తాలనుట జ్యోతిషమునకే వ్యతిరేకంగా పురోహితులను మేపుట, అవివేకమని అజ్ఞానమని సూటిగా పొడిచి చెప్పుచున్నాడు_విధిని నమ్మిన వేమన. బిడ్డ వచ్చినవేళ గొడ్డు వచ్చిన వేళ అని, మనదౌర్భాగ్యాన్ని అన్నెం పున్నెం ఎరుగని పడచులమీద పశువుల నెత్తిపై పులిమి, ఇతరులను తిట్టించుచున్నారు_అర్ధపండితులు. కట్టుకొన్నఇంటిని తిట్టించుచు బెదురుబెట్టి పొట్టబోసుకొనుచున్నారు వాస్తుశాస్త్రజ్ఞబ్రువులు. తిథివారనక్షత్రం వారశూలం; తెనుగువారివర్జ్యం, అరవలరాహుకాలం (వారిపుణ్యానకేతుకాలాన్నిగూడ సృష్టించలేదు) యమగండం, తురకల 3_8_13_18 పాటిస్తే జీవితభీరువుకు అజ్ఞానికి అల్పాచమానానికీ అవకాశం ఉండబోదు. తదియ త్రయోదశి మనకెంత పునీతమో ముస్లిముల కంత అరిష్టదాయకం. తమిళులు మౌఢ్యాలను పాలించరు. అమావాస్య పవిత్రం. ఇక నామనక్షత్రాలట! రాముడికి రావణునికి ఒకేనక్షత్రంగదా. ఇక తెలిసిందేగదా వారి గుణాలజాడ. పిడుగుకు ఏమివారశూలలే అని ఎవరైనా బయలుదేరితే 'మనో జయంతు మాండవ్యః' అని సరిపెట్టుదురు. సుఖదుఃఖాలు శుభాశుభాలు సర్వమానవులకు ఒకేవిధమని వీరు గుర్తించలేక పోతున్నారు. ఈఅజ్ఞానాన్నే, ఈమూఢవిశ్వాసాన్నే వేమన ఇట్లా పరిహసించినాడు:

విప్రు లెల్ల జేరి వెఱ్ఱికూతల గూసి
సతిపతులను గూర్చె సమ్మతమున
మును ముహూర్త ముంచ ముండ్లెట్లు మోసెరా...

ఎట్లా కనువిప్పు కలిగిస్తున్నాడో చూడండి! పాటించేవారినేనా ఇవి గొంతు పట్టుకొనేది? వెనుకటికి ఒకముల్లా ముద్దముద్దకు బిస్మిల్లా కావాలన్నాడట. వేమనవాదం, లగ్నాలు బెట్టి పొట్టబోసుకొనేవారికి కడుపుమంట కలిగించవచ్చును. సహేతుకవాదబుద్ధికి ఇవి ఏవీ గిట్టవు. ఒకేముహూర్తంలో జరిగిన పెండ్లిండ్లఫలితాలు ఎంతభిన్నంగా ఉంటునో ఊహించండి.

**భారతము :**

మనసు దాచుకొని, మాటలు మ్రింగని ఈతిరుగుబాటుకవికి భారతమంటే ఒకలెక్కా పక్కా?

తాత జనించె కన్నకకు, తండ్రులు తాము కుండు గోళకుల్,
మాత పరాసుకూల, మరి మక్కువ ద్రౌపది భర్త లేవురున్,
నీతులు జెప్పు పాండవులసీమము లిట్టివి...

(కుండుడు – మగ డుండ రంకుమగనికి పుట్టినవాడు; గోళకుడు – మగడు చని పోయినతర్వాత ఇంకొకనిచే కలిగినబిడ్డ). ఇంతేగాకుండా – "పేరు ధర్మరాజు పెనుపేపవిత్తయా" అని గుణగణనము చేస్తున్నాడు. తిక్కనగూడ – 'మెత్తని పులి ధర్మసూతి; అంతర్మదదుష్టుడు ధర్మసూతి' అని వర్ణింపజేసి ఉన్నాడు.

వేమన దూషించని కపటాచారము లేదు ధూర్తయోగులను దొంగ గురువులను వెదకి వేటాడినాడు "తలలు బోడులైన తలపులు బోడులా" అని వీరిని గురించి చెప్పినమాట.

**కులవిభేదములు :**

కులముల ఎచ్చుతక్కువ లనిన ఇతనికి ఒళ్లుమంట – ఏవగింపు. కులము ఒంటబుట్టవేదనుటకు–

రామనామపఠనమహిమచే వాల్మీకి
పరగ బోయ డయ్యు బాప డయ్యె
కులము ఘనము గాదు గుణము ఘనంబురా...

అని. "ఎరుక గలుగువాడె ఎచ్చయిన కులజుండు", "జంగమైనపిదప జాతి నెంచగరాదు" అని శాసించినాడు. అందులకే బ్రహ్మవిద్య లేని బ్రాహ్మణులను "బాప డనగ నేమి, భక్తు డనగ నేమి?" అని ప్రశ్నించి—

పరగ బొమ్మగుడ్డు పరికించి చూచిన,
కులములన్ని అందు గూడబుట్టె

అని దేవరహస్యమును దెలుపుచున్నాడు - ఈసమదర్శనుడైన గ్రామీణ యోగి. గీతలో గుణకర్మలచేతనే నాలుగుకులాలను సృష్టించినా నని, శ్రీకృష్ణ భగవానుడు చెప్పినదానికి ఇది బహిరంగవ్యాఖ్యానం :

మాలవాని నేల మహిమీద నిందింప
నొడల రక్తమాంస మొకటి కాదొ ?
వానిలోన మెలగు వానికులం బేది...

అంటూ మానవతావాదము చేసి,

మాలవాడైనను, మరి యాత్మమీదను
మనసు నిలిపెనేని మాల గాడు;
మనసు నిలుపకున్న మహిమీద మాలడు

అని, శాశ్వతసత్యమైన నిర్వచనం చేసినాడు. ఇది గాంధీజీకి ముందు ఆంధ్ర దేశంలో బయలుదేరిన హరిజనోద్ధరణోద్యమం ! దీనికి రామానుజాచారి దారి చూపినాడు.

తనదు తల్లి లంజ, తనయాలు మాదిగ
శ్రీపతికి గురు వశిష్ఠుడు దరయ
తపము చేత ద్విజుడు, తర్కింప కుల మెట్లు...

ఇట్లా దైవమతమును ప్రచారంచేస్తున్నాడు వేమన. ఈబెడదను తప్పించుకొనే కాబోలు, నదీమూలాన్ని ఋషిమూలాన్ని విచారించరా దన్నారు. ఇట్టి పరమ సత్యములకు భిన్నంగా నడచుకొనినవారిపై వేమన చిట్లినపిడుగువలె బడి బొబ్బలు కలుగజేసినాడు.

**అద్వైతసిద్ధి : భాషాసౌలభ్యము :**

వేమన కైవల్యపథంలో పురోగమించినదంతా అద్వైతసిద్ధాంతానుగుణ ముగనే ! ఆసూత్రము నిట్లు నెలకొల్పుకొనినాడు :

సకలాకారు డనంతుడు
సకలాత్మలయందు సర్వసాక్షియు దానై
సకలమున నిర్వికారుం
డకలంకస్థితిని బ్రహ్మ మనబడు వేమా.

తన్ను తాను దెలిసికొనుటేగాక, ఇతరులకు ఎరుక దెల్పుటయందు వేమనభాష

నీటికంటే పలుచనై, క్లిష్టవిషయములను పండు వలచి చేతబెట్టుచున్నది. భావ ప్రకటనపాండితిని తిలకించండి; మనసు తేరి నిర్మలమైనవారికి దప్ప ఇట్టివచో నైపుణి అలవడజాలదు. ప్రారబ్ధవాదమును కర్మసిద్ధాంతమునంతా ఇట్లు మూడు బంతులలో ఇముడ్చుచున్నాడు :

ప్రాత వెంటగాని వర మీదు దైవంబు,
చేతకొలదిగాని ప్రాత గాదు,
ప్రాత కజుడు కర్త, చేతకు తా కర్త...

మహాబాష్యములశ్లోకము లన్నిటికిని ఈచిన్నపద్యమే విపులసులభవ్యాఖ్యానము! ఇట్లే డాక్టర్ రాధాకృష్ణన్ - 'The present is determined, and the future is conditioned' అని చక్కటిభాషలో కుదించి చెప్పినాడు. ఇది చిత్రగుప్తుడు Ledger keeper మాత్రమే అనుట !

అనంతభిన్నత్వంలో ఏకత్వమును ఎంతసులభంగా సూక్ష్మంగా విస్పష్టంగా చెప్పుచున్నాడో చూడండి :

పసులవన్నె వేరు పాలెల్ల నొక్కటి,
పుష్పజాతి వేరు పూజ యొకటి,
దర్శనంబు లారు దైవంబు ఒక్కటి...

దీనికిమించిన సర్వప్రాపంచికమతము సనాతనమైనధర్మమును గలదా ? ఇంతకంటె సులభంగా బోధించేవారు గలరా ? 'నాదేవుడు - నాదేవుడు' అని గొంతులు కోసుకొనేవారికి ఇంతకంటె చక్కటి ఉపదేశం దొరుకుతుందా ? 'ఏకం సత్ విప్రాః బహుధా వదంతి' అని గదా పరమఋషులవాక్యం !

ఆరురుచులు వేరు సారంబు నొక్కటి,
సత్యనిష్ఠ వేరు సత్య మొకటి,
పరమఋషులు వేరు భవ్యుండు ఒక్కండు...

—భాష లింతె వేరు పరతత్త్వ మొక్కటి — అని, గాంధీజీ "రాం — రహీముల" భావాన్ని ఎప్పుడో చాటినాడు - యీపెడకట్టె యోగి. ఇదే గదా నానాత్వంలో ఏకత్వం.

ఇంత ఎరుక కలిమిగలిగిన ఉపదేశకుని తనకాలం అర్థం చేసుకోలేక పోగా, అపార్థమునే చేసికొన్నది. కారణం - హెన్‌రీ బవర్సు అన్నట్లు - తన యుగపురోగామి వేమన !

## 4. ఆనాటి పరిస్థితులపై వేమన పలుకుబడి

వేమనమతము, ఉపదేశాలు అగ్రజాతులవారిని ఉద్దేశించి చెప్పబడినవి కానేకావు; సామాన్యగ్రామీణులు, తరతరాలుగా తత్త్వవాక్యాలు విని చిలుకపలుకుల వల్లె వల్లించుచుండిన ఎచ్చిపచ్చి చదువువారు, మూఢనమ్మకాలవారి కొరకే చెప్పబడినవి; అందుచేతనే ఎక్కువగా వారే వేమనచే ఆకర్షితులైనారు. అప్పటమైన తెనుగునుడికారంలో ఆయననిర్మలహృదయం వేదాంతము ప్రతిబింబించినవి. "కొండఅద్దమందు కొంచమై యుండదా ?" అని తానే చెప్పినట్లు అంతపెద్దవేదాంతం, ప్రజలఅందుబాటులోనికి, చిన్నదై చిక్కులేక వచ్చినది. సంసారులు (శూద్రఅగ్రవర్ణములవారు) ఇతరపామరపాటకజనం శిష్యులైనారు. రాయలసీమంతా ఆయనకవితాకన్యకకు, ఆయనతత్త్వవిద్యకు విహారరంగమైనది. గురుపీఠములందలి శ్రీచక్రములకు, సంస్కృతభాషకు ఆచార్యులమఠాలయాలకు అంటబెట్టుకొని యుండిన భూరివిద్య, సామాన్యవిద్యతోబాటు ప్రజలపరమైనది. 1453లో పూర్వరోమన్‌సామ్రాజ్యం కేంద్రము - ఐరోపీయసంస్కృతికి కేంద్రము - కాన్‌స్టాంటినోపుల్ (ఇప్పటి ఇస్టన్‌బుల్) తురుష్కులవశమై అందు కేంద్రీకరింపబడియుండిన వివిధవిద్యలు విజ్ఞానము అచటనుండి పలాయనమై పరమట దేశదేశాలకు పాకి, పునరుజ్జీవనోద్యమమును (Renaissance) - ఒకయుగాంతరమును కల్పించినట్లు, ఒకనవ్యచైతన్యశకము తెనుగునాట, ఒకఆధ్యాత్మికవసంతోత్సవమై పుట్టినది. బ్రాహ్మణేతరులే ఉపదేశకులైనారు. ప్రజలకు ఆత్మగౌరవము ఆత్మవిద్యతోబాటు పైకుబికినది. తెనుగుభాషే మతవిద్యను తెలిపే భాష అయినది; తెనుగుకు జాతీయ భాషాస్థాయి దొరికినది.

అక్షరాస్యులైన బ్రాహ్మణేతరులు గురుస్థానాలను ఆక్రమించుకొనినారు. చదువురానివారికి, పాటకజనానికి తత్త్వబోధ విని అర్థంచేసుకోదగిన వివేకము, దానిని ఆచరించవలెనను పట్టుదల పుట్టినవి. వేమనకవిత్వం నేల నాలుగు చెరగుల ప్రజలను చకితులను చేసినది. ఊరూర కవులను గూడ పుట్టించినదేమో! తత్త్వజ్ఞానాలనే పాటలు ప్రతినోట నానినవి. పల్లెపల్లెకు ఒకమతగురువు వెలసినాడు. వేమనకు తను మన ధనము లర్పించిన శిష్యకోటి బయలు దేరినది.

దీనితో గూడ విజ్ఞానచైతన్యమే గాక, యథార్థమతం గూడ వికసించినది. తనమతం తెలియక పరమతాలకు ఎగబ్రాకే బుద్ధిని సామాన్యప్రజలలో చాలవరకు వెనుకకు మరల్చినది. కల్లమతం కాలికొంది పరుగెత్తిపోయినది.

పెద్దలనే పేద బ్రాహ్మణేతరస్వాములు బయలుదేరినారు. వీరు సంచారం గావించుచు, పల్లెటూళ్ళలో శిష్యకోటిని సమకూర్చుకొనినారు. ఇందు జంగం దేవరలు ప్రముఖపాత్ర వహించినారు. తెనుగులో కందార్థాలు గీతాలు పాటలురూపాన మతవాఙ్మయం పెరిగినది. మతవిద్యకు తెనుగుతన మబ్బినది. ఇది వేమన ప్రభావాలలో అతిప్రధానమైనది. సత్యబోధ చేసేదేవరలు బత్తులు చాలమంది, నెల్లూరు తూర్పునాట నిన్న మొన్నటివరకు, ఆరాధనలు చేయించుచు పూజలందు చుండినారు. ఈమతప్రకారం ఇంకను పూర్తిగా రూపరిపోలేదు. జంగందేవరలు సంసారులఇండ్లలో ముఖ్యంగా అపరకర్మలలో ప్రధానాచార్యులైనారు. ఈకర్మకు తీరాలని తెనుగుపేరుబెట్టినారు. బ్రాహ్మణపురోహితుడు "కాకగృధ్రప్రీత్యర్థం" అని చెప్పగా దేవర "కాకులగ్రద్దల ప్రీతికొరకు"; "మీతాతలు తండ్రులు కైలాసం పొయ్యేకొరకు" అని గంటవాయిస్తూ పిండం బెట్టించును. ఇది, తిరుపతివెంకటేశ్వరునిసన్నిధిలో వేదపఠనానంతరం ద్రావిడప్రబంధం (నాలాయిరం) చదువుటవంటి ఉభయభాషాప్రయోగము. డి.యం.కే. నేడు దేవాలయాలలో కోరేది ఇదే ప్రక్రియను. కాకగృధ్రప్రీత్యర్థం అనేమాటను సంసారులు పలుకలేక కాకిగుద్దపీతిఅని రసాభాసంచేసేదానికంటె దేవరమంత్రమే శుభమేమా!

ఇప్పుడే పోతులూరు వీరబ్రహ్మం — విశ్వబ్రాహ్మణధ్వజంతో బయలుదేరినారు — చదువుఅలవడియుండిన విశ్వబ్రాహ్మణులు, వీరశైవులు భాషను మంత్రమును గరపుచు గురువులైనారు. ఈయన శిష్యులలో అన్నికులముల వారు, అన్నిమతములవారు చేరినారు. దూదేకుల సిద్దయ్య మతప్రచారం ఆంధ్రదేశంలో — ముఖ్యంగా రాయలసీమ నెల్లూరుమండలాలలో గుర్తింపదగియుండినది. అదేమతసమైక్యతకు మూలకందమైనది. వీరితోబాటు మాలదాసరులు దేశమందంతటా భక్తి గీతములు ఆలపించుచు భజనలు చేయించుచుండినారు. దీనికంతా ముమ్మందు లింగాయతమతం ప్రజలమానసికక్షేత్రాల చదును జేసి, బీజావాపము చేసియుండినది. దీనిపై వేమనబోధ తొలకరియై షేల్కాలుపుపైరును మొలపించి పెంచినది.

దీనితో, మతం అగ్రజాతులగుత్తగుప్పెటనుండి బయటబడినది. ఇంతకు ముందెప్పుడో, తమిళనాడులో సర్వవర్ణసమైక్యమతం వ్యాపించియుండినది. శైవనాయనారులలో నందనారుబోటి మాలలు, ఇతరకులముల స్త్రీపురుషులుండినారు. ఇక వైష్ణవఆళ్వారులలో అన్నికులములవా రుండిరి. రామా

నుజాచార్యులవారి పరోక్షగురువు యామునచార్యులవారి (ఆళవందార్) ప్రియ మైనశిష్యుడు చిననంబి మాల। ఈపరిసరవాతావరణమును, ఆంధ్రదేశంలో గాలివానవలె వీచునట్లు వేమన చేయగలిగినాడు. తమిళనాటిసంగతి వేమనకు బాగా తెలిసిఉండినది.

వేమనకు ముందువెనుకలలో, కన్నడులలో హేమారెడ్డి మల్లమ్మ అనే సాధ్వి గీతాలు వ్రాసి, శ్రీశైలమల్లికార్జునుని సేవించి సాయుజ్యమును పొంది నది. ఈమెకథ సక్కుబాయికథకు సరిపోవుచుండును.

వేమనసంప్రదాయం ఆంధ్రదేశంలో మహానది అయినది. పలుతావు లలో తెనుగులో తత్త్వం బోధించుశూద్రస్వాములమఠము లేర్పడినవి. ఇందు చాలమంది యోగినిలుగూడ గలరు. ఏగంటివారు, ఎడ్లరామదాసు మొదలగు వారు, వేమన ఆధ్యాత్మికజ్యోతిలో తమకరదీపికలను వెలిగించుకొని ఆంధ్ర భూమిని తేజోవంతము చేసినారు.

ఇదీ। వేమన తెనుగుప్రజకు గావించిన మహోపకారము। ఆయన లోకకవిత సాధించినప్రయోజనమే ఇది।

## 5. వేమనకవితాసౌభాగ్యము

కవితకు రసానుభూతి, దానిని ప్రకటించగలిగినభాష — ఈరెండునూ రెండుఊపిరితిత్తులవంటివి. ఛందోనియమాలు బంగారుసంకెలలు కానంతవరకు తొడవులే కాగలవు. తెనుగుకు ప్రాస అనుప్రాస కమ్మదనాన్ని కూర్చే ఒంట బుట్టిన సహజాంగములు. యతులు వద్దన్నా తెనుగుమాటలకూర్పు — పొంకాన్ని వదలలేకున్నారు విప్లవకవుల మనుకొనేవారు గూడ. కాబట్టి, వేమనసమకాలి కుడైన తెనుగుబిడ్డ జగన్నాథపండితరాయలు వేమనసంగతి తెలిసికొనే కాబోలు 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం'- అని అన్నాడు. లోకోత్తరాహ్లాదజనక మైనకవితాశిల్పగుణము కొందరికి స్వతస్సిద్ధము. మహాకవులలో ఈరసము చిక్కనైనా, పామరజనంలో గూడ జాలువారుచునేడుండును,

**చలువచీర గట్టుకోని చాకిరేవుకునేనుబోతే**
**సన్నమల్లెలవాన గురిసెబ్బే పెడమల్లి చిన్నా,**
**చలువచీర నగము దడిసెబ్బే। పెడమల్లి చిన్న।**

అనే ఎరుకల — దొమ్మరసానెలపాట, మన్మథావస్థను తెలిపే ప్రణయభావ కవిత్వానికి, రసావేశానికి పనసదొనవంటిదికాదా ? మాపల్లెలలో - "తూర్పు

రేకలు మైలవిడిచినప్పుడు లేచి బయలుదేరినా" అని, భావుకులు కవనం అల్లినట్లు, సామాన్యంగా నిరక్షరాస్యులే అంటారు. ఈకవితారసం గూడుకట్టుకొని, సంస్కారితహృదయాలలో నక్కొని ఉంటుంది; ఆమనిలో ఋతుధర్మంగా చెట్లు చిగిర్చినట్లు, సందర్భశుద్ధినిబట్టి మహాకవులవలెనే గ్రామీణకవిగూడ, ఆనాటికోకిలవలె కుహూరవాలకు ప్రతిగా తనపాటలతో ప్రజలమానసాన్ని పులకరింపజేస్తాడు. ఇట్టికవితావేశమే _ రసావేశమే వేమనను ఆవహించినది. ఇది లోకకవిత ! ప్రజాకవిత !

**సామెతలు : వేమనభాష :**

ఇట్టి కవితాసామగ్రియే సామెతలుగా, నానుడులుగా యాలపదాలుగా వెలువడి గాలివలె దేశమందంతటా అలముకొనిపోయి, ప్రతినోటా నిండి యుండును. ఈకవితారీతిని చేబట్టబట్టే వేమనరచనకు శాశ్వతగుణ మబ్బినది. ఆంధ్రకవితాసామ్రాజ్యపాలకులైన మహాకవులు తమకాలమునాటి వాడుకభాషను వాడబట్టే వారికవితకు జీవమెక్కినది. కాబట్టి వేమనభాష గ్రామ్య మనిన తిక్కనపోతనత్యాగరాజాదుల్వాతలను గూడ గ్రామ్య మనవలసిఉంటుంది. ఇంక కొందరు వేమనభాషలో తప్పు లున్నవనుచున్నారు. ఒకవైయ్యాకరణి తప్పు ఇంకొకరికి ఒప్పు అగుచున్నది. ఎదిగిపొయ్యేభాషను అనుసరించి అనుగమించవలసిన వ్యాకరణానికి ప్రథమస్థాన మివ్వడం - ముందు బుట్టిన చెవులకంటె, వెనుక బుట్టిన కొమ్ములు గొప్ప వనుటవంటిది.

తప్పులో ఒప్పులో కమ్మగా, చెవికి ఇంపుగా విషయపూర్ణంగా చెప్పినదే సత్కవిత అని చాలమంది పెద్దలమతం. ఇంగ్లీషుమహాకవి ఆలివర్ గోల్డు స్మిత్, తన "వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు" పుస్తకప్రకటనలో "A book may be amusing with numerous errors, or it may be very dull without a single absurdity"___అని మంచిపుస్తకా లేవో చక్కగా నిర్వచనం చేసినాడు. ఇసుకలో చమురు వచ్చినా వచ్చునుగాని కొన్నిసలక్షణగ్రంథాలలో కవితారసం ఎండిపోయిఉంటుంది; ఇది వరటకపోయిన మామిడిపండువంటిది.

ఇట్టిది గాదు వేమనకవిత్వం. బుగ్గనుండి ఎడతెరిపి లేకుండా పారే, తేరినమంచినీటిజాలు - ఈకవితాధార ఇది హృదయావేశానికి అక్షరరూపమైన విభవము ! పెద్దభావములను చిన్నమాటలలో చెప్పగలిగిన మహాశిల్పి వేమన. చిక్కదనము - చేవ-కండ గలిగినమాటలకూర్పులే యాతనికవిత్వానికి ప్రాణము.

చలువరాతిలో మలసిన విగ్రహంవలె వంపులతీరుతో స్థిరమై సుందరమై, అందరికీ అర్థమయ్యే పోలికలు దృష్టాంతాలతో యీరచనలు నిండిఉండును కాబట్టి పండితులకు పామరులకు హృదయఫలకంలో హత్తుకొనిపోతవి యీ పద్యాలు. భావోద్రేకపుపరుగును భాష అందుకొనజాలక కవిత చతికిలబడుట చాలమంది వ్రాతలలో కనుపించేదోషము. కాని, వేమనలో యీరెండును జోడు ఉద్దిగా పేరెమువారినవి. ఇదొక విశిష్టగుణము వేమనజాతీయకవనము నకు! ఇక విషయగౌరవభారము, జీవభాషాకంచుకమును తొడుగుకొని పద్యాలను అటునిటు కదలనీయదు - చెదరనీయదు. సూటిగా సరళభాషలో చెప్పబడినభావం అద్దంలో కనబడినట్లే కనబడి, ఎన్నటికీ చెరిగిపోకుండును. అంటే, చెప్పినమాటలపొంకము వేమనసొమ్ము! Expression ప్రాణవంతమైన దనుట.

**లోకానుభవం :**

లోకానుభవం, వేమనకవితకు ఒకఅమూల్యసామగ్రి. ఉన్నదానినే నేర్పుతో ఉపయోగించి, ప్రాణము పోసి పాఠకుని ముందు నిలబెట్టుటే వేమన పనితనము. ఇదే ఆయనఐంద్రజాలికశక్తి. ఎవరి వెలిమెచ్చులకో పోయి, తనకవితాకన్యకకు వికృతాలంకారములను యీజానపదుడు కల్పించడు; ఆపడుపుకూటిపై ఆశే లేదు ఇతనికి.

వేమన యతిగణాలకు యతులవలె ఉపాసించి ఎరుగడు. అవే ఆయన వాక్యము ననుసరించి పరుగెత్తుకొని వచ్చి, తమతమస్థానాలలో తమకు తామై ఔచిత్యంతో కొలువుదీరిపోవును. కాబట్టే పద్యం సహజంగా సౌభాగ్యంగా నడిచినది. మాకాపు లన్నట్లు - రాళ్ళచేలో గుంటక తోలినట్లు దడబుడలు గడగడలు యీయనకవిత్వంలో వినిపించవు.

ఈసరళతాగుణంవల్లనే, వేమనపద్యం రాని తెనుగువాడు - చదువురానీ రాకపోనీ - ఆయన చాటువ చెప్పనివ్యక్తి ఆంధ్రదేశంలో లేడనవచ్చును. ఇట్టి లోకవ్యాప్తి వేమన తర్వాత బద్దెనదే! (సుమతిశతకం)

**వేమన ఆటవెలదులు :**

కవికి కంసాలికి సీసం తేలిక అంటారు, కాని వేమనకు ఆటవెలది. దానిపై గజ్జగట్టి జగన్మోహనంగా ఆంధ్రసాహిత్యరంగస్థలంమీద లాస్యం

సలిపినది. మొదట ఆటవెలదిసంగతి బాగా తెలిసినవాడేగదా! కందము తిక్కనదైనందున, ఆకందనస కొంచెంగానే పట్టించుకొన్నాడు. తననిండు భావాన్ని మూడుచిన్నబంతులలోనే ఇమిడ్చుట ఒకఅపూర్వప్రతిభ. అందులో ఒకపంక్తి సామెతతో అర్థాంతరన్యాసమో అయిఉండును. ఈఇమిడికలో యీ కుదింపులో, యీకవితాకన్యక చోటు లేక ఇరుక్కొని కూర్చుండి సంకటపడ లేదు. హ్రస్వీకరణమున ఇంతటి ఆరితేరినచేయి, భావప్రకటనమునకు చాలిన వాడు ఒక్కతిక్కనే వేమనకు దీటనవచ్చు. ఈయనపద్యం ఒకసమగ్రసజీవ శరీరంవంటిది. ఏపదమును కదిలించినా, ఆపద్యానికి అంగసౌష్ఠవం చెడుటే గాక కీళ్లూడిపోవును.

**అన్నిపద్యాలలో కవితాగౌరవం ఉండగలదా?**

ఈయన విమర్శకవాక్యాలు చురకత్తివాదర పదను కలిగియుండును. అయినా ఈ ఉపదేశవాక్యాలు గ్రీష్మాతపంలో పాంథునికి ఒకచలివేంద్రవలె వ్యాకులితమనస్కునికి శాంతిని ఒనగూర్చుచుండును. ఒక ఉపదేశకుని వేదాంతవిషయాలు కవిత్వంలో రాణించుట వేమన చేయివాసిపని. ఇది శాస్త్ర వాఙ్మయంలో అపూర్వగుణము. మనవారు ప్రతివిషయాన్ని పద్యంలోనే చెప్పుటచే కవితాకళకు చచ్చుదనము చప్పిడిదనము కలిగియున్నవి. ఈబెడద వేమనకు తప్పినది.

వేమన బయటబెట్టిన విషయాలు రుచింపనివారు, పాతకవితారీతులకు అమ్ముడుబోయినమనసుగలవారు, వేమన కవి కాడని ఆయన రచనలకు వ్యాప్తి లేదని చెప్పుదురు. కవి కాదన్నది చెల్లేమాట కాదు కాబట్టి, వ్యాప్తి లేదన్న మాటను పరిశీలిస్తాం: కవిత్రయం, శ్రీనాథ పోతన రామరాజభూషణ తెనాలి రామకృష్ణ మొదలగు ప్రబంధకవులు ఏకొద్దిమందికో దప్ప మిగతవారికి ఎందరికి వేమన కున్నంత ప్రచారమున్నది? ఊరకే లేదంటే సరిపొయ్యేమాట కాదిది! ఆయన కవి గానిచో, అందరిమానసాలు హరించనిదే, ఆయనలో ఏవో ఒకవిశిష్టగుణము లేనిదే, ఇంతటి ప్రజారంజకత ఎట్లు సమకూడగలదు? ఇది లేదంటే మొండివాదం అనిపించుకొంటుంది.

కొందరు విమర్శకులు కష్టంమీద వేమనకవిత్వగౌరవాన్ని అంగీకరిస్తూ అన్నిపద్యాలలో కవితాగుణం లేదని ఒకసొడ్డు పెట్టుచున్నారు. ఇది కవిబ్రహ్మలకే అలవిగానిపని. ఇట్టిపరిపూర్ణత ఆబ్రహ్మచేతనే కాదని-

పునుగుపిల్లి కేల పుట్టించె వాసనః
కనకము తనకేమి కల్లజేసె ?
బ్రహ్మచేతలెల్ల పాడైనచేతలు...

ఇంకొకరైయుంటే హిమగిరి యందలి కస్తూరి మృగమును పోల్చి యుందురు. పునుగుపిల్లిసంగతి వినే ఉండరు. 'బ్రహ్మదేవుచేత పదడైన చేతరా' అని చాటుచు, కవులకల్పనలన్నీ కళాఖండాలు కావని పరోక్షంగా చెప్పు చున్నాడు. అర్థవమైనదే నిలుచునన్నదానికి (Survival of the fittest) వేమన రచనలే సజీవసాదృశ్యాలు. రామలింగడన్నట్లు వట్టి 'కయిత్తపు పైయిత్యపు భ్రమ' కాదు వేమనది. ఇక వేమనకవితాసురభిళసుమాల కొన్నింటిని ఆఘ్రాణింతము :

**కవితాసురభిళసుమములు :**

ఈకృషీవలకవి, తనచుట్టున్న ప్రకృతిని, అందరికీ తెలిసినవిషయము లను దృష్టాంతములనే చేపట్టి పోల్చిచెప్పుటచేతనే, అవి విన్నవారిమనసులలో నిలిచి నాలుకకొనలపై ఆడుచున్నవి.

**ఉపమాలంకారములు :**

ఈయన ఉపమానాలలో, ఊహావల్లరిని తెగపెంచి ఆకాశశూన్యంలో లీనంచేయడు. అవి తన ఎదుటనే నిలిచియుండును. ఉపమానాలలో కాళిదాసునికి ఉన్నంతలాఘవం యీకాపువానికి గూడ కలదంటే దైవదూషణం అని పైన బడకుందురుగాక!

"జారకాంతలవెంట దిరుగువాడు వెఱ్ఱివాడు" అని అంటూ ఇది "పంటచేను విడిచి పరిగయేరినయట్లు" అని ఉపమించినాడు. ఈమాటతో గూడ పొలాలలో పనగట్టిన తర్వాత రాలిపడిన కంకులను ఏరుకొనే బీదలదృశ్యం కన్నులకు గట్టుచున్నది. ఈపని కడుపునింపేపని గాదనుట. "చెప్పు దినెడి కుక్క చెఱకుతీపే మెరుగు" అనిన దానికంటె సూటైన ఉపమానం ఇం కొకటి ఉండబోదు: "తొత్తుతోడిపొందు తొఱ్ఱిపెసలమూట" పెసలు నున్నగా గుండ్రముగా నుండుటచే అద్దం ఆపులేకుండా జారిపోవును. గరుకుగా ఉండే వడ్లు ఇట్లా జారవు. "భూమి నాది యన్న భూమి పక్కున నవ్వు" నటః పరిమితి అని భూముల పెరుక్కొనే యీనాడు ఇది రైతులకు కొంత ఊరటగా నుండగలదేమో! "గంపెడంతతవుడు గంపలో బెటక చన్ను బటనీదు

కొన్నబత్తి" కొన్నదైనా ప్రతిఫలం లేక పనిచేయ దనుటలో సారస్యం. ఇదిగోనున్న—ఇదిగోవెన్న అనిగదా సామెత. "పులి దాసరి కిడుట" ఇంతకంటె వంచకుల వర్ణనము కావాలనా. "గాజు యింటికుక్క కళవరపడురీతి"— అద్దాల మేడలో కలిగే తబ్బిబ్బులను ఎంతో చక్కగా చెప్పినాడు "వానతోడ వచ్చు వడగండ్లు" - అవును - అంతే।

**ఎత్తిపొడుపు :**

మన ఆంధ్రవాఙ్మయంలో, విమర్శన మన్నా హేళనమన్నా తిట్టుడే! Satire అనే ఎత్తిపొడుపుబాణిని వేమనవలె ఉపయోగించినవారు చాల తక్కువ. ఇట్లే భారతీయసాహిత్యాలలోగూడ హాస్యమంటే కలికమునకుగూడ కానరాని దినుసు. ఈ ఎగతాళిని ఉపయోగించి, చురచుర లాడించుటలో వేమన ఆరి తేరిన చేయి. ఈ ఎగతాళి కోడిగము మర్మభేదనమైనా, దెబ్బతిన్నవానిచేత గూడ నవ్వించును."పెట్టి పొయ్యలేని వట్టినరులు పుట్టలోని చెదలువంటివారు". వట్టినరులు అనుటలో మానశరీరధారులైన అప్రయోజకులను స్ఫురింపజేస్తు న్నాను.

పిసినారిని ఎన్నో పద్యాలలో చించి చెండాడినాడు.

**"కొంకనక్క జావ గొత్త లేమిటి కేడ్చు ?"**
**"కుక్క యే మెరుంగు గురులింగదేవుని,**
**సక్క యే మెరుంగు ఒక్కపొద్దు**
**మూర్ఖు డేమి యెరుగు మోక్షంబుత్రోవను"**
**"ముంజకోక లెల్ల లంజకోకలకాయె"**

ఇందు బ్రహ్మచారి వ్యభిచారి అయినసంగతిని విమర్శించినాడు.

"నొసలు భక్తుడయ్యె, నోరు తోడేలయ్యె" అని గోముఖవ్యాఘ్రానికి తెనుగు చెప్పుచున్నాడు. "ముసలిముండల కేల ముసిముసినగవులు" అంటూ, దీనితో వేణుగోపాలశతకమునకు నామాలు బెట్టినాడు, పెట్టు—నామం బెట్టులు, భిక్షం బెట్టుటను గూర్చి ఇట్లు చమత్కరించినారు. 'ఇటు బెట్టిన ఇటు బెట్టిన ఇటు బెట్టక ముక్తి లేదు'....— అని నిలువుబొట్టు అడ్డబొట్టులను చూపుచు, ఒకరికి పెట్టవలెననే సైగలచేతను చెప్పుచున్నాడు. ఇది మాటల అర్థంపై చేసిన చమత్కారము.

ఈ విసరుల ఫక్కిలోను మతమునే మూఢాచారాలను దొంగస్వాములను వీపులు బాది విమర్శించినాడు. ఇవి తలమానికపు నుడులు।

ఆడుదానిని నెత్తిన ఎక్కించుకొనిన ఊబమగలను, దేవతలపై బెట్టి ఎంతవ్యంగ్యంగా అంటున్నాడో చూడండి :

స్త్రీ నెత్తిన రుద్రునకును
స్త్రీ నోటను బ్రహ్మ కెపుడు, సిరి గుల్కంగా
స్త్రీ నెఱిఱొమ్మున హరికిని
స్త్రీనెడ పగ గురుడ వన్న - దేవర వేమా.

అని, తా నాతప్పుచేయ లేదంటున్నాడు. ఈపద్యాన్ని తిప్పిచెప్పుచు ఒకవికటకవి, మాదేవతలస్వర్గంలో గూడ మొగలాయిదర్బారులోవలెనే-శిరస్దదార్, ఉరస్దదార్, ముఖస్దదారు లున్నారంటున్నాడు. దార అంటే భార్యగదా!

నీతులు, హితోక్తులు చెప్పటలో ఈకవి తీరేవేరు. చేదుమందును బెల్లంలో పొదిగి మింగించిన ట్లుండును.

వేమనకవితావీధులు "రాకపోకలు లేని రాజవీధులు" గావు.

**వేమనతెనుగు :**

వేమన తెనుగు అమ్మ చెప్పినదేగాని, అంతగా బడిఅయ్యవారు చెప్పినది గాదు. ఆయన ఎన్నినుడులనో కల్పించినాడు. తిక్కన శాంతిపర్వంలో సంస్కృతపదాలకు తెనుగుమాటలు కల్పించినట్లు, వేమనగూడ ఎన్నోపదాలను నుడికారాలను కొత్తవాటిని చేపట్టినాడు. పొత్తినూలికాయపురుగు _ పొత్తినూలుపురుగు (తంతునాభము), ఎరుక (జ్ఞానము) మొదలగునవి తిక్కన ప్రయోగాలు. ఇట్లే ప్రతిసంస్కృతపారిభాషికపదానికి వేమన తెనుగు చేసినాడు. బ్రహ్మాండానికి బొమ్మగుడ్లు అని వేమనతెనుగుసేత. లోచూపు (అంతర్దృష్టి లేక అంతర్ముఖము.) "తావు లేనిచోట తావు తానై యుండు" అనిక్షేత్రక్షేత్రజ్ఞులను వివరించినాడు.

సహజమైననుడికారము ఈకవిసొమ్ము. చెప్పటలో జీవము తేజము ఉండును. సంస్కృతసూక్తులను శ్లోకాలను, వాటి అబ్బగా తెనుగుచేయుటలో వేమన నేర్పరి. ఈయన తర్వాత బద్దెభూపాలుడు. ఆకల్పనకు కురుచదనము బిగువు ప్రాణంగా ఉండును. "ప్రసూత్యంత్యం చ యౌవనం" అనేదానిని "పేకటి దొలగు వెనుకటి బిగువు" అంటాడు _ వేమన.

**కొన్ని విశేషాలు :**

వేమన తనకు అనుభవంలోనికి వచ్చిన ఎన్నోఅంశాలను వివరించి

నాడు. వాదభ్రష్టుడైన వైద్యశ్రేష్ఠుడు కాబట్టి, రసాయనికశాస్త్రం కొంత తెలిసి నట్లున్నది.

ఉప్పుకప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ జూడ రుచులజాడ వేరు ;
పురుషులందు పుణ్యపురుషుడు వేరయా...

అన్న సర్వసాధారణమైన పద్యంలో సైన్సువిషయం చెప్పినాడు. ఇది చప్పిడి పద్యమని, కడకు ఉప్పురుచిగూడ పట్టించుకొనక, కొందరుపెద్ద లనుట, దీని లోని అంతు పట్టుకోలేకనే ? ఉప్పుకప్పురము రెండుగూడ నిప్పులో కాలిపోవు నని వీరిశంక. కాని భేదమిది : ఉప్పు నిప్పులో చిటపటలతో నీటై పోగా, కర్పూరం మండి కనబడకుండా పైకిపోయి, పైన మూకుడు బోర్లించిన, కర్పూరం మరల కోపులరూపం దాల్చి కనబడును. ఇది Sublimation - ఉత్తమగుణరూపస్థితిని బొందుట. సామాన్యుడు ఉప్పువలెనే నిప్పున నీ్ పోగా, ఉత్తముడు కప్పురంవలె ఉన్నతరూపాంతరస్థితిని బొందును. అందు వల్లనే పురుషులలో పుణ్యపురుషుడు వే రంటున్నాడు. ఇది అతీతమానవస్థితిని అందుకొనుటవంటిది; ఈఅభిప్రాయాన్నే ఇంకా ఇట్లు స్థిరీకరించుచున్నాడు ;

పరుస మినుము సోకి బంగార మయినట్లు,
కప్పురంబు జ్యోతి గలసినట్లు,
పుష్పమందు తావి పొనగునట్టులు ముక్తి ...

ఆత్మజ్యోతి పరంజోతిలో లీనమగుటే కప్పురము లయించుట అని చెప్పు చున్నాడు. ఈ ఉదాత్తభావమునకు ఇది తెనుగుమాటలలో వివరణము.

## 6. వేమన సూక్తులు - సామెతలు :

సామెతలు ఒకజాతిగుణమును, దానిప్రత్యేకతను ప్రదర్శించే సుధామయ సూక్తులు. వీటికి తలతోక అనక ప్రాణం నిలువెల్లా నిండిఉండును. లోకాను భవము ఇంగితము గలిగినకవికి, ఇంటిపట్టుననే ఉన్నసంసారికి, పామరునికిగూడ వీటిని అల్లగలిగినశక్తి ఉన్నది. మాతట్టు వీటిని చాటవలు, సాటవలు, సాటువలు అంటారు ; సాటిమాట చెప్పుట అనుట. ఇక తెనుగుకు ప్రాణమైన అనుప్రాసే చాటవకు సొంపు. ఆంధ్రభాషకు విశిష్టగుణమైన ప్రాసలు ఇందు పొర్లిపారు చుండును. వీటిని కల్పించుటయందు వేమన జాణతనము మెరసినది. తన సొంతాలు గాక, అప్పటికి వ్యాప్తిలో నుండినవాటిని గూడ వేమన చేపట్టి

యుండును. కాబట్టే ఈయన పద్యాలలో ఇవి కొల్లలుగా చేరినవి. ఇదేపని మనకవు లెందరో చేసి, తమకావ్యాలకు సుడికారమును విపులీకరణ దక్షతను చేకూర్చుకొనినారు. సామెతతో చెప్పినచో విషయం సులభగ్రాహ్యమై లక్కఅతుక్కొనినట్లు మనసులో ముద్రితమైపోవును. మాటకారితనానికి చాటవే జీవం ; సామెతలు అనుదినం ఎదిగిపొయ్యే జీవస్రవంతి.

ఇక వేమన పసిడితునకలు కొన్ని :

ఆలివంకవారు అందరు చుట్టాలు.
కూరలేని తిండి కుక్కతిండి.
బ్రహ్మ కైన బుట్టు రిమ్మతెగులు.
కాపు లేనిదాని కాపుర మడుగరా. (కాపు - రక్షణ).
చెట్టు ముదరనిచ్చి చిదిమిన పోవునా.
గడుసురాలు మగని గంపబెట్టమ్మురా.
గొడ్డుటావు పాలు గోకితే చేపునా.
కుమ్మరి కొక యేడు గుదియ కొక నాడు.
పుట్టమీద గొట్ట భుజగంబు చచ్చునా.
ఏటివంక తీర్ప ఎవ్వరి తరమౌను.
అప్పు లేని వాడె అధికసంపన్నుడు.
అల్పనరుల కెల్ల నతివలపై చింత.
అందరు ఘనులైన హరునకు తావేది.
ఇతరు లెరుగకున్న నీశ్వరుం డెరుగడా.
కదళి మ్రింగువాడు గరళంబు మ్రింగునా.
కుక్క సింహ మగునె గోదావరికి బోవ.
కుడితి మరుగు బఱ్ఱె విడినీరు తాగునా.
కదనభీతు జూచి కాలుండు నవ్వురా.
కాశివాసులైన కనబోరు మోక్షంబు.
కొండముచ్చుపెండ్లి కోతి పేరంటాలు.

వెనుకటికి కోతిపెండ్లికి గాడిద పౌరోహిత్యం వహించింది. చుట్టంగా వచ్చినఒంటె, గాడిదకంఠమాధుర్యానికి మెచ్చుకొంటే, లొట్టిపిట్ట అందానికి గాడిద మూర్ఛపోయిందట. అట్లున్నది ఈసామెత.

కుక్క ఇల్లు సొచ్చి కుండలు వెదకదా.

# గురజాడ అప్పారావు

## — డా॥ కొత్తపల్లి వీరభద్రరావు

వెనకటికి ఒకావిడ షేక్స్పియర్ నాటకాన్ని ఒదాన్ని చూసి "షేక్స్పియర్ మహాకవి అంటే కాబోలు ననుకొని వచ్చాను. దీనిలో పాత్రలు, సన్నివేశాలు, మాటలు అన్నీ నాకు తెలిసినవి" అందట! ఇదే షేక్స్పియర్ 'విశిష్టత' అని ఆవిడ ఊహించలేకపోయింది. మహాకవి ఎవరైనా వాస్తవికతను తలపింపజేసేలాగ రచన సాగిస్తాడు. కాని, కవి వాస్తవికత పత్రికావిలేఖరి వాస్తవికత కాదు. ఇద్దరికీ వస్తువు ఒకటే అయినప్పుడు కూడా ఈభేదం కనబడుతుంది. వాస్తవికజగత్తులో రాగద్వేషాదులతో సతమతమయ్యే ప్రజానీకం ప్రతినిధులు కావ్యజగత్తులోనూ దర్శనమిస్తారు. అందుకే వాళ్లను మనం గుర్తుపడతాము. వాళ్ల మాటలు చేష్టలు మనకు పరిచితంగా ఉంటాయి. కాని, కావ్యజగత్తులోని వ్యక్తులు వాస్తవికజగత్తులోని వ్యక్తులలాగ మాట్లాడరు మాట్లాడినట్లు ఉంటారు. అలా ప్రవర్తించరు. ప్రవర్తించినట్లు ఉంటారు. ఈ'ఉండడం' వాస్తవికజగత్తుకు ఎంతదగ్గరగా ఉంటే అంత గొప్పవాస్తవికరచన అన్నమాట ఆరచన. ఆరచయిత, ఆకవి అంత కృతకృత్యుడయ్యాడన్నమాట! స్థూలదృష్టికి, వాస్తవికజగత్తులోనివాళ్ళే ఆసన్నివేశాలే ఆమాటలే కావ్యజగత్తులోనూ ఉన్నట్లు ఉండడంచేత ఆఇంగ్లీషావిడ అన్నట్లు చప్పున అందరికీ స్ఫురిస్తుంది. అవిధంగా స్ఫురించడంలోనే కవి విశిష్టత ఉంది. వాస్తవికరచనల్ని పరిశీలించడానికి ఈకొలతబద్ద అమోఘంగా పనిచేస్తుంది.

ఈ'మానపరీక్ష'కు తట్టుకొని మహాకవి గురజాడ అప్పారావు (21-9-1862–30-11-1915) మన ఎదుట మహామేరువులా నిలుస్తాడు. శ్రీశ్రీ 'కన్యాశుల్కం'వ్రాస్తూ ఇలా'మీద అంటాడు.

గడ్డి వేయ పోట్లగొడ్డు కొమ్మాడించు. (పోట్ల - పొడిచే)
చెరుకు దిన్ననోరు చేదారగించునా.
చేట్లు మూడినపుడు మాటలు దోపవు.
చేటుకాలమైన చెరుప నల్పుడె చాలు.
చెరకురసముకన్న చెలిమాట తీపిరా.
తనకుగాని యాలు దానవురాలురా.
దాత లేనియూరు దయ్యాలపేటరా.
నాసటిమీదివ్రాత నులిమిన బోవునా.
పాతలంజె కెపుడు భయము లేదు.
పేడ దిన్నపురుగు బెల్లమే మెరుగురా

ఒకసాహెబ్ కోమటిఅంగడికి పోయి, పెంట దినే కోమటీ అన్నాడట. వెంటనే జిత్తులమారి శెట్టి—"సాహెబూ కాస్త బెల్లం తిను" అన్నాడు. ఇదేమయ్యా అని ప్రక్కవా డంటే - ఎవరి అలవాటు వారిది - అన్నాడట.

మారులేని తిండి మాల[illegible]ండి.
మొండివాని హితుడు బండవాడు.
మూర్ఖునకు బుద్ధి ముందుగా బుట్టును.
సురియ బట్టగానె శూరుడు గాలేడు!

"జీవితంలో ఏసందర్భానికైనా సరిపోయేమాటలు ఎక్కడో ఒకచోట గురజాడమహాకవిలో దొరుకుతాయి..... అబ్బూరి రామకృష్ణరావుగారూ నేనూ ఏసందర్భంమీద మాట్లాడుకున్నా దానికి సరిపోయేమాటలు కన్యాశుల్కంలో వెదకడం మాకొక సరదా,......... మహాకావ్యాల ప్రధానలక్షణాలలో ఇదొకటి – ఈవిశ్వతోముఖత్వం". (వారం – వారం; ఆనందవాణి 1946; శ్రీశ్రీసాహిత్యం వచనవిభాగం; 1970; పుట 339). ఇంచుమించుగా తనరచనల కన్నింటికీ ఈవిశ్వతోముఖత్వాన్ని తేగలిగిన అప్పారావు తనవ్యక్తిత్వంలోనే ఈధర్మాన్ని పుష్కలంగా పెంపొందించుకొన్నాడు. అందుకే అప్పారావు మేధావులలో మేధావి కాగలిగాడు. మేధావులకు మేధావి అయ్యాడు. కవులకు కవి అయ్యాడు.

సహజసిద్ధమైన ప్రతిభకు, వ్యుత్పత్తిని జోడించి తనసమకాలసమాజంలో కీర్తిప్రతిష్ఠలు పొందాడు. సామాన్యమైన మధ్యతరగతికుటుంబంలో పుట్టి అసామాన్యమైనవ్యక్తిగా రూపొంది శాశ్వతకీర్తి సంపాదించి తెలుగువారికి గౌరవమర్యాదలు తెచ్చాడు ఈమహాపురుషుడు. తనకాలంనాటికి ఉన్నసమస్త విజ్ఞానాన్నీ ఆకళింపునకు తెచ్చుకొని తదనుగుణంగా సాహిత్యాన్నీ జీవితాన్నీ తీర్చిదిద్దుకొన్ననేర్పరి గురజాడ అప్పారావు. తెలుగుకవులలో సాధారణంగా కనబడని మేధాసంపత్తి ఈయనలో కనబడుతుంది. హృదయానికీ బుద్ధికీ చక్కనిసమన్వయం కుదుర్చుకొని తనరచనల ద్వారా తెలుగువారిలో ఈసమ్మేళనాన్ని ప్రోత్సహించాడు.

చాలామందికి స్వస్వరూపజ్ఞానం ఉండదు. తమ శక్తుల్నీ లోపాల్నీ వారు తెలుసుకోలేరు. ఉన్నది లేదనుకొంటారు. లేనిది ఉందనుకొంటారు. ఇందువల్ల వాళ్ళ జీవితాల్లో రచనల్లో పొందిక ఉండదు. అప్పారావు ఇలాంటి వాడు కాడు. ఆయనకు స్వస్వరూపజ్ఞానమూ ఉంది. తనకర్తవ్యం ఏమిటో కూడా తెలుసు. తనకేది కావాలో తెలియక, తానేమి చెయ్యాలో తెలియక బాధపడ్డవ్యక్తి కాడు అప్పారావు. తనగమ్యస్థానం తనకు తెలుసు. అది చేరుకొనేమార్గమూ తెలుసు. అందుకే అప్పారావు రచనల్లో మనకు అస్పష్టత కనబడదు. ఆయన ప్రవర్తనలో వక్రత లేదు.

గురజాడ పుట్టిన, పెరిగిన, వికసించినకాలం మనదేశచరిత్రలో విశిష్టమైనకాలం. పాశ్చాత్యసంపర్కం వల్ల మనసమాజంలో, సమాజాన్ని తీర్చిదిద్దే మేధావులలో, ఎన్నోమార్పులు వస్తున్నకాలం అది. ఆనాడు మన సంస్కృతిని పూర్తిగా నిరసించి పాశ్చాత్య సభ్యతవైపు పూర్తిగా మొగ్గిపోయిన

వాళ్లూ ఉన్నారు; మార్పును గుర్తించలేక గుర్తించినా అంగీకరించగలిగే ఆత్మ విశ్వాసం లేక బాధపడుతూ ఉన్నవాళ్లూ ఉన్నారు. మార్పు ప్రాణికిలాగే సమాజానికీ సహజం అని తెలుసుకొని తదనుగుణంగా ప్రవర్తించగలిగిన వాళ్లూ ఉన్నారు. అప్పారావు ఆవిధంగా ప్రవర్తించడమే కాకుండా, వస్తున్న వచ్చిన మార్పుల్ని తనప్రతిభకు అనుగుణంగా మలుచుకొని కొత్తసృష్టిని చేశాడు. అందుకే ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు అప్పారావును 'గురజాడ వాల్మీకి' అన్నారు.

అప్పారావు పుట్టిన కాలాన్ని గురించి వ్రాస్తూ (మార్గదర్శి గురజాడ అప్పారావుగారు) శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఇలా అన్నారు.

"దేశం ఎంతగా పరులపాదాలకింద నలిగిపోవాలో అంతగానూ నలిగి పోయాకా, జాతి యెంతగా బానిస అయిపోవాలో అంతగానూ బానిస అయి పోయాకా, భాష యెంతగా శృంఖలాబద్ధం అయిపోవాలో అంతగానూ శృంఖలా బద్ధం అయిపోయాకా,సాహిత్యం ఎంతగా దిగజారిపోవాలో అంతగానూ దిగజారి పోయాకా భవిష్యత్తు ఎంతగా అంధకారబంధురం అయిపోవాలో అంతగానూ అంధకారబంధురం అయిపోయాకా పుట్టుకువచ్చాడీ మహాకవి" (నవోదయ, డిసెంబరు 1946.)

గురజాడ ప్రతిభావ్యుత్పత్తుల్ని గురించి వ్రాస్తూ సుబ్రహ్మణ్యశాస్త్రిగారే ఇలా అన్నారు.

"విస్తరించి చూస్తే, అప్పారావుగారిదగ్గిర, లౌకికప్రజ్ఞ అపారంగా వుండినట్టు కనబడుతుంది. వైదికసంపత్తి కూలంకషంగా వుండినట్టు గోచరిస్తుంది. ఆర్షవిభూతి అనన్యసాధారణంగా వుండినట్టున్నూ ద్యోతకం అవుతుంది" (పై వ్యాసంలోనే).

ఇంక అప్పారావు సంపాదించిన పాశ్చాత్యసాహిత్యవిజ్ఞానమూ అపారమే. ఆనాటికి లబ్ధప్రతిష్ఠులయిన ఇంగ్లీషురచయితల్ని, ఇంగ్లీషుద్వారా ఇతరపాశ్చాత్య రచయితల్ని క్షుణ్ణంగా చదివి జీర్ణం చేసుకొన్నాడు. రాజనైతికవిషయాల్ని తాత్త్వికవిషయాల్ని స్వాయత్తం చేసుకొన్నాడు. ఆనందగజపతిమహారాజుల ఆస్థానంలో ఆంతరంగికుడిగా మెలగడంవల్ల, మహారాజులకు లభించిన అనుభవాలన్నీ ప్రత్యక్షంగా కొన్ని పరోక్షంగా కొన్ని ఈయనకూ లభించాయి. మద్రాసు, కలకత్తా మొదలైన పట్టణాలతో సన్నిహితసంబంధం ఉండడంవల్ల ఇతరప్రాంతాలలోని భారతీయమేధావుల సాహిత్యసాంస్కృతికవ్యాసంగాలూ

ఆలోచనారీతులు రాజనైతికప్రవర్తనలు – ఒకటేమిటి, అన్నీ – తెలుసుకొనే అవకాశం కలిగింది. ఈవిధంగా ఆయనఅనుభూతి త్రిగుణాత్మకంగా వర్ధిల్లింది. ఆయనమాటల్లోనే ఆయన్ని వర్ణించాలంటే, గురజాడ అప్పారావు "కొత్తపాతలమేలుకలయిక".

గురజాడవ్యక్తిత్వాన్ని వర్ణిస్తూ డా. సి. నారాయణరెడ్డిగారు ఇలా అన్నారు.

"గురజాడ అప్పారావుగారి జననము ఆంధ్రసాహిత్యలోకమునకు అరుణోదయము. పిల్లవసుచరిత్రల పెంజీకట్లు ముసురుకొన్నరోజులలో దేశికవితా రశ్మిని ప్రసరించిన కవిభాస్కరు డాతడు. సాహిత్యము ఏకొందరిసొత్తో యనుకొన్నకాలములో అది ప్రజలసొమ్మని ఉదారముగా పంచిపెట్టిన సౌమ్య శీలి ఆయన. కందుకూరి సాంఘికవిప్లవమును, గిడుగుభాషావిప్లవమును, తనలో సమన్వయించుకొని, సరిక్రొత్తసాహిత్యవిప్లవము లేవనెత్తిన నవయుగవైతాళికు డాయన. ఆయనచేతిచలువతో, అస్పృశ్యముగా పడియున్న వాడుకభాష అందల మెక్కినది. మెత్తని తెలుగుపలుకు కత్తివాదర వలె మెరసినది. వీధి మానిసికి వేదిక లభించినది. ఆంధ్రభారతి అంతకు ముందటి అలంకారభారములను దుల్చివేసి ముచ్చటగా ముత్యాలసరాల నలంకరించుకొన్నది. నాటకము, గేయము, వ్యాసము, కథానిక, ఆయనవాఙ్మహిమతో ఎన్నడు లేని జవమును, జీవమును పుంజుకొన్నవి.... బ్రతితికినంతకాలము తనలక్ష్యసాధనకై, గ్రంథశోధనకై, నిర్విరామముగా పనిచేసిన 'కర్మిష్ఠి' ఆయన. (ఆధునికాంధ్రకవిత్వము, సంప్రదాయములు; ప్రయోగములు। 1967 పుట – 207).

ఈవిధంగా తెలుగువారిమన్నల్ని పొందిన గురజాడ వేంకటఅప్పారావు దుందుభినామసంవత్సర భాద్రపద బహుళత్రయోదశీ ఆదివారం (21 – 9 –1862) నాడు కౌసల్యమ్మ వెంకటరామదాసు దంపతులకు, మాతామహుడు గొడవర్తి కృష్ణయ్య పంతులు ఇంట్లో రాయవరంలో జన్మించాడు.

ఆయనబాల్యమంతా మామూలుగా జరిగినా, బాలుడు ప్రతిభావంతుడు అని పదిమందీ అనుకొనేటట్లే ఉంది ఆకాలం. నాటి విజయనగరం మహారాజుల పరిపాలనలో, గజపతులవిజయనగరం లలితకళలకూ శాస్త్రవిద్యలకూ నిలయమై గ్రీసుదేశంలోని ఏథెన్సు పట్టణంతో పోలికగా పోటీగా ఉండేది. అలాంటి చోట విద్యాభ్యాసం, ఉద్యోగం అప్పారావు చేశాడు. సహృదయులూ పండిత పక్షపాతులూ పోషకులూ అయిన శ్రీఆనందగజపతి (1850 – 1897) ప్రభృ

తుల ఆదరాభిమానాలూ గౌరవమర్యాదలూ పొందుతూ అప్పారావు జీవితం గడిచింది. మహారాజులవల్ల తాను పొందినలబ్ధికి ఇబ్బడిగానే వారికి అప్పారావు సేవచేశాడు. ఈరోజుల్లో ఇలా ఎందరిజీవితాలో గడిచాయి. కాని, గురజాడ అందరిలాంటివాడూ కాడు గనక, మిగిలినవాళ్ళనందరినీ అందరూ మరచి పోయినా తనని మాత్రం ఎవళ్ళూ మరచిపోవడానికి వీలులేకుండా, కాకుండా అప్పారావు చేసుకొన్నడు.

ఆయన బాల్యమిత్రుల్లో మనం మరిచి పోకుండా స్మరించవలసినవ్యక్తి గిడుగు వేంకట రామమూర్తి (1863 _ 1940). తన ప్రతిభావ్యుత్పత్తుల సాయంతో గ్రాంథికభాషావాదుల్ని నిరుత్తరుల్ని చేసి వ్యావహారికభాషా వాదాన్ని సుస్థాపితంచేసిన మహామనీషి ఈయన. తరవాతరవాత విమర్శకులు ఈఇద్దర్నీ కృష్ణార్జునులతో నన్నయభట్టు నారాయణభట్టులతో పోల్చడం సామాన్యమయింది. ఈపోలికమాట ఎలాఉన్నా గిడుగుగురజాడలు మనభాషాసాహిత్య రంగాలలో విప్లవాన్ని లేవదీసి నడిపి జయాన్నిపొందిన జంట అనడంలో సాహసం ఏమాత్రం లేదు. అతిశయోక్తి ప్రసక్తే లేదు

గురజాడ జీవిత విశేషాల్నిగురించీ ఆయన రచనల్ని గురించీ ఎన్నో రచనలు బయలుదేరాయి. కె. వి. రమణారెడ్డిగారి 'మహోదయం' వంటి ఉద్గ్రంథాలు వచ్చాయి. శ్రీశ్రీ ఆరుద్ర ప్రభృతులు వ్రాసిన అనేకవ్యాసాలు ఉన్నాయి. బం. గో. రె. గారు వ్యాఖ్యాన వివరణల సహితంగా ముద్రించిన కన్యాశుల్కం మొదటి ముద్రణ (1897) పునర్ముద్రణం (1969) ఉంది. ఇవికాక, మహాకవిరచనలే ఉన్నాయి. వాటిమీద అవసరాల సూర్యారావుగారు వ్రాసినవ్యాఖ్యానాదులు ఉన్నాయి. పత్రికలలో పడ్డ పద్దులకొలదివ్యాసాలు ఉన్నాయి. సాహిత్యవిమర్శలలో ప్రసంగవశాన గురజాడను గురించి వ్రాసిన వందలకొలదిపుట లున్నాయి. తెలుగులోనే కాక, ఇంగ్లీషురష్యన్ మొదలైనపాశ్చాత్యభాషల్లోనూ తమిళం, కన్నడం, హిందీ, బెంగాలీ మొదలైన భారతీయభాషల్లోనూ కూడా ఆయనరచనలు కొన్ని అనువాదాలుగానూ ఆయన మీద రచనలు కొన్ని మౌలికంగానూ వెలువడ్డాయి. ఏతెలుగుకవిని గురించి _ పోనీ, ఏఇరవయ్యోశతాబ్ది తెలుగుకవినిగురించీ - ఇంత సాహిత్యం బయలు దేరలేదేమో అనిపిస్తుంది. కాలం గడుస్తున్నకొద్దీ ఈసాహిత్యం అభివృద్ధి పొందుతూనే ఉందిగాని తగ్గుతూ లేదు; దీనికి కారణం _ ఒక్కముక్కలో చెప్పాలంటే - అప్పారావువ్యక్తిత్వంలో ఉన్న మానవత్వం; ఆయనకవిత్వంలో ఉన్న విశ్వతోముఖత్వం.

అయినా, ఆయన జీవించిఉండగా ఆయన్ని మెచ్చుకొన్నారు గాని, ఆమెప్పునకూ నేటి మెచ్చుకోలుకు పోలికేలేదు. ఆయన చనిపోయిన తరవాత పాతికేళ్ళదాకా ఆయనరచనలకు నేటిప్రాచుర్యం లేదు. కొందరికి ఒప్పుకోవడానికి ఇష్టం లేకపోయినా, సహృదయవిమర్శకులందరూ ఒప్పుకొని తీరవలసిన సత్యాలివి. దీనికి కారణం ఆయనరచనలలోపం కాదు. ఆరచనల్ని ఆమనీషిని అర్థంచేసుకోవడానికి గుర్తించడానికి తెలుగువారు చాలావిషయాలు నేర్చుకోవలసి రావడమే ముఖ్యకారణం. దేశప్రజలభావనారీతులలో, సామాజిక పరిస్థితులలో ఎన్నోమార్పులు వచ్చినప్పుడు గాని ఆయనవిలువ ప్రజలకు బాగా తెలియలేదు. తెలుగుభాషను తెలుగుజాతిని అయన ప్రేమించినా, తెలుగుభాషలో తెలుగువాళ్ళకోసం ఆయన వ్రాసినా - ఆయనదృష్టి సంకుచిత జాతీయతమీద కంటె విస్తృతమానవతమీద అధికంగా ప్రసరించింది. ఆయన "దేశభక్తి" గీతం దీన్ని అక్షరాలా రుజువు చేస్తోంది. ఆయన ఇతరరచనలు దీనికి సాక్ష్యం ఇస్తున్నాయి. స్వాతంత్ర్యోద్యమప్రభావం సోకి తెలుగులో బయలుదేరిన జాతీయగీతాలను పరిశీలిస్తే ఈవిషయం స్పష్టమవుతుంది. ఆయన రచనల్లో ఉద్రేకం కంటె ఉచితత్వానికి ఎక్కువప్రాముఖ్యం. కొన్నికొన్నిరచనలు చదువుతూంటే ఉద్రేకంమీద ఆయనకు అపనమ్మకమేమో అనిపిస్తుందికూడా.

గురజాడ చనిపోయిన కొద్దిసంవత్సరాలలోనే జాతీయోద్యమం వెల్లువలా దేశాన్ని ముంచెత్తింది. అక్కడ ఉద్రేకానికే ప్రాధాన్యం; ఉద్వేగానికే పట్టాభిషేకం. స్వాతంత్ర్యపిపాస ఆదర్శవాదానికి కాల్పనికోద్యమానికి జీవగర్ర. గురజాడకవిత్వంలో కాల్పనికలక్షణాలు కొన్ని ఉన్నా, అవి ఆయనకవిత్వం కేవలం కాల్పనికం అని కొట్టివెయ్యడానికి వీలియ్యవు. ఆయనకాల్పనికతలో వాస్తవికతకూడా దూరికూర్చుంది. ఇందువల్లనే ఆయన్ని అనుసరించి రచనలు సాగించేకవులూ ఆయనరచనల్ని మెచ్చుకొనే సహృదయులూ కాల్పనికోద్యమ ప్రవాహం కొంత సన్నగిలేవరకూ బహుళంగా లేరు. ఎవరేనా ఉన్నా, వారికేనాడు ప్రచారం లేదు.

గురజాడ అప్పారావు విశ్వకవి; కవులకు కవి; మహాకవి; అని ఇప్పుడు కంఠోక్తిగా చెబుతున్న శ్రీశ్రీ దృష్టిలోనే ఆనాడు ఆయన కవిగా లేడు. "Shelley, Tagore, రాయప్రోలు, కృష్ణశాస్త్రి అదీ వరస! రాయప్రోలు పక్కన అబ్బూరి, కృష్ణశాస్త్రిపక్కన వేదుల. నండూరి ఎంకిపాటలు, విశ్వనాథ - నాయని ! వీరూ మాకవులు. బసవరాజునీ కవికొండలనీ కవు లనడం కరుణించి. గురజాడ

కవిగా మాదృష్టిలోనే లేదు. మనుచరిత్ర చదివితే చాలదా మహాభారతం యెందుకూ ?" (రేడియో ప్రసారితం ; ముద్రణ ; ఆంధ్రశిల్పి 1947 జనవరి – ఫిబ్రవరి; శ్రీశ్రీ సాహిత్యం – వచనవిభాగం; 1970; పుట_508)

గురజాడవిషయంలో శ్రీశ్రీకి నా డీభావం ఉండడానికి కాలప్రభావమే కారణం. గురజాడని మహానాటకకర్తగా అంగీకరించినవాళ్ళు కూడా ఆనాడు ఆయన్ని మహాకవి అనడానికి అంత సుముఖంగా లేరు. అయితే ఆయన్ని మహాకవి అన్నవాళ్ళు అసలే లేరనికాదు. ఆఅన్నవాళ్ళలో దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారిలాంటికవీ, నిడుదవోలు వేంకటరావుగారిలాంటి పండితవిమర్శకులూ ఉన్నారు. ఉన్నవాళ్ళసంఖ్య తక్కువ అనీ, జనబాహుళ్యంలో ఆయనరచనల కంత ప్రాచుర్యం లేదనీ, దీనిభావం. ద్వితీయప్రపంచసంగ్రామం ప్రారంభం అయినతరవాత; పాశవికశక్తులు మానవుడి స్వాతంత్ర్యాన్ని తమ ఇనపకాళ్ళ కింద అణిచివెయ్యడం మొదలుపెట్టిన తరవాత; తెలుగుదేశంలో కాల్పని కోద్యమం తనప్రభావాన్ని పోగొట్టుకోవడం మొదలుపెట్టిన తరవాత; మార్క్సు సిద్ధాంతాలకు ఆసిద్ధాంతాల ప్రాతిపదికమీద బయలుదేరిన సాహిత్యసంస్కృతు లకు దేశంలో వ్యాప్తి రావడం ప్రారంభం అయినతరవాత ; గురజాడ అప్పా రావుని ఆయనరచనల్ని నవ్యదృష్టితో విమర్శకులు చూడడం ప్రారంభించారు. దీనితో యువతరంలో గురజాడకి మంచి ప్రచారం వచ్చింది. ఇదిగాక, అంతకుపూర్వం విశేషప్రచారంలో లేని ఆయనరచనల్ని, ఇంగ్లీషులోనే ఉన్న కొన్ని ముఖ్యరచనల్ని అవసరాల సూర్యారావుగారు తెలుగులో సవ్యాఖ్యానంగా విశాలాంధ్రవారిద్వారా ప్రచురించడంతో గురజాడ పూర్తిస్వరూపం ప్రజల ముందుకు వచ్చింది. దేశకాలపరిస్థితులూ అనువుగా ఉన్నాయి. అప్పటికప్పుడే నిర్వీర్యమైపోయిన కాల్పనికరచనలతో విసిగి ఉన్న తెలుగువారికి గురజాడవారి రచనలు "కొత్తపాతల మేలుకలయిక"గా "క్రొమ్మెరుంగులు" చిమ్మాయి.

ఈసందర్భంలో ఒక్కవిషయం చెప్పవలసి ఉంది. ఒకరాజకీయ దృక్పథానికి చెందిన ప్రజలలో గురజాడకు ప్రచారం రావడంతోనే; ఇతర రాజకీయదృక్పథాలకి చెందినవారిలో, ఏదృక్పథానికీ చెందనివారిలో ఆయనమీద మొదట్లో కొంతవిముఖత కలిగిన మాట నిజం. ఇది పాతికేళ్ళక్రితం మాట. క్రమక్రమంగా సహృదయులందరూ గురజాడ ప్రతిభని గుర్తించి ఆయన్ని గౌరవించడం మొదలుపెట్టారు. నిజంగా చూస్తే నాటి గురజాడకి నేడు మనకున్న విభిన్నరాజకీయ దృక్పథాలు ఉండడానికే వీలులేదు. కాని ఆయన

మేధావి కనక మానవతావాది, కవి గనక మానవహృదయవేదనావేది. ఈరెండు కారణాలవల్ల ప్రజలకు సన్నిహితుడు. అందుకే "నాది ప్రజలఉద్యమం" అని ఆయన ధైర్యంగా వ్రాయగలిగాడు.

గురజాడవారి రచనల్ని స్థూలంగా కావ్యాలనీ, కథలనీ, నాటకాలనీ, వ్యాసాలనీ విభజించవచ్చు. ఈశాఖల్లో దేనికీ చెందనివీ కొన్నిఉన్నాయి. భాషా విషయంలో ప్రజలభాషనే వాడాలి అనే పట్టుదలగలవాడు ఆయన. అయినా, కేవలం సాంప్రదాయికమైన రీతిలో ప్రాచీనవృత్తాలలో చేసినరచనలూ ఉన్నాయి. ఆయనవి ఇవి— మాటలమబ్బులు, పుష్పలావికలు, మెరుపులు మొదలైన ఖండకావ్యాలూ; సుభద్ర అనే అసంపూర్ణకావ్యమూ. అయితే వీటి నన్నింటిని ఆయన కారణాంతరాలచేత వ్రాశాడు. ఆయన్ని ఆయనగా మనముందు పెట్టే రచనలు కావివి. ఆయన వ్యక్తిత్వక్రమపరిణామపరీక్షలో వీటికి స్థానం ఉంది. అంతే ! "గురజాడవా రీ రీతిగానే పద్యరచన చేసియుండినచో ఆమార్గములో వారు తప్పక ప్రౌఢకవి యయ్యేడివారు" అంటారు డా. నారాయణరెడ్డిగారు. వారే అన్నట్లు "వైతాళికత్వము, యుగకర్తృత్వము ఆయన సాధింపవలసిన విషయములు" గనక, గురజాడవారు కొత్తమార్గం తొక్కారు.

గురజాడవారు తొక్కిన కొత్తమార్గాన్ని పరీక్షించేముందు, ఆయన ఇంగ్లీషురచనల్ని కొంత పరిశీలించవలసిఉంది. ఇవికూడా ఆయనవ్యక్తిత్వ క్రమపరిణామంలో భాగం పంచుకొన్నవే.

ఆరోజుల్లో మనదేశంలో ఉన్న మేధావులైన విద్యావంతులకు ఇంగ్లీషు భాష అంటే — ఇప్పుడు మనలో చాలామందికి ఊహించడానికే కష్టమనిపించే— వ్యామోహం ఉండేది. నాటిపరిస్థితుల్ని అనుసరించి ఇది మనం అర్థం చేసుకో గలం కూడా.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిలాంటి వారు కూడా, "కళ్లకు వెలు గిచ్చి కొత్తబాటలు కనపర్చి దృక్పథమే మార్చేసింది, ఇంగ్లీషువాఙ్మయం మనకు" అంటారు. (అనుభవాలూ - జ్ఞాపకాలూను, రెండవసంపుటం : పుట - 260)

నాటిపరిస్థితుల్ని గురించి సురేంద్రనాథ్‌బెనర్జీ ఈవిధంగా 'కళ్లకి కట్టి నట్లు' వ్రాశాడు.

"Our fathers, the first fruits of English education were violently pro-British. They could see no flaw in the civilization or the culture of the West. They were charmed by its novelty and its strangeness......Everything English was good-even the drinking

of brandy was a virtue; everything not English was to be viewed with suspicion." (A Nation in Making-1925; page-308)

బెనర్జీ వర్ణించిన పరిస్థితులు వంగదేశానికి సంబంధించినవైనా, మిగిలిన ప్రాంతాలలోనూ వాటికి తీసిపోని పరిస్థితులు - కొన్నైనా - ఉన్నాయంటే సత్యదూరం కాదు. ఆదేశంలో, ఇంగ్లీషులోనే కవిత్వం వ్రాసి, ఇంగ్లీషుకవిగా అంతర్జాతీయవిఖ్యాతిని పొందాలనుకొని ఉవ్విళ్లూరిన మైకేల్ మధుసూదన్‌దత్ (1824 - 1873) లాంటి వాళ్లుకూడా ఉండేవాళ్లు. పాపం! ఆరోజుల్లో ఆయన ఆశయం ఇదట :

"To cross the vast Atlantic wave
For glory, or a nameless grave."

ఆరోజుల్లో భారతీయమేధావులు, కవులు ఇంగ్లీషులో రచనలు సాగించి పాశ్చాత్యప్రపంచంలో పేరుసంపాదించాలని చాలా ఉబలాటపడేవాళ్ళు. భారతదేశంలో అన్నిప్రాంతాల్లోను ఇలాంటివాళ్ళు ఉండి, దేశభాషల్లో వ్రాయక ఇంగ్లీషులోనే వ్రాస్తూ ఉభయభ్రష్టత్వం ఎదుర్కొనగా మూకీభావం వహించడంగాని, కలరూపు గ్రహించి తమప్రతిభని మాతృభాషాభివృద్ధికి వినియోగించి కవులుగా పేరుపొందడంగాని చేస్తూ ఉండేవాళ్లు. వంగదేశంలో ఇలాంటివాళ్ళకి ప్రతీక మైకేల్ మధుసూదన్‌దత్తు. ఇంగ్లీషుకవిగా తనకీర్తి దశదిశలా వ్యాపిస్తుందని గాఢంగా నమ్మిన దత్తు, 1842 లో ఇంగ్లండునుండి వచ్చే 'బ్లాక్‌ఉడ్స్ మాగజైన్' (Blackwoods' Magazine) కి తన ఇంగ్లీషుపద్యాలు కొన్ని పంపాడు. వాటిని 'వర్డ్స్‌వర్త్' మహాకవికి అంకితంచేశాడు. ("These poems are most respectfully dedicated to williams Wordsworth Esqr., the poet, by a foreign admirer of his genius—the author.")

ఆపద్యాలు ఏమయ్యాయో నాటికీ నేటికీ ఎవళ్ళకీ తెలియదు. తరవాత దత్తు ఇంగ్లీషులో వ్రాయడం మానివేసి మాతృభాష అయిన వంగభాషలో వ్రాసి మహాకవి అని కీర్తి సంపాదించాడు. ఆయన 'మేఘ్‌నాథ్‌వధ్' వంగమహాకావ్యాలలో ఒకటి అయింది.

కాలప్రభావానికి లోనై గురజాడకూడా ఇంగ్లీషులో కవిత్వం వ్రాశాడు. ఆరోజుల్లో విజయనగరంనుంచి 'ది ఇండియన్ లెజర్ అవర్' (The Indian Leisure Hour) అనే పత్రిక జి. వెంకటరమణయ్య అనే ఆయనసంపాదకత్వం కింద వచ్చేది. తన పత్రికలో వెంకటరమణయ్య గురజాడ వ్రాసిన 'సారంగధర' అనే ఇంగ్లీషుపద్యకావ్యాన్ని ప్రచురించాడు. ఇది 1883 నాటి మాట.

అప్పుడు అప్పారావు ఎఫ్.ఏ. చదువుతున్నాడు. ఈ వెంకటరమణయ్య దాన్ని తనపత్రికలో ప్రచురించడమే కాకుండా, ఆరోజుల్లో కలకత్తానుంచి శంభు చంద్రముఖర్జీ అనేఆయన నడుపుతూ ఉన్న 'రీస్ అండ్ రయ్యత్' (Reis and Rayyet) అనే పత్రికకి కూడా ప్రచురణార్థం 'సారంగధర' పంపాడు.

దీనితో శంభుచంద్రముఖర్జీ మన గురజాడని గురించి తెలుసుకోవడం జరిగింది. ఈయన 'సారంగధర'ని స్వీకరిస్తూ వెంకటరమణయ్యకి వ్రాసిన జాబులో (14 ఆగస్టు 1883) ఇలా అన్నాడు.

"Sarangadhara is indeed, a most promising production, and I have resolved to give it the widest publicity in our paper......... Appearing from time to time, in fragments, in 'The Indian Leisure Hour', the poem may be said to have received no publication as yet. I wished to give it every advantage and have accordingly published it as if it were our own. My object, indeed, is two-fold. I wish to encourage the young author by bringing out his work under the most favourable circumstances......Meanwhile, please communicate this letter to your young friend. His poem has many defects to be sure, but there is stuff in him. Let him go on and prosper. I need scarcely say that I long to know his name and all particulars about him, his birth, his education and pursuits." (Unilit–Gurajada Special Issue ; Andhra Viswa Sahiti (1963) ; Pages–18,19).

శంభుచంద్రముఖర్జీ ప్రదర్శించిన ఈసహృదయత అప్పారావుని బాగా ఆకర్షించింది. ఇంచుమించుగా ముఖర్జీని తన కవితాగురువుగా ఎంచుకొని తన ఆశల్ని ఆవేదనల్ని ఆయనకి తెలియజేసుకోవడం మొదలుపెట్టాడు అప్పారావు. ఇద్దరి మధ్యా ఉత్తరాలు నడిచాయి. ముఖర్జీ ఎన్నోసలహాల్ని అప్పారావుకి ఇచ్చాడు. అపజయాల్ని, నిరాశల్ని ఎదుర్కోవాలిగాని నిరుత్సాహపడకూడదన్నాడు. 1883 లో సెప్టెంబరు 17వతేదీని ముఖర్జీ అప్పారావుకి వ్రాసిన జాబు ఈవిషయాల్ని అన్నింటిని విపులంగా తెలియజేస్తోంది.

"I take great interest in the career of a young poet like you and the accounts of your life are most welcome. The discouragements you have experienced are nothing extraordinary ; every writer of Genius or any originality certainly every poet, must reckon upon them. Still less reason is there to wonder at your travail." (Unilit–Gurazada Special Issue ; Andhra Viswa Sahiti (1963) ; Page–19).

వ్యతిరేక విమర్శల్ని లెక్కచెయ్యకుండా కవి తనరచనల్ని తాను చేసుకొంటూ పోవాలని ధైర్యం చెప్పడమే కాకుండా, 'సారంగధర' కావ్యాన్ని గురించి తనఅభిప్రాయాల్ని నిష్కర్షగా నొప్పించకుండా చెప్పడమేకాక, కవిత్వాన్నిగురించి తనకున్న అభిప్రాయాల్నికూడా ముఖర్జీ వ్యక్తంచేసి అప్పారావు కవితాదృష్టిని తీర్చిదిద్దాడు. ఈవిషయాల్ని పైన పేర్కొన్న జాబులోనే ఇలా వివరించాడు.

"Then the modern blank verse that you attempt in 'Saranga-dhara' is far from popular, I suspect. The jingling rhymes of Pope still occupy the minds of men and pass for true poetry. But never mind. Don't be discouraged. You have parts. Improve them by cultivation. Read and reflect. Read not poetry only, but all kinds of books. Above all; observe. Observe man and nature and their works. Travel, if you get opportunity. If not, make the most of your immediate neighbourhood. Go into the remote villages, the woods, the hills, go to the sea-shore; watch the sun and moon; watch the clouds and storms; watch sun-beams and the dew; watch the stars of Heaven and the thunder and lightning and waves of the ocean. Watch waterfalls and running brooks. Nor forget to notice the beautiful and the uncomely in the human form divine. And, last not least, follow the operations of the heart, your own and others, measure their strength as well as weakness. Remember what others have remarked on these things, but never depend upon others. Trust your own self, give telher to your own powers. You must read good deal, but in as-much-as you write in a tongue not your own, you must master the language. Read carefully, to see how those to the manner born express themselves. At first you must imitate others until you acquire command sufficiently to chalk out, if possible, a new path suiting your genius. If you write from true inspiration, when full of your subject, you cannot fail to succeed. More hereafter."

గురుజాడ అప్పారావు ప్రతిభాస్రవంతిని తీర్చి దిద్దిన ఉత్తరం ఇదని నానమ్మకం. ఇందుచేత దీన్ని ఇంచుమించుగా పూర్తిగా ఉదాహరించడం జరిగింది. ఈఉత్తరం అందుకొనేనాటికి అప్పారావువయస్సు 22 సంవత్సరాలు. అప్పారావు తనజీవితంలో సాధించిన సాహిత్యప్రక్రియల్ని అన్నింటినీ - వాటిని గురించి మన కిప్పుడు బాగా తెలుసుగనక - ఆకళింపునకు తెచ్చుకొని ఈఉత్త

రాన్ని మనస్సులో పెట్టుకొని పరిశీలిస్తే ముఖర్జీ సలహాల్ని అప్పారావు యావత్సాహిత్యజీవితంలోనూ ఎలా పాటించాడో మనకి అవగతమవుతుంది. మనుష్య స్వభావపరిశీలన, ప్రకృతిపరిశీలన ఆయనరచనల్లో మనకి అడుగడుగున కనబడతాయి. ఏమి చేయ్యాలో చెప్పేగురువు దొరకవచ్చుగాని, చెయ్యగలిగినశిష్యుడు కూడా ఉండాలిగదా! అప్పారావు అలా చెయ్యగలిగిన ప్రతిభావంతుడు. ముఖర్జీ ఉపదేశబీజాలు ఊషరక్షేత్రంలో పడలేదు!

అప్పారావుకి ప్రతిభతోబాటు విజ్ఞతకూడా ఉంది గనక, ఇంగ్లీషులో కవిత్వం వ్రాయడంతో ప్రారంభించినా అది తనగమ్యం కాజాలదని తొందరగానే గ్రహించాడు. లేకపోతే అప్పారావు, ఇంగ్లీషు బాగా వ్రాయగలిగిన విజయనగరసంస్థానోద్యోగిగా మాత్రమే ఉండిపోయేవాడు. విదేశీయుడు ఆభాషలో సృజనాత్మకరచనలు చెయ్యడం, మెప్పు పొందడం, అసాధ్యం అని ఆయన సులువుగానే గ్రహించాడు. ముఖర్జీ వ్రాసిన జాబులోగూడా ఈవిషయమై ప్రస్తావన ఉందిగదా! ("...... in as-much-as you write in a tongue not your own, you must master the language. Read carefully, to see how those to the manner born express themselves......")

పాశ్చాత్యభాషాసాహిత్యాల, నాగరికతా సంస్కృతుల వ్యామోహంలో పడి సర్వం మరిచిపోయి, 'తెల్లదొర' గా చెలామణీ కావాలనే బాధతో పాశ్చాత్యస్త్రీని వివాహమాడి, క్రైస్తవమతాన్ని స్వీకరించి, విదేశాలలో పర్యటించి, అనేక పాశ్చాత్యభాషలు నేర్చుకొని, ఇంగ్లీషులోనే వ్రాస్తూ ఉండికూడా చిట్టచివరికి మైకేల్‌మధుసూదన్‌దత్తు కవిగా కృతార్థత, చరితార్థత తన మాతృభాష అయిన వంగభాషలోనే పొందగలిగాడంటే, ఇంక ఈవిషయమై వేరే చెప్పవలసింది ఏముంది!

అప్పారావు విజ్ఞత, పరిసరాలు, వాతావరణం - ఆయన్ని వంగకవి అంతదూరం పోవలసిన అవసరం లేకుండా చేశాయి. ఆరోజుల్లో ప్రతిభావంతులైన మనవాళ్ళందరూ ఇంగ్లీషురచనలలో ప్రారంభించేవాళ్ళనడానికి అప్పారావు తమ్ముడు, ప్రతిభావంతుడు, అయిన శ్యామలరావుకూడా తార్కాణం. కాని పాపం శ్యామలరావు చిన్నతనంలోనే చనిపోయాడు. శంభుచంద్రముఖర్జీ అప్పుడప్పుడు శ్యామలరావుకి కూడా వ్రాయడం ఉంది.

అప్పారావు వ్రాసిన 'సారంగధర' ని చదివిచూస్తే ఆయనప్రతిభ మనకి వ్యక్తం అవుతుంది. ఇంగ్లీషులోకూడా చెయ్యి బాగా తిరిగింది అని తెలుస్తుంది.

భావగాంభీర్యం సహజంగా ఉండనే ఉందిగదా! 'సారంగధర' ప్రారంభాన్ని మహాకవి గురజాడ ఇలా చేశాడు. ఈ ప్రారంభంలో, ఇంగ్లీషుభాషకి సహజం కాని ప్రాచ్యభావపద్ధతి కొంత ఉన్నా, భాషాడంబరం ఉన్నా రచయిత కవితాత్మ కలవాడని వెంటనే తెలుస్తుంది.

"The labouring dawn gave out the child of light
Whose infant became palayed o'er the river's breast
And woke the bees asleep in lotus bowers,
While from Godavary's bank in merry whirls
A thousand pigeons starred the morning sky".

(Unilit–Gurazada Special Issue, Andhra Viswa Sahiti (1963); Page–21)

చిత్రాంగి మెల్లిగా సారంగధరుడి పక్కకి చేరి, ఉద్యానవనంలో క్రీడా సరస్సులో ఉన్నపువ్వుల్ని చూపిస్తూ ఇలా అంటుంది :

"How now the Lord of Day from every bud
Kisses the sleep away, that blushing wakes
And opes her fairy lids? The butterfly
Robed in his gandy silks wooes every bloom,
But wooes to quit– reckless wanton he!"

(Unilit–gurazada Special Issue; Andhra Viswa Sahiti (1963); Page–24)

అప్పారావు సాహిత్యజీవితం ప్రారంభదశలో ఉన్నా ఆయనప్రతిభని-ఆయన వ్రాసినజాబులనుబట్టి, సారంగధరను బట్టి శంభుచంద్రముఖర్జీ గుర్తించ గలిగాడు. అందుకే, వెంకటరమణయ్యకి 1883 లో వ్రాసిన ఉత్తరంలోను ("...there is stuff in him."), అప్పారావు తమ్ముడు శ్యామలరావుకి 1889 లో వ్రాసిన ఉత్తరంలోను (...He has the stuff in him.") అప్పారావు ప్రతిభని గుర్తించి వ్రాశాడు ముఖర్జీ.

నాటి వంగదేశ పరిస్థితుల్ని బట్టి, ఐతిహాసికకారణాలవల్ల గురజాడ వారికి వంగమేధావులమీద కవులమీద ఆదరాభిమానాలు గౌరవమర్యాదలు ఎక్కువ అని మనం ఊహించవచ్చు. తరవాతకూడా అవకాశం వచ్చినప్పుడు కలకత్తా వెళ్ళి వంగమేధావుల్ని కవుల్ని ఆయన కలుసుకొన్నాడు. 1912 లో వంగీయసాహిత్యపరిషత్తు ఏర్పాటుచేసిన (3-1-1912) తేనీటివిందులో పాల్గొ

న్నాడు. కలకత్తాపురప్రముఖులందరూ రవీంద్రనాథ్‌ఠాకుర్‌ని అభినందించ డానికి చేసినసభలో (12_1_1912) పాల్గొని ఠాకుర్‌ని కలుసుకొన్నాడు. ఈ సన్నివేశం అప్పారావుకి చిరస్మరణీయం అయింది. అయితే, అప్పారావు అప్పటికప్పుడే తెలుగుదేశంలో లబ్ధప్రతిష్ఠుడు. వ్రాయవలసింది, ఇంచు మించుగా, అంతా వ్రాసేశాడు అప్పటికే. తరవాత మళ్ళీ డిసెంబరుమాసంలో ఠాకుర్‌ని కలుసుకొన్నాడు. వివిధవిషయాలు చర్చించుకొన్నారు. ఇద్దరి మధ్యా కొన్ని ఉత్తరాలు నడిచాయి. అంతే.

ఈ వ్యాసంలో అప్పారావు వ్రాసిన ప్రతిరచననీ పరిశీలించాలని నా ఉద్దే శంకాదు ఆపని ఈవరకే చాలామంది చేశారు. అప్పారావు కవితాత్మ ఎలా పరిణామవికాసాల్ని పొందిందో, వివిధ విషయాలమీద ఆయన కున్న అభి ప్రాయాలు రచనల్ని ఎలా ప్రభావితం చేశాయో నాదృష్టికోణంనుంచి చూడడం దీని ముఖ్యోద్దేశం. అప్పుడే అది విమర్శ అనిపించుకొంటుంది. విమర్శలు అనేక విధాలుగా ఉంటాయి అని తెలుసుకొన్న సహృదయులు ఈ నామార్గాన్ని అర్థంచేసుకోగలరు.

గురజాడకి భాషవిషయమై ఒక నిర్దిష్టాభిప్రాయం ఉంది. ప్రజలభాషకి సాహిత్యగౌరవం రావాలని ఆయన కోరిక. ఈవిషయాన్ని ఆయన చాలాసార్లు చెప్పాడు. కన్యాశుల్కం ప్రథమముద్రణం (1897) పీఠికలో ఇలా వ్రాశాడు.

"I clothed the play in the spoken dialect, not only that it is better intelligible to the stage-going public than the literary dialect, but also from a conviction that it is the proper comic diction for Telugu."

కన్యాశుల్కాన్ని 1897 కంటె ముందే అప్పారావు వ్రాశాడు. దాన్ని 1897 లో జగన్నాథవిలాసినీ నాటకసమాజంవారు విజయనగరంలో ప్రదర్శిం చారు. ఈనాటకానికి నాందీప్రస్తావనలు నాటిసంప్రదాయాన్ని అనుసరించి సంస్కృతంలో వ్రాశారు (13 ఆగస్టు, 1892). ఈనాందీప్రస్తావనల్లో గురజాడ వారిని గురించి ఉన్నవాక్యాలు నాటిపండితలోకం ఆయన్నిగురించి, ఆయన రచనని గురించి ఏమనుకొంటూ ఉండేదో మనకి తెలియజేస్తాయి. ఆనందగజ పతి మహారాజు ఆస్థానంలో కవులు,పండితులు, కళాకారులు చాలామంది ఉండే వాళ్లనీ వాళ్లలో అప్పారావు ఇలాంటివాడనీ అక్కడ ఉంది!

"తేష్వేకో ఒయ మాంగ్లేయభాషాకవి గ్గురజాడ వేంకటప్పారాయ నామా షేక్‌స్పియర్ మోలియర్ బెంజాన్సన్ ఇత్యాది మహాకవిగ్రంథనిరంతర పఠనా దరీ ఆంగ్లేయనాటకక్రమ మాంధ్యే ఒప్యవతారయితుం కుతుకీ,ఆంధ్రేఒపి గ్రంథ భాషాయా అగ్రాంథిక ద్రష్టృజనాబోధ్యస్వభావప్రయోగతయా తా ముపేక్ష్య స్వభావప్రయోగయోగ్యా మానుభావికీం కేవల వ్యవహారరూపాం ఆంధ్రభాషా మాదాయ, ఆంగ్లేయీ మేవ నాటకపద్ధతి మవలంబ్య కన్యాశుల్కంనామ నాటక మకార్షీత్" (మొట్టమొదటి కన్యాశుల్కము (1897); బం.గో.రె., 1969., పుట - 70.)

రెండో ముద్రణం నాటికి గురజాడవారి భావాలు ఇంకా బాగా వ్యక్త మయ్యాయి. ఆపీఠికలో, గ్రాంథిక వ్యావహారిక భాషల తులనాత్మక పరిశీలన చేసే వాక్యాలుకూడా కొన్ని దాన్లో ఉన్నాయి. మొదటిముద్రణం నాటకంకంటె రెండోముద్రణం నాటకం పెరిగినట్లే పీఠికా పెరిగింది. ఈ పెరుగుదల భాషా విషయమై ఆయన కున్న నిర్దిష్టాభిప్రాయాల్ని మనకి బాగా తెలియజెప్పడానికి పనికి వచ్చింది. సమాకాలికుల్లో కొందరిని విమర్శించడానికి (The first edition was marked success. The press gave it a cordial reception and hailed it as an event in the History of Telugu literature, and men, women and children read it with interest. The only exception was Mahamahopadhyaya K. Venkataratnam Pantulu garu who cannot stand two things in this otherwise perfect world – Social Reform and Spoken Telugu".), కొందర్ని భూషించడానికి ("The credit of deliberately introducing the vernacular into Telugu drama in keeping with Sanskrit tradition belongs to my friend V. Venkataraya Sastri garu whose Prataparudriyam owes not a little of its charm to dialogue in the dialects.") కూడా ఈ పీఠికని గురజాడ ఉపయోగించు కొన్నాడు.

ఇదిగాక, క్రమక్రమంగా గ్రాంథికభాషకూడా ఏవిధంగా వ్యావహారిక భాషకి దగ్గరగా జరుగుతోందో కూడా వివరించాడు. ("While the Vernacular Is thus gaining recognition, the Literary Dialect itself is approximating to the Spoken Dialect in the best modern prose which manifest great freedom of usage.")

ఒకవిధంగా చూస్తే; ఇది కేవలం తన నాటకం రెండోముద్రణకి పీఠికగా మాత్రమే గురజాడ అనుకొన్నట్లు, మనం ఊహించడానికి వీలు లేదు. ఆయన

వాదాన్ని తిరిగి చెప్పడానికి ఈపీఠికని ఆయన ఉపయోగించుకొన్నాడు అనాలి. భాషాశాస్త్రానికి లిపికి సంబంధించిన విషయాల్ని కూడా ఆయన దీనిలో వివరించాడు. ("I had to contend with one difficulty in printing this book. There are many sounds in the Spoken Dialect which are not reprsented in the Telugu Alphabet. In the present state of Telugu Phonetics, I had to contend myself with indicating such sounds by a horizantal line placed over the nearest symbols, and I employed the Ardhanusvara after a nasal. The creation of new symbols and their adoption into type can be effected only after a more widespread recognintion of the Spoken Dialect.") ఈ పీఠిక చదివిన వాళ్ళకి అప్పారావు ఎంతటి మేధావో, ఎంతటి విద్వాంసుడో, ఎంతటి స్వాతంత్ర్యప్రియుడో తెలుస్తుంది. తనప్రతిభమీద, తనవాదంమీద ఆయనకి అంత నమ్మకం ఉంది గనకనే, సంకెళ్ళని ప్రేమించేవాళ్ళు ఎవళ్ళైనా ఉంటే ఉండనివ్వండి అంటాడు.వ్యావహారికభాషకి ఉన్నశక్తి అనంతం అంటాడు.గ్రాంథికభాష బరువు చేటుఅంటాడు. ("I view the Telugu Literary dialect as a great disability imposed by tradition upon the Telugus. Let those who love fetters venerate it. My own vernacular for me, the living Telugu, the Italian of the East in which none of us is ashamed to express our joys and sorrows, but some of us are ashamed to write well. Literature in the Vernacular will knock at the door of the peasant and it will knock at the door of the Englishman in India. Its possibilities are immense.")

ఈవిధంగా వ్రాస్తూ పోయి,భాషని సృష్టించేది శాసించేది మహాకవి అనే పరమసత్యాన్ని వ్యక్తం చేశాడు. మహాకవి ఎవరేనా బయలుదేరి వ్యావహారిక భాషలో ఉద్గ్రంథం వ్రాస్తే, వ్యావహారిక భాష గొప్ప భాషగా రూపురేఖలు తీర్చి దిద్దుకొంటుంది అంటాడు ఈయన. ("No argument in favour of a Vernacular Literature is needed with persons who are conversant with the history of the English Dialects and the Prakrits, and I know it is not arguments that will evolve a new Literary Dialect for Telugu. A great writer must write and make it. Let us prepare the ground for him.")

ఎంత ఆత్మవిశ్వాసంతో అన్నమాట లివి. ఆగొప్పరచయిత ఆయనే అని మనం ఇప్పు డనుకొంటున్నాము. అప్పారావూ అలాగే అనుకొని ఈ వాక్యాలు వ్రాశాడంటే సత్యదూరం కాదేమో !

భాషాసంబంధమైన ఆయనభావాల్ని బాగా అర్థం చేసుకోవడానికి ఈ పీఠిక పనికివచ్చింది. తన లక్షణాలకు లక్ష్యాలుగా ఉండాలి అన్నట్లుగానే ఆయన రచనలన్నీ చేశాడు. తన రచనల్ని సంఘసంస్కరణదృష్టితో కూడా చేసినా ఇక్కడే వీరేశలింగం పంతులికీ ఈయనకీ ఉన్న ముఖ్యభేదం. వీరేశలింగానికి సంస్కరణ ముఖ్యం. దానికి సాహిత్యం ఉపకరణం. అప్పారావుకి సాహిత్యం ముఖ్యం. సంస్కరణ కొసరు లాభం. అయితే, ఇంత నిష్కర్షగా ఎక్కడా లేకపోయినా ఈ ఇద్దరి రచనల్ని చదివితే మనకి కలిగే భావం ఇదేఅని నానమ్మకం. అప్పారావుకి కూడా వీరేశలింగంమీద వ్యక్తిగా ఉన్నంత గౌరవం, ఆయన రచనలమీద లేదనిపిస్తుంది. వీరేశలింగం కర్మవీరుడు, కార్యశూరుడు. అప్పారావు మేధావి, కవి.

అప్పారావు ముత్యాలసరాలలోకూడా భాష భావం అతికినట్లు ఉండడానికి కారణం ఆయనకి వ్యావహారికభాషమీద ఉన్న ప్రభుత్వమే. కేవలం అభిమానం చాలదు; మహాకావ్యం వ్రాయడానికి, ప్రతిభ కావాలి. అది అప్పారావుకి పుష్కలంగా ఉంది. ప్రజలభాష విషయంలో, అప్పారావు మీద వర్డ్స్‌వర్త్ ప్రభావం చాలా ఉంది. తన 'లిరికల్‌బాలెడ్స్' (Lyrical Ballads) కి పీఠిక వ్రాస్తూ వర్డ్స్‌వర్త్ ఇలా అంటాడు. "The principal object, then, proposed in these poems was to choose incidents and situations from common life and to relate or describe them, throughout, as far as possible in a selection of language really used by men and at the same time, to throw over them a certain colouring of imagination, whereby ordinary things should be presented to the mind in an unusual aspect..."అప్పారావు వర్డ్స్‌వర్త్ మీద ఒకవ్యాసంకూడా వ్రాశాడు. ఆయనవల్ల ప్రభావితుడయ్యాడు. ముత్యాలసరాల్లో ఆయన వ్రాసిన లఘుకావ్యాల మీద ఈప్రభావం కనబడుతుంది.

అప్పారావుగేయకావ్యాల్ని పరిశీలించి చూస్తే మనకి ముఖ్యంగా కనపడేది ఆయన సంయమనం. కవిత్వంలో ఉద్రేకం అతిమాత్రంగా ప్రదర్శించడం ఆయనలో కనబడదు. అప్పారావుకి నాటకకర్తగా వచ్చిన ప్రచారంకంటె కవిగా తక్కువ ప్రచారం రావడానికి ఇదో కారణం. తనహృదయవేదనని ఝరీవేగంతో జలపాతరీతితో ఆయన వ్యక్తంచెయ్యడు. మందగంభీరపద్ధతిలో భావప్రసరణ జరుగుతుంది. పూర్ణమ్మలో కాసులులో ఇంకా ఇతరత్రా ఇదే ఆయన కిష్టమైన పద్ధతి. మేధావి అయిన కవిపద్ధతే ఇది.

కవిగా ఆయన ఎంతగొప్పవాడో వచనరచయితగా కూడా అంతగొప్ప వాడు. ఆయన వచనరచనల్ని స్థూలంగా - నాటకాలు, కథలు, విమర్శలు, ఇతరాలు అని విభజించవచ్చు. వీటి అన్నింటిలోను ఆయన వ్యక్తిత్వవిశిష్టత వ్యక్తమయ్యే పద్ధతిలోనే రచన సాగింది. కన్యాశుల్కం, కొండుభట్టీయం మొదలైన వాటిలో ఒక విశ్వజనీనత కనబడుతుంది. ఒక నిత్యనూతనత్వం కనబడుతుంది. అప్పారావు వస్తువుగా స్వీకరించిన సాంఘికసమస్యలు లేనప్పుడు కూడా ఆ నాటకాలు ఆనందాన్ని ఇస్తున్నాయంటే ప్రజాదరణ పొందుతున్నాయంటే వాటిపాత్రల ప్రవృత్తుల విశ్వజనీనతే కారణం. ఇదే కారణం వల్ల సంస్కృతంలో ఉన్న మృచ్ఛకటికానికి విశ్వవిఖ్యాతి వచ్చింది. కాళిదాసుకీ, శూద్రకుడికీ ఉన్న భేదంకూడా ఇక్కడే ఉంది. కాళిదాసు సృష్టించిన పాత్రలు భారతదేశంలోనే ఉంటాయి. ఉండడానికి వీలుంది. శూద్రకుడు సృష్టించినపాత్రలు ఎక్కడేనా ఉండవచ్చు. అయితే, కాళిదాసు చిత్రించిన మానవ హృదయపరిస్థితులు విశ్వజనీనాలు. పాత్రలు కావు. కానక్కరలేదు. కాళిదాసు మహాకవి, మహానాటకకర్త. శూద్రకుడు మహానాటకకర్త. ఇద్దరికీ విశ్వజనీనత భిన్నకారణాలవల్ల వచ్చింది. నాదృష్టిలో అప్పారావు శూద్రకుడికి దగ్గరగా వస్తాడు. శూద్రకుడు శ్రవ్యకావ్యాలు వ్రాశాడో లేదో మనకి తెలియదు. అప్పారావు కావ్యాలుకూడా వ్రాసి ప్రఖ్యాతి పొందాడు. ఈవిధంగా కవికూడా అయ్యాడు. మహాకవి, నాటకకర్త అప్పారావు.

అప్పారావు చిన్నకథని తీర్చిదిద్దాడు, ఆయనకంటెముందు కథలు వ్రాసినవాళ్లు ఉండవచ్చు. కాని ఆయనకథలికి ఒకవిశిష్టత ఉంది. కథా ప్రారంభంలోనే పఠితల మనసుల్ని ఆకర్షిస్తాడు. దిద్దుబాటు, మీపేరేమిటి మొదలైన కథలు విశ్వసాహిత్యంలో ఉన్న ఏకథలకీ తీసిపోవు. సంయమనం అనేలక్షణం అప్పారావు సాహిత్యకళ ముఖ్యలక్షణం అనుకొన్నాముగదా। ఇది కథల్లోనూ కనబడుతుంది. అయితే, కన్యాశుల్కం బహువిస్తృతమైనదిగదా। సంయమనం మాట ఏమిటి అంటే, సంయమనం అనేగుణం రచనకి సంబంధించింది. వస్తువిస్తృతినిబట్టి మొత్తం నాటకమంతా దీర్ఘంగా పెరిగినా; అక్కడ ఏఘట్టంలోనూ, ఏపాత్రలోనూ, ఏమాటలోనూ బింకంసడలిపోవడంలేదు. ఈ లక్షణాలు అన్నీ అప్పారావు రచించిన చిన్నకథల్లో మనకి కనబడతాయి.

ఒకధ్యేయంతో అప్పారావు తన విమర్శనాత్మకవచనాన్ని తీర్చిదిద్దుకొన్నాడు. విమర్శవ్యాసం బుద్ధికి పని కల్పించేది; రచయితల్లో కానియ్యండి,

పఠితల్లో కానియ్యండి. అప్పారావువ్యాసాలు అక్షరాల ఇలాంటివే. ఆయన మేధాశక్తిని ప్రదర్శించే ఉత్తమరచనలు అవి. అప్పారావుధ్యేయం-మానవుల హృదయాల్ని సంకుచితపరిచి బంధించి వుంచే శృంఖలాన్ని ఛేదించడం. వ్యాస రచన బుద్ధివికాసానికి తోడ్పడాలని ఆయన భావం. అందుకే ఆయన రచనల్లో- హాస్యం, గుణదోషవిచారం, సందేశం తగిన మోతాదుల్లో కలిసి, పఠితల హృదయానికి మనస్సులకీకూడా రంజకంగా ఉంటాయి.

పైన పేర్కొన్నవి ఏవీగాక ఆయన చేసిన రచనలు చాలా ఉన్నాయి. ఇవిగాక ఆయన ఇంగ్లీషులోనే వ్రాసిన రచనలూ ఉన్నాయి. ఇంగ్లీషు వచన రచనల్లో చాలా భాగం "డైరీలు" మొదలైనవి తెలుగులోకి వచ్చాయి. ఇంకా రావాలి. ఈ వచ్చినవాటిలో — అనువాదంలో అక్కడక్కడ ఉన్న లోపాలవల్ల మానవ స్వభావసిద్ధమైన ఇతర దోషాలవల్ల, గురజాడ "డైరీలు" మొదలైన వాటిలో కొన్నిచోట్ల ఆయన భావాలు సరిగా వ్యక్తం కావడంలేదని నార్లవారి వంటి పెద్దలు ఈమధ్య అంటున్నారు. ఇది చాలా ముఖ్యమైన విషయం. ఒక రచయితని మనం ఆయన రచనలద్వారా లోకానికి పరిచయం చేస్తున్నప్పుడు ఆయన్ని యథాతథంగా చూపించడం న్యాయం. కర్తవ్యం.

అప్పారావుని పొగిడేవాళ్ళూ తెగడేవాళ్ళూ కూడా జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయం ఒకటి ఉంది. అప్పారావు పందొమ్మిదో శతాబ్దిలో పుట్టిపెరిగినమనిషి. ఇరవయ్యో శతాబ్దిలో పదిహేనేళ్ళపాటు బతికినా, ఈ శతాబ్ది ప్రారంభంనాటికే ఆయనకి పేరుతెచ్చిన పనులన్నీ, ఇంచుమించుగా, చేసేశాడు. ఇదిగాక ఆయన సంస్థానోద్యోగి. అప్పటి కింకా స్వాతంత్ర్యం రాకపోవడమే కాకుండా,ఉద్యమం కూడా మందకొడిగానే ఉంది. సనాతనమతంపేరిట జరుగుతున్న అన్యాయాల్ని అరికట్టాలి అనేదే అతని దృష్టి. మతాన్ని గురించి మనకున్న అభిప్రాయాలన్నీ ఆయనకీ ఉన్నాయి అనుకోవడం పొరపాటు. ఇవన్నీ నిజమే అయినా, ఆయన మేధావి గనక క్రాంతదర్శి గనక మనం నేటికీ ఆయన్ని స్మరిస్తున్నాము. ఆయన రచనల్ని చదువుతున్నాము. "కొత్తపాతల మేలు కలయిక" ఆయన ఆదర్శం. దాన్ని పూర్తిగా సాధించిన సత్త్వసంపన్నుడు.

ఈ వ్యాసంలో కొత్తగా చెప్పింది ఏమీ లేకపోవచ్చు. అప్పారావు ప్రతి రచననీ భూతద్దం కింద పెట్టి, ఆయన చేసిన ప్రతిపనినీ సూక్ష్మేక్షికతో పరిశీలించి, వ్రాయాలని నా ఉద్దేశం కాదు. ఒక సహృదయ విమర్శకుడు ఒకకవి రచనల్ని చదివినప్పుడు ఎలా ప్రభావితు డవుతాడో చూపించడమే నా ఉద్దేశం. విమర్శలు

అనేకరకాలుగా ఉండవచ్చుగదా। విషయనిర్ణయం చేసే పరిశోధనాత్మక విమర్శ ఒకటి; విషయ వివరణ చేసే వ్యాఖ్యానాత్మక విమర్శ ఒకటి; గుణదోష విచారణ చేసే విమర్శ ఒకటి; కవిని చదివి ఆనందించి, ఆ కవి సమాజంలోనూ సాహిత్యం లోనూ ఏవిధంగా కొత్తదనాన్ని తెచ్చాడో గ్రహించి దాన్ని పదిమందిముందూ పెట్టే ఆత్మాశ్రయవిమర్శ ఒకటి. ఇంకా ఎన్నోరకాలు ఉండవచ్చు. ఉంటాయి కూడాను. ఈ వ్యాసం అప్పారావుమీద నా ఆత్మాశ్రయ విమర్శ అనవచ్చు. దీనికి అప్పారావు ఒప్పుకొంటా డని నా నమ్మకం. ప్రతిదానికీ ఆయనకి మనిషి కొలబద్ద గదా।

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 57 | 26 | కందురి | వందురి |
| 60 | 3 | సంఘాతొ | సంఘాతో |
| 64 | 16 | మహహవము | మహోహవము |
| 70 | 25 | వేఁడినిటూర్పు | వేఁడినిట్టూర్పు |
| 108 | 7 | సలరు | నలరు |
| | 25 | సెససి | సెనసి |
| 109 | 9 | నఖోవీధి | నభోవీధి |
| | 14 | గర్భి | గర్భ |
| | 19 | పాండురంగని | పాండురాంగుని |
| 168 | 19 | కృషి | కుషి |
| 173 | 13 | తెలియును | తెలియను, |
| 177 | 16 | అంతారార్థమును | అంతరార్థమును |
| 182 | 29 | అరేబియా | అరేమియా |
| 199 | 24 | నామాలు | మానాలు |
| 200 | 8-9 | శిరస్దదార్ | శిరస్థదార్ |
| | | ఉరస్దదార్ | ఉరస్థదార్ |
| | | ముఖస్దదార్ | ముఖస్థదార్ |




# మా 'యువభారతీయులు'

1. శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి, ఎం. ఏ., అధ్యక్షులు
సికింద్రాబాదు సాయం కళాశాల ఆంధ్రోపన్యాసకులు.

2. శ్రీ ఎస్. పాండురంగారెడ్డి, ఎం.ఏ., డి.ఎల్.ఎస్.సి., ఉపాధ్యక్షులు
కార్యదర్శి, జిల్లాగ్రంథాలయసంస్థ.

3. శ్రీ జి. ఎల్. నరసింహారావు, ఎం. ఏ., ఉపాధ్యక్షులు
ఎ. జి. ఆఫీసు, హైదరాబాదు.

4. శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు, బి. కామ్., కార్యదర్శి
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా.

5. శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు, బి. ఏ., సహకార్యదర్శి
స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు.

6. శ్రీ డి. ఎల్. ఎన్. ప్రసాదు, బి. కామ్., సహకార్యదర్శి
తంతి తపాలా, ఆడిట్.

7. శ్రీ వంగపల్లి విశ్వనాథం, ఎం.కామ్., సమావేశకర్త, కోశాధికారి
సికింద్రాబాదు ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల వాణిజ్యశాస్త్రోపన్యాసకులు.

8. శ్రీ అల్లంరాజు వెంకట్రావు (సుధామ) బి.ఒ.ఎల్.,
సంయుక్త సమావేశకర్త

9. శ్రీ నాగినేని భాస్కరరావు, ఎం.బి.బి.ఎస్. (ప్రి-ఫైనల్)
గాంధీ వైద్యకళాశాల, హైదరాబాదు. —సంయుక్త సమావేశకర్త

# కార్యవర్గ సభ్యులు

10. శ్రీ సి. వి. ఎ. ఎస్. సూర్యనారాయణ, ఎం.కామ్.,
నిజాం కళాశాల వాణిజ్యశాస్త్రోపన్యాసకులు.
11. శ్రీ కె. బుచ్చిబాబు, డి. ఒ. ఎల్.
12. శ్రీ మాడభూషి అనంతాచార్యులు, భాషాప్రవీణ,
తెలుగుపండితులు, జలక్షత్రియప్రకాశ హిందీవిద్యాలయ.
13. శ్రీ పి. గోపాలకృష్ణ,
యునైటెడ్ స్టీల్ ఏజన్సీ.
14. శ్రీ టి. కె. విజయకుమార్,
15. శ్రీ విశ్వనాథ సూర్యనారాయణ, బి. ఎస్ సి.,
16. శ్రీ కె. జగన్నాథాచార్యులు,
స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు.
17. శ్రీ జీడిగుంట కామేశ్వరరావు, ఎం. ఎస్. సి.
18. శ్రీ డి. కె. శ్రీనివాసాచార్య, బి. ఒ. ఎల్. సంస్కృతపండితుడు,
ప్రాచ్యలిఖిత గ్రంథాలయము మరియు పరిశోధనాలయము.

# సభ్యులు

19. శ్రీ అక్కిరాజు జనార్దనరావు, బి. ఏ., డి. జె.,
సబ్-ఎడిటర్, స్టేట్ హెల్త్ ఎడ్యుకేషన్ బ్యూరో.
20. శ్రీ డి. కృష్ణప్రసాదు, బి. కాం.,
21. శ్రీ ఎమ్. ఆర్. శ్రీనివాసాచార్య, బి. ఏ.,
22. శ్రీ మాడభూషి రంగాచార్యులు, బి. ఏ.,
క్యాషియర్, దక్షిణమధ్యరైల్వే.
23. శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడ్, బి. కామ్. (తృతీయ)
24. శ్రీ వి. బాపిరెడ్డి, ఎం. ఏ.
ఎ. జి. ఆఫీసు, హైదరాబాదు.

25. శ్రీ డి. ఓబుల్‌రెడ్డి, ఎం.కాం.,
సికింద్రాబాదు ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల వాణిజ్యశాస్త్రోపన్యాసకులు.

26. శ్రీ ఆర్. ఎస్. నారాయణరావు, బి. ఏ.

27. శ్రీ డి. చంద్రశేఖర్, బి. కామ్. (ద్వితీయ)

28. శ్రీ టి. శేఖరరెడ్డి, బి. కాం.
కమర్షియల్ క్లర్కు, దక్షిణమధ్యరైల్వే.

29. శ్రీ గణపవరపు నారాయణమూర్తి, బి. కాం.,
స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా.

30. శ్రీ పింగళి జగన్నాథరావు, ఎమ్. ఒ. ఎల్.

31. శ్రీ ఎస్. పి. చారి, ఎం. ఏ.,
ఉస్మానియా విశ్వవిద్యాలయకళాశాల అర్థశాస్త్రోపన్యాసకులు.

32. శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యం., ఎం. కాం.
ఉస్మానియావిశ్వవిద్యాలయ కళాశాల వాణిజ్యశాస్త్రోపన్యాసకులు.

33. శ్రీ కోటంరాజు రామకృష్ణశర్మ, ఎం. కాం.,
సికింద్రాబాదు సాయం కళాశాల వాణిజ్యశాస్త్రోపన్యాసకులు.

34. శ్రీ ఎస్. ఎస్. ప్రసాదు., ఎం. ఎస్. సి.
అలియాబాద్ జూనియర్ కళాశాల అధ్యాపకులు.

35. శ్రీ ఎల్. ఎస్. భార్గవ,

36. శ్రీ కె. నాగేశ్వరరావు, బి. కాం.,
స్టేట్‌బ్యాంకు ఆఫ్ హైదరాబాదు.

37. శ్రీ ఇంద్రగంటి సుబ్బరాయశాస్త్రి,
అజంజాహీమిల్స్.

38. శ్రీ ఎ. గోపాలకృష్ణమాచార్యులు, ఎం. ఏ. ఎం. ఓ. ఎల్.,
ఎస్. వి. ఇ. ఎస్. తెలుగుకళాశాల, ఆంధ్రోపన్యాసకులు,

39. శ్రీ నాళం వీరయ్య ఎం. ఏ,
ఎస్. వి. ఇ. ఎస్. తెలుగుకళాశాల, గణితశాస్త్రోపన్యాసకులు.

40. శ్రీ డి. ప్రభాకరరావు, బి. ఎస్. సి. (ఎగ్రికల్చర్).,
ఆఫీసరు, స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా

41. శ్రీ వి. వి. సత్యప్రసాదు, బి. కాం.,
స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా.

42. శ్రీ ఎస్. ఆదినారాయణమూర్తి,
స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా.
43. శ్రీ మోర్తల గోపాలరెడ్డి, బి. ఏ.,
స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా.
44. శ్రీ కె. ఎస్. ప్రసాదు, ఎం. ఏ.,
ఆఫీసరు. స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా.
45. శ్రీ టి. వి. సుబ్రహ్మణ్యం, ఎం. ఏ. ఎల్. ఎల్. బి.
ఖాదీగ్రామోద్యోగసంస్థ.
46. శ్రీ ఎస్. కామేశ్వరరావు,
ఖాదీగ్రామోద్యోగ సంస్థ.
47. శ్రీ అల్లంరాజు రాధాకుమార్ (రాధాయి), బి.ఏ.,
సిండికేట్ బ్యాంక్.
48. శ్రీ ఎస్. నీలాంబరరావు, బి. కాం.,
49. శ్రీ సి. నరసింహారావు

# వనితా విభాగం

1. కుమారి ఎల్. సబిత
2. ,, ఎల్. సుచేత
3. ,, వి. జానకి
4. ,, వి. బి. లక్ష్మి
5. ,, ఎమ్. రత్నమాల
6. ,, ఎ. దుర్గాకుమారి
7. ,, కె. సత్యవతి
8. ,, సి. బి. కామేశ్వరి
9. ,, వి. శరత్‌కుమారి
10. ,, ఆర్. నిర్మల
11. ,, శర్వాణి
12. ,, శారద
13. ,, పి. వసంతరాణి



# గౌరవసభ్యులు

1. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు.
2. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.
3. డా. సి. నారాయణరెడ్డిగారు.
4. శ్రీ అక్కిరాజు వాసుదేవరావుగారు.
5. శ్రీ వానమామలై వరదాచార్యులుగారు.
6. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు.
7. డా. పాటిబండ మాధవశర్మగారు.
8. శ్రీ కాళోజీ నారాయణరావుగారు.
9. డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారు.
10. శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు.

# యువభారతి

# ప్రచురణలు



1. సరస్వతీసాక్షాత్కారము
(రసపుష్టికలిగిన కావ్యం) అనుముల కృష్ణమూర్తి రు. 2.00

2. జీవనగీత
(మానవాళి నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తు. ఖలీల్‌జీబ్రాన్ The Prophet కు తెనుగుసేత) కాళోజీ రు. 2.50

3.* వీచికలు
(నలుగురుయువకవుల కవితాసంకలనము)
కృష్ణమూర్తి, చక్రవర్తి, వెంకట్రావు, విశ్వనాథం రు. 2,00

4. పంచవటి (కథలసంపుటి)
అవసరాల రామకృష్ణారావు, మంజుశ్రీ, శీలా వీర్రాజు, లత, సి. ఆనందారామం. రు. 2.00

5.* రచన
(మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు - గోష్ఠిపై 37 గురు ప్రముఖసాహితీవేత్తల వ్యాససంపుటి) రు. 5,00

6. కావ్యలహరి
(ఉపన్యాసమంజరి) ప్రాచీనాంధ్ర ప్రబంధాలకు మణిహారం - ఆచార్యదివాకర్ల వేంకటావధాని రు. 5.00

7.* అక్షరాలు
(పదముగ్గురు 'యువభారతీయు'ల కవితాసంకలనం) రు. 2.00

8. చైతన్యలహరి
ఉపన్యాసమంజరి. (అయిదుగురు సాహితీప్రజ్ఞామూర్తుల సాహిత్యసేవాసమాలోచనా స్రవంతి) రు. 6.00

9. మహతి
(స్వాతంత్ర్యయుగోదయం(1947-1972)లో తెలుగుతీరు తెన్నులపై నూర్గురు ప్రసిద్ధతెలుగురచయితల వెలుగువ్యాసాలు) రు.20.00

---

*ప్రతులు లేవు.

# విరాళ సేకరణలో తోడ్పడిన సహృదయులు

## హైదరాబాదు

శ్రీమతి ఇ. వసుమతిరెడ్డి
,, అండాళ్
" సుమిత్రారెడ్డి
" నాయని కృష్ణకుమారి
శ్రీ హరికిషన్‌రావు
" భీమసేన్ నిర్మల్
" ఏ. రామకృష్ణ ఆర్య
" శీలా వీర్రాజు
" డి. వీరమణి
" పి. ఎస్. ఎన్. శర్మ
" ఎం. ఎస్. ఆర్. ఆంజనేయశర్మ
" అక్కిరాజు రమాపతిరావు
" తాళ్ళూరి నాగేశ్వరరావు
" పి. జి. లాలే
" పి. శ్రీరామశర్మ
" టి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి
" ఎం. వెంకటేశ్వర్లు
" సుభాష్‌బాబు
" జి. పద్మనాభశాస్త్రి
" ఎన్. టి. వేదాచలం
" అయల సోమయాజుల నాగేశ్వరరావు
" దాసు నరసింహారావు
" కె. బి. సత్యనారాయణ
" కె. రవీంద్రరెడ్డి
" పి. సూర్యకాంత్
" గౌరీనాథశాస్త్రి
,, కె. శ్రీఆంజనేయశర్మ
,, యల్. చంద్రమోహన్
,, యం. యన్. మహాంతయ్య
,, ఎ. సత్యనారాయణమూర్తి
శ్రీ యస్. కృష్ణమూర్తిశాస్త్రి
" పి. వి. చలపతిరావు
" ఎస్. వి. రామారావు
" జి. పార్థసారథి
" డి. సచ్చిదానందమూర్తి
" మండవిల్లి సీతారామమూర్తి
" పి. వి. రామనరసయ్య
" సూర్యదేవర జతీన్‌కుమార్
" డి. వెంకటరామరెడ్డి
" దమ్ము శ్రీనివాసబాబు
" వి. రంగారెడ్డి
" ముక్కామల లక్ష్మీనారాయణ
" తల్లాప్రగడ రాజారాం
" సీతారామమూర్తి
" సుబ్బారావు
" యాద జగదీశ్వర్
" ఎం. ఎల్. నరసింహారావు
" యాదగిరి
శ్రీమతి సుశీల
కుమారి పండా శమంతకమణి
శ్రీ ఎస్. సుదర్శనరెడ్డి
" ఎస్. కోటేశ్వరరావు
" శ్రీపతి రఘురామకుమార్
" మురళీధర్
" అభిమన్య
" జి. సూర్యనారాయణ
" కె. ఎల్. గణపతి
" ఆకెళ్ళ కోదండరామమూర్తి
" సి. వి. ఆర్. శర్మ
" జనార్దన్ భట్
" జి. ఎస్. మోహన్
" కె. ఎల్. ఎన్. శర్మ

కుమారి జె. రత్నమణి
కుమారి కె జయశ్రీ
శ్రీ టి. కుమారస్వామి
" డి. సాకేతరాజు
" ఎం. బాలరాజు
" జీడిగుంట రామచంద్రమూర్తి
" ఎన్. స్వామి
" పి. లక్ష్మీనారాయణ
" ఏ. రాజయ్య
" పాండురంగయ్య
" జి. కుమారస్వామినాయుడు
కె. డి ప్రతాప్‌రెడ్డి
" కె. ఎస్. ఆర్. ప్రసాద్
" టి. పార్థసారథి
" బి. వి. ఎల్. జగన్నాథరావు
ఎం. లోకనాథ్
" వి. రాఘవరావు
" కె. వి. లక్ష్మీకాంతం
" వి. సుబ్బరాయశాస్త్రి
" కె. పాండురంగారావు
" వీర్రాజు
" వే. వెంకటనారాయణ
పి. బి. అణ్ణంగరాచార్యులు
" ఏ. సుబ్రహ్మణ్యం
" బి. హనుమంతరెడ్డి
" పి. ఆర్. శర్మ
" పి. శ్రీకృష్ణ
" ఎం. కమలాకర్
" జి. ఏ. ఆర్. ఎల్. రావు
ఎం. వి. ఎల్. చారి
" బి. శ్రీరాంరెడ్డి
" దేవరాజు మహరాజు
" ఎస్. వి. రామకృష్ణారావు
పి. కోటేశ్వరరావు
"

శ్రీ సి.హెచ్. బోసుబాబు
ఏ. కమలాకర్
" కె. ప్రభాకర్
" కె. వి. చలపతిరావు
" వెంకటేశ్వరరావు
" యస్. కృష్ణారావు
" యన్. ఆనందాచారి
" సి. మల్లికార్జునరావు
" యం. సత్యనారాయణ

## సికింద్రాబాదు

శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులు
" కె. విఠల్‌రెడ్డి
" జె. వి. రాఘవేంద్రరావు
" పి. స్వామి
" కొండయ్య
" దాబా మాధవరావు
" రాజేశ్వరరావు
" నాగేశ్వరరావు
" కె. దివాకరశర్మ
" ఎ. బ్రహ్మానందం
" యశ్వంతరావు

## వరంగల్

కుమారి వి. శేషు
శ్రీ ఎస్. వెంకటరంగారెడ్డి
" పి. వి. రామారావు
" ఐ. కిషన్‌రావు, శ్రీ వర్మ
" సుబ్రహ్మణ్యం
" డి. ఉపేంద్రస్వామి (గూడూరు)

## హనుమకొండ

శ్రీ ఏ. శంకరయ్య
డా॥ ముదిగొండ శివప్రసాద్
డా॥ సుప్రసన్నాచార్యులు
శ్రీ పేర్వారం జగన్నాథం
" వే. నరసింహారెడ్డి

**మహబూబాబాదు**

కుమారి కె. వి. కమలకుమారి

**విజయవాడ**

శ్రీ కె. పూర్ణచంద్రరావు
" కె. ఎస్. ఆర్. శర్మ
" సి. వి. సుంరరామశర్మ
" జి. వి. సూర్యనారాయణ

**తిరుపతి**

శ్రీ నాగసిద్దారెడ్డి
" వై. ఆనందరావు
" చిట్టా దామోదరశాస్త్రి
,, సి. వెంకటరమణ

**కొత్తగూడెం**

శ్రీ ఆర్. ఎస్. శాస్త్రి
శ్రీమతి కమలమ్మాళ్

**ఏలూరు**

శ్రీ వెలగా వెంకటప్పయ్య
" బి. ఎస్. ఎన్. ఆచార్య

**నిజామాబాదు**

శ్రీ ఎన్. ఎల్. సోమయాజిశర్మ

**మహబూబ్‌నగర్**

శ్రీ వి. బుచ్చారెడ్డి
" వి. రామస్వామి
" ఎస్. మధుసూదనశర్మ
శ్రీ ఎన్. స్వామిశాస్త్రి, నెల్లూరు
డా॥ వి. కె. రావు, కాకినాడ

**ఆదిలాబాద్**

శ్రీ ఎం. నారాయణరెడ్డి
" వి. సురేందర్
శ్రీ కె. మద్దయ్య, కర్నూలు
శ్రీ పి. సుబ్రహ్మణ్యం, బొంబాయి

**ఖమ్మం**

శ్రీ జె. ఆర్. రామమోహనరావు
శ్రీ పి. కుటుంబరావు, మచిలీపట్నం
,, జి. సుబ్బారావు, మచిలీపట్నం
శ్రీ డి. ఎల్. ఎన్. శాస్త్రి, గుంటూరు
" పి. హనుమంతరావు, ,,
" పి. చంద్రప్రకాశరావు, ,,

**రాజమండ్రి**

శ్రీ సి. హెచ్. ఆర్. జి. పి. శాస్త్రి
" ఇ. వి. నరసింహాచార్యులు
" ఐ. సదాశివగుప్త
శ్రీ ఏ. వెంకటరామయ్య, శ్రీకాకుళం
శ్రీమతి ఆంధ్రమాత ,,
శ్రీ ఎస్. అచ్యుతరావు ,,
శ్రీ కె. రామమోహనరావు, కరీంనగర్
" పాపారావు ,,
" కమలమనోహరరావు ,,

**విశాఖపట్నం**

శ్రీ మునుకుట్ల రామసుబ్రహ్మణ్యం
" ఏ. వి. చెయిన్లు
,, జి. సుందరరామయ్య
శ్రీ కె. మురళీమోహనరావు, తెనాలి
శ్రీ పి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, చీరాల
శ్రీ ఎస్. సిల్వరాజన్, చిత్తూరు

**నూజివీడు**

శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులు
శ్రీ బి. రామలింగరాజు, సూర్యాపేట
" సి. సత్యనారాయణ ,,
శ్రీ విద్యాసాగరశర్మ, జడ్చర్ల
" ఎస్. రాజరెడ్డి ,,
" ఎన్. శాయిరెడ్డి ,,

**సదాశివపేట**

శ్రీ ఎం. రంగకృష్ణమాచార్యులు
శ్రీ జి. ఎస్. ప్రకాశరావు, జగిత్యాల
" కె. సంపత్కుమారాచార్యులు,,

**ఖర్గపూర్ (పశ్చిమబెంగాల్)**

శ్రీ శిలపరశెట్టి 'సనారా'

శ్రీ ఎమ్. రామగౌడు, బోధన్
శ్రీ జి. రాంబాబుప్రసాద్, బిక్కవోలు

## అమలాపురం

శ్రీ వారణాసి సత్యనారాయణమూర్తి
" పి. ఎల్. నరసింహశాస్త్రి
శ్రీ ఎన్. పుల్లయ్య, మధిర
" ఎన్. ఎన్. స్వామి, మధిర
శ్రీ వి. ఎస్. రమణమూర్తి, సిద్దిపేట
" ముదిగొండ వీరభద్రయ్య ,,

## విజయనగరం

శ్రీ కె. గంగాధరశర్మ
" పి. వి. సాయీనాథశాస్త్రి
శ్రీ జె. బాలగంగాధరం, గరివిడి
శ్రీ డి. హనుమంతరావు, మంథని
శ్రీ వి. శేషఫణిశర్మ, ధర్మపురి
శ్రీ ఎం.వి. రాఘవులు, నాగార్జునసాగర్
శ్రీ గంటి గోపాలశాస్త్రి, పార్వతీపురం

## చిట్టగుంట

శ్రీ ఏ. ఎస్. ఆర్. అంజనేయశర్మ
శ్రీ బి. రామకృష్ణ, తాడికొండ
శ్రీ డి. అనంతశయనం, పరుచూరు

## భీమునిపట్నం

శ్రీ ఎం. వి. రామస్వామి
శ్రీ జి. హరిహరనాథశర్మ, జోగిపేట
శ్రీ డి. చిన్నయ్య, గుంతకల్
శ్రీ రంగాచార్య, పాలెం

## ఆర్మూరు

శ్రీ యు. వి. ఎల్. ఎన్. మూర్తి
శ్రీ ఎం. వి. నరసయ్య, నూనెపల్లి
శ్రీ అవ్వారి నారాయణ, ధర్మవరం

## రుద్రంపూరు

శ్రీ తోట రామచంద్రయ్య
శ్రీ జి. శ్రీరామమూర్తి, అనకాపల్లి
డా॥ కె. హరి, కొడంగల్
శ్రీ కాశీ విశ్వనాథం, నర్సీపట్నం
శ్రీ డి. శ్రీశైలం, నారాయణపేట
శ్రీ ఎస్.పాండురంగశర్మ, కామారెడ్డి

## రాయగడ (ఒరిస్సా)

శ్రీ కె. భానుమూర్తి
శ్రీ ఏ. సోమశేఖరరావు, మద్దివలస
శ్రీ కొప్పర్తి రామారావు, ఆకివీడు
శ్రీ వి. వి. నారాయణ, మధుపల్లి
శ్రీ అందే వెంకట్రాజం, కోరుట్ల

## నాగరకర్నూలు

శ్రీ సి. రామచంద్రరావు
శ్రీ కె. రామకృష్ణయ్య, యెల్లారెడ్డి

## అరుణాచల్ ప్రదేశ్

శ్రీ వై. వి. బి. పుండరీకాక్షయ్య

## హైదరాబాదు (అనుబంధం)

శ్రీ బి. నారాయణ
,, సి. హెచ్. ప్రభాకరరావు
,, సి. హెచ్. వెంకటరమణ
,, కె. ప్రహ్లాద్
,, కె. సోమయ్య
కుమారి కాంత
శ్రీ నెల్లుట్ల శేషగిరిరావు
,, తిరుమల శ్రీనివాసాచార్యులు
,, శశికుమార్ (పూనా)
,, ఎమ్. ఎ. రావు (ఖరగ్‌పూర్)
,, మాధవీలత (కామారెడ్డి)
,, వి. వినాయకరావు (చెన్నూరు)

★



స్పందనం జీవలక్షణం;
రసస్పందనం
సహృదయలక్షణం;;
సరసహృదయం
సాహిత్యానికి సంజీవనం;;;



సాహితీప్రసరణం జాతి పురోగమనానికి సారథ్యం వహించగలిగినప్పుడే జాతి తన ప్రతిభను, తన సౌందర్యాన్ని, తన తపస్సును ప్రసన్నంగా ప్రపంచింప గల్గుతుంది. సహనము, సమన్వయము, సహృదయశీలము సృజనాత్మకమయిన ఉత్తమసాహిత్యానికి అనువైన వాతావరణాన్ని సృష్టించ గల్గుతాయి. ఈ నమ్మకంతోనే యువభారతి వివిధ కార్యక్రమాలను రూపొందించి సహజంగానే సరసులైన తెలుగువారి సహకార ఔదార్యాలతో నిర్విఘ్నంగా జయప్రదంగా నిర్వహించగల్గింది.

వెన్నలాంటి మనసున్నవారు, వెన్నుతట్టి వెంటనిలబడేవారు అయిన సాహితీ బంధువుల ఆదరాభిమానాలు గతంలో ఊతగా, వర్తమానంలో చేయూతగా నిలచి భవిష్యత్తుకు వెలుగుబాటలు తీర్చి తలపెట్టిన సాహిత్య సహనోద్యమాన్ని సాఫల్యం చేస్తాయని ఆశిస్తున్నాం.

యువభారతి సమాజంలో సాహిత్యరసికత్వాన్ని సముల్లాసితం చేయడానికి కంకణం కట్టుకున్నది. సాహిత్యసభలకు సహస్రాధిక సహృదయులను ఆకర్షించి సాహిత్య సమ్యక్‌దృష్టి సాదరంగా ప్రసారిస్తున్నది. ఆ ప్రసారాలలో ప్రసన్నమైన సాహితీ హృదయాలను మాలకట్టి తెలుగుసరస్వతికి అర్పిద్దామని సాహితీమిత్ర పథకాన్ని రూపొందిస్తున్నాం.

వీలయినంత ఎక్కువమందికి, వీలయినంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించగలిగినట్లయితే పాఠకులలో సాహిత్యోపాసనంపట్ల ఆసక్తిని, సాహిత్యకులపట్ల అనురక్తిని పెంపొందింపవచ్చునని మా ప్రయత్నం. ఆయత్నాన్ని పురస్కరించుకొని జరుగుతున్న కృషి, నలుగురికీ తెలిసి, సహృదయుల ప్రోత్సాహ సహకారాలను మరింతగా పొందగలిగిననాడు, లక్ష్య సాధన కవసరమైన వాతావరణాన్ని సృష్టించుకోగల్గుతాం. యువభారతి తన కృషిలో పాలుపంచుకునే మిత్రులకోసం ఎదురుచూస్తోంది. సాహితీ మిత్రులుగా

చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకునే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. ఇది సాహితీమిత్ర పథకం ధ్యేయం.

ఈ రెండుసంవత్సరాలుగా జరుపుతున్న 'కావ్యలహరి', 'చైతన్య లహరి' వంటి ఉపన్యాసాలు, వాటి ప్రచురణలు ఇకముందుకూడా కొనసాగించ టానికి, మరింత ఉపయోగకరమైన కార్యక్రమాలను ప్రతిసంవత్సరం నిర్వ హించడానికి మీ చేయూత నరిస్తున్నాం. మీ మిత్రలాభం సాహితీసంస్కృతి వికాసానికై యువభారతి సాగించే కృషికి గొప్ప స్నేహఫలం కాగలదని విశ్వసిస్తున్నాము.

మంచితనంతో మనుగడ కొనసాగించటంలో నమ్మకం వున్న మేము, మాకృషిలో పాలుపంచుకునేందుకై సహృదయు లయిన సాహిత్యాభిమానులకు అందిస్తున్న ఆహ్వానం "సాహితీమిత్ర !"

ఈ స్నేహాహ్వానాన్ని స్వీకరించండి !
సాహితీమిత్రులుగా చేరండి !!

సాహితీమిత్రులు
❋యువభారతి

సాహితీమిత్రులుగా యువభారతిలో చేరడం అంటే మీ అండదండలను మాకు సహృదయంతో అందించటానికి అంగీకరిస్తున్నారన్నమాట.

**'యువభారతి'యులైన సాహితీమిత్రులకు ఈ పథకంలో సమకూడే సదు పాయాలు :-**

* ప్రతి సంవత్సరం ఐదు రూపాయల సభ్యత్వంతో యువభారతి సాహితీమిత్రులుగా పరిగణింపబడతారు.
* 1973 వ సంవత్సరంలో మూడు రూపాయల ప్రచురణపూర్వ విరాళంపై ప్రచురింపబడే పుస్తకం మీకు ఉచితంగా అందుతుంది. నేరుగా అందించడంగానీ, పోస్టుద్వారా పంపడంగానీ జరుగుతుంది.
* 1973 వ సంవత్సరంలో యువభారతి నిర్వహించే సాహిత్య కార్య క్రమాల వివరాలు, ఆహ్వానాలు అందుతాయి.
* 1973 వ సంవత్సరంలో మీరు యువభారతి ప్రచురణలను 25% మినహాయింపుతో కొనే సదుపాయం ఉంటుంది.
* సాహితీమిత్రులు అని వెల్లడించే సభ్యత్వచిహ్నం అందుతుంది.
* యువభారతి సమావేశాలలో మీరు సాహితీమిత్రులుగా, అతిథులుగా పాల్గొనవచ్చును.

* అన్నింటికన్నమిన్న – యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి. మీకాసంతృప్తి కలిగించేలా, యువభారతిని తీర్చి దిద్దడంలో మీ సహకారం అందించటం.

## సాహితీమిత్రపథకంలో చేరాలనుకుంటే......

సభ్యత్వపత్రాన్ని పూర్తిచేసి రు 5-00 జతపరచి యువభారతి చిరునామాకు పంపాలి.

## నేను స్థానికుడినికాదే ?

అని మీరు సంశయించనక్కరలేదు. ఈ పథకంలో సభ్యత్వం, జంట నగరాలలోనివారికే పరిమితం కాదు. సాహిత్యాభిమానులు ఎక్కడున్నా సాహితీ మిత్ర సభ్యత్వం స్వాగతం పలుకుతోంది. (స్థానికులు కానివారు తమ సభ్యత్వ రుసుము రు. 5-00 లు మనియార్డరు ద్వారా యువభారతి కార్యాలయానికి పంపి, పూర్తిచేసిన సభ్యత్వపత్రానికి ఆ ఎమ్. ఓ. రసీదును జతపరచి పంపండి.)

## ప్రత్యేక సదుపాయం

1972, డిసెంబరు 31వ తేదీలోగా సాహితీమిత్రులుగా చేరేవారికి ఈ క్రింది రెండు పుస్తకాలలో కోరుకున్న ఒకపుస్తకం ఉచితం.

**జీవనగీత**

ఖలీల్ జీబ్రాన్ THE PROPHET కు
కాళోజీ తెనుగుసేత
(మానవాళి నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తు)
వెల : రు. 2-50 లు.

**పంచవటి**

చిరపరిచితులైన అయిదుగురు కథకుల
కథలసంపుటి
వెల రు. 2-00 లు

---



# యువభారతి పరిచయము

* తొమ్మిది సంవత్సరాలలో తొమ్మిది ప్రచురణలు.
* 1970 లో 'మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు' చర్చా గోష్ఠి నిర్వహణ.
* 1971 లో 'కావ్యలహరి' ఉపన్యాసమంజరి - ప్రథమముద్రణలో 11,500 ప్రతులు ముద్రించి, వేలసంఖ్యలో సాహిత్యాభిమానులను సభలను ఆకర్షించిన ఘనత.
* 1972 లో చైతన్యలహరి ఉపన్యాసమంజరి.
* 1972 లో భారతస్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా శత సాహిత్య వ్యాసతంత్రీ విపంచి - 'మహతి' ప్రచురణ.

పైకార్యక్రమాలద్వారా సాహితీప్రియుల ప్రశంసలను పొంది ఆఉత్సాహం ఊతగా, యువభారతి సాహితీమిత్ర పథకాన్ని సమర్పిస్తోంది.

సాహితీ మిత్రులుగా చేరండి!

మీ మిత్రులకు చెప్పి చేర్పించండి!!

మా కృషికి మీ చేయూత నందించండి!!!

---

'చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది'

అన్నవాక్యమే మా యువభారతి కి ఊపిరిపోసింది



# సాహితీమిత్ర సభ్యత్వపత్రము



---

పేరు............................................................................

..................................................................................

వయస్సు/పుట్టిన తేది............................................................

విద్య............................................................................

అభిరుచులు......................................................................

..................................................................................

..................................................................................

వృత్తి............................................................................

ఆఫీసు చిరునామా..............................................................

..................................................................................

..................................................____ఫోను నెం.............................____

ఇంటి చిరునామా...............................................................

..................................................................................

..................................................................................

ఇంటి ఫోను నెం.................................................................

..................................................................................

పరిచయం చేసినవారి పేరు..................................................

..................................................................................

నన్ను సాహితీ మిత్రునిగా చేర్చుకోండి. దీనితోపాటు 5 రూపాయలు పంపుతున్నాను.

సంతకం

---

1971 డిశంబర్ 31 వ తేదీ లోగా చేరేవారు ఈ క్రింది ఉచితపుస్తకాలలో తాము కోరుకునే పుస్తకంవద్ద (×) గుర్తు వుంచండి.

(1) జీవన గీత ( ) (2) పంచవటి ( )

---

ఆఫీసు ఉపయోగం :-

రు: 5_00 నేరుగా / M. O. ద్వారా అందినవి.

రసీదు సంఖ్య

తేదీ.... .... .... .... .... .... ....

సభ్యత్వ సంఖ్య.... .... .... ....

కార్యదర్శి.



